శ్రీమతేరామానుజాయనమః.

శ్రీభగవదవతారంబగు వేదవ్యాసులచే

వేదాన్తార్థప్రకాశకంబుగనిర్మింపబడిన

బ్రహ్మసూత్రములకు వేదాన్తశాస్త్రన్యాయములధికరణాఙ్గపంచకముతోడ

సులభంబగునట్లుగ,

ఆదిశేషావతారులగు శ్రీభాష్యకారులవలన

పరమకృపచేసాయించబడిన

శ్రీ వేదాన్తదీపంబను మహాగ్రంథము,

సంస్కృతభాషయందుండుటవలన

దానిని

# ఆంధ్రటీకాసహిత బ్రహ్మసూత్రములు



అనేపేర,

ఉభయవేదాన్తప్రవర్తకులగు,

చిన్నబళ్లాపురం - శ్రీనివాసాచార్యులు,

కడప - రా - పెరుమాళ్లాచార్యులు,

రా - కూర్మయ్యావాయకులు,

ప్రపన్నులగు, మొదలియాండాన్ నాయకులు

వీరలసహాయముచే

నరహరి - రామస్వామిశెట్టిగారి పుత్రుండగు

## నరహరి - రంగయ్యశెట్టివలన

రచియింపబడి,

ఆదికళానిధిముద్రాక్షరశాలయందచ్చుగూర్పించి

ప్రచురింపంబడియె.

---

శ్రీభాష్యకారులతిరువవతారసంవత్సరము ౮౮౨ కు సరియైన

౧౮౯౭ సం॥ అక్టోబరునెల ౩౦ తేది.

Of the IV. Parts, Parts I & II.

శ్రీమతేరామానుజాయనమః.

శ్రియః కాన్తోనన్తోవర గుణగణై
కాస్పదవపుర్హతా శేషావద్యః పరమ
ఖపదో వాఙ్మనసయోః । అభూమి
ర్భూమిర్ప్రణతజన దృశామాదిపురు
షోమనస్తత్పాదాబ్జే పరిచరణసక్తం
భవతుమే ॥ ౧ ॥ ప్రణమ్యశిరసా చా
ర్యాం స్తదాదిష్టేనవర్త్మనా। బ్రహ్మ
సూత్రపదాంతస్థవేదాంతార్థః ప్రకా
శ్యతే ॥ ౨ ॥ ... ※

ఈవిషయమందువేదవేత్తలయొక్క
పద్ధతినిదియే- యేదనిన- అచిద్వస్తువు
కంటే స్వరూపమువలన స్వభావము
వలనఅత్యన్తవిలక్షణులుతదాత్మభూ
తులై చేతన స్వరూపులైన ప్రత్యగా
త్మలనియు, బద్ధముక్త నిత్యరూపులై
న ప్రత్యగాత్మలకంటె, నిఖిల హేయ
ప్రత్యనీకత్వము చేతను, కల్యాణగుణై
కతానత్వముచేతను, సర్వావస్థావస్థి
తచిదచిద్వ్యాపకత్వముచేతను ధా
రకత్వముచేతను, నియన్తృత్వముచే
తను, సర్వశేషిత్వముచేతను, అత్యన్త
విలక్షణుడు పరమాత్మయనియు భగ
వానులచేతగీతలయందు ‟ద్వావిమౌ
పురుషౌలోకే క్షరశ్చాక్షరఏవచ। క్ష
రస్సర్వాణి భూతాని కూటస్థోక్షర
ఉచ్యతే। ఉత్తమఃపురుషస్త్వన్యః పర
మాత్మే త్యుదాహృతః। యోలోకత్ర
యమావిశ్యబిభర్త్యవ్యయ ఈశ్వరః।
యస్మాత్క్షరమతీతోహమక్షరాదపిచో
త్తమః। అతోస్మిలోకే వేదేచ ప్రథితః
పురుషోత్తమ,, అని చెప్పబడినది.

‟ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశః,,
‟పతిం విశ్వస్యాత్మేశ్వరం,, ‟అన్త
ర్బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయ
ణస్స్థిత,, ఇత్యాది శ్రుతులయందును
చెప్పబడియున్నది.

యేత్వక్షరమనిర్దేశ్యమవ్యక్తంప
ర్యుపాసతే। సర్వత్రగమచిన్త్యంచ
కూటస్థమచలంధ్రువమ్। ఇత్యాదివ్య
పదేశములుండుటవలన సూత్రకారు
లచేతను నీప్రకారము చెప్పంబడినవి.

నేతరోనుపపత్తేః,, భేదవ్యపదే
శాత్,, ‟అనుపపత్తేస్తు నశారీరః,,
‟కర్మకర్తృవ్యపదేశాచ్చ,, ‟శబ్దవి
శేషాత్,, ‟సమ్భోగప్రాప్తిరితిచే
న్న వైశేష్యాత్,, నచస్మార్తమతద్ధ
ర్మాభిలాపాచ్ఛారీరశ్చ,, ఉభయేపి
హిభేదేనైనమధీయతే,, ‟విశేష
ణభేద వ్యపదేశాభ్యాంచ నేతరౌ,,
‟ముక్తోపసృప్యవ్యపదేశాచ్చ,, స్థి
త్యదనాభ్యాంచ,, ఇతర పరామర్శా
త్సఇతిచేన్నాసంభవాత్,, ఉత్తరాం
చేదావిర్భూతస్వరూపస్తు,, ‟సుషు
ప్త్యుత్క్రాన్త్యోర్భేదేన,, ఇత్యాదిశ

ద్భేభ్యః,, అధికన్తుభేదనిర్దేశాత్,, అధికోపదేశాత్తు బాదరాయణ స్యైవందర్శనాత్,, జగద్వ్యాపారవర్జం ప్రకరణాద సన్నిహితత్వాచ్చ,, భోగమాత్ర సామ్యలింగాచ్చ,, ఇత్యాది సూత్రములకు విరోధంబుగ అవిద్యాకృతముఉపాధికృతమని భేదమునిర్దేశ ముచేయడముయుక్తముకాదు.

గీ॥ఇదంజ్ఞానముపాశ్రిత్యమమసాధర్మ్యమాగతాః।సర్గేపినోపజాయన్తే ప్రళయేనవ్యథంతిచ। శ్రు॥ ‟తదావిద్వాన్పుణ్యపాపేవిధూయనిరఞ్జనః పరమంసామ్యముపైతి,, ముక్తోపసృప్యవ్యపదేశాచ్చ,, ఉత్తరా చ్చేదా విర్భూతస్వరూపస్తు‟సమ్పద్యావిర్భావస్స్వేనశబ్దాత్,, జగద్వ్యాపారవర్జం ప్రకరణాద సన్నిహితత్వాచ్చ,, భోగమాత్ర సామ్యలిఙ్గాచ్చ‟యనిసర్వావిద్యోపాధి వినిర్ముక్తమైనముక్తావస్థలోభేదమును చెప్పుటవలనను శ్రుతిస్మృతి సూత్రములయందంతట భేదమునిర్దేశించి - చిదచిదీశ్వర స్వరూపభేదముస్వాభావికమని నిశ్చయింపబడినది.

‟సర్వంఖల్విదంబ్రహ్మతజ్జలానితిశాన్తఉపాసీత,, వాచారంభణం వికారోనామధేయంమృత్త్యికేత్యేవసత్యం,, ‟సదేవసోమ్యేదమగ్రఆసీదేకమేవాద్వితీయంతదైక్షతబహుస్యాం ప్రజాయేయేతి తత్తేజో సృజత,, సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజాయతనాస్సత్ప్రతిష్ఠాఃఐతదాత్మ్యమిదం సర్వంతత్సత్యంసఆత్మాతత్త్వమసి శ్వేతకేతో,, గీ॥ క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి,, సూ॥ తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః,, యని పరబ్రహ్మమునకు కారణత్వమును, సమస్తమైన చిదచిదాత్మక ప్రపంచమునకు కార్యత్వమును చెప్పి కారణమున కంటే కార్యమునకనన్యత్వమును చెప్పి యుండడము యీప్రకారంబుగ వుపపన్నమౌచున్నదిఅవియేవిఅనిన- సర్వావస్థావస్థితమైన చిదచిద్వస్తువులకు పరమాత్మశరీరత్వమును పరమాత్మకుఆత్మత్వమును ‟యఃపృథివ్యాన్తిష్ఠన్,, యస్యపృథివీ శరీరం,, ‟యఆత్మనితిష్ఠన్యస్యాత్మాశరీరంయఆత్మానమన్తరోయమయతి,, ‟యస్యావ్యక్తం శరీరం యస్యాక్షరం శరీరం యస్యమృత్యుశ్శరీరం ఏషసర్వ భూతాన్తరాత్మాపహతపాప్మాదివ్యోదేవ ఏకోనారాయణః,, ‟అన్తః ప్రవిష్ట శ్శాస్తాజనానాంసర్వాత్మ,, అనేదే మెదలుగాగల శ్రుతులచేతనే చెప్పబయున్నదిగనుక సూక్ష్మచిదచిద్విశిపరమాత్మ కారణమనియు, స్థూలదచిద్విశిష్టపరమాత్మ కార్యమనిఁ కారణావస్థయందును - కార్యావ

యందును చిదచిద్వస్తుశరీర కత్వము చేతతత్ప్రకారియైన పరమాత్మే సర్వ శబ్దవాచ్యుడని పరమాత్మశబ్దముచేత సర్వశబ్దసామానాధికరణ్యము ముఖ్య ముగానేమిక్కిలి యుపపన్నమౌచున్న ది. శ్రు॥ అనేనజీవేనాత్మనాను ప్రవి శ్యనామరూపేవ్యాకరవాణి,, తత్సృ ష్ట్వాతదేవాను ప్రావిశత్ తదనుప్రవి శ్యసచ్చత్యచ్చాభవత్,, ఇత్యాదిశ్రు తులే యీయర్థమును యుపపాదనచే యుచున్నది- పరమాత్మ సర్వచేతనా చేతనములయందు ఆత్మగా అనుప్రవే శించి వుండుటవలనను సకలచేతనాచే తనములువానికి శరీరంబుగనుండుట వలనను పరమాత్మే సర్వశబ్దవాచ్యు డౌచున్నాడనిఅర్థము.

శ్రు॥బహుస్యామ్,, అని పరమా త్మతానే బహుభవనముగా అయ్యే గాగునచేసిన సంకల్పము నామరూప విభాగములకు అనర్హమైన సూక్ష్మచి ద చిద్వస్తువులను శరీరముగా కలిగిన తానే నామరూప విభాగార్హమైన స్థూలచిదచిచ్ఛరీరకత్వముచేత బహు ప్రకారంబులుగ అయివున్నాడని వేద న్తులయొక్కప్రక్రియ.

యెవరైతే నిర్విశేష కూటస్థస్వ ప్రకాశనిత్యచైతన్యమాత్రమే బ్రహ్మ మని చెప్పుచున్నారో వారలకు సూ॥ జన్మాద్యస్యయతః,, శాస్త్రయోని నిత్వాత్ "తత్తుసమన్వయాత్" ఈక్ష తేర్నాశబ్దం,, ఇవిమొదలుకొనిసూ॥ "జగద్వ్యాపారవర్జం ప్రకరణాదస న్నిహితత్వాచ్చ,, "భోగమాత్ర సామ్యలిఙ్గాచ్చ,, "అనావృత్తి శ్శ బ్దా దనావృత్తి శ్శబ్దాత్,, అనే సూత్రము అన్తంబుగాగల సూత్రస మూహములయందు- బ్రహ్మమునకు జగత్కారణత్వ బహుభవన సంకల్ప రూపఈక్షణమే మొదలుగాగల అన న్తవిశేషణములను చెప్పుచున్నందున సమస్తమైన సూత్రసమూహములును సూత్రకారులచేతను దహరించబడిన "యతోవా ఇమానిభూతాని జాయ న్తే,, "తదైక్షత బహుస్యాం ప్రజా యేయేతి,, ఇవిమొదలుగాగల సమ స్తశ్రుతులుసంబంధించకపోవును.

అనన్తరము - శ్రుతి "యేనాశ్రు తంశ్రుతం,, అనిఏకవిజ్ఞానముచేత స ర్వవిజ్ఞానమును ప్రతిజ్ఞచేసి "యథాసో మ్యైకేనమృత్పిండేన, అనికూశమునా రమొదలైన వానితోచేరిన ఒక్కమృ త్పిండముచేత చేయబడినఘటశరావా దులనుఏప్రకారంబుగ ఆమృత్పిండము నకంటేఅనన్యద్రవ్యమని తెలుసుకొం దురో అటేలాగున బ్రహ్మజ్ఞానముచే తసూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మకారణమై నసమస్త చిదచిదాత్మక ప్రపంచము నకుఆబ్రహ్మమునకంటే అతిరిక్తవస్తు

వులేద నేజ్ఞానము సంభవించు చున్నద నివుపపాదించెను ''సదేవ సోమ్యేద మగ్రఆసీదేక మేవాద్వితియ్యం,, అనే శ్రుతులయందుఇదంశబ్దవాచ్యమైనచి దచిదాత్మకప్రపంచమునకు సృష్టికం టెపూర్వమందు నిఖిలభేదాభావము చేత సచ్ఛబ్దవాచ్యమునకు ఏకత్వాప త్తి ఘటశరావాదుల ఉత్పత్తికంటే పూర్వమందుత్పాదకమైన మృత్పిండ మునకు ఏకతాపత్తివలెనే చెప్పియు న్నది. ''తదైక్షతబహుస్యామ్,, అనే శ్రుతి అసచ్ఛబ్దవాచ్యమైన పరబ్రహ్మ మే చిదచిదాత్మక ప్రపంచరూపము చే బహుప్రకారంబుగ కావడము ఒ కట్మృత్పిండమే ఘటశరావాదిబహు రూపముగాపరిణమించేటట్లు. సంక ల్పించితన్నుతేజఃప్రభృతిజగదాకార ముచేతసృజించెననియు చెప్పియున్న ది. ''ఐతదాత్మ్యమిదంసర్వం తత్స త్యంసఆత్మాతత్వమసి,, అనేశ్రుతివా క్యములనుబట్టి బ్రహ్మమొక్కటే అవి ద్యాకృతోపాధి పారమార్థికోపాధు లచేతకట్టబడినదై దేవాదిరూపముల చేత బహుప్రకారమైయున్నదని వేద వేత్తలచేత గ్రహించదగినదని చెప్ప డముఅయుక్తము.

''జ్ఞాజ్ఞౌద్వావజావీశనీశౌ,, నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానామేకోబ హూనాం యోవిదధాతికామాన్,, అనేదే మొదలుగాగల శ్రుతులచేత జీవులకు అజత్వనిత్యత్వ బహుత్వము చెప్పుటవలన ఘటశరావాదులకు వు త్పత్తికంటేపూర్వమందు ఏకవిధమైన మృద్రవ్యమునకు వుత్పత్త్యనంతరకాల మందు కాదగినబహుత్వమువలెనేసృ ష్టికంటే పూర్వమందు ఏకరూపమైన బ్రహ్మమునకు సృష్ట్యుత్తరకాలమందు నానావిధమైన జీవరూపముచేత బ హుత్వముచెప్పినట్లైతే అప్పుడుజీవుల కు అజత్వనిత్యత్వబహుత్వములు చె ప్పినశ్రుతులకు విరోధించును సూత్ర ములకువిరోధించును. ''ఇతరవ్యపదే శాద్ధితాకరణాదిదోషప్రసక్తిః,, య ని బ్రహ్మమే దేవమనుష్యాది జీవరూప ములచేత బహుప్రకారమైనట్టయితే తనకుఅహితాకరణాది దోషప్రసక్తి గలుగునని చెప్పితన్నివారణార్థమై ''అ ధికంతుభేదనిర్దేశాత్,, అనే సూత్ర ముచేతజీవునికంటేబ్రహ్మమునకుభేద ముచెప్పియున్నది.

''వైషమ్యనైర్ఘృణ్యేన సాపేక్ష త్వాత్,, అనే సూత్రప్రకారంబుగ దేవాదివిషమసృష్టి ప్రయుక్తమైనఈ శ్వరపక్షపాతనైర్ఘృణ్యములు జీవుల యొక్క పూర్వపూర్వకర్మ సాపేక్ష వలనగలిగెననియు అందువలననేవిష మ సృష్టిగలిగెననియు పరిహృతమైన ది. ''నకర్మావిభాగితి చేన్నానాది

త్వాదుపపద్యతేచాప్యుపలభ్యతేచ,, యని ‘‘సదేవసోమ్యేద మగ్రఆసీదేక మేవాద్వితీయ్యం,, అనిసృష్టికంటేపూర్వమందు జీవులకుఅభావముచెప్పుట వలనఆయాయికర్మసంభవించదనిచెప్పినట్టయితేజీవులకునుతత్తత్కర్మప్రవాహము అనాదియనిపరిహరించబడినది‘‘నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః,, అనేసూత్రముచేతఆత్మకు వుత్పత్త్యభావము,నిత్యత్వము యుండుట వలన స్వసిద్ధాంతమునకు విరోధముగానుండుటవలనను,ఆమోక్షము జీవభేదములకుఅనాదిత్వముసమస్తవేదాన్తులు అంగీకరించియుండుటవలనను. ఆకారణముచేత శ్రుతివిరోధసూత్రవిరోధస్వమత విరోధములుగలుగుటవలన సృష్టికంటేపూర్వమందు చెప్పబడియుండెడుఏకత్వావధారణమునకు నామరూప విభాగమునకు అనర్హమైనసూక్ష్మచిదచిద్వస్తు శక్తిభేదము చెప్పవలెను యిదిఅందరిచేతను చెప్పబడినదిగానేయుండును. యింతచెప్పడమెందుకనగా. అవిద్యాపరికల్పనమందునను ఉపాధిపరి కల్పనమందునను బ్రహ్మవ్యతిరిక్తమైన అవిద్యాసంబంధము ఉపాధిసంబంధముగలచేతనవస్తువులేనందున అవిద్యోపాధి సంబంధములు తత్కృతదోషములు బ్రహ్మమునకేసంభవించును.

సన్మాత్రబ్రహ్మమని చెప్పేవాదమందునను సృష్టికంటేపూర్వమందు సన్మాత్రమైన నొక్కటైన బ్రహ్మమే సృష్ట్యుత్తరకాలమందు భోక్తృభోగ్యనియన్తృరూపేణత్రిప్రకారంబుగనైనదని చెప్పవలెను. అటువలె చెప్పినట్టయితే ఘటశరావమణికము వలెనేజీవేశ్వరులకు ఉత్పత్తిమత్త్వము అనిత్యత్వమున్నుగలుగును.తన్నివారణార్థమైఏకత్వాపత్తివేళయందునసుభోక్తృభోగ్యనియంతృశక్తి త్రితయమునున్నదని చెప్పవలెను అటువలె చెప్పినను సీత క్తిత్రయశబ్దవాచ్యమైనదియేమియనివివేచనచేయవలసివచ్చును.

సన్మాత్రమైననొక్కటైదానికే భోక్తృభోగ్యనియన్తృరూపముచేతపరిణామసామర్థ్యమునశక్తిశబ్దముచేత చెప్పవలసివచ్చును ఇటుల చెప్పినట్టయితే ఘటశరావాదిపరిణామసమర్థమైన మృత్పిండమునకు తదుత్పాదకత్వమువలె బ్రహ్మమందు ఈశ్వరాదులకు ఉత్పాదకత్వము చెప్పి నట్టయితే ఈశ్వరాదులకు అనిత్యత్వమున్ను వచ్చును. అనిత్యత్వదోష నివారణార్థమై ఈశ్వరాదులకుసూక్ష్మరూపనుచేత నుండడమేశక్తిఅని చెప్పవలెను అయితే తదతిరిక్తసన్మాత్రమైన బ్రహ్మముండేలాగు ప్రమాణము లేనందున అదివుండేలాగుఅంగీకరించినను

తదుత్పాద్యులైన ఈశ్వరాదులకును నిత్యత్వ ప్రసంగమువలనను ముగ్గిరికిన్ని నామరూపవిభాగానర్హ సూక్ష్మదశాపత్తిసృష్టికం పేకూర్వమందు ఏకత్వావధారణమునకు అర్థమనిచెప్పతగినది.

అటువలెచెప్పినట్టయితే ఈశ్వరాదులకు బ్రహ్మైకత్వకత్వమువలన ఏకత్వావధారణము విరోధించును అందువలన సర్వావస్థలయందుండెడుచిదచిద్వస్తువులకు బ్రహ్మశరీరత్వము వినబడుటవలన సర్వదాసర్వశబ్దముల చేత బ్రహ్మమొక్కడే తత్తచ్ఛరీరిగా తత్తద్విశిష్టమై తెలియబడుటవలన స్థూలచిదచిద్వస్తువిశిష్టమైన బ్రహ్మమే కార్యభూతమైన జగత్తనియు నామరూప విభాగానర్హ సూక్ష్మ చిదచిద్వస్తువిశిష్ట బ్రహ్మము కారణమనియు చెప్పుటవలన ఆ బ్రహ్మమే మృత్పిండస్థానీయము అవస్తువునే «సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయ మని శ్రుతియందు చెప్పబడియున్నది. ఆవస్తువే విభక్తనామరూప చిదచిద్వస్తు విశిష్టమై యుండుటవలన ఆ బ్రహ్మమే కార్యమని చెప్పుటవలన సమస్తము సమంజసమౌను. గనుక శ్రీభాష్యమందు వారిమతమునకు కలిగియుండే శ్రుతివిరోధము న్యాయవిరోధములును విస్తారంబుగవివరింపబడినదని యిక్కడ వివరించలేముఅని తెలియవలయును.

భాష్యమందు చెప్పబడిన అధికరణార్థములు సూత్రార్థములవివరణము లనుసులభంబుగ తెలియడముకొఱకు సంక్షేపముచేత నుపన్యాసముచేయబడుచున్నది యెటులననిన.

ప్రథమపాదమందు ప్రధానపురుషులే జగత్కారణభావముచేత వేదాంతములు ప్రతిపాదన చేయుచున్నవనిశంకించి అవికాదనినిరసించి అనంతరము సత్యసంకల్పమై నిరవద్యమై సమస్తకల్యాణగుణాకరమైన బ్రహ్మమునే జగత్కారణ భావంబుగ ప్రతిపాదన చేయుచూనున్నవని చెప్పబడినది. ద్వితీయతృతీయచతుర్థ పాదములయందుకొన్నివేదాంతవాక్యములు ప్రధానపురుష ప్రతిపాదన పరములని ఆ ద్వారా సర్వాక్షేపము నుఆశంకచేసి అవియుబ్రహ్మపరము లేనని చెప్పబడినది. అక్కడద్వితీయ పాదమందు అస్పష్టజీవాదిలింగకము లైనవాక్యములు నిరూపితములైన వనియు స్పష్టలింగకవాక్యములు తృతీయపాదమందు నిరూపితములైనవనియు చతుర్థపాదమందైతే ప్రధాన పురుష ప్రతిపాదనచ్ఛాయను అనుసరించిన వాక్యములు నిరూపితములైనవనివిశేషము అందువలన ప్రథమాధ్యాయమందు సర్వవేదాంత వాక్య

జాతముసర్వజ్ఞత్వ సత్యసంకల్పత్వా దియుక్తమైన బ్రహ్మమునేజగత్కా రణత్వంబుగ ప్రతిపాదన చేయుచూ నున్నవని స్థాపనచేయబడెను.

రెండవఅధ్యాయమందు ఆయర్థమునకు దుర్ధర్షణత్వము చెప్పుటవలన దార్ఢ్యముచెప్పబడుచున్నది. అక్కడ ప్రధమపాదమందు సాంఖ్యాదుల యొక్క స్మృతివిరోధమువలన న్యాయవిరోధమువలనప్రాప్తములైనదోషములను నివారణచేయబడియున్నది రెండవఅధ్యాయమందు సాంఖ్యాది వేదబాహ్యపక్షములయొక్క నిషేధముచేసి వేదావిరోధమైన మన్వాది స్మృతులకు న్యాయములకు ఆదరణీయత్వమును దృఢముచేయబడియున్నది. తృతీయచతుర్థములయందు వేదాన్తవాక్యములకుపరస్పరముగా ప్రాప్తమైనవి ప్రతిషేధదోషగంధాభావములను ప్రసిద్ధిచేయడముకొఱకుఅన్తరిక్షాదులకుబ్రహ్మయొక్క కార్యమని-ప్రకారమని విశోధనముచేయబడుచున్నదిఅక్కడ తృతీయపాదమందుచిదచిత్ప్రపంచమునకు బ్రహ్మకార్యత్వ ముండినప్పటికి అచిదంశమునకుస్వరూపముయొక్కఅన్యథాభావముచేత కార్యత్వమును- చిదంశమునకుస్వభావాన్యథాభావముచేత జ్ఞానసంకోచవికాస రూపమైన కార్యత్వము చెప్పబడియున్నది. చతుర్థమందు జీవునికినుపకరణ భూతములైనయింద్రియాదుల ఉత్పత్తిప్రకారను చెప్పబడియున్నది. మొదటి అధ్యాయద్వయమువలన మోక్షేచ్ఛగల పురుషులకునుపాస్యమైనదిదోషగన్ధశూన్యమై అనవధికాతిశయాఽసంఖ్యేయకల్యాణగుణములుగలదై సమస్త జగత్తుకు ముఖ్యకారణమైనబ్రహ్మమేయని చెప్పబడియున్నది. ఉత్తరాధ్యాయద్వయముచేతబ్రహ్మయొక్కయుపాసనప్రకారమును- ఉపాసనకుఫలభూతమైన మోక్షస్వరూపమును, చెప్పబడియున్నవి. అచ్చట తృతీయాధ్యాయప్రథమపాదమందు బ్రహ్మమును ఉపాసనేచ్ఛయొక్క యుత్పత్తికొఱకు జీవునికి సంసారమందు సంభవించెడి దోషములు చెప్పబడియున్నది. ద్వితీయమందు ఉపాసనేచ్ఛ కలుగుటకు బ్రహ్మకునిరస్తనిఖిల దోషత్వకల్యాణగుణాకరత్వరూపమైన ఉభయలింగత్వముల ప్రతిపాదన చేయబడియున్నది. తృతీయమందుబ్రహ్మోపాసనైకత్వ నానాత్వవిచార పూర్వకముగా ఉపాసనల యందు పసంహార్య అనుపసంహార్యగుణ విశేషములను చెప్పబడియున్నది-చతుర్థమందు ఉపాసనకువర్ణాశ్రమధర్మములయందు కర్తవ్యత్వ మువ్యవస్థ చేయబడియున్నది.

చతుర్థాధ్యాయమందు బ్రహ్మ యొక్క ఉపాసనకు ఫలచింతన చేయబడుచున్నది- అచ్చట ప్రథమపాదమందు బ్రహ్మోపాసనకు ఫలముచెప్పుటకొఱకు ఉపాసన స్వరూప పూర్వకంబుగ ఉపాసనానుష్ఠానప్రకారము అవిద్యయొక్క సామర్థ్యము చెప్పబడియున్నది. ద్వితీయమందు బ్రహ్మోపాసన చేయువారలకు బ్రహ్మప్రాప్తిమార్గోప క్రమప్రకారచింతన చెప్పబడియున్నది. తృతీయమందర్చిరాదిగతి స్వరూపమునుఅర్చిరాదిమార్గముచేత నేబ్రహ్మప్రాప్తియని ప్రతిపాదన చేయబడియున్నది.

చతుర్థమందుముక్తునికి బ్రహ్మను భవప్రకార చింతనను చెప్పబడియున్నది. గనుకముముక్షువులచేత దెలియదగినది నిరస్తనిఖిలదోష గంధము అనవధికాతిశయ అసంఖ్యేయ కల్యాణగుణగణాకరము నిఖిలజగదేక కారణమైన పరబ్రహ్మము. అసకృదావృత్తస్మృతిసంతానరూపఉపాసనాత్మకబ్రహ్మజ్ఞానము మోక్షసాధనము. ఉపాసనకుఫలముఅర్చిరాదిమార్గముచేత పరబ్రహ్మమునుపొంది పునరావృత్తిలేక స్వస్వరూపభూతమైన జ్ఞానాదిగుణావిర్భావపూర్వకంబుగ అనంతమహావిభూతి అనవధికాతిశయానందబ్రహ్మనుభవము అనిశారీరకసాస్త్రముచేత చెప్పబడుచున్నది.



హరిః ఓమ్.

# ఆంధ్రటీకాసహిత బ్రహ్మసూత్రములు.

## ప్రథమాధ్యాయము- ప్రథమపాదము.

### ౧. జిజ్ఞాసాధికరణము.

౧. అథాతో బ్రహ్మజిజ్ఞాసా.

అర్థము.—— అథ - అనన్తరము, అతః-కర్మ అల్పాస్థిరఫలము గలదౌట వలననే, బ్రహ్మ-స్థిరఫలజనకమైన బ్రహ్మయొక్క,జిజ్ఞాసా-జ్ఞాన విషయిక ఇచ్ఛ, చేయతగినది.

బ్రహ్మకర్మకమీమాంసవిషయము ఆరంభింపదగినదా - కాదా - యని సందియము.

అందుకొఱకుపరీక్ష చేయబడుచున్నది, మరియు వేదాంతములు బ్రహ్మమందు ప్రమాణములా- కావా- అని సందేహము.

పరినిష్పన్నమైన యర్థమందు శబ్దమునకు బోధన సామర్థ్య నిశ్చయము సంభవించునాలేదాయని సంశయము సంభవింపదని పూర్వపక్షము.

సంభవించుననిసిద్ధాంతము.

ఎప్పుడుసంభవింపదో అప్పుడుపరినిష్పన్నమైన అర్థమందు శబ్దమునకు బోధన సామర్థ్యములేకపోవుటవలన సిద్ధరూపమైనబ్రహ్మమందు వేదాంతములు ప్రమాణముకాదని బ్రహ్మవిచారస్వరూపమైన బ్రహ్మ మీమాంస ఆరంభింప తగినదికాదు.

ఎప్పుడు సంభవించునో అప్పుడు సిద్ధమైనయర్థమందు బోధనసామర్థ్యము కలుగుటవలన వేదాంతములు బ్రహ్మమందుప్రమాణములని మీమాంస ఆరంభయోగ్యమగును.

ఈయర్థమందు పూర్వపక్షము చేయువాడు తలచుచున్నాడు; పెద్దల వ్యవహారమున కంటె మరియొక స్థలమునందు శక్తిజ్ఞానము పుట్టకపోవుటవల్ల వ్యవహారము కార్యబుద్ధిపూర్వకత్వముచేత కార్యమైన యర్థమందే శబ్దమునకుశక్తినిశ్చయమువలన పరినిష్పన్నార్థరూప బ్రహ్మమందువేదాంతములుప్రమాణములు కావని బ్రహ్మవిచారరూపమైనమీమాంసము ఆరంభయోగ్యము కాదు.

సిద్ధాంత మెట్లన్నను, బాలురకు తల్లి దండ్రులు మొదలగు వారలచేత అమ్మా, తాత, మాతుల, శిశు, పశు, పక్షి, మృగాదులయందు వ్రేలు

చేత చూపించి ఆయాయి వస్తువాచకనులయిన శబ్దములను బ్రయోగించుచుండు వారలచేత క్రమేణబహుప్రకారములుగా శిక్షితులైన వారికినాయాయిశబ్దముల శ్రవణ క్షణానంతరమందే ఆయాయి అర్థములందు జ్ఞానము తమకే కలుగును, శబ్దార్థములకు మరియొక సంబంధము తెలియకపోవుట వలన సంకేతముచేసిన పురుషుడు తెలియక పోవుట వలన శబ్దార్థములకు బోధ్య బోధక భావమేసంబంధమని నిశ్చయింతురు-గనుక పరినిష్పన్నమైన అర్థమందును శబ్దమునకు బోధకత్వ నిశ్చయము సంభవించునని బ్రహ్మమందు వేదాంతవాక్యములుప్రమాణములగునని బ్రహ్మవిచారరూపమైనమీమాంసము ఆరంభింపతగినది.

సూత్రార్థము (అథాతో బ్రహ్మజిజ్ఞాసా) అథ-అనంతరమందు- అతః-యనిగడిచిపోయిన దానికి హేతుత్వ ప్రతిపాదకము.

బ్రహ్మణో జిజ్ఞాసా-జిజ్ఞాసయనగా తెలిసికొనే యిచ్ఛ.

ఇచ్ఛకుచెప్పబడునదే ప్రధానము గనుక చెప్పబడునదిజ్ఞానమే, ఇచ్చట అభిప్రాయమైనది. పూర్వవృత్తాంతమువల్లనుండి అల్పాస్థిరఫలముగల కేవలకర్మములు తెలియుటవలననసంతరమందు అట్టే హేతువవల్లనే అనంతమైన స్థిర ఫలముగల బ్రహ్మాధిగమము చేయతగినది.

సంగ్రహ తాత్పర్యము.—అల్పాస్థిరఫలముగలదైన కర్మవిచారానంతరము-అనన్తస్థిర ఫలప్రదమైన బ్రహ్మజిజ్ఞాసచేయతగినది.

అధికరణసంగ్రహము.—అధ్యాయచతుష్టయాత్మక శారీరకమీమాంసాశాస్త్రము- బ్రహ్మకారణత్వమును- తదభావ్యత్వమును- ముముక్షూపాస్యత్వమును- ముక్తప్రాప్యత్వమును-భోదించుచున్నది-ప్రభాకరమతరీత్యాశబ్దమునకు కార్యార్థములో బోధకత్వశక్తియగుటచేత - పరినిష్పన్నవస్తువందుశబ్దమునకు బోధకత్వశక్తి లేనందున వేదాంతములు పరినిష్పన్నమైన బ్రహ్మమందు ప్రమాణంబు కాచాలదు - ప్రమాణముకానందునసాఙ్గాధ్యయనవంతునకు అనన్తస్థిరఫలాపాతప్రతీతి రానేరదు. ‘‘అక్షయ్యం హవై చాతుర్మాస్యయాజినస్సుకృతం భవతి,, ఇత్యాదివాక్యములకు అక్షయమైన ఫలము శ్రుత మగుటచేత కర్మాల్పాస్థిరఫలత్వనిర్ణయము సిద్ధింపదుగానకర్మణామల్పాస్థిరఫలాపాతప్రతీతిరూపవిశిష్టహేతువుసిద్ధింపనందున వేదాన్తారంభము ఘటింపదనే పూర్వపక్షమునకు అమ్నాతామాతులాది శబ్దములలో సిద్ధరూపమైన

మా తాపిత్రాద్యర్థంబులు ప్రథమవ్యుత్పత్తి ద్యోతనమగుట చేత నదికార్యరూపార్థంబున నేయనే నిర్బంధము లే నందున వేదాంతములకు బరినిష్పన్న బోధనసామర్థ్యంబుగలవైఅవిప్రమాణంబులగుటచేత- అనన్తస్థిర ఫలావాప్తప్రతీతి రూప విశేష్యాంశము లభించును-కర్మవిచారము చేసినవానికి నావృత్తివిధానాదులవలన కర్మంబులకు సాతిశయఫలత్వమవగతమగుటచేత- అక్షయత్వ కీర్తనము చిరకాలస్థాయిత్వాభిప్రాయంబుగ. ,,వాయుశ్చాన్తరిక్షై తదమృతమ్,, అనుచోట అమృతత్వమువలెనే నిర్వహింప వలసియున్నందునకర్మణామల్పాస్థిరఫలత్వనిర్ణయరూప విశేషణాంశముసిద్ధించును- ఇట్లు విశిష్ట హేతువు లభించుటచే శాస్త్రారంభముఘటించుననే ప్రథమాధికరణము.

౨. జన్మాధికరణము.

౨. జన్మాద్యస్యయతః.

అ.— అస్య- ఈజగత్తునకు, యతః- ఎవనివలన, జన్మాది- జన్మ మే మొదలుగాగలవో.

తైత్తిరీయకోపనిషత్తందు ఈవాక్యమునకు ,,యతోవాఇమానిభూతాని జాయంతె,, యనెడిశ్రుతివిషయవాక్యము. దీని అర్థము-యతః - ఏబ్రహ్మమువలన, ఇమానిభూతాని - ఈభూతములు, జాయన్తే - పుట్టుచున్నవో, ఏన- ఏబ్రహ్మము చేత జాతములైనవి బ్రతుకుచున్నవో. ఏభూతములుమృతిపొంది యెక్కడలీనములగుచున్నవో. తత్-ఆబ్రహ్మను- విజిజ్ఞాసస్వ- తెలుసుకోవలసినది అనిజిజ్ఞాస్యత్వము చేత ప్రతిజ్ఞ చేయబడిన ఈబ్రహ్మజగజ్జన్మాదికారణత్వముచేతనా? లేక లక్షణము వల్లనా? చెప్పడమునకు సమర్థమగునా కాదాయని సంశయము.

సమర్థము కాదని పూర్వ పక్షము ఎట్లన్నను.

జగజ్జన్మాదులు ఉపలక్షణత్వముచేతనైనా విశేషణత్వముచేతనైనా బ్రహ్మలక్షణము కానేరదు.

ఉపలక్షణత్వము చెప్పిన పక్షమందు ఉపలక్ష్యమునకు మరియొక ఆకారముయొక్క యోగమపేక్షింపబడును. ప్రకృతమందు ఆయాకారములేదు గనుక ఉప లక్షణత్వము సంభవింపదు.

విశేషణత్వము చెప్పిన పక్షమందు అనేక విశేషణములు గలచోట వలన నొకటికి ప్రతిపాదకత్వము సంభవింపదు - విశేషణములకు బహుత్వముండుటవల్ల ఆవిశేషణములు వ్యావర్తకములౌటచేత బ్రహ్మకు యనేకత్వము సంభవించును.

సిద్ధాంత మెట్లన్నను - ఒక వస్తువ

యందు నవిరుద్ధములైన విశేషణముల నేకములైనప్పటికిని శ్యామత్వ యువత్వరూపములైనధర్మముగల దేవదత్తుని వలెనే జగజ్జన్మాదివిశిష్టమైన బ్రహ్మ మొక్కటేవిశేష్యమగును.

ఉపలక్షణత్వపక్షమందు జన్మాదులచే నుపలక్ష్యమైన బ్రహ్మకు బ్రహ్మశబ్దముచేత దెలియబడెడి బృహత్వరూపమైన ఆకారములున్నవి యని జగజ్జన్మాది కారణము బ్రహ్మయని లక్షణముచెప్పుటకు సమర్థమగును.

సూత్రార్థము - అస్య- వివిధ విచిత్రమైన భోక్తృ భోగ్యములచేత పూర్ణమైన- జగతః- జగత్తుకు, యతః- ఎవనివలన, జన్మాది - జన్మము మొదలుగాగలస్థితిలయములో - అదేబ్రహ్మమని చెప్పబడుచున్నది.

తా.—— ఏబ్రహ్మము వలన నీజగత్తుసృష్టిస్థితిలయములు గలవో.

అ- సం.—— బ్రహ్మసిద్ధియందు వేదాంతము ప్రమాణంబై ననులక్షణము బ్రహ్మకు సిద్ధింప నందున బ్రహ్మప్రతిపత్తిరానేరదు- అదెట్లన్న ‘‘యతోవా ఇమాని’’ ఇత్యాది వాక్యము జన్మకారణత్వాదులను లక్షణంబుగ రప్పించనందున - జన్మ కారణత్వాదులను విశేషణమందురో - ఉపలక్షణమందురో - విశేషణభేదప్రయుక్తవిశేష్యభేదను ప్రసంగించుటచేత - విశేషణమనకూడదు ఉపలక్ష్యోపలక్షణవ్యతిరిక్తోపలక్ష్యగతజ్ఞాతాంశములభింపనందు నఉపలక్షణమనగూడదనే పూర్వపక్షమునకు- అనేకవిశేషణవిశిష్టవిశేష్యైకస్య ‘‘దేవదత్తశ్యామోయువాలోహితాక్షః’’ ఇత్యాదిషు దర్శనాత్- ‘‘ఖణ్డోముణ్డః పూర్ణశృఙ్గోగౌః’’ ఇత్యాదిషు ఖణ్డత్వముణ్డత్వాదివిరుద్ధవిశేషణానామేవ విశేష్యభేదకత్వదర్శనాత్ - జన్మాదికారణత్వాదేః కాలభేదేన బ్రహ్మణ్యవిరుద్ధత్వాచ్చ- విశేషణత్వముపపన్నము- ఉపలక్షణోపలక్ష్య వ్యతిరిక్తోపలక్ష్యగత బ్రహ్మత్వాదియైన తృతీయాకారము లభించుటచేత ఉపలక్షణత్వమున్ను కూడును. ఇటుల జన్మకారణత్వాదులు బ్రహ్మలక్షణమగుటచేత లక్షణంబులబ్రహ్మప్రతిపత్తి వచ్చుటచేత బ్రహ్మవిచారము ఘటించునని జన్మాధి కరణ ప్రమేయము.

3. శాస్త్రయోన్యధికరణము.

3. శాస్త్రయోనిత్వాత్.

అ.—— శాస్త్రి - వేదమే, యోనిత్వాత్-కారణముగలవాడగుటవలన.

యతోవా ఇమానీత్యాది వాక్యమే విషయవాక్యము.

జగత్కారణమైన బ్రహ్మమందు అశ్రుతి ప్రమాణ మగునా - కాదా యని సంశయము.

ప్రమాణముకాదని పూర్వపక్షము అనుమానముచేత సిద్ధించిన బ్రహ్మవిషయకము గనుక ప్రమాణాంతరముచేత సిద్ధింపని వస్తువందే శాస్త్రిప్రమాణము.

జగత్తుకు సావయవత్వము వలన కార్యత్వ ముండుటచేత, కార్యమునకు దాను ఉపాదాన రూపమైన సామగ్రి ప్రయోజనములు తెలిసిన మనుష్యుడేకర్తగాకలిగినది గనుక, జగన్నిర్మాణ రూపకార్యమందు సమర్థుడై, కర్మబద్ధుడైన స్వల్పశక్తిగల జీవునకు విలక్షణుడై, సర్వజ్ఞుడై, శర్వశక్తుడైన సర్వేశ్వరుడే అనుమానముచేత సిద్ధించినవాడని ఆబ్రహ్మమందు పూర్వము చెప్పిన శ్రుతి ప్రమాణము కాదని- సిద్ధాన్తము. జగత్తుకు కార్యత్వముండినప్పటికిని ఒకేకాలమందే యొకనిచేతనే సమస్తమునిర్మింపబడెనని ప్రమాణములేని దానివలన విలక్షణపుణ్యముగల జీవులకుజ్ఞానశక్తివైచిత్ర్యములచేత నొకకాలమం దొక జగత్తుయొక్క నిర్మాణసామర్థ్యము సంభవించును గనుక తదతిరిక్తుడైనపురుషుడు అనుమానముచే సాధనీయుడు కాడని అట్టి పురుషునియందు ఆశాస్త్ర మొకటే ప్రమాణమగును గనుక పూర్వమందు చెప్పబడిన శ్రుతి బ్రహ్మయందు ప్రమాణము.

శాస్త్రం- వేదము, యోనిః- కారణము అనగా ప్రమాణము. తత్- ఆ బ్రహ్మము, శాస్త్రయోనిః- శాస్త్రియోని యగును, ప్రమాణాన్తరమునకు అవిషయుడు గనుక శాస్త్రిమొకటి చేతనే తెలియబడువాడు గనుక బ్రహ్మకు శాస్త్రియోనిత్వముసంభవించునుననిసూత్రార్థము.

తా. ఆ, బ్రహ్మ, కారణముగా కలవాడు.

అ-సం.— వేదాన్తములకు సిద్ధమైనబ్రహ్మ వస్తువందు బోధకత్వ శక్తిగలిగినదై జన్మకారణత్వాదులుబ్రహ్మ లక్షణమై బ్రహ్మ ప్రతిపత్తిలభించినను - వేదాంతారంభము ఘటింపదు- శాస్త్రిరూప ప్రమాణము ప్రమాణాంతరాప్రాప్తంబై ప్రమాణాన్తర విరోధము లేని అర్థములు బోధకముగానుండును- ఇకను బ్రహ్మయొక్క-నిమిత్తత్వాంశము ‹‹క్షిత్యాదికం సకర్తృకంకార్యత్వాత్,, ఘటవత్- అనే అనుమానముచేత సిద్ధించును-ఉపాదానత్వాంశమునిమిత్తభూతులైన కులాలాదులలో ఉపాదానత్వము కానరానందున- ప్రత్యక్ష్యాది ప్రమాణవిరుద్ధంబుగనుండును- గాన, సాధక బాధక ప్రమాణ విరహితము కానందున బ్రహ్మకారణత్వమునుసాధించుతరిలోకదృష్టకులాలాదిక్షేత్రజ్ఞ సజా

తీయుడై సిద్ధించునేగానివివక్షితుడైన ఈశ్వరుడు సిద్ధింపనందున అనుమానముచేతనీశ్వరునియొక్క-నిమిత్తత్వాంశమును సాధింప గూడనందున అనుమానను సాధింపనేరదు- అపరిమితశక్తుడైన నిమిత్తేశ్వరునికే లోకాపరిదృష్టమైనఉపాదానత్వాంశమును ప్రమాణాంతర బాధితముకానందున ఉపాదానత్వాంశమందు ప్రమాణాంతరబాధకముకానేరదు కాబట్టిసాధకబాధక ప్రమాణ విరహితమైన బ్రహ్మకారణత్వంబున వేదాంతమే ప్రమాణముకాదగినందునతద్విచారమారమ్భణీయమని శాస్త్రయోన్యధికరణ ప్రమేయము.

౪. సమన్వయాధికరణము.

౪. తత్తుసమన్వయాత్.

అ.— తత్- పూర్వ సూత్రమందుచెప్ప బడిన శాస్త్ర యోనిత్వము, సమన్వయాత్- పురుషార్థత్వముచేత అన్వయమువలనసిద్ధించును.

బ్రహ్మకు శాస్త్రప్రమాణ కత్వముసంభవించునా లేదాయని విచారముచేయబడుచున్నది.

సంభవింపదని పూర్వపక్షము.

ఎట్లన్నను.

ప్రవృత్తినివృత్తి రహితుఃడైనబ్రహ్మకుస్వరూపముచేత పురుషార్థత్వములేకపోవుటవలన, పురుషార్థమునకుబోధక మాటచేతనే శాస్త్రమునకు ప్రామాణ్యమువల్లనుండెయుసంభవింపదు, మోక్షసాధకబ్రహ్మధ్యానవిధిపరత్వము చెప్పినప్పటికిని అసత్తైనబ్రహ్మయందుధ్యానవిధానముసంభవించును గనుక, బ్రహ్మసద్భావ మందు తాత్పర్యములేదని బ్రహ్మకు శాస్త్రప్రమాణకత్వముసంభవింపదు.

సిద్ధాంతము - అధిక గుణముగల పితృ పుత్రాదుల జీవనజ్ఞానము వలెనే అవధి లేని యధికానంద స్వరూపమైన బ్రహ్మజ్ఞానమునకు నతిశయ రహిత పురుషార్థత్వము సంభవించుట వలన బ్రహ్మకు శాస్త్ర ప్రమాణకత్వముసంభవించును,

"ఆనన్దో బ్రహ్మ, యదేష ఆకాశ, యతో వాచో, ఆనన్దం బ్రహ్మణోవిద్వాన్నబిభేతికుతశ్చన, ఆనంద స్వరూపమే బ్రహ్మము, వేదవాక్యములు మనస్సు చేతనున్ను బ్రహ్మానందమూహించుటనసమర్థమై వెనకకుతిరుగును అటువంటిఆనందమును తెలిసినవాడు మరలసంసారమును పొందడుయనెడియర్థ ప్రతిపాదకములైన శ్రుతులచేననవధికానంద స్వరూపమే బ్రహ్మమని చెప్పబడుచున్నది. గనుక బ్రహ్మతన రూపముచేతనైనా అనుభవింపబడిన వాడైనట్టయితే నిరతిశయానందస్వరూపుండని తత్ప్రతిపాదన ప

రునికే సాక్షాత్తుగా పురుషార్థమంద న్వయము.

ప్రవృత్తి నివృత్తులయందుపరుడైనవానికిదాని చేతగలిగినఫలముయొక్క సంబంధము వలన పురుషార్థ మంద న్వయము.

సూత్రార్థము-తుశబ్దముసంభవించినపూర్వ పక్షమునకు నివృత్తి ద్యోతకము.

తత్-పూర్వసూత్రమందు చెప్పబడినబ్రహ్మకుశాస్త్రయోనిత్వము,సమన్వయమువలనసిద్ధించును.

సమ్యక్ అన్వయః- సమ్యక్ అనగా పురుషార్థత్వముచేత, అన్వయాత్ - అన్వయమువలన.

తెలిసికొనెడి మనుష్యునికి ననవధికానందస్వరూపుడౌటచేత పరమపురుషార్థస్వరూపుడైన బ్రహ్మమందు బోధకత్వముచేతశాస్త్రమునకునన్వయమువలనబ్రహ్మకుశాస్త్రప్రమాణకత్వముసిద్ధించును.

తా.—వేదకారణను పేరమపురుషార్థాన్వయమువలనసిద్ధించును.

అ - సం.— ప్రవృత్తి నివృత్తిపరంబుగనుండు ''అర్థార్థీ రాజకులంగచ్ఛేత్,, ''మన్దాగ్ని ర్నాంబుపిబేత్,, ''స్వర్గ కామోయజేత,, నకళఞ్జంభక్షయేత్ ''ఇత్యాదివాక్యములకే ప్రయోజన పర్యవసాయిత్వ ముండును- సిద్ధవస్తు బోధక వాక్యంబులకు నట్లు లేదు కాబట్టిసిద్ధమైనబ్రహ్మప్రతిపాదకవాక్యంబులకు ప్రయోజన పర్యవసానము లేనందున వేదాన్త శాస్త్రము అనారమ్భణీయమనే పూర్వపక్షమునకు- నిధివలె స్వయం ప్రయోజన రూపమై తత్ప్రతిపాదక వేదాంత వాక్యములే సాక్షాత్ప్రయోజనపర్యవసాయిలు - ఇష్టానిష్టప్రాప్తిపరిహారసాధనబోధన ద్వారాప్రవృత్తినివృత్తి పరవాక్యములకు ప్రయోజనపర్యవసాయిత్వమువినా- ప్రత్యక్షప్రయోజనపర్యవసాయిత్వములేదు - గాన- అనన్త కల్యాణగుణ పరి పూర్ణమై బ్రహ్మంబే ప్రయోజనమైతత్ప్రతిపాదకశాస్త్ర ప్రమాణమైసిద్ధించుటచే బ్రహ్మప్రతిపాదక శాస్త్రమారమ్భణీయమనిసమన్వయాధికరణము.

౫. ఈక్షత్యధికరణము.

౫. ఈక్షతేర్నాశబ్దమ్.

అ.—అశబ్దం-ప్రధానము, ఈక్షతేః-ఈక్షణమువలన,న-కాదు.

''యేనా శ్రుతం శ్రుతం,, భవతీత్యాది జగత్కారణ వాది వేదాన్త వేద్యము విషయము. దేని చేత దెలియబడనిదియు దెలియ బడినదియును యగును యనెడి జగత్కారణత్వమును జెప్పెడి శ్రుతి విషయమైన వస్తువు సాంఖ్యులచేత జెప్ప బడిన ప్ర

ధానమా ఆనందస్వరూపమైనబ్రహ్మమాయని సంశయము.

ప్రధానమని పూర్వపక్షము.

ఎట్లన్నను, ప్రతిజ్ఞా దృష్టాంతములయొక్క అన్వయము చేత ననుమానాకారముగల వాక్యముచేత దెలియబడును.

గనుక ప్రధానమేయని ‹‹ఏనాశ్రుతంశ్రుతమ్భవతి,, యనెడి శ్రుతిచేనొకటిని దెలియుటచేతనేసర్వము తెలియబడునని ప్రతిజ్ఞచేసి‹‹యథాసోమ్యైకేన మృత్పిండేన,, అనెడి దృష్టాంతముచేత ఉపపాదనచేయ బడుచున్నది.

గనుక ఆయనుమానవిషయమైనదెయీ వాక్యముచేత వేద్యమనినిశ్చయానంతరమందు ‹‹సదేవసోమ్యేయనెడి శ్రుతియందు సచ్ఛబ్దము ప్రధానవాచకము.

తదైక్షతయనే శ్రుతియందుండెడి ఈక్షణముగౌణమగునని-తత్తేజఐక్షతయనెడి శ్రుతి ప్రతిపాదితమైనగౌణదర్శనముచేతనే తెలియబడుచున్నది.

సిద్ధాంతము ‹‹తదైక్షత బహుస్యాం,, యనెడిశ్రుతియందు బహుభవన సంకల్పరూప ఈక్షణముచేత నన్వయమువలన సదేవసోమ్యేయనుకారణవాచకమైనసచ్ఛబ్దమునకు నచేతనమైనప్రధానము యర్థముకానేరదు-సర్వజ్ఞమైనసత్య సఙ్కల్పాదియుక్తమైన పరబ్రహ్మమే యర్థమని నిశ్చయింపబడుచున్నది.

అనుమానస్వరూపము ఆవాక్యమని చెప్పకూడదు- హేతువు చెప్పకపోవుటవలన, అన్యజ్ఞానముచేతఅన్యజ్ఞానముసంభవింపక పోవుననెడి అర్థము పోగొట్టుటకొరకుదృష్టాంతముచెప్పిరి ముఖ్యదర్శనముసంభవించు చున్నప్పుడుగౌణమైన ఈక్షణము నంగీకరించ డమెవరికిని యుచితముగాయుండదు.

తేజస్సు మొదలుగాగలిగిన వస్తువులయందును గౌణమైన ఈక్షణముతాత్పర్యముకాదు తేజశ్శబ్దాదులు తేజశ్శరీరకుడైన అంతర్యామి వాచకములు గనుక పరబ్రహ్మమేజగత్కారణమని తెలియవలెను.

సూత్రార్థము- ఈక్షతిః- ఈక్షతిధాతువునకుదర్శనమని యర్థము.

అశబ్దమనగా శబ్దమేప్రమాణము, దేనికి సంభవింపదో అది అశబ్దమనిపించు కొనును- గనుక పదోక్తమైన అనుమానముచేత జెప్పబడిన అశబ్దమైనప్రధానము-న-కాదు,

‹‹సదేవసోమ్య, యనుశ్రుతియందుప్రతిపాద్యమైన బ్రహ్మయం దన్వయముగల ఈక్షణరూప వ్యాపారమువలనఅచేతనమైన అశబ్దముకాదు- సర్వజ్ఞమైన బ్రహ్మమే జగత్కారణమనినిశ్చయించవలెను.

తా.—— జగత్సర్గోపయుక్తము
క్షేక్షణముప్రకృతికింగూడదు.

౬. గౌణశ్చేన్నాత్మశబ్దాత్.

అ.——గౌణశ్చేత్ - గౌణేక్షణమని
నట్టయితె,ఆత్మశబ్దాత్ - చేతనవాచక
శబ్దమువలన, న- కాదు.

"తత్తేజ ఐక్షత," యనెడిఅచేతన
మును బొందిన గౌణేక్షణముయొక్క
సాహచర్యము తదైక్షత యనెడి స్థల
మందు ఈక్షతిశబ్దము గౌణమని చెప్ప
కూడదుఆత్మశబ్దమువలన.

సచ్ఛబ్దముచేత జెప్పబడి చూచెడి
వానియందు "ఐతదాత్మ్యమిదం స
ర్వంతత్సత్యంస ఆత్మా," యనిచేతన
వాచకమైన ఆత్మశబ్దముసమభివ్యాహా
రముచే నుండుటవలనగౌణముకాదనే
నిశ్చయింపవలసినది.

"ఐతదాత్మ్యమిదంసర్వం," యనె
డిశ్రుతులయందు తేజఃప్రభృతులైన
వానికి తదాత్మకత్వశ్రవణమువలన తే
జఃప్రభృతి ఈక్షణము ముఖ్యమేయని
యభిప్రాయము.

తా.——ఆత్మశబ్దముచేతనవాచక
మైనందునగౌణేక్షణము కానేరదు.

౭. తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్.

అ.—— తన్నిష్ఠస్య-బ్రహ్మాత్మకత్వ
ము చేత, జీవాను సంధాన నిష్ఠునికి,
మోక్షోపదేశాత్ - మోక్షముచెప్పుట
వలన.

ఈకారణమువలన సచ్ఛబ్దముచేత
జెప్పబడినదిప్రధానముకాదు"పరబ్ర
హ్మ.తత్త్వమసి,,యనెడుశ్రుతియందు
బ్రహ్మస్వరూపముచేప్రత్యగాత్మాను
సంధాననిష్ఠునకు "తస్య తావదేవచి
రం యావన్న విమోక్ష్యే అథ సమ్ప
త్స్యే,,యనేవాక్యమువలన మోక్షము
చెప్పుటవల్ల దానియందుకారణమైనది
పరబ్రహ్మమేను.

తా.—— ఆత్మనిష్ఠునికి మోక్షము
చెప్పుటచేత పరబ్రహ్మమే యనుట.

౮.—— హేయత్వావచనాచ్చ.

అ.—— హేయత్వ - త్యాజ్యత్వ
ము, అవచనాచ్చ - చెప్పక పోవుట
వలన.

ప్రధానమునకే కారణత్వముచెప్పి
నయెడల ప్రధానముమోక్షవిరోధిగ
నుక హేయత్వము చెప్పబడును.

హేయత్వము చెప్పబడక పోవుట
వలనప్రధానము కారణముకాదు- బ్ర
హ్మమే కారణమని తాత్పర్యము.

తా.—— ప్రధానమునకు మోక్ష
విరోధిత్వముచెప్పుట వలన.

౯. ప్రతిజ్ఞావిరోధాత్.

అ.——ప్రతిజ్ఞా-చేయబడినప్రతిజ్ఞ
కు,విరోధాత్-బాధకమాటవలన.

ప్రధానమనివాదించిన యెడలప్ర
తిజ్ఞకువిరుద్ధమగును.

"యేనాశ్రుతంశ్రుతం,, యనెడి

శ్రుతిచే జెప్పబోవు కారణ జ్ఞానము చేత చేతనాచేతనమిశ్రమైన సమస్త ప్రపంచముయొక్క-జ్ఞానమే ప్రతిజ్ఞచే యబడియున్నది - చేతనాంశ మును గూర్చి బ్రధానమునకు కారణత్వము రాదు అప్రధాన జ్ఞానముచేత చేతనాంశము తెలియబడదుగనుక ప్రధానము కారణముకాదు.

తా.—చేయబడిన ప్రతిజ్ఞకుబాధకముకలుగుటవలన.

౧౦. స్వాప్యయాత్.

అ.— స్వ - స్వకారణ మందు, అప్యయాత్ - లీనత్వముజెప్పెడిశ్రుతివలన.

స్వమపీతో భవతియని జీవునికి సుషుప్తియందు స్వాప్యయము వినబడుచున్నది.

స్వకారణమందు అప్యయముఅనగా-లీనత-జీవునిగూర్చి ప్రధానమునకు కారణత్వము లేకపోవుటవలనను స్వాప్యయ శ్రుతివిరోధము కలుగుటవలనను ప్రధానము కారణముకాదు - బ్రహ్మే జగత్కారణమని తెలియవలెను.

తా.— జీవునకు సుషుప్త్యవస్థయందు దనకుగారణభూతమైన పరబ్రహ్మయందు లీనత్వము కలదనుట శ్రుతిసిద్ధము.

౧౧. గతిసామాన్యాత్.

అ.—గతి-మరియొకయుపనిషత్తుయందుజెప్పబడిన, సామాన్యాత్-సాదృశ్యమువలన.

మఱియొక ఉపనిషత్తుయందుజెప్పబడిన రీతిగా నీయుపనిషత్తు యందును ప్రధానము కారణము కాదని నిశ్చయింపవలెను.

"యస్సర్వజ్ఞస్సర్వవిత్ తస్మాదేతద్బ్రహ్మనామరూపమన్నఞ్చజాయతే పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే స్వాభావకీజ్ఞానబలక్రియాచ - సకారణం కరణాధిపాధిపః- ఆత్మనిఖల్వారే విదితేసర్వమిదం విజ్ఞాతంభవతి-తస్యహవాఏతస్యమహతోభూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదః- పురుష ఏవేదం సర్వంయద్భూతం యచ్చభవ్యం తస్మాద్విరాడజాయత - ఆత్మావా ఇదమేక ఏవాగ్రఆసీత్ స ఇమాన్లోకాన సృజత తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశస్సంభూతః-ఏకోహవై నారాయణ ఆసీత్ - స ఏకాకీనరమేత,, మఱియు నుపనిషత్తుల యందు అతని శక్తి అనంతమనియు సతనిబలజ్ఞానాదులు విలక్షణమనియు-సమస్తవస్తువులనువిశేషాకారము చేతను సామాన్యాకారముచేతను దెలిసినవాడనియు సమస్త ఇంద్రియాదులకునధిపతియనిఆబ్రహ్మ తెలియబడినపైతే సర్వము తెలియబడుననియునీసమస్తప్రపంచము భూతభవిష్యదాత్మకమంతయునుబ్రహ్మస్వ

రూపమనియునతనివలనవిరాట్స్వరూపముదయించె ననియు నాత్మశబ్దవాచ్యమైనబ్రహ్మ మొక్కఁడే సృష్టికిపూర్వమందుండెననియు నాబ్రహ్మముసమస్తలోకములనుసృష్టిచేసెననెడియర్థప్రతిపాదకములైన యనేకశ్రుతులచేత పరబ్రహ్మకే కారణత్వము నిశ్చయముచేయబడుచున్నది.

ఈశ్రుతికినిదాని గతిసామాన్యమువలన బ్రహ్మమేకారణమని చెప్పను- ప్రధాన మెంత మాత్రము కారణము కాదు.

తా.—ఈశ్రుతి సాదృశ్యము మఱియొకశ్రుతియుండుటవలనను.

౧౨. శ్రుతత్వాచ్చ.

అ.— శ్రుతత్వాచ్చ- ‹‹ఆత్మనఏవేదంసర్వమితి,, యనెడిఈయుపనిషత్తుయందు కారణత్వము వినబడుట వల్లను.

ఆకారణమువల్లనుంచి సదేవసోమ్యయను కారణ వాక్యముచేత దెలియదగినదిప్రధానముకాదుసర్వజ్ఞమై సత్యసంకల్పమైన పరబ్రహ్మమేయని దృఢముచేయబడినది.

తా.— సచ్ఛబ్దవాచ్యమైనకారణముప్రధానముకాదుబ్రహ్మమేయనియుపనిషత్తుయందు వినబడుటవలన.

అ.—సం|| ‹‹సదేవసోమ్యేద మగ్రఆసీత్,, ఇత్యాదివాక్యమందు జగత్కారణతయాప్రతిపన్నమైనసచ్ఛబ్దవాచ్యవస్తువుప్రధానము కాగలదౌను ఇదంశబ్దవాచ్యమైన సత్వరజస్తమోమయజగంబునకుతదుక్తమైన ప్రధానము కారణమగునేగాని- సత్వరజస్తమోవిధురమైన బ్రహ్మము కారణము కానేరదు- మరియు అనుమానాకారవాక్యవేద్యతయా అనుమానిక ప్రధానమేఈవాక్యమందు కారణమై తోచుచున్నదనేపూర్వపక్షమునకు జగత్సర్గోపయుక్తముఖ్యేక్షణముప్రకృతికిగూడనందునసర్వజ్ఞమైనబ్రహ్మంబునకేయుండుటచేతను - చిదచిద్విశిష్టబ్రహ్మముజగత్కారణమగుటచేతను శరీరభూతచిదచిద్ద్వారా సత్వరజస్తమోమయాన్వయము కూడుటచేతను జగత్కారణలక్షణ్యము బ్రహ్మమునకు నుండుటవలనఅనుమానావయవములలో ప్రధానమైన హేత్వవయవమను పాత్తమగుటచేతవాక్యమున కనుమానాకారత్వముసిద్ధించదుగాన- సచ్ఛబ్దవాచ్యమైనకారణముప్రకృతికాదు - పరమాత్మేయని సిద్ధాంతముచేసి బ్రహ్మముఅచిద్వ్యావృత్తమని ప్రతిపాదించబడ్డది.

౬. ఆనన్దమయాధికరణము.

౧౩. ఆనన్దమయోఽభ్యాసాత్.

అ.— ఆనన్దమయః- ఆనందమయ శబ్దముచేత జెప్పబడినవాడు పర

మాత్మ, అభ్యాసాత్ - సాన్నిధ్యము వలన.

తైత్తిరీయోపనిషత్తుయందు “తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సమ్భూత,, యనియారంభించి“తస్మాద్వాఏతస్మాద్విజ్ఞానమయాదన్యోఽన్తరఆత్మానందమయ,, యనెడి స్థలమందు జగత్కారణత్వముచే తెలియపడిన ఆనందమయ వస్తువు జీవుడా-లేకపరమాత్మాయనిసంశయము.

జీవుండనిపూర్వపక్షము ఎట్లు “తస్యైషఏవశారీరఆత్మేతి,, యనువాక్యముచె ఆనందమయమునకు శారీరత్వముచెప్పబడును.

శారీరుడుఅనగా శరీరసంబంధము గలవాడు, అతడు ప్రత్యగాత్మయైన జీవుడే అతనికిచేతనత్వముండిన దాని వలన దర్శనపూర్వకమైన సృష్టియును ఉపపన్నమగును.

సిద్ధాంతము “సైషానన్దస్య మీమాంసాభవతి,, యని బ్రహ్మానందమునుఆరంభించి యతోవాచోనివర్తంతె అప్రాప్యమనసాసహ ఆనన్దంబ్రహ్మణోవిద్వాన్,, యనెడి వాక్యమువరకును జెప్పబడినానందము ప్రత్యగాత్మకు నర్థాంతరభూతుడైన పరమాత్మకేనిశ్చయింపబడుచున్నది.

శ్రుతియందు జెప్పబడిన శారీరత్వము పరమాత్మకే సంభవించును. “తస్మాద్వాఏతస్మాదాత్మన ఆకాశస్సమ్భూత,,యనుశ్రుతిచేతండెలియబడినపరబ్రహ్మమే అన్నమయాదిశరీరుండనినిశ్చయింపబడుచున్నది.

మఱియొక ఆత్మకు నిర్దేశము లేకపోవుటవలన శ్రుత్యన్తరములయందు ‘యస్యపృథివీశరీర, మనియారంభించి ‘ఏషసర్వభూతాంతరాత్మాఽపహతపాప్మాదివ్యోదేవ ఏకో నారాయణ, యని పృథివ్యంతరిక్షాదులకు శరీరత్వమును పరమాత్మకు ఆత్మత్వమున్ను జెప్పబడియున్నది.

అన్నమయమునకు ఆత్మయైన వస్తువే ప్రాణమయాదులయందు “తస్యైషఏవశారీరఆత్మా యఃపూర్వస్యేత్యనుకృష్యత,,యనిఆత్మగా అనుకర్షణము చేయబడుచున్నది. విజ్ఞానస్వరూపుడైన ప్రత్యగాత్మకును ఆవస్తువే ఆత్మా. గనుక ఆనందమయమందు “తస్యైషఏవశారీర ఆత్మయఃపూర్వస్యేతి,,యనేనిర్దేశము ఆనందమయమునకుఅనన్యాత్మత్వప్రదర్శనమే ప్రయోజనముగాగలది.

ఆకారణము వలన జగత్కారణముగా జెప్పబడిన నానందమయుండు పరమాత్మే.

సూత్రార్థము- అనన్దమయశబ్దము చేతనుఆకాశము మొదలైన శబ్దముల

చేతను జెప్పబడిన జగత్కారణ భూతుండైనవాడు ప్రత్యగాత్మకు నర్థాన్తర భూతుడైనపరమాత్మేను.

ఎట్లన్నా పరమాత్మకు నిరతిశయానందమునకు ప్రతీతియుండుటవలన.

"సఏకో మానుషానన్దః తేయేశతం", యనెడివాక్యముచేత ప్రత్యగాత్మయందు సంభావితమైన నానందమునకు బ్రహ్మయందే స్థితి యోగ్యమగునని తేయేశతమని యభ్యాస ముండిన దానివలనపరమాత్మేను.

తా.—— ఆనన్దమయ శబ్దముచేత జెప్పబడినవాడు జీవాత్మకంటే విలక్షణమైన పరమాత్మేను - ఎందువలనంటే - ఆయానందమునకు సర్వాధికత్వము ప్రతిపాదనమగుటవలన పరమాత్మయందుఆఆనందముండుటవలనప్రత్యగాత్మ కానేరదు.

౧౪. వికారశబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్.

అ.—— వికారశబ్దాత్- వికారార్థకమయట్ప్రబ్దమువలన, నేతిచేత్ - బ్రహ్మ కాదనినట్టయితే, ప్రాచుర్యాత్- ఈమయటుకు ప్రాచుర్యార్థమువలన, న-కాదు.

ఆనందమయః - అనివికారార్థకమయట్ శబ్దముండిన దానివలనఅవికృతుండైన పరమాత్మ యెంతమాత్రముకాదు.

అన్నమయః, అనెడివికారోపక్రమమువలన మయట్ప్రబ్దమునకు వికారమేయర్థమని చెప్పడమయుక్తను కాదుజీవునికిన్ని,నజాయతేమ్రియతేవా, యనెడివాక్యములచేత వికారప్రతిషేధనువలన ప్రాచుర్యార్థమే మయటని నిశ్చయింపవలయును.

ఈఆనందమందు "యతోవాచోనివర్తన్తే", అనిచెప్పబడిన ప్రాచుర్యమువల్ల ఆనందప్రచురుడుపరమాత్మే.

అనవధికమై ప్రచురమైన ఆనందము ప్రత్యగాత్మయందు సంభవింపదనియూహింపవలయు.

తా.—— వికారార్థకమైన మయట్ప్రబ్దము ప్రాచుర్యార్థకము వలన బ్రహ్మమందన్వయించును.

౧౫. తద్ధేతువ్యపదేశాచ్చ.

అ.—— తత్-అనందమందు, హేతుః-కారణత్వముయొక్క,వ్యపదేశాచ్చ- చెప్పుటవలనున్ను.

ఏష హ్యేవా నన్దయాతి, యనెడి శ్రుతిచేత జీవుల నానన్ద పరచుటను జెప్పబడియున్నది గనుక పరమాత్మే ఆనన్దమయుండనినిశ్చయము.

తా.—— ఆనందమయ హేతుత్వ కారణములు చెప్పుటవలననున్ను.

౧౬. మాన్త్రవర్ణిక మేవచగీయతే.

అ.—— మాన్త్రవర్ణికమేవ- మన్త్రవర్ణమందు జెప్పబడినబ్రహ్మమే

గీయతే- ఆనన్దమయమని స్తోత్రముచే యబడుచున్నది.

"సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ" యనుమన్త్రవర్ణమందుజెప్పబడినబ్రహ్మమే "తస్మాద్వాఏతస్మాదాత్మన" యనియారంభించి ఆనంద మయఃయనిచెప్పబడుచున్నదిగనుక ఆనందమయుండేబ్రహ్మ.

తా.—మన్త్రవర్ణమందు జెప్పబడినబ్రహ్మమే ఆనందమయుండనిస్తుతింపబడుచున్నాడు.

ప్రత్యగాత్మకుపరిశుద్ధమైనస్వరూపమును మంత్రవర్ణమందు చెప్పబడినదనిశంకచేసి చెప్పుచున్నారు.

౧౭. నేతరోనుపపత్తేః.

అ.—ఇతరః-ఇతరజీవునకు, అనుపపత్తేః - సర్వజ్ఞత్వము సంభవింపకపోవుటవలన, న-మన్త్ర వర్ణ మందు చెప్పబడినవాడు కాడు.

పరబ్రహ్మకంటేనితరులైనప్రత్యగాత్మలు మంత్రవర్ణమందు జెప్పబడలేదుఆప్రత్యగాత్మకు "బ్రహ్మణావిపశ్చితేతి, యనెడివాక్యమందు చెప్పంబడినవిపశ్చిత్వము సంభవింపదు.

అనగా "వివిధంపశ్యన్-చితువిపశ్చితం, యనెడిసమాసముచేత.

"సోకామయతబహుస్యాం ప్రజాయేయేతి" యనువాక్యమందుజెప్పబడిననిరుపాధిక బహుభవనసంకల్పరూపసర్వజ్ఞత్వము. ఆసర్వజ్ఞత్వము పరిశుద్ధ స్వరూపుడయిన జీవునికి సంభవింపదు "జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ" యని ముందరనే యీయర్థము చెప్పబడుచున్నదిగనుక పరబ్రహ్మమే మన్త్రవర్ణ మందు జెప్పబడినవాడు.

తా. సర్వజ్ఞత్వము సంభవింపకపోవుటవలన మన్త్రవర్ణమందు జెప్పబడినవాడుజీవుండుగాడు పరమాత్మే.

౧౮. భేదవ్యపదేశాచ్చ.

అ.—భేద-భేదముయొక్క, వ్యపదేశాచ్చ-చెప్పుటవలన.

భీషాస్మాద్వాతఃపవత, అనెడిశ్రుతిచేత అగ్నివాయుసూర్యాది జీవవర్గమునకుశిక్షితవ్యత్వముచేతనుఆనన్దమయమగు బ్రహ్మమునకు శిక్షకత్వముచేతను భేదము చెప్పబడుచున్నది గనుక ఆనన్దమయమేపరమాత్మ.

"తస్మాద్వాఏ తస్మా ద్విజ్ఞానమయాదన్యోన్తరఆత్మానందమయః" అనుశ్రుతులచేత విజ్ఞానమయుడైనజీవునికంటే నానంద మయ పరమాత్మకు భేదముచెప్పబడుచున్నది.

విజ్ఞానమయుడు జీవుడే- బుద్ధిమాత్రముకాదు-మయట్టుకుశ్రవణముండుటవలననానందమయమేపరమాత్మా.

తా.— శ్రుతియందు విజ్ఞానమయజీవునికంటెనానన్దమయపరబ్రహ్మ

కు భేదము చెప్పడమువలన.

౧౮. కామాచ్చనానుమానాపేక్షా.

అ.— కామాచ్చ - ఇచ్ఛవల్లనే జగత్సృష్టివినబడుటవలన,అనుమాన-ప్రధానముయొక్క,అపేక్షా- అభిలాషయు,న-లేదు.

సోకామయత్రయనిఆరంభించి "ఇదంసర్వమసృజతా,, యని కామమువల్లనేజగత్సృష్టివినబడుటవలనసీయానందమయునకుజగన్నిర్మాణమందనుమానముచేత జెప్పబడిన ప్రకృత్యపేక్షయున్నులేదని తెలియబడుచున్నది.

ప్రత్యగాత్మకు నొకానొక సృష్టియందుప్రకృత్యపేక్షగలదుగనుక ప్రత్యగాత్మకంటెభిన్నుండే పరమాత్మ.

తా.— ఇచ్ఛవల్లనే జగత్సృష్టి వినబడుట వలనప్రధానాభిలాషయునులేదు.

౨౦.అస్మిన్నస్యచ తద్యోగంశాస్తి.

అ.— అస్మిన్-ఆబ్రహ్మమందు-అస్య-ఈజీవునికి-తత్-ఆనన్దనుయొక్క యోగం- సంబంధమును- శాస్తి- శాస్త్రముచెప్పుచున్నది.

"రసోవైసః రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీభవతి,, యనేశ్రుతిచేతరస శబ్దముచే జెప్పబడిన ఆనందమయుని యందు అయంశబ్దనిర్దిష్టుండైన జీవునికినానంద లాభమని ఆనంద యోగము నుశిక్షించుచున్నది శాస్త్రము.

ప్రత్యగాత్మకేవనియొక్క లాభమువలన నానందప్రాప్తి కలుగునో అతడే ఆప్రత్యగాత్మకంటే భిన్నుండైన పరమాత్మ,ఆనంద మయుడైన పరబ్రహ్మము.

తా.— జీవునకు ఆనందయోగముపరబ్రహ్మసంబంధము వలన కలుగునని శాస్త్రముచెప్పుటవలన పరమాత్మేఆనన్దమయుడు.

అ-సం.—బ్రహ్మముఅచిద్వ్యావృత్తమైన-జీవవ్యావృత్తంబు కాచాలదు "తస్మాద్వాఏతస్మాద్విజ్ఞానమయాదన్యోన్తరఆత్మానన్దమయః,,అనుచోట ఆనన్దమయశబ్దవాచ్యుడు జీవుండగుట చేత-వాడుజీవుడైనందుకై "తస్యైష ఏవశారీర ఆత్మా,, యనిశరీరసమ్బన్ధశ్రవణమున్ను "అనేనజీవేనాత్మానానుప్రవిశ్య,,యనుసామానాధికరణంబుచేతజీవబ్రహ్మలకైక్యము-కాబట్టిజగత్కారణ తయానిర్దిష్టుడైనఆనన్దమయుండుజీవుడేయనే పూర్వపక్షమునకుశతగుణితోత్తరక్రమేణఅభ్యస్తమైనఆనన్ద సుఖలవభాగియై పరిమితకర్మవశ్యుడై నజీవునకు ఘటింపకపోవుటచేత పరమాత్మకేఅదియున్నదౌటచేతను "శారీరఆత్మా,, యనుజగచ్ఛరీరుడగుటచేతను కర్మకృత శరీరము కానందున - సామానాధి కరణ్య నిర్దేశముచేతను శరీరాత్మ భావని బన్ధన

గీయ తే- ఆనన్దమయుమని స్తోత్రముచే యబడుచున్నది.

"సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ,,యనుమన్త్రవర్ణమందుజెప్పబడినబ్రహ్మమే"తస్మాద్వాఏతస్మాదాత్మన,,యనియారంభించి ఆనంద మయఃయనిచెప్పబడుచున్నదిగనుక ఆనందమయుండేబ్రహ్మ.

తా.—మన్త్రవర్ణనుందు జెప్పబడినబ్రహ్మమే ఆనందమయుండనిస్తుతింపబడుచున్నాడు.

ప్రత్యగాత్మకుపరిశుద్ధమైనస్వరూపమును మంత్రవర్ణమందు చెప్పబడినదనిశంకచేసి చెప్పుచున్నారు.

౧౭. నేతరోనుపపత్తేః.

అ.—ఇతరః-ఇతరజీవునకు,అనుపపత్తేః - సర్వజ్ఞత్వము సంభవింపకపోవుటవలన, న-మన్త్రి వర్ణ మందుచెప్పబడినవాడు కాడు.

పరబ్రహ్మకంటేనితరులైనప్రత్యగాత్మలు మంత్రవర్ణమందు జెప్పబడలేదుఆప్రత్యగాత్మకు"బ్రహ్మణావిపశ్చితేతి, యనెడివాక్యమందు చెప్పంబడినవిపశ్చిత్వము సంభవింపదు.

అనగా"వివిధంపశ్యత్ చితువిపశ్చితం, యనెడిసమాసముచేత.

"సోకామయతబహుస్యాం ప్రజాయేయేతి,, యనువాక్యమందుజెప్పబడిననిరుపాధిక బహుభవనసంకల్పరూపసర్వజ్ఞత్వము. ఆసర్వజ్ఞత్వము పరిశుద్ధ స్వరూపుడయిన జీవునికి సంభవింపదు "జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ,, యనిముందరసే యీయర్థముచెప్పబడుచున్నదిగనుక పరబ్రహ్మమే మన్త్రివర్ణమందు జెప్పబడినవాడు.

తా. సర్వజ్ఞత్వము సంభవింపకపోవుటవలన మన్త్రివర్ణ మందు జెప్పబడినవాడుజీవుండుగాడు పరమాత్మే.

౧౮. భేదవ్యపదేశాచ్చ.

అ.— భేద-భేదముయొక్క,వ్యపదేశాచ్చ-చెప్పుటవలన.

భీషాస్మాద్వాతఃపవత, అనెడిశ్రుతిచేత అగ్నివాయుసూర్యాది జీవవర్గమునకుశిక్షిత వ్యత్వముచేతనుఆనన్దమయమగు బ్రహ్మమునకు శిక్షకత్వముచేతను భేదము చెప్పబడుచున్నది గనుక ఆనన్దమయమేపరమాత్మ.

"తస్మాద్వాఏ తస్మా ద్విజ్ఞానమయాదన్యోన్తరఆత్మానందమయః,,అనుశ్రుతులచేత విజ్ఞానమయుడైనజీవునికంటే నానందమయ పరమాత్మకు భేదముచెప్పబడుచున్నది.

విజ్ఞానమయుడు జీవుడే- బుద్ధిమాత్రముకాదు-మయట్టుకుశ్రవణముండుటవలననానందమయమేపరమాత్మా.

తా.— శ్రుతియందు విజ్ఞానమయజీవునికంటెనానన్దమయపరబ్రహ్మ

కు భేదము చెప్పడమువలన.

౧౯. కామాచ్చనానుమానాపేక్షా.

అ.— కామాచ్చ - ఇచ్ఛవల్లనే జగత్సృష్టివినబడుటవలన, అనుమాన-ప్రధానముయొక్క, అపేక్షా- అభిలాషయు, న-లేదు.

సోకామయత యని ఆరంభించి «ఇదంసర్వమసృజత», యని కామమువల్లనే జగత్సృష్టివినబడుటవలన నీయానందమయునకు జగన్నిర్మాణమందనుమానముచేత జెప్పబడిన ప్రకృత్యపేక్షయున్నులేదని తెలియబడుచున్నది.

ప్రత్యగాత్మకు నొకానొక సృష్టియందు ప్రకృత్యపేక్షగలదుగనుక ప్రత్యగాత్మకంటేభిన్నుండే పరమాత్మ.

తా.— ఇచ్ఛవల్లనే జగత్సృష్టి వినబడుట వలన ప్రధానాభిలాషయునులేదు.

౨౦. అస్మిన్నస్యచ తద్యోగంశాస్తి.

అ.— అస్మిన్-ఆ బ్రహ్మమందు- అస్య-ఈజీవునికి-తత్-ఆనన్దముయొక్క యోగం- సంబంధమును- శాస్తి- శాస్త్రముచెప్పుచున్నది.

«రసోవైసః రసం హ్యేవాయం లబ్ధ్వానన్దీభవతి», యనే శ్రుతి చేత రస శబ్దముచే జెప్పబడిన ఆనందమయుని యందు అయంశబ్దనిర్దిష్టుండైన జీవునికినానంద లాభమని ఆనంద యోగమునుశిక్షించుచున్నది శాస్త్రము.

ప్రత్యగాత్మకెవనియొక్క లాభమువలన నానందప్రాప్తి కలుగునో అతడే ఆ ప్రత్యగాత్మకంటే భిన్నుండైన పరమాత్మ, ఆనంద మయుడైన పరబ్రహ్మము.

తా.— జీవునకు ఆనందయోగము పరబ్రహ్మసంబంధము వలన కలుగునని శాస్త్రము చెప్పుటవలన పరమాత్మే ఆనన్దమయుడు.

అ-సం.— బ్రహ్మము అచిద్వ్యావృత్తమైన-జీవవ్యావృత్తంబు కాచాలదు «తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాదన్యో న్తర ఆత్మానన్దమయః», అనుచోట ఆనన్దమయశబ్దవాచ్యుడు జీవుండగుట చేత-వాడు జీవుడైనందుకై «తస్యైష ఏవశారీర ఆత్మా», యని శరీరసమ్బన్ధ శ్రవణమున్ను «అనేనజీవేనాత్మానానుప్రవిశ్య», యనుసామానాధికరణంబు చేత జీవబ్రహ్మలకైక్యము-కాబట్టి జగత్కారణ తయానిర్దిష్టుడైన ఆనన్దమయుండు జీవుడేయనే పూర్వపక్షమునకు శతగుణితోత్తరక్రమేణ అభ్యస్తమైన ఆనన్ద సుఖలవభాగిన్యై పరిమితకర్మవశ్యుడై న జీవునకు ఘటింపకపోవుట చేత పరమాత్మకే అదియున్నదౌట చేతను «శారీర ఆత్మా», యనుజగచ్ఛరీరుడగుట చేతను కర్మకృత శరీరము కానందున - సామానాధి కరణ్యనిర్దేశము చేతను శరీరాత్మ భావని బన్ధన

మైన ఐక్యమును జెప్పుచున్నదే గాని- స్వరూపైక్యమును జెప్ప లేదు - చెప్ప నందున జీవబ్రహ్మభేదము సిద్ధించుట చేత జగత్కారణభూతుండైన ఆన న్దమయుండు బద్ధముక్తావస్థ జీవుండు గాడు- తద్విలక్షణుడైన పరమాత్మ యని సిద్ధాంతముచేయబడినది.

౭. అన్తరధికరణము.

౨౧. అన్తస్తద్ధర్మోపదేశాత్.

అ.—అన్తః-సూర్యమధ్యమందు వినబడెడువాడు పరమాత్మ- తద్ధర్మో పదేశాత్ - పరమాత్మ ధర్మములు చెప్పుటవలన.

ఛాన్దోగ్య శ్రుతియందు “ యఏ షోఽన్తరాదిత్యే హిరణ్మయః పురు షోదృశ్యతే, ‘యఏషోన్తరక్షిణిపురు షోదృశ్యతే,యనెడి శ్రుతులచేతసూ ర్యునియందును నేత్రములయందునుం డునని చెప్పబడిన పురుషుడు జీవుడా పరబ్రహ్మమాయనిసంశయము.

విజాతీయజీవుడని పూర్వపక్షము యెట్లన్నను శారీరత్వము చెప్పుటవల నశరీర సంబంధము కర్మవశ్యుండైన జీవునికేతన కర్మఫలానుభవము కొఱ కునగునని. సిద్ధాంతము “ సఏష స ర్వేభ్యః పాప్మభ్య ఉదిత,, యనువా క్యము అపహతదోష పూర్వకముగా సమస్త లోకములకు కామ పూరక త్వనియామకత్వములు చెప్పుట వలన నదిజీవునికిసంభవింపదు గనుక నేత్రా ద్యాధారుడు పురుషోత్తముండేయని తెలియవలయు.

తనక సాధారణమై విలక్షణమైన రూపము, జ్ఞానబలాదులు మొదలైనక ల్యాణగుణములవలెనే సంభవించును. “ఆదిత్యవర్ణంతమసస్తుపారే,, య నెడుశ్రుతిచేత నారూపమునకున ప్రా కృతత్వముచెప్పబడుచున్నది.

సూత్రార్థము- ముఖ్యముగా సూ ర్యమధ్యమందును నేత్రమధ్యమందును జెప్పబడెడుపురుషుడు పరబ్రహ్మ,అ సాధారణములైన అపహత పాప్మ త్వాదిధర్మోపదేశమువలన.

తా.— సూర్యమధ్యమందు విన బడుచుండేపురుషుడుపరమాత్మధర్మ ముగల పర బ్రహ్మగాని జీవుండుగా డు-తదసాధారణధర్మముల యొక్క యుపదేశమువలన.

౨౨. భేదవ్యపదేశాచ్చాన్యః.

అ.— భేద- భేదముయొక్క-వ్య పదేశాచ్చ- చెప్పుటవలన-అన్యః-జీవు నికంటెనన్యుడైనపరమాత్మ.

“యఆదిత్యేతిష్ఠన్నాదిత్యాదన్త రః యఆత్మని తిష్ఠన్నాత్మనోన్తర,, అనే శ్రుతులచేత జీవునికంటేభేదము చెప్పుటవలన జీవునికంటే భిన్నుండే పరమాత్మ.

అ-సం.— కేవలజీవుండుజగత్కారణముగాకపోయినను యోగ్యమైనపుణ్యవిశేషములైన ఆదిత్యాది చేతనులలో నొకడు జగత్కారణముకావచ్చును-అదెట్లన్న ''యఏషో న్తరాదిత్యేహిరణ్మయః పురుషోదృశ్య తేహిరణ్యశ్మశ్రుః'' ఇత్యాదిచ్ఛాన్దోగ్యవాక్యములో కరచరణాదిశరీరరూపసమ్బన్ధముకారణవస్తువునకుప్రతిపాదితమై యుండుటచేతనట్టిరూపము కర్మకృతశరీర సంబంధముగలజీవుని కేయగుటవలనవిలక్షణజీవుడే జగత్కారణమని,పూర్వపక్షము అందుకు ''సర్వేభ్యః పాప్మభ్యఉదిత'' యనిఅపహతపాప్మత్వము శ్రుతమగుటచేతనుపరమాత్మకున్నుశ్రుతిస్మృతిప్రసిద్ధమైనఅప్రాకృత దివ్యమంగళవిగ్రహములుండుటచేత నపహత పాప్మత్వాదికల్యాణగుణములుగల విలక్షణవిగ్రహయుక్తుడైన పరమాత్మేయీ వాక్యమందు ప్రతిపాదింపబడ్డవాడు ఉపచితపుణ్యవిశేషుడైనజీవుండుగాడని సిద్ధాంతముచేయబడినది.

౮. ఆకాశాధికరణము.

౨౩. ఆకాశ స్తల్లిఙ్గాత్.

అ.— ఆకాశః-ఆకాశశబ్దముచేతజెప్పబడినది బ్రహ్మను- తల్లిఙ్గాత్- జగత్కారణత్వరూపమైనబ్రహ్మయొక్కచిహ్నమువలన.

''అస్య లోకస్య కాగతి రిత్యాకాశఇతిహోవాచ సర్వాణిహవా ఇమానిభూతా న్యాకాశాదేవ సముత్పద్యన్తే ఆకాశంప్రత్యస్తం యన్తీతి'' అనెడిశ్రుతియందు జెప్పబడినజగత్కారణముప్రసిద్ధమైనఆకాశమా,సమస్తచిదచిద్విలక్షణమైన బ్రహ్మమా,యని సంశయము.

ప్రసిద్ధమైన ఆకాశమనిపూర్వపక్షము. ఆకాశశబ్దమునకు ఆకాశమందే జనుల వ్యవహార ముండుటచేతను - ''యతోవా ఇమాని భూతాని'' యనువాక్యముచేత జెప్పబడిన సామాన్యలక్షణమునకును సదాది శబ్దములకును ఆకాశసాధారణత్వ ముండుట వలన నాఆకాశమందేపుట్టునని చెప్పెడి ''ఆకాశాదేవ సముత్పద్యన్తే'' యనిశ్రుతి ప్రతిపాదితమైన ఆకాశమందేపర్యవసానముయుక్తము - ఆకాశమునకు జగత్కారణత్వ నిశ్చయమైన యనంతరమందుదర్శనాదులును గౌణమనే నిశ్చయింపవలెను.

సిద్ధాంతము ''సర్వాణి హవా ఇమాని భూతాని'' యనిప్రసిద్ధనిర్దేశమునుబట్టిన్ని ప్రసిద్ధదర్శనపూర్వకత్వమునుబట్టిన్ని చిదచిద్వస్తు విలక్షణుండును సర్వజ్ఞుడును నైన బ్రహ్మమేఆకాశశబ్దార్థము.

సూత్రార్థము - ముఖ్యముగానాకాశశబ్దనిర్దిష్టము పరబ్రహ్మమే - ప్ర

సిద్ధముగాజెప్పబడిన జగత్కారణత్వాది లింగములవలన.

తా.— శ్రుతియందాకాశ శబ్దముచేత జెప్పబడినది జగత్కారణత్వాది చిహ్నముల వలన బ్రహ్మమే గాని ప్రసిద్ధాకాశముగాదు.

అ-సం.— ‘‘సర్వాణి హవా ఇమానిభూతాన్యాకాశాదేవసముత్పద్యన్తే,, ఇత్యాది చ్ఛాన్దోగ్య వాక్యమందాకాశ శబ్దవాచ్యంబై తోచుచున్న జగత్కారణవస్తువు ప్రసిద్ధాకాశమేకావలెను - ఆకాశశబ్దము ప్రసిద్ధాకాశమందు రూఢమగుటచేత పరమాత్మునికి యాకాశ శబ్దవాచ్యత్వమప్రసిద్ధమైనదని పూర్వపక్షము, అందుకుసర్వశబ్దముచేత జెప్పంబడుచేతనాచేతన సర్వప్రపంచ కారణత్వమేమి ‘‘పరాయణం,,యని జెప్పంబడుప్రాప్యత్వప్రాపకత్వములేమి- ఇవియన్నియుప్రసిద్ధాకాశమునకుగూడనందునను పరమాత్మకేయున్నందునను-ఆకాశతే,ఆకాశయతి, యనేవ్యుత్పత్తివలననాకాశశబ్దము పరమాత్మకుగూడుటచేతసునా ఆకాశముశబ్దవాచ్యంబు పరమాత్మే గానిప్రసిద్ధాకాశముగాదనిసిద్ధాంతము.

౯. ప్రాణాధికరణము.

౨౪. అతఏవప్రాణః.

అ.— అతఏవ- ఆకారణమువలననే- ప్రాణః- ప్రాణశబ్దవాచ్యుడుపరబ్రహ్మమే.

ఛాన్దోగ్యమందు ‘‘ప్రస్తోతర్యాదేవతా ప్రస్తావమన్వాయత్తే,, యనిప్రస్తుతించి ‘‘కతమసాదేవతేతిప్రాణఇతిహెూవాచసర్వాణిహవాఇమానిభూతానిప్రాణమేవాభిసంవిశన్తిప్రాణమభ్యుజ్జిహతే సైషాదేవతా ప్రస్తావమన్వాయత్తేతి,, యనెడిస్థలమందు నిఖిలజగత్కారణత్వముచేత జెప్పబడినప్రాణశబ్దము ప్రాణమా, లేకపూర్వమందు జెప్పబడిన బ్రహ్మమా, యనిసంశయము. ప్రసిద్ధమైన ప్రాణమనిపూర్వపక్షము, యెట్లన్నను సమస్తజగత్తుకుప్రాణాధీనమైనస్థితికలిగియుండుటవలన నాప్రాణమేసమస్తజగత్కారణత్వముగానిర్దేశమునకుయోగ్యమౌను.సిద్ధాంతము.పాషాణకాష్ఠాదులందును చేతనులందును ప్రాణాధీనమైనస్థితిలేదుగనుక ‘‘సర్వాణిహవాఇమానిభూతాని,, యనెడువాక్యములచేతప్రసిద్ధముగా నిర్దేశించిన హేతువునుబట్టి ప్రాణశబ్ద నిర్దిష్టను పరబ్రహ్మమే సూత్రము వ్యాఖ్యానము చేయబడినది.

తా.— ఆకారణమువలననేప్రాణశబ్దవాచ్యండుపరబ్రహ్మముగానిప్రసిద్ధప్రాణముగాదు.

అ.—సం॥ ‘‘సర్వాణి హవా ఇ

మాని భూతాని ప్రాణమేవాభిసంవిశన్తి,, ఇత్యాదివాక్యమందు ప్రాణశబ్దవాచ్యమైన జగత్కారణవస్తువు ప్రసిద్ధప్రాణముగానుండవలెను. సర్వవస్తువులు ప్రాణాధీనస్థితికమైయుంచుటచేత యనిపూర్వపక్షము అందుకు శిలాకాష్ఠాద్యచేతనముల యందును చేతనస్వరూపంబులందును ప్రాణాధీనస్థితికత్వము కూడనందున సర్వ జగత్కారణతయానిర్దిష్టమైన ప్రాణుండు పరమాత్మే గాని ప్రసిద్ధప్రాణముగాదని సిద్ధాన్తము

౧౦. జ్యోతిరధికరణము.

౨౫. జ్యోతిశ్చరణాభిధానాత్.

అ.— జ్యోతిః-జ్యోతిశ్శబ్దముచేత జెప్పబడిన పరమాత్మకు-చరణాభిధానాత్ - సర్వభూతచరణత్వము చెప్పుటవలన.

ఛాన్దోగ్యమందు ,,అథ యదతః పరోదివోజ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనుత్తమేషూత్తమేషు లోకేషు ఇదంవావతద్యది దమస్మిన్నన్తః పురుషే జ్యోతిః,, యనెడి శ్రుతిచేత జగత్కారణత్వమువలన వ్యాప్తమైననిరవధికదీప్తిగల జ్యోతిశ్శబ్దముచేత చెప్పబడినది ప్రసిద్ధమైనజ్యోతియా, లేక పరబ్రహ్మమా, యనిసంశయము.

ప్రసిద్ధమైనజ్యోతియని పూర్వపక్షము ,,ఇదంవావతద్యదిదమస్మిన్నన్తః పురుషే జ్యోతిః,, యని కుక్షియందుండెడి ప్రసిద్ధమైన తేజస్సుతో ఐక్యముచెప్పుటవలన స్వవాక్యమందు తేజస్సుకంటె భిన్నమైన బ్రహ్మమునకు సాధారణహేతువు లేకపోవుటవలన నా తేజస్సే జగత్కారణము.

సిద్ధాంతము. ప్రసిద్ధమైన తేజస్సుకంటె భిన్నమైన బ్రహ్మమే ఇచ్చట నిరతిశయమైన తేజోయుక్తముగా జ్యోతిశ్శబ్దముచేత జెప్పబడినది, యెట్లన్నను ,,పాదోస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతందివీతి,, యని పూర్వవాక్యమందంతరిక్ష సబంధత్వముచేత జెప్పబడినవస్తువుకే ,,అథయదతః పరోదివోజ్యోతిః,, యనెడి స్థలమందు ప్రత్యభిజ్ఞానమువలన అదిపరబ్రహ్మమే యని తెలియబడినది, సమస్త భూతములకు దానియొక్క పాదత్వముచేత చెప్పబడినది ఉపపన్నమగును. ఈప్రకారముగా నా తేజస్సుకు పరబ్రహ్మత్వము నిశ్చయింపబడెను గనుక కుక్షియందుండెడి తేజస్సుకు తదాత్మకత్వము చెప్పడముఫలము కొఱకనితోచుచున్నది.

సూత్రార్థము - జ్యోతిశ్శబ్ద నిర్దిష్టమైనది పరబ్రహ్మనే- ఈ తేజస్సుకు పూర్వవాక్యమందు సర్వభూత చరణత్వము చెప్పుటవలన- సర్వభూత పాదత్వము పరబ్రహ్మకే యుపపన్నమగును.

తా.— సర్వభూత చరణత్వము

చెప్పుటవలన జ్యోతిశ్శబ్దవాచ్యుడుపరబ్రహ్మమే.

౨౬. ఛందోభిధానాన్నేతిచేన్నతదా చేతోర్పణనిగమా త్తథాహిదర్శనమ్.

అ.— ఛందః- గాయిత్రిలో-అభిధానాత్ - చెప్పుటవలన - న- పరబ్రహ్మ కాదనినట్టయితే- న - అట్లుచెప్పవద్దు- తదా - ఆరీతిగానే- చేతః- బుద్ధిని-అర్పణ-ఉంచడముయొక్క- నిగమాత్- ఉపదేశమువలన - తథాహిదర్శనం-శాస్త్రముఆప్రకారమున్నది.

‘‘గాయత్రీవాఇదంసర్వమితి,,యనిప్రకృతత్వ ముండినదానివలన సర్వభూత పాదత్వముచేతగాయత్రికేచెప్పడమువలన బ్రహ్మకాదనిచెప్పినట్టైనే ఉపపన్నముకానేరదు - గాయత్రియేప్రకారమానో అదేప్రకారమేబ్రహ్మమందు బుద్ధినివేశనము జేయవలెననివ్యవస్థచేయబడియుండును- చతుష్పాత్వ రూపమైన గాయత్రియొక్క-సాదృశ్యను బ్రహ్మయందను సంధానము చేయవలెనని భావముగనుక నేగాయత్రికి సర్వాత్మత్వములేకపోయినప్పటికిని యనుపపత్తిలేదనియర్థము- మఱియొకస్థలమందు ఛందస్సుకే సాదృశ్యమువలన ఛందశ్శబ్దముచేత జెప్పడముతోచబడుచున్నది ‘‘తేవాఏతే పఞ్చాన్యేపఞ్చాన్యే దశసమ్పద్యన్తే,, యని మొదలుకొని ‘‘సైషావిరాడన్నాత్,, యనేశ్రుతివలనకు నీయర్థము స్ఫుటముగానుండును.

తా.— గాయత్రిని జెప్పడమువలన బ్రహ్మ కాదనగూడదు- యెందువల్లనంటె- గాయత్రీసాదృశ్యమునాలుగు పాదములు కలుగుటవలనబ్రహ్మయందు జెప్పదగినది.

౨౭. భూతాదిపాదవ్యపదే శోపపత్తేశ్చైవమ్.

అ.— భూతాది- భూతముమొదలైనవానికి-పాదః-పాదత్వము - వ్యపదేశః - చెప్పడమునుగూర్చి - ఉపపత్తేశ్చ- ఉపపత్తిసంభవించుటవలన-ఏవం- ఇదేరీతిగానే. భూతపృథివీశరీరహృదయములుచెప్పునట్టి ‘‘సైషాచతుష్పద,, యనిభూతాదులకు పాదత్వముచెప్పడము బ్రహ్మమందే యుపపన్నమగును - బ్రహ్మమేగాయత్రీశబ్దముచేతచెప్పబడినదని తెలియవలెను.

తా.—భూతములుమొదలైనవానికిపాదత్వముచెప్పుటవలన నిదేరీతినుపపత్తిసంభవించును.

౨౮. ఉపదేశభేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్.

అ.— ఉపదేశ- ఉపదేశముయొక్క-భేదాత్-భేదమువలన-న- ఈప్రకారముకాదు- ఇతిచేత్-ఇట్లనినట్టయితే-న-అనవద్దు-ఉభయస్మిన్నపి- రెండు

విధముల యుపదేశమందును విరోధ ములేకపోవుటవలన.

"పాదోస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతందివి," యనెడువాక్యముచేత జెప్పబడినదిపరబ్రహ్మమేకాని అట్లయినను "అధయదతః పరోదివో జ్యోతిరిత్రి," అంతరిక్షసంబంధమాత్రను చేనిచ్చట అదిప్రతిజ్ఞ చేయబడేది లేదు- అచ్చటికినిచ్చటికిని వ్యపదేశప్రకారమేభిన్నముగానుండును- అక్కడ "దివి," యనుసప్తమిచేతనంతరిక్షము చెప్పబడుచున్నది - ఇచ్చట "దివఃపరోజ్యోతిః,"యనుశ్రుతిచేనంతరిక్షము కంటెపరము జ్యోతియని - పంచమిచేత చెప్పబడుచున్నది-ఆకారణమువలన ప్రతిసంధానము లేదన్నట్టయితే యుక్తముకాదు - రెండువ్యపదేశములందును పైనుండురూపమైన అర్థైక్యను చే ప్రతిసంధానమునకు విరోధములేదు - యెట్లనిన - వృక్షాగ్రమందు శ్యేనసుుండును - వృక్షాగ్రమున కంటె ననంతరము డేగయుండునుయని చెప్పుటవలన.

తా.—శ్రుతియందు విభక్తిభేదముచేజెప్పబడ్డదైనను యుపరిస్థితిరూపార్థమునకువిరోధములేనందున పరబ్రహ్మమే.

అ-సం.— "అధయదతఃపరోదివోజ్యోతిర్దీప్యతే," యనేఛాందోగ్యవాక్యమందు జ్యోతిశ్శబ్దవాచ్యము ప్రసిద్ధమైన జ్యోతిస్సుకాగలదు - స్వవాక్యమందు పరమాత్మవ్యాప్తలింగవిశేషముతోపనందున కౌక్షేయజ్యోతిరైక్యోపదేశముచేతననెడిపూర్వపక్షమునకు - సర్వభూతములు ద్యుసంబంధియైన జ్యోతిస్సుకుపాదముగవ్యపదేశించుటచేత- కౌక్షేయజ్యోతిరైక్యోపదేశముఫలార్థంబు గాతదాత్మకత్వాను సంధానవిధి పరమగుటచే నిరతిశయదీప్తియుక్తమైన జ్యోతిశ్శబ్దవాచ్యముపరమాత్మేగాని ప్రసిద్ధజ్యోతిస్సుకాదని సిద్ధాంతము.

## ౧౧.—ఇన్ద్రప్రాణాధికరణము.

### ౨౮.ప్రాణ స్తథానుగమాత్.

అ.—ఇన్ద్రప్రాణః- ఇన్ద్రప్రాణశబ్దములచేత జెప్పబడినదిపరబ్రహ్మ- తథా - ఆప్రకారము, అనుగమాత్ ఆనందాదు లందను సరించి వచ్చుటవలన.

కౌషీతకీబ్రాహ్మణములో ప్రతర్దనవిద్యయందు "త్వమేవ మేవరం వృణీష్వయంత్వం మనుష్యాయ హితతమంమన్యస," యనిప్రతర్దనునిచేజెప్పబడిన ఇంద్రుడు "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మాతం మామాయు రమృత మిత్యుపాస్స్వ," యని అత్యంతహితమయిన యుపాసనకు కర్మత్వముచేనిర్దిష్టుడైన

ఇంద్రప్రాణమునకు అర్థము జీవుడా, పరమాత్మా, యనిసంశయము.

జీవుండని పూర్వపక్షము - యెట్లన్నను- ఇంద్రశబ్దమునకు జీవ వాచకత్వమే ప్రసిద్ధముగా నుండును గనుక జీవవిశేషమంచే నిశ్చయము ‘‘తమ్మామా యురమృత మిత్యుపాస్వ’’ అని జీవశబ్దమునకు సమానాధి కరణమైన ప్రాణశబ్దమునకు అదే అర్థమని దానియందే యుపాస్యత్వోప దేశమువలన.

సిద్ధాంతము- ఇంద్రప్రాణశబ్దము చేతజెప్పబడినది జీవునికంటె అర్థాంతరభూతుండైన పరబ్రహ్మ ‘‘సఏష ప్రాణఏవ ప్రజ్ఞాత్మానందోऽజరోऽమృత’’ యనిఇంద్రునిప్రాణశబ్దముచే జెప్పబడిన వస్తువుకే జీవులయందసంభావితమైన నానందాన్య తత్వాదులు జెప్పబడును గనుక బ్రహ్మమని నిశ్చయము.

సూత్రార్థము - ఉపాసనచేయవలెనని జెప్పబడిన ఇంద్రప్రాణ శబ్దమునకర్థముపరబ్రహ్మ- తథాయనిప్రకారవచనము- పరబ్రహ్మస్వరూప భూతమైన ఆనందాదులం దుపపత్తివలన పరబ్రహ్మ యనినిశ్చయింపవలెను.

తా.— ఆనందాదులందను గమములవలన నింద్రప్రాణశబ్దముచేతంజెప్పబడినదిపరబ్రహ్మము.

౩౦. నవక్తురాత్మోప దేశాదితి చేదధ్యాత్మసమ్బన్ధభూమాహ్యస్మిన్

అ.— వక్తుః- చెప్పెడిఇన్ద్రునికి- ఆత్మోపదేశాత్ - తనయుపదేశమువలనబ్రహ్మకాదన్నట్లయితే-న- కాదనవద్దు- అధ్యాత్మ అత్మయందు-సంబంధ - సంబంధముయొక్క - భూమా - ఆధిక్యము - హి - ఏకారణమువలన- అస్మిన్- దీనియందుగలదో. ఈపరమాత్మ యుపాస్యుడుకాడు ‘‘మామేవ జానీహి’’ ‘‘తమ్మామా యురమృత మిత్యుపాస్వ’’ యనిప్రతిజ్ఞ జేయబడినజీవత్వముగల ఇంద్రుడువక్తృవైనతనకే యుపాస్యత్వమునుపదేశించుట వలనసుపక్రమ మందుజీవభావమునిశ్చయింపబడినట్లయితేయుపసంహారమందు దానికనుగుణముగా నేయన్వయము చెప్పవచ్చునుగనుకపరమాత్మకాదనిజెప్పగూడదు - ఆత్మనిసంబంధః - అనగాపరమాత్మ విషయకమైనసంబంధము- ఆత్మసంబంధబహుత్వము - జీవునికంటెనర్థాంతరభూతుండైన పరమాత్మకుఅసాధారణ ధర్మములయొక్క-సంబంధబహుత్వమీప్రకరణమందు నుపక్రమముమొదలు నుపసంహారమువఱకు తెలియబడుచున్నది.

ఉపక్రమమందు ‘‘యంత్వమ్మనుష్యాయహితతమంమన్యస’’యనిఅత

నిచేత జెప్పబడిన యుపాసనము పర మాత్మోపాసనమే- దానికే హితతమత్వముండుటవలన-అదేప్రకారమే ‘‘ఏషఏవసాధుకర్మకారయతి,, యనిసత్కర్మాసత్కర్మలయొక్క- కర్తృత్వముపరమాత్మధర్మమేను-ఆప్రకారమే ‘‘తద్యథారథస్యారేషు నేమి రర్పితానాభావరాఅర్పితాః ఏవమేవైతాభూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేఽర్పితా,, యనెడి అనేకశ్రుతులచే జెప్పబడిన సర్వాధారత్వము బ్రహ్మధర్మము - అనందాదులును ‘‘ఏషలోకాధిపతిరేషసర్వేశ,, యని - హిశబ్దము- హేత్వర్థము-అందువలన పరబ్రహ్మయనియర్థము-పరమాత్మేయుపాస్యుండైనట్టయితే యేలాగునఇంద్రుడు ‘‘మాముపాస్స్వ,, యనితన్ను నుపాసనచేయమని చెప్పినాడనగా చెప్పుచున్నారు.

తా.— ఆత్మసంబంధాధిక్యము వలననింద్రశబ్దవాచ్యుండు బ్రహ్మకాదనగూడదు - సాధ్వసాధుకర్మలయొక్క-కారయితృత్వముపరమాత్మధర్మమనేకారణమువలన.

౩౧. శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్.

అ.— శాస్త్రదృష్ట్యా-శాస్త్రక్రమముచే-వామదేవవత్ వామదేవునివలెనే-ఉపదేశః-ఉపదేశముండుటవలన.

ఇంద్రుడనే జీవునికి తనయాత్మత్వముచేనుపాస్యుండైనపరమాత్మోపదేశము శాస్త్రదృష్టివలననగును ‘‘అన్తః ప్రవిష్టశ్శాస్తాజనానాంసర్వాత్మా,, ‘‘తత్త్వమసి,, ‘‘యఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మాన వేదయస్యాత్మాశరీరంయాఆత్మానమన్తరో యమయతి సతఆత్మాన్తర్యామ్యమృతః,, ‘‘ఏషసర్వభూతాంతరాత్మాపహతపాప్మాదివ్యోదేవ ఏకోనారాయణః,, యని అనేకశ్రుతులు పరమాత్మనుజీవాత్మకు నాత్మగానుపదేశము చేసినవిఆకారణమువలన జీవాత్మవాచకమైన శబ్దములు జీవాత్మ శరీరకుండైనపరమాత్మనే జెప్పుచున్నవని శాస్త్రముందు చూడబడిన యర్థమున కే ‘‘మామేవవిజానీహి,, ‘‘మాముపాస్స్వ,, యనిస్వాత్మశబ్దముచే పరమాత్మోపదేశముచేయుట విరోధమునసంభవింపదు- ఏప్రకారమువామదేవుడు శాస్త్రదృష్టిచే స్వాత్మశరీరకుండైన పరమాత్మను నేనుచూచుచున్నానని పరమాత్మనుగురించి ‘‘తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదేఅహం మనురభవం సూర్యశ్చాహం కక్షీవాన్నృషిరస్మివిప్ర,, యనిచెప్పెనోఆప్రకారము.

తా.— వామదేవునివలెనే హితతమోపాసనముండుటవలన- అనగా

వామదేవఋషి శాస్త్రదృష్టిచే పరమాత్మను ఆత్మశరీరకుడుగాచూచినే నుమనువైతిని- సూర్యుడైతినని జెప్పుటవలన.

౩౨. జీవముఖ్యప్రాణ లిఙ్గాన్నేతిచేన్నోపాసా త్రైవిధ్యాదాశ్రితత్వాదిహతద్యోగాత్.

అ.—జీవః- జీవునికి, ముఖ్యప్రాణలిఙ్గాత్- ముఖ్యప్రాణ స్వరూపమైన హేతువువలన, నేతిచేత్ - కాదనినట్టయితే, న- కాదు, ఉపాస- ఉపాసనలయొక్క, త్రైవిధ్యాత్-మూడు ప్రకారములవలన, ఆశ్రితత్వాత్- మరియొకవిద్యయందు త్రివిధత్వముఆశ్రయింప బడుటవలన, ఇహ - ఈవిద్యయందు, తత్- త్రైవిద్యముయొక్క, యోగాత్-యోగమువలన.

«త్రిశీర్షాణం త్వాష్ట్రమహనమరున్ముఖాన్యతీన్సాలావృకేభ్యః ప్రాయచ్ఛమ్ «యావదస్మిఞ్ఛరీరే ప్రాణోవసతితావదాయుః,,యనిజీవముఖ్యమైన ప్రాణరూపహేతువువలన అధ్యాత్మసంబంధాతిశయముచేత పరమాత్మత్వనిశ్చయమని జెప్పగూడదు- పరమాత్మతనఆకారముచేతను - జీవశరీరకత్వముచేతను- ప్రాణశరీరకత్వముచేతను - ఉపాసనలయొక్క త్రైవిద్యమువలన ఆయాయిశబ్దముల చేత జెప్పంబడెనని నిశ్చయింపవలెను- అన్యస్థలమందు బ్రహ్మోపాసనలయొక్క త్రివిధత్వముచెప్పబడియున్నది.

« సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ,, «ఆనందోబ్రహ్మ,, యనే వాక్యముల తన ఆకారముచేత నుపాస్యత్వమును «సచ్చత్యచ్చాభవత్,, యనే డిభోక్తృశరీరకత్వముచేతనుభోగ్యశరీరకత్వముచేతను జెప్పబడియున్నది-అటువలెయీప్రతర్దనవిద్యయందుపాసకులకు త్రైవిద్యముండుటవలన నీప్రకారముజెప్పిరి-గనుక ప్రాణశబ్దముచెజెప్పబడినది పరమాత్మ.

తా.— ముఖ్య ప్రాణ స్వరూపహేతువుండినను-మఱియొకవిద్యయందుత్రివిధోపాసనల వలన నాశ్రయింపబడుటచె జీవుండనగూడదు ఇంద్రప్రాణ శబ్దముచె జెప్పబడిన వాడు పరబ్రహ్మ.

అ-సం.— «ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తమ్మామాయురమృత మిత్యుపాస్య,, ఇత్యాదివాక్యములలో హితతమోపాసనకుకర్మతయానిర్దిష్టుడైనఇంద్రుండుజీవుండుకాగలదు - ఇంద్రశబ్దముజీవవిశేషమందు రూఢమగుటచేతను «మాముపాస్య,, యని స్వాత్మోపాసనమును అమృతత్వప్రాప్తిసాధనంబుగ నుపదేశించుటచేతనే పూర్వపక్షమునకు «సఏషప్రాణఏవప్రజ్ఞాత్మా నందోఽజరోమృతః,,

యనిఇంద్రప్రాణశబ్ద నిర్దిష్టునియందు ఆనందాజరామృతశబ్దసామానాధికరణ్యమన్వయించ వలసి యున్నందున "మాముపాస్వ" యని స్వశరీరకపరమాత్మోపాసనమును విధించిన దేగాని కేవల జీవోపాసనను విధింపనందున హితతమోపాసకుకర్మతయానిర్దిష్టుడు చేతనుడైన ఇంద్రుండుగాడు- జగత్కారణ భూతుండైన పరమాత్మయనినిర్ణయింపబడ్డది.

ప్రథమ పాదము ముగించెను.

శ్రీ శ్రీ శ్రీ

ప్రథమాధ్యాయము ద్వితీయపాదము

౧౨. సర్వత్రప్రసిద్ధ్యధికరణము.

33. సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్.

అ.— సర్వత్ర- సమస్తప్రపంచమందును దత్స్వరూపముచే జెప్పబడినదిపరబ్రహ్మ, ప్రసిద్ధోపదేశాత్-ప్రసిద్ధమైనయుపదేశమువలన.

ఛాన్దోగ్య శ్రుతియందు "సర్వం ఖల్విదంబ్రహ్మతజ్జలానితిశాన్తఉపాసీతఅథఖలుక్రతుమయోయం పురుషః యథాక్రతురస్మిన్లోకే పురుషోభవతి తథేతఃప్రేత్యభవతి సక్రతుం కుర్వీత మనోమయః ప్రాణశరీర" యని - ఇచ్చట "సర్వంఖల్విదం బ్రహ్మ" యనె వాక్యములందు సర్వాత్మకత్వముచేత చెప్పబడినదిజీవుడాలేక పరమాత్మా -యనిసంశయము.

జీవుడని పూర్వపక్షము. ఎట్లన్న- సర్వస్థలములందును తాదాత్మ్యోపదేశముజీవుని కేయుపపన్నమగును- సమస్తహేయప్రత్యనీకుడు - కల్యాణైకతానుడైన-బ్రహ్మకుసమస్తహేయాకరసర్వతాదాత్మ్యంబు విరుద్ధమాట చేసంభవింపదు- జీవునికైతెకర్మనిమిత్తమే, బ్రహ్మ మొదలుకొని స్తంబపర్యంతము సర్వభావముపపన్నమగును సృష్ట్యాది హేతుత్వమున్న ఆకర్మనిమిత్తముచేత నేయుపపన్నమగును-బ్రహ్మశబ్దము బృహత్వరూపమైన గుణయోగముచేత "తస్మాదేతద్బ్రహ్మ నామరూప మన్నంచ జాయత" యనువాక్యమువలెనే అక్కడవ్యవస్థ చేయబడియున్నది.

సిద్ధాంతము "తజ్జలానితిసర్వంఖల్విదం బ్రహ్మ" యనితజ్జన్మస్థితిలయహేతువైన తదాత్మకత్వము ప్రసిద్ధముగానిర్దిశ్యమైనదిపర బ్రహ్మకేయుపపన్నమగును - పరబ్రహ్మవలనజగజ్జన్మ స్థితిలయములు ప్రసిద్ధమగును. "సోకామయత బహుస్యాం ప్రజాయేయ" "ఇదంసర్వమసృజత" యనెశ్రుతులవలన - అదేరీతిగానే సర్వస్వరూపత్వము-జన్మాదికారణత్వము బ్రహ్మకేజెప్ప బడియున్నవి "సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజాస్సదాయతనాస్సత్ప్రతిష్ఠా ఐతదాత్మ్యమి

దంసర్వం,, యనినిఖిలదోష రహితుడునుకల్యాణై కతానుడునునైన పరబ్రహ్మకు జెప్పబడిన సర్వభూతాన్తర్యామిత్వము విరుద్ధముకాదు ‹‹యః పృథివ్యాంతిష్ఠన్ ‹‹యస్య పృధివీశరీరం,, ‹‹యయాత్మ నితిష్ఠన్ యస్యాత్మాశరీరంసత ఆత్మాన్తర్యామ్యమృత,, యనుశ్రుతులలో జెప్పబడిన శరీరాత్మత్వము చేతనే సర్వాత్మత్వము యుపపాదించుటవలన శరీరాత్మలకు స్వభావమువ్యవస్థయాను - సర్వంబ్రహ్మయనెడి సామానాధికరణ్యనిర్దేశముసర్వశబ్దమునకు సర్వశరీరకుడైన బ్రహ్మనుందేప్రవృత్తి యుపపన్నమగును-శరీరవాచకమైన శబ్దములుశరీరిమైననాత్మయందేపర్యవసించుచున్నది - దేవమనుష్యాదిశబ్దమువలెనే.

సూత్రార్థము ‹‹సర్వంఖల్విదంబ్రహ్మ,,యనిజెప్పబడినవస్తువందుసర్వశబ్దవాచ్యముండుట వలన సామానాధికరణ్యముచేత దాత్మగా నిర్దిష్టమైనదిపరబ్రహ్మమేను-ఎట్లన్నను ‹‹తజ్జలానితి,, ‹‹సర్వమిదంబ్రహ్మఖలు,,యనేవాక్యములచేతప్రసిద్ధోపదేశముండుటనుబట్టియుసర్వాత్మకత్వము యొక్కయుపదేశమునుబట్టియు నాబ్రహ్మమే జగత్తుకుసృష్టిస్థితిలయములకు హేతువుగాన ఈయర్థము వేదాంతములయందు ప్రసిద్ధమని తెలియవలెను.

తా.—ప్రసిద్ధోపదేశము వలన సమస్త ప్రపంచమును పరబ్రహ్మస్వరూపముచేత జెప్పబడినది.

౨౮. వివక్షితగుణోపపత్తేశ్చ.

అ.—వివక్షిత-వివక్షచేయ బడిన సత్య సంకల్పత్వము మొదలయిన, గుణ- గుణములకు, ఉపపత్తేశ్చ-ఉపపత్తిసంభవించుటవలన.

మనోమయత్వము మొదలుగాగల సత్య సంకల్పత్వ మిశ్రవివక్షిత గుణములు పరబ్రహ్మయందే యుపపన్నమౌను.

తా.—సత్యసంకల్పముమొదలైన గుణంబులుగలవాడౌటవలనజీవాత్మగాదు పరమాత్మేయని తాత్పర్యము.

౩౫. అనుపపత్తేస్తునశారీరః.

అ.—అనుపపత్తేః - ఈగుణములు జీవునియందు లేక పోవుటనుబట్టి, శారీరః-జీవుడు, న-కాదు.

ఈగుణములు యనంత దుఃఖములతోగూడియుండిన స్వల్పసుఖముగలఅజ్ఞుడై కర్మపరవశుండైన ప్రత్యగాత్మయందు గలుగకపోవుటవలన జీవుడుగాదు పరబ్రహ్మమని తెలియ వలయును.

తా.—ఈగుణంబులుజీవునియందులేనందున నితడు బ్రహ్మకాదు.

౩౬. కర్మకర్తృ వ్యపదేశాచ్చ.

అ.—కర్మ-కర్మగా, కర్తృ-కర్తృ

వుగా, వ్యపదేశాచ్చ-చెప్పుటవలన.

"ఏతమితః ప్రేత్యాభి సమ్భవితాస్మి," యని ప్రాప్యత్వంబుచే నుపాస్యము చెప్పబడుచున్నది ప్రాప్తృతయా జీవునినిర్దేశింపబడినది గనుకజీవునికంటె భిన్నుండే పరమాత్మ.

తా.— స్పష్టము.

౩౭. శబ్దవిశేషాత్.

అ.—శబ్దవిశేషాత్ - ప్రథమమొదలైనశబ్దములవలన.

"ఏషమఆత్మాన్తర్హృదయ," యని జీవుడుషష్ఠిచేత, ఉపాస్యుడు ప్రథమచేత, చెప్పబడుచున్నారు గనుక జీవునికంటె నన్యుడు పరమాత్మ.

తా.—ఏషమ ఆత్మాంతర్హృదయ," యనుశ్రుతియందుషష్ఠీప్రథమావిభక్తులచేత జీవేశ్వరులు జెప్పబడినవారుగనుక జీవునికంటె భిన్నుడుపరమాత్మ.

౩౮. స్మృతేశ్చ.

అ.—స్మృతేశ్చ- స్మృతులందును జీవునికంటె భిన్నుడు పరమాత్మయని జెప్పబడును "సర్వస్యచాహంహృదిసన్నివిష్టోమత్తస్స్మృతిర్జ్ఞానమపోహనంచ," యని జీవునికంటె నన్యుడు యుపాస్యుడైనపరమాత్మ.

తా.— సర్వభూతముల హృదయమందుండుటచే నుపాస్యుడైన పరమాత్మ జీవునికంటెభిన్నుడు.

౩౯. అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్నని చాయత్వా దేవం వ్యోమవచ్చ.

అ.—అర్భకౌకస్త్వా - స్వల్పస్థానము గలవాడౌటవలన,తద్వ్యపదేశాచ్చ-స్వల్పుడని జెప్పుటవలనను, నేతిచేత్-కాదనినట్లయితె, న-కాదు, నిచాయత్వాత్-ఉపాస్యత్వరూపహేతువువలన, ఏవం-ఈప్రకారముగా, వ్యోమవత్-అంతరిక్షమువలెనే జెప్పబడినది.

"ఏషమఆత్మాన్తర్హృదయ," అని అల్పస్థానమునుబట్టి "అణీయాన్వ్రీహేర్వాయవాద్వే," యనియల్పభావమువలన స్వల్పుడు పరబ్రహ్మ యని జెప్ప గూడదు (నిచాయత్వాదేవం) ఉపాసనకొఱకై స్వల్పుండనియుస్వల్పస్థానమందుండేవాడనియు జెప్పబడియున్నదేగాని స్వరూపముచేనల్పుడుకాడు "జ్యాయాన్పృథివ్యా," యని సమస్తమునకంటె బృహత్తనియు పదేశించుచున్నది అధికుండైనను పరబ్రహ్మహృదయమందుఖనీభూతము గాయుండుటచేత నల్పత్వమైనయను సన్ధానముపపన్నముగును (వ్యోమవత్) మొటువలెనంటేఅన్తరిక్షమమహత్తైనను సూచీ పథాదులందు స్వల్పము గా నితర స్థలములలో నధికముగా యుండునట్లుదానినను సంధానముజేయవలెను- చశబ్దము- అవధారణార్థ

కము దానివలననేయనియర్థము స్వాభావికమైన మహాత్వమిచ్చట జెప్పబడుచున్నది ‘‘జ్యాయాన్పృథివ్యాజ్యాయా నంతరిక్షా జ్జ్యాయాం దివోజ్యాయానేభ్యోలోకేభ్య,, యనియనంతరమందుపదేశము చేయబడుచున్నది.

తా.—స్పష్టము.

౪౦. సంభోగప్రాప్తిరితిచేన్నవైశేష్యాత్.

అ.—సంభోగ-సుఖదుఃఖరూపమైనసంభోగముయొక్కప్రాప్తిరితిచేత్ సంబంధముకలగనియన్నట్లయితే,న-అనగూడదు, వైశేష్యాత్-హేతువులయొక్క విశేషత్వముండుటవలన.

ఏయుపాసకుని హృదయ మందు బ్రహ్మముండునని చెప్పబడునో ఆజీవునివలెనే బ్రహ్మకును శరీరసంబంధప్రయుక్తమైన సుఖ దుఃఖములు కలుగునని జెప్పగూడదు - కర్మపరవశత్వము సుఖాదిప్రాప్తియందు హేతువేకాని కేవల శరీరాంతర్వర్తిత్వంబు హేతువుకానేరదు- మఱియును ఆకర్మపరవశత్వము అపహత పాప్మైన బ్రహ్మకుసంభవింపదు.

తా.—సుఖదుఃఖరూపమైన సంభోగసంబంధములకు కేవల శరీరాంతర్వర్తిత్వము కారణంబుకానేరదుకర్మపరవశత్వంబు పరబ్రహ్మకుసంభవింపదు.

అ-సం.— ‘‘సర్వం ఖల్విదం బ్రహ్మతజ్జలానితిశాన్తఉపాసీత,,యను శాణ్డిల్య విద్యా వాక్యమందు పఠితమైనబ్రహ్మము-జీవుండుగా నుండవలెను-నిర్దిష్టుండైనపరమాత్మకు హేయాకారమైన చిదచిద్రూపసర్వభావంబు గూడనందున దేవ మనుష్యాది రూపముచే కర్తృకృతంబుగజీవునికిసర్వాత్మభావము గూడుటచేతననే పూర్వపక్షమునకు సర్వవేదాంతప్రసిద్ధంబైన సర్వ జగత్కారణత్వంబు నుపదేశించుటచేత- తజ్జత్వ - తదన్తత్వమువలన బ్రహ్మంబునకే తాదాత్మ్యముపపన్నముగుట దేవమనుష్యాదిభావముచే జీవునికి తాదాత్మ్యముండిననువానికిజగత్కారత్వంబు గూడనందున బ్రహ్మశబ్దవాచ్యుండు జీవుండు గాడు-సర్వ జగచ్ఛరీరతయా సర్వ శబ్దవాచ్యుడైనపరమాత్మయని సిద్ధాన్తము.

౧౩. అత్త్రధికరణము.

౪౧. అత్తాచరాచరగ్రహణాత్.

అ.— అత్తా- బ్రహ్మక్షత్రరూపమైన వోదనభక్షకుడు పరమాత్మ, చరాచరగ్రహణాత్ - బ్రహ్మక్షత్రశబ్దముచేతచరాచరాత్మకజగత్తు గ్రహింపబడుచున్నది.

కఠవల్లీయుపనిషత్తుయందు ‘‘యస్యబ్రహ్మచక్షత్రంచోభే భవతఓదనః మృత్యుర్యస్యోపసేచనం కఇత్థా వేద

యత్రసః,, యనిచెప్పబడిన ఓదనోప సేచనచే సూచనచేయబడిన భోక్తృ పురుషుండుజీవుడా-పరమాత్మా-యని సంశయము-జీవుండని పూర్వపక్షము. ఎట్లు-భోక్తృత్వము కర్మనిమిత్తముగ నుకయాకర్మసంబంధంబు జీవునికేసం భవించును.

సిద్ధాంతము - సర్వోప సంహా రానంతర మందే మృత్యురూపమయి నయుపసేచనంబు అదనమునకు యోగ్య మౌను చరా చరాత్మక మైన స ర్వజగత్తుకు భోక్త పరమాత్మేయని తెలియవలయు.

జగత్సృష్టిస్థితిలయములేవినోదము గాగల బ్రహ్మకు నీజగదుప సంహార రూపభోక్తృత్వము కర్మసంబంధ ప్రయుక్తంబు గాదు.

సూత్రార్థము - బ్రహ్మక్షత్ర రూపమైనఓదనమునకు భోక్తపరమాత్మ బ్రహ్మక్షత్రశబ్దముచేత చరాచరాత్మకమైనసమస్తజగద్గ్రహణమువలన.మృత్యువేయుపసేచనంబు గాగలఓదనం బుబ్రహ్మక్షత్రమాత్రముగాదు, మరే మనిన-అదే యుపలక్షణముగాగల చరా చరాత్మకమైన సమస్త జగత్తని భావము.

౧౨. ప్రకరణాచ్చ.

అ.—— ప్రకరణాచ్చ- పరబ్రహ్మను చెప్పెడిప్రకరణమువలన, ‹‹మహాంతంవిభుమాత్మానం మత్వాధీరోనశోచతి,, ‹‹నాయమాత్మా ప్రవచనేనల భ్యోనమేధయ,, యనుప్రకరణము బ్రహ్మపరముగనుక బ్రహ్మయని తెలియ వలయును.

ఓయీ అనంతరమందు‹‹ఋతంపిబంతౌ సుకృతస్య లోకేగుహాం ప్రవిష్టౌపరమేపరార్థ్యే,, యనిజీవబ్రహ్మలకిద్దరికి కర్మఫలభోక్తృత్వంబుజెప్పుటవలన పరమాత్మకును కర్మఫలభక్షణమం దన్వయనులేని దానివలన నంతఃకరణంబుతో గూడినజీవుడే యచ్చటభోక్తయని తెలియబడుచున్నదిగనుకయీ జీవుడుప్రకృతమందు భోక్తృ కానియనిఅశంకచేసి చెప్పుచున్నారు.

తా.—— ఈప్రకరణమువలన బ్రహ్మప్రతిపాదకమైనది.

౧౩. గుహాంప్రవిష్టా వాత్మానౌ హితద్దర్శనాత్.

అ.—— గుహాం- దేహమును, ప్రవిష్టౌప్రవేశించినవారు,ఆత్మానౌహి- జీవాత్మపరమాత్మలు, తద్దర్శనాత్-మరియొకప్రకరణమందు వీరలకుప్రవేశముండుటవలన.

గుహాయందు ప్రవేశించినజీవాత్మ పరమాత్మలనగా జీవునితోగూడినపర మాత్మయని అక్కడ తోచబడుచున్నదనియర్థము తానుప భోక్తగాక పోయినప్పటికిని పరమాత్మకుంబ్రయోజ

కత్వముండినదానివలన పానమందన్వయమున్నది జీవునితోఁగూడిన పరమాత్మ ఏప్రకారము తెలియబడుచున్నదనిన నాజీవబ్రహ్మలకేమఱియొకప్రకరణమందు ప్రవేశముకనుబడుచున్నది. ‘‘తందుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణం। అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి,, యనిపరమాత్మకు ‘‘యాప్రాణేనసమ్భవత్యదితిర్దేవతామయీ। గుహాంప్రవిశ్యతిష్ఠంతియాభూతేభిర్వ్యజాయత,, యని జీవునికి కర్మఫలములననుభవించువాడనిస్ఫుటమైనది.

తా.— మఱియొకప్రకరణమువలన హృదయగుహను ప్రవేశించినవారుజీవాత్మపరమాత్మలు.

౮౮. విశేషణాచ్చ.

అ.— విశేషణాచ్చ- ప్రాప్యత్వమునుమొదలుగాగలవిశేషణమువలన.

ఈప్రకరణమునం దుపక్రమంబుమొదలు యుపసంహారమువరకు జీవపరమాత్మలేయుపాస్యత్వయుపాసకత్వములచేత ప్రాప్యత్వప్రాప్తృత్వములనుబట్టిజెప్పబడుచున్నారు గనుక భేదముజూడబడినది ‘‘మహాంతంవిభుమాత్మానంమత్వాధీరోనశోచతి,, ‘‘విజ్ఞానసారథిర్యస్తుమనఃప్రగ్రహవాన్నరః। సోఽధ్వనః పారమాప్నోతితద్విష్ణోః పరమంపదం,, యని చరాచరాత్మకమునకుభోక్తపరమాత్మ.

తా.— ఉపాస్యత్వఉపాసకత్వప్రాప్యత్వప్రాప్తృత్వములచే జీవపరమాత్మలుజెప్పబడుచున్నారు గనుక చరాచరాత్మక సర్వప్రపంచ భక్షకుడుపరమాత్మ.

అ-సం.— ‘‘యస్య బ్రహ్మచక్షత్రంచ ఉభేభవతఓదనః మృత్యుర్యస్యోపసేచనం,, ఇత్యాదికఠవల్లి వాక్యమందు ఓదనోపసేచన సూచితుండైన అత్తాజీవుడుగావలెను భోక్తృత్వముకర్మనిమిత్తమగుటచేత జీవునికేయదికలిగి యుండవచ్చుననే పూర్వపక్షమునకు చరాచరరూపకృత్స్నజగదత్తృత్వము జగత్సంహారకర్తృత్వంబేగాక కర్మనిమిత్తభోక్తృత్వము కానందున తాదృశసంహారకర్తృత్వము పరమాత్మధర్మమౌటచేత నీవాక్యప్రతిపాద్యుడుజీవుండుగాడు పరమాత్మే యనిసిద్ధాంతము.

౧౪. అంతరాధికరణము.

౮౫. అంతరఉపపత్తేః.

అ.— అంతరః-అక్షియొక్క-అంతరమందుండెడువాడుపరమాత్మ, ఉపపత్తేః- సంయద్వామత్వముమొదలైనగుణములకునుపపత్తిగలుగుటవలన.

ఛాందోగ్యమందు ‘‘యఏషోఽక్షిణి పురుషోదృశ్యతే ఏషఆత్మేతి హోవా

-చైతదమృత మభయమే తద్బ్రహ్మ,, యని నేత్రమే ఆధారముగా గలపురుషుడు ప్రతిబింబమా- జీవుడా పరమాత్మ యనిసంశయము వీనియందెవడో యొకడనిపూర్వపక్షము ఎట్లన్న ''య ఏష దృశ్యత,, యని ప్రసిద్ధముగా సాక్షాత్కార నిర్దేశముండుటవలన.

సిద్ధాంతము - పరమాత్మనే నేత్రాద్యాధారములచే జెప్పబడు పురుషుడు అక్షిపురుష సంబంధతయా వినబడెడి నిరుపాధికములైనఆత్మత్వఅమృతత్వఅభయత్వబ్రహ్మత్వ సంయద్వామత్వము మొదలైన గుణంబులు పరమాత్మయందే నుపపత్తికలుగును ప్రసిద్ధముగనే నిర్దేశించుటయు గలదు ''యశ్చక్షుషితిష్ఠన్, అను శ్రుతులయందు ప్రసిద్ధంబుగ నుపపన్నమగును.

ఆసాక్షాత్కారను బ్రహ్మోపాసనపరులైనయోగులకు సంభవించును సూత్రార్థము ముఖ్యముగా నేత్రమధ్యమందు జెప్పబడిన పురుషుడు సంయద్వామత్వాది గుణములకు యోగ్యుడైన పరమాత్మయని ఉపపత్తిసంభవించును.

తా.— సంయద్వామత్వముమొదలైన గుణములుగలుగుటవలన అక్షిపురుషుడుపరమాత్మ.

౨౮. స్థానాదివ్యపదేశాచ్చ.

అ.— స్థానా - స్థానాదులయొక్క, వ్యపదేశాచ్చ-చెప్పుటవలన.

''ప్రాణో బ్రహ్మకం బ్రహ్మఖం బ్రహ్మ,, యని సుఖవిశిష్టతయా చెప్పబడిన పరబ్రహ్మకే నేత్రాధారతయా యుపాస్యత్వము చెప్పుట వలన పరమాత్మ.నిశ్చయముగాదృఢపరచే హేతువు సుఖవిశిష్టత్వముఇతరనిరపేక్షమని ఏవకారముప్రయోగించబడ్డమైనది.

౨౭. సుఖవిశిష్టాభిధానాదేవచ.

అ.—సుఖవిశిష్ట - సుఖవిశిష్టత్వము- అభిధానా దేవచ - చెప్పడమువలన.

''ప్రాణోబ్రహ్మకంబ్రహ్మఖంబ్రహ్మ, యను వాక్యములలో సుఖాశ్రయనుగా చెప్పబడినపరబ్రహ్మకే నేత్రాధారత్వముచేతనుపాస్యత్వముజెప్పుటవలనపరమాత్మ- నిశ్చయముగాదృఢపరచెడు హేతువు సుఖ విశిష్టత్వమితరనిరపేక్షమని సూచనచేయుటకు ఏవకారముప్రయోగించిరి.

''ప్రాణోబ్రహ్మకంబ్రహ్మఖంబ్రహ్మ,, యనిపూర్వము జెప్పబడినవాక్యములందు-సుఖవిశిష్టపరమైనబ్రహ్మమని యేప్రకారము తెలియబడుచున్నది - ఎప్పటికిప్రతీకోపాసన జేయదగునదనిశంకించిజెప్పుచున్నారు.

తా.—పరమాత్మకు నేత్రాధారముసుఖవిశిష్టపరమేయని చెప్పబడినది.

౧౮. అతఏవచసబ్రహ్మ.

అ.—అతఏవచ-ఆకారణమువలననే - సబ్రహ్మ - ఖశబ్దమునకర్థమైననాకాశముబ్రహ్మ.

అచ్చట సంసారభీతుఁడై బ్రహ్మస్వరూపజ్ఞానేచ్ఛగల యుపకోసలునికొఱకు "కంచతుఖంచనవిజానీమి,, యని అడిగితే "యద్వావకంత దేవ ఖం యదేవఖం తదేవకం,, యని అన్యోన్యవ్యవచ్ఛేదకముచే నపరిచ్ఛిన్నసుఖ స్వరూపను బ్రహ్మయని చెప్పి "ప్రాణంచహాస్మైతదాకాశం చోచుః,, యనిఖశబ్దముచేత జెప్పదగిననాకాశముఅపరిచ్ఛిన్నసుఖవిశిష్టపరబ్రహ్మమే.

తా.— శ్రుతియందు ఖశబ్దమునకే బ్రహ్మస్వరూపత్వము జెప్పుటవలననీశబ్దముచే జెప్పబడినఆకాశమేయపరిచ్ఛిన్నసుఖవిశిష్టమైనబ్రహ్మము.

౧౯. శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ.

అ.—శ్రుతోపనిషత్కైః తెలియబడినబ్రహ్మస్వరూపముగలవారిచేదెలియబడిన-గతి - అర్చిరాదిమార్గముయొక్క - అభిధానాత్ - చెప్పడమువలన.

అధిగత బ్రహ్మయాథాత్మ్యంబుగలపురుషునిచేబ్రహ్మప్రాప్తికొఱకునేయర్చిరాదిమార్గంబు దెలియబడినదో-యామార్గమునకే అక్షిపురుషునివినినవారు దెలియుదురు- గనుకయదేయర్థమును "తేర్చిషమేవాభి సంభవన్తి,, యనిజెట్పుట వలన అక్షిపురుషుఁడుపరమాత్మ.

తా.— తెలియబడినబ్రహ్మయాథాత్మ్యంబుగలవారిచేత బ్రహ్మప్రాప్తికొఱకైనదియేదోఆఅర్చిరాదిమార్గముజేత పొందదగిన అక్షిపురుషుడుపరమాత్మ.

౨౦. అనవస్థితేరసంభవాచ్చనేతరః.

అ.— ఇతరః - జీవుడు, అనవస్థితేః - నేత్రమందుండక పోవుటవలన, అసంభవాచ్చ-సంయద్వామత్వరూపగుణములు సంభవింపకపోవుటవలన, న-కాదు.

పరమాత్మకంటేనితరుండైనజీవుఁడుయానేత్రమందునియమనుగా నుండఁడుగనుక నాజీవునియందమృతత్వాదిగుణములుసంభవింపవుగానఅక్ష్యాధారుండుగాఁడు.

తా.— జీవుఁడు నేత్రమం దుండక పోవడమువలన సంయద్వా మత్వగుణములు సంభవముగానందున పరబ్రహ్మకాఁడు.

అ-సం.—"యఏషో న్తరక్షిణిపురుషోదృశ్యతే,, యనిఛాందోగ్యమందక్ష్యాధారతయానిర్దిష్టుండైనపురుషుడు ప్రతిబింబజీవ దేవతా విశేషముల

లోనన్యత ముండుగావలెను ప్రసిద్ధవన్నిర్దేశమువలన "దృశ్యతే" ఇత్యపరోక్షాభిధానముచేతప్రతిబింబముగా వచ్చును జీవునికిచక్షుస్సులో విశేషసన్నిధానముండుటచేత జీవుడే తానాను "రశ్మిభిరేషోస్మిన్ప్రతిష్ఠితః" యనుశ్రుతిప్రసిద్ధివలనచక్షుః ప్రతిష్ఠితదేవతావిశేషముతానాననే పూర్వపక్షమునకు "ఏషఆత్మేతిహోవాచ ఏతదమృతమభయమేతద్బ్రహ్మేత్యాచక్షతే" ఇత్యాదివాక్యముచే ప్రతిపన్నమైన కల్యాణగుణములు పరమాత్మకే యున్నదౌచునుండగా "యచ్చక్షుసి తిష్ఠన్" ఇత్యాదిశ్రుతి ప్రసిద్ధమైన చక్షుర్వర్తిత్వమును "ఏషోఽక్షిణి" యని ప్రసిద్ధవన్నిర్దేశించుటచేత "దృశ్యతే" ఇత్యపరోక్షాభిధానము యోగిదృశ్యత్వాభి ప్రాయంబగుటచే ప్రతిబింబాదులకు నియమేన చక్షుర్వర్తిత్వంబులేనందున నక్షిపురుషుడు ప్రతిబింబాదులలో నన్యతనుండుగాడుపరమాత్మయని సిద్ధాంతము.

౧౫. అంతర్యామ్యధికరణము.

౫౧. అంతర్యామ్యధిదైవాధి లోకాదిషుతద్ధర్మవ్యపదేశాత్.

అ.—అధిదైవాదిలోకాదిషు- అధిలోక పదములతోగూడిన వాక్యములందువినబడు, అంతర్యామి - అంతర్యామియైనవాడుపరమాత్మ, తద్ధర్మవ్యపదేశాత్ - పరబ్రహ్మధర్మములను జెప్పడమువలన.

బృహదారణ్యకమందు "యఃపృథివ్యాంతిష్ఠన్పృథివ్యాఅంతరోయంపృథివీనవేదయస్య పృథివీశరీరం యఃపృథివీ మంతరోయమయత్యేషత ఆత్మాన్తర్యామ్యమృత" యనేసమస్తమైన పర్యాయ వాక్యములందు వినబడెడు పురుషుండుప్రత్యగాత్మా-లేకపరమాత్మాయనిసంశయము ప్రత్యగాత్మయని పూర్వపక్షము. వాక్యశేషమందు "ద్రష్టాశ్రోతామన్తా" యని జీవునికి ద్రష్టృత్వాదులు చెప్పుటవలన "నాన్యోతోస్తిద్రష్ట" యని ఇతరద్రష్ట్రినిషేధమునుండి.

సిద్ధాంతము. పృథివిమొదలు నాత్మపర్యంతమగు సమస్తతత్వములకు అదృశ్యుడైన నొకడె నియంత యనియు వానికి అమృతత్వాది గుణములున్నవనియు చెప్పుటవలన అవిపరమాత్మ ధర్మములె గావలెను గనుక అంతర్యామి పరమాత్మ. ద్రష్టృత్వాదులును రూపాది సాక్షాత్కారములు "పశ్యత్యచక్షుః" యనే ప్రకారము పరమాత్మయందున్నవి "నాన్యోతోస్తిద్రష్ట" యని జీవునికదృష్టమైన యంతర్యామి ద్రష్టృవౌనట్లు అంతర్యామికిని అదృష్టమైనద్రష్ట్రంతరము నిషేధపరము.

సూత్రార్థము-అధిదైవఅధిలోకాదిపద చిహ్నములచేత గూడియుండిన వాక్యములయందు వినబడెడినంతర్యామి పరమాత్మ సర్వాంతరత్వ సర్వావిదితత్వ సర్వశరీరకత్వ సర్వనియమనసర్వాత్మకత్వ అమృతత్వము మొదలుగాగల ధర్మములకు వ్యపదేశముండుటవలనపరమాత్మ.

తా.— పరమాత్మ ధర్మములను జెప్పడమును బట్టినధిదైవాదిలోకాదిపదములతోగూడినవాక్యములందువినబడునంతర్యామిపరమాత్మ.

౫౨. నచస్మార్తమతద్ధర్మాభిలాపాచ్ఛారీరశ్చ.

అ.— స్మార్తం-ప్రధానమును-శారీరశ్చ - జీవుడును - అతద్ధర్మ-వీరలందులేనిధర్మములయొక్క - అభిలాపాచ్ఛ-చెప్పడమువలన - నచ- అంతర్యామికారు.

స్మార్తం-ప్రధానమును- శారీరః-ప్రత్యగాత్మయును - అన్తర్యాములుగారు-నాజీవప్రధానములకునసంభావితమైనధర్మములు జెప్పబడుటవలన-ఏప్రకారను - అచేతనమైనప్రకృతికియసంభావనమైన నంతర్యామి ప్రసక్తిలేదో నాప్రకారమే జీవునికిని లేదనియర్థము.

తా.— ప్రకృతిజీవులకుంబరమాత్మధర్మంబులు లేనందునన న్తర్యాములుగారు.

౫౩. ఉభయేపిహిభేదేనైనమధీయతే.

అ.—ఉభయే- కాణ్వమాధ్యందినములు రెండు- ఏనం - ఈపరబ్రహ్మను-భేదేన-భేదముచేత- అధీయతే-చెప్పబడుచున్నది.

ఉభయే-కాణ్వమాధ్యందినములు రెండు‹యోవిజ్ఞానేతిష్ఠన్,,‹యఆత్మనితిష్ఠన్,, యనిఏకారణము వలన ప్రత్యగాత్మకంటె-పరమాత్మునిభిన్నునిగాను - అన్తర్యామిగాను జెప్పుచున్నదోనాకారణమువలన జీవునికంటె భిన్నుడుపరమాత్మ.

తా.— విజ్ఞానాత్మలయందంతర్యామిగాచెప్పబడినపరమాత్మజీవునికంటెభిన్నుడు.

అ.—సం॥ ‹‹యః పృథివ్యాన్తిష్ఠన్పృథివ్యా అన్తరోయమ్పృథివీనవేదయస్యపృథివీశరీరం,, ఇత్యాదివాజసనేయక వాక్యశ్రుతుండైన నంతర్యామిజీవుండుగావలెను- వాక్యశేషమందుకరణాయత్తజ్ఞానమునన్తర్యామికి శ్రుతమాటవలననేపూర్వపక్షమునకు-నొక్కడేసర్వలోకసర్వభూతసర్వదేవతాదులను నియమించుచున్నాడనునదిపరమాత్మాసాధారణధర్మమాటచేత ‹‹ద్రష్టాశ్రోతా,,యని

రూపాదిసాక్షాత్కారమును జెప్పుచున్నదేగాని కరణాయత్తజ్ఞాన వత్త్వమునువకాణింపనందున నన్తర్యామి జీవుండుగాడు పరమాత్మయని సిద్ధాన్తము.

౧౬. అదృశ్యత్వాదిగుణకాధి కరణము.

౨౧. అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః.

అ.— ధర్మ-సర్వజ్ఞత్వము మొదలైనధర్మములు-ఉక్తేః- చెప్పుటవలన అదృశ్యత్వాదిగుణకః- అదృశ్యత్వము మొదలైన గుణములు గలవాడు పరమాత్మ.

అథర్వణ మందు ‟అథపరాయయాతదక్షర మధిగమ్యతే యత్తదద్రేశ్యమ్„ అని మొదలుకొని ‟యద్భూతయోనింపరిపశ్యన్తిధీరాః„ ‟అక్షరాత్పరతఃపరః„ యనువఱకుజెప్పబడినవారుప్రధానపురుషులా- లేకపరమాత్మా-యనిసంశయము.

ప్రధానపురుషులనిపూర్వపక్షము. పృథివ్యాద్య చేతనములందు పొందిన దృశ్యత్వాదులకు నిషేధముండుటవలనతత్సదృశమై యచేతనమైన ప్రధానమేభూతయోనియనియు - అక్షరమనియు దెలియబడుచున్నది-ఆప్రకారముగా ‟అక్షరాత్పరతః పరః„ యని చైతన్యమున కాధార భూతుండైన పురుషుడె చెప్పబడును.

సిద్ధాన్తము - ఉత్తర శ్రుతియందు ‟యస్సర్వజ్ఞ స్సర్వవిత్„ యని ప్రధానపురుషులకయోగ్యమైన సర్వజ్ఞత్వముచెప్పి ‟తస్మాదే తద్బ్రహ్మ నామరూపమన్నంచజాయతే„ యనే వాక్యముచేత సర్వజ్ఞుండై సత్యసంకల్పుండైనబ్రహ్మవలన జగదుత్పత్తిశ్రవణమునుబట్టిపూర్వమందు జెప్పబడిన అదృశ్యత్వాదిగుణములు గలవి, భూతయోనియైన దనియు ‟అక్షరాత్పరతఃపరః„ యనినిర్దిష్టమైనఅక్షరము - పర బ్రహ్మమనియు దెలియబడుచున్నది.

సర్వజ్ఞత్వాదిధర్మంబులు చెప్పబడినందున- అదృశ్యత్వాదిగుణకుడు పరమాత్మ.

తా.— అదృశ్యత్వాది గుణములు, సర్వజ్ఞత్వధర్మములు, గలవాడు పరమాత్మ.

౨౨. విశేషణ భేదవ్య పదేశాభ్యాంచ నేతరౌ.

అ.—విశేషణ- విశేషణమును-భేద-భేదమును- వ్యపదేశాభ్యాంచ- చెప్పుటలచేత-నేతరౌ- ప్రధానపురుషులుగారు.

ఎటులనాప్రకరణము ప్రధానమునకంటెభూతయోనియైనఅక్షరమును ఏకవిజ్ఞానముచేతసర్వవిజ్ఞానాదులను విశదపరచునో అటువలెనె ‟అక్షరా

త్పరతః పరః యనిఅక్షరముఅవ్యాకృతముకంటెన నస్తరమందుస్థితిగల పురుషునిపరుండనినీభూతయోన్యక్షరపురుషునికిభేదము చెప్పబడుచున్నదిగనుక ప్రధానపురుషు లెంతమాత్రముకారు పురిపరబ్రహ్మమని చెప్పబడినది.

తా.—— అక్షరాత్పరత్వము ప్రకృతిపురుషులకుఘటింపదు - పరమాత్మ కే ప్రతిపాద్యమాను.

౨౮. రూపోపన్యాసాచ్చ.

అ.——రూపోపన్యాసాచ్చ - సమస్తప్రపంచంబునుఅక్షర స్వరూపంబుగజెప్పుటవలన.

"అగ్నిర్మూర్ధా" ఇత్యాదులచే సమస్తచిదచిదాత్మ ప్రపంచంబునకు భూతయోన్యక్షర స్వరూపత్వంబుజెప్పుటవలననదృశ్యత్వాదిగుణ విశిష్టుండుపరమాత్మ.

తా.—— చిదచిదాత్మప్రపంచమునకు భూతయోన్యక్షర స్వరూపంబు జెప్పుటచే అదృశ్యత్వాదిగుణవిశిష్టుండుపరమాత్మ.

అ.——సం॥ "యత్త దద్రేశ్యమగ్రాహ్యమ్" ఇత్యాది వాక్యమందును "అక్షరా త్పరతః పరః" యన్నువాక్యమందును ప్రతిపన్నమైనఅదృశ్యత్వాదిగుణకమును అక్షరాత్పరతః పరుడును- ప్రకృతిపురుషులుగానుండవలెను - అచేతనపృథివ్యాదిగతమైనదృశ్యత్వాదిప్రతిషేధము- తత్సజాతీయప్రధానమందుచిత మాటచేత దానికంటేపరత్వంబుజీవునికి ఉచితంబౌననేపూర్వ పక్షమునకు "యస్సర్వజ్ఞస్సర్వవిత్" ఇత్యాది వాక్యములలోనదృశ్యత్వాదిగుణక వస్తువునకు సర్వజ్ఞత్వాదిగుణంబు శ్రుతమాటచే దానికంటేపరత్వంబుజీవునికి ఘటింపనందునని రెండువాక్యంబులలో ప్రకృతిపురుషులు ప్రతిపాద్యులుగారు- పరమాత్మ డే ప్రతిపాద్యుండనిసిద్ధాంతము.

౧౭. వైశ్వానరాధికరణము.

౨౭. వైశ్వానరస్సాధారణ శబ్దవిశేషాత్.

అ.——వైశ్వానరః - వైశ్వానరశబ్దముచేత జెప్పబడినవాడుపరమాత్మ, సాధారణశబ్ద - సాధారణ శబ్దములచేత - విశేషాత్, విశేషంబుగ చెప్పబడినచోటవలన.

ఛాందోగ్యమందు "ఆత్మానమేవేమం వైశ్వానరంసమ్ప్రత్యధ్యేషిత మేవనో బ్రూహి" యనియారంభించి "యస్త్వేతమేవం ప్రాదేశమాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానర ముపాస్తే" యనినిచ్చటవైశ్వానరుడా లేక పరమాత్మా నిర్ణయమునకు శక్యుడని సంశయము.

నిశ్చయించుటకు శక్యంబు గాదని పూర్వపక్షము వైశ్వానర శబ్దమునకు

జఠరాగ్నియందును మహాభూతము లందు మూడోదైన దేవతందును పరమాత్మయందును వైదికప్రయోగముండుటవలన నీప్రకరణమందుసమస్తములకు హేతువులుండును.

సిద్ధాంతము - ‹‹కోనఆత్మాకింబ్రహ్మ›› యనిసమస్తజీవులకునాత్మభూతుండైన బ్రహ్మమేదని యుపక్రమానంతరమందు ‹‹ఆత్మానం వైశ్వానరం›› యనిబ్రహ్మశబ్దస్థానమందంతట వైశ్వానరశబ్ద ప్రయోగముండుటవలనవైశ్వానరాత్మ సమస్తజీవులకు నాత్మభూతుండైన పరబ్రహ్మమని తెలియబడుచున్నది.

సూత్రార్థము - వైశ్వానరశబ్దముచేత నిర్దిష్టుండైనపురుషుడు వైశ్వానరశబ్దమునకనేకార్థసాధారణ ముండినను ఈప్రకరణమందుపరమాత్మాసాధారణములైన సర్వాంతర్యామిత్వాదులచే విశేష్యమాణముగనుక పరబ్రహ్మమేయని నిశ్చయింపవలెను. విశేష్యతఇతివిశేషః విశేషింపబడుచున్నాడుగనుకవిశేష్యము.

తా.—సాధారణశబ్దంబులు విశేషముగా జెప్పుటవలన వైశ్వానరశబ్దవాచ్యుండుపరబ్రహ్మ.

౨౮. స్మర్యమాణమనుమానంస్యాదితి.

అ.— స్మర్యమాణం - స్మరింపబడునది, అనుమానం - పరమాత్మకవైశ్వానరస్వరూపమన్న హేతువు, స్యాత్-కాతగినది, స్మర్యమాణమనగా దెలియబడుచుండునది - అనుమానమనగా ఊహింపబడునది,ఇతి,శబ్దముప్రకారవాచకము-స్మరింపబడురూపమే యగ్నికిపరమాత్మ రూపత్వమందనుమానమౌను.

అంతరిక్షముమొదలుకొని పృథివివరకునవయవవిభాగముచేనగ్నికిరూపముజెప్పబడియున్నది ‹‹అగ్నిర్మూర్ధాచక్షుసీ చంద్రసూర్యౌ›› ద్యాం మూర్ధానంయస్యవిప్రావదన్తి›› యను శ్రుతిస్మృతులచేతప్రసిద్ధంబుగ పరమపురుషరూపమువైశ్వానరమనిచెప్పడమందు హేతువగునని యర్థము. నిశ్చయములేదని శంకించిపరిహరించుచున్నారు.

తా.—ప్రసిద్ధపరమపురుష రూపముజెప్పడమువలన నీప్రకారంబుగ స్మరింపడినరూపము వైశ్వానర శబ్దమునకుబరమాత్మభావమందుగురుతుగానున్నది.

౨౯. శబ్దాదిభ్యోంతః ప్రతిష్ఠానాచ్చ నేతిచేన్నతథా దృష్ట్యుపదేశాదసమ్భవాత్పురుషమపిచైనమధీయతే.

అ.— శబ్దాదిభ్యః- శబ్దముమొదలైనవానిచేత, అంతః- అంతరప్రదేశమందు,ప్రతిష్ఠానాత్ - స్థితివలన, న- కాదు, ఇతిచేన్న - ఇట్లనేది కాదు,

తథా - అటువలె, దృష్ట్యుపదేశాత్ - ఉపాసనోపదేశము వలన, అసంభవాత్ - కేవల జఠరాగ్నికి త్రిలోకశరీరకత్వము సంభవింపకపోవుటవలన, ఏనం- ఏపురుషుని పరమాత్మగా, అధీయతే, అధ్యయనముజేయబడుచున్నదో.

శబ్దమనగా వాజినేయులు వైశ్వానరవిద్యయందు ''సఏషోగ్ని ర్వైశ్వానరః,, వైశ్వానరసామానాధికరణ్యోగ్నిశబ్దము ఈప్రకరణమందును ''హృదయంగార్హపత్యం,, యని యారంభించి హృదయాదిస్థానములందుండెడు అగ్నికి అగ్నిత్రయకల్పనమును ప్రాణాహుతులకునాధారత్వకల్పనమునునిశ్చయింపబడినవి.

వాజినేయులకు ''సయోహావైతమేవమగ్నింవైశ్వానరం పురుష విధం పురుషేంతః ప్రతిష్ఠితంవేద,, యనివైశ్వానరునకు శరీరాంతర్వర్తిత్వంబు తోచుచున్నది ఈహేతువుచేత నేవైశ్వానరునకు జాఠరాగ్నిత్వప్రతీతివలననితడే పరమాత్మయనునర్థము సంగతముకాదనిన అదియుక్తముగాదు దృష్టిః అనగా ఉపాసనము ఆప్రకారము ఉపాసనోపదేశమువలనయని అర్థము జాఠరాగ్నిశరీరత్వముచేత వైశ్వానరరూపుడైన పరమాత్మకు నుపాసనమిక్కడ చెప్పబడుచున్నది ''అయమగ్ని ర్వైశ్వానరః పురుషేంతః ప్రతిష్ఠిత,, ఇవి మొదలైనవానియందుప్రకారమునిది తెలియబడుచున్నదనిన అసంభవాత్ - కేవలజాఠరాగ్నికి త్రైలోక్యశరీరత్వంబు సంభవింపదు చశబ్దము ప్రసిద్ధ్యర్థకము ''సఏషోగ్నిర్వైశ్వానరోయత్పురుష,, యనే స్థలమందు వైశ్వానరాంతర్యామియైనపురుషశబ్దవాచ్యుని ప్రసిద్ధంబుగ ధ్యానముచేయుచున్నారట్టిపురుషుడే పరమాత్మయని తెలియబడుచున్నాడు.

''పురుషఏవేదంసర్వమ్,, ''పురుషాన్నపరంకిఞ్చిత్,, యని ఇదేయర్థముదృఢముచేయబడినది.

తా.—పరబ్రహ్మకధ్య యనపున్నందువలన దేహాంతరప్రదేశస్థితివినబడు శబ్దములచేత కేవలజఠరాగ్నికి నుపదేశముండినను త్రిలోకశరీరకత్వముజెప్పగూడదు.

౨౦. అతఏవనదేవతాభూతఞ్చ.

అ.—అతఏవ - ఆకారణమువలన, దేవతా -అగ్న్యాఖ్యమైన దేవతయును, భూతంచ - మూడవభూతమైన తేజస్సుయును, న- కాదు.

ఏకారణము వలన మూడు లోకములే శరీరముగాగలవాడో- ఏకారణముచేత నిరుపాధిక పురుష శబ్దనిర్దిష్టుడో, ఆకారణములవలన వైశ్వానరశబ్దవాచ్యుడు అగ్న్యాఖ్యమైన దేవతమహా భూతము లందు మూడవది

ధైన వైశ్వానరుడని శంకింపబడును.

తా.— అగ్న్యాఖ్యమైన దేవత యును మూడవ భూతమైన తేజస్సు యును పరమాత్మ గాదు.

౨౮. సాక్షాదప్యవిరోధం జైమినిః.

అ.— సాక్షాదపి- ప్రత్యక్షముగాను, అవిరోధం- విరోధాభావమును, జైమినిః - జైమిన్యాచార్యులు తెలియుదురు.

అగ్నిశరీరకత్వముచేత వైశ్వానరునకు ఉపాసనార్థంబుగనగ్నిశబ్దముతో సమానాధికరణ్య నిర్దేశముజేయబడినది ప్రపంచమందు మనుష్యులకు నేతృత్వములైన సంబంధముచేత వైశ్వానరశబ్దమేలాగున పరమాత్మునియందు వర్తించునో నాప్రకారంబుగ నగ్నిశబ్దమునకగ్రమైననయనముతో సాక్షాత్సంబంధముండుటవలన పరమాత్మను బోధచేయడమందు నేవిరోధములేదని జైమిన్యాచార్యులు తెలియుదురు.

"యస్త్వేతమేవం ప్రాదేశమాత్రమభివిమానమాత్మానంవైశ్వానరం,, యనేవాక్యముచేత పృథివ్యంతరిక్షమధ్యప్రదేశ సంబంధిత్వమువలన పరిచ్ఛిన్నత్వమునపరిచ్ఛిన్నుడైన వైశ్వానరరూపముపరమాత్మకేలాగునసంభవించుననగా చెప్పుచున్నారు.

తా.—సాక్షాత్తుగానగ్నిశబ్దమునకు అగ్రమైననయనముతో సంబన్ధముండుటనుబట్టిపరమాత్మను బోధచేయడమందు నేవిరోధములేదు.

౨౯. అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః,

అ.—అభివ్యక్తేః-చక్కగావ్యక్తమౌటకొఱకని, ఆశ్మరథ్యః - ఆశ్మరథ్యాచార్యులు దెలియుదురు.

అనవచ్ఛిన్నమైన పరమాత్మకుపాసనార్థంబుగ నంతరిక్షప్రభృతి పృథివ్యంతప్రదేశముజేత పరిచ్ఛిన్నమని ఆశ్మరథ్యాచార్యులు దెలియుదురు- అంతరిక్షముమొదలైనప్రదేశముల చేతనభివ్యక్తుడైన పరమాత్మకు నంత రిక్షభూమ్యాదులకు శిరస్సే మొదలుగాగలయవయవ కల్పనముఏమిప్రయోజనముకొఱకనిశంకించిన చెప్పుచున్నారు

తా.—అనవచ్ఛిన్నమయిన పరమాత్మకు ఉపాసన కొరకని ఆశ్మరథ్యాచార్యులు దెలియుదురు.

౩౦. అనుస్మృతేర్బాదరిః.

అ.— అనుస్మృతేః - ఉపాసన కొరకని-బాదరిః- బాదరాచార్యులు దెలియుదురు.

అనుస్మృతియనగా-ఉపాసనము బ్రహ్మప్రాప్తియందు నాప్రకారముపాసనార్థముకొరకై శిరస్సుమొదలు పాదాన్తదేహపరికల్పనముయనిబాదరిరాచార్యులు దెలియుదురు - పరమాత్మభూతుండైననీవైశ్వానరుడే త్రైలోక్యశరీరత్వముజేతనుపాస్య

డని యుపదేశము చేయబడి నట్టయితె ,,ఉరఏవవేదిర్లోమానిబర్హిహ్హృదయంగార్హపత్య,,యనియు ఉపాసకశరీరావయవములకు గార్హపత్యాది పరికల్పనమేమిటి కొఱకని యనినం జెప్పుచున్నారు.

తా.— బాదరాచార్యులు పాసనకొఱకని తెలియుదురు.

౬౪. సంపత్తేరితి జైమినిస్తథాహిదర్శయతి.

అ.— సంపత్తేరితి-ఉపాసకులచేత ప్రతిదినము చేయబడు ప్రాణాహుతికి అగ్నిహోత్రముయొక్క-సంపాదనకొరకని- జైమినిః-జైమునులు దెలియుదురు- తథాహి-అదేరీతిగా-దర్శయతి-శ్రుతులుచెప్పుచున్నవి.

ఉపాసకులచేత ప్రతిదినముచేయబడుచుండే వైశ్వానరవిద్యకంగభూతమైన ప్రాణాహుతికి నగ్నిహోత్రత్వసంపాదనమ్ముకై గార్హపత్యాదుల పరికల్పనమని జైమిన్యాచార్యులు తెలియుదురు.

అదేప్రకార మగ్నిహోత్ర సంపత్తియే ఈశ్రుతిచూపించుచున్నదిప్రాణాహుతిచేసి ,,అధయఏవంవిద్వానగ్నిహోత్రంజుహోతి,,యనియీయర్థమునేదృఢపరచుచున్నది చెప్పబడినయర్థమునకు పూజ్యత్వఖ్యాపనముకొఱకై ఆచార్యపదగ్రహణము.

తా.—శ్రుతులందు చెప్పేప్రకారను నుపాసకులచేత ప్రతిదినము చేయంబడుప్రాణాహుతి అగ్నిహోత్ర సంపాదన కొరకని జైమునులు దెలియుదురు.

౬౫. ఆమనస్తిచైనమనస్మిన్.

అ.—ఏనం-ఈపరబ్రహ్మను- అస్మిన్ - ఉపాసకదేహమందు-ఆమనస్తిచ - అనుసంధానము చేయుచున్నారు.

ఏనం- పరమపురుషుడైనవైశ్వానరశబ్దవాచ్యుడు అంతరిక్షభూములేదేహంబుగాగలపరమాత్మ-అస్మిన్-ఈయుపాసకదేహమందు- ఆమనస్తిచ-ప్రాణాగ్నిహోత్రముచేతనారాధ్యత్వముకొరకు దెలియుచున్నారు ,,తస్యహవాఏతస్యవైశ్వానరస్యమూర్ధేవసుతేజా,, యనిఉపాసకునియొక్క-మూర్థాదిపాదాన్తములైన యన్తరిక్షప్రభృతులుపరమపురుషునియొక్క-శిరస్సుమొదలైనవనిప్రాణాగ్నిహోత్ర కాలమందను సంధేయములనియర్థను.

తా.— పరబ్రహ్మను యుపాసకదేహమందుప్రాణాగ్నిహోత్రము చేతనారాధ్యత్వముకొఱకు దెలియుదురు.

అ.—సం॥ఆత్మానమేవైమంవైశ్వానరం సమ్ప్రత్యధ్యేషి,, ఇత్యాది

వాక్యమందు శ్రుతుడైన వైశ్వానరుడు పరమాత్మయని నిర్ణయింప గూడదు- వైశ్వానరశబ్దమేమి- జాఠరాగ్నేమి భూతతృతీయమేమి- దేవతావిశేషమేమి- వీనియందునను- పరమాత్మునియందునను - వేదముప్రయోగించుచున్నదనే పూర్వపక్షమునకు "కోనఆత్మా కిం బ్రహ్మ,, యని యుపక్రమమందు సర్వాత్మభూత పరబ్రహ్మ జిజ్ఞాసయోపసన్నులైన యౌపమన్యవాదిమునులనుగురించి యుపదేశింప బడుటచేత పరమాత్మ ధర్మమైన ద్యుప్రభృతి పృథివ్యంత జగచ్ఛరీరత్వంబు శ్రుతమౌటవలన జాఠరాగ్న్యాదులలోని శబ్దము ప్రయోగింపబడినను- నిచ్చోటు వైశ్వానరుడు పరమాత్మయని సిద్ధయింపబడినది.

ఈపాదార్థమైన జగచ్ఛరీరత్వము సర్వత్ర ప్రసిద్ధ్యధికరణములో "సర్వంఖల్విదం బ్రహ్మ,, మనువిషయవాక్యమందుచూడవచ్చును- అత్త్రధికరణమందు "గుహాం ప్రవిష్టౌ,, ఇత్యాది సూత్రవిషయమైన "తందుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్టం పురాణం,, ఇత్యాదివాక్యంబువలన సౌభరివలె జగత్తుజ్ఞానాధిష్ఠితముకాదని స్వరూపము చేత సర్వశరీరంబులలో హృదయ గుహాప్రవిష్టుండైన పరమాత్మకు శరీరమని జెప్పబడినది- అన్తరాధికరణములో,, ఏషో క్షిణిపురుషో దృశ్యతే,, యనే విషయవాక్యమందు ఇంద్రియములకును పరమాత్మ శరీరత్వమును జెప్పంబడినది- అన్తర్యామ్యధికరణమందు కేవలేంద్రియములేగావు ప్రత్యేకము సర్వతత్త్వములు పరమాత్మ శరీరమని చెప్పబడినది- అదృశ్యత్వాది గుణకాధికరణమందు- సర్వతత్త్వములు సముదాయరూపముచేత బ్రహ్మశరీరమని "రూపోపన్యాసాత్,, యనుసూత్రమందు జెప్పబడినది- వైశ్వానరాధికరణమందు జగచ్ఛరీరత్వంబు ముముక్షూపాస్యమని ప్రపంచితంబు.

ద్వితీయపాదము- ముగించెను.

శ్రీ శ్రీ శ్రీ

ప్రథమాధ్యాయము తృతీయపాదము

౧౮. ద్యుభ్వాద్యధికరణము.

౬౬. ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్

అ.—ద్యుః- స్వర్గము, భు- భూమి, ఆది- ఇవిమొదలగువానికి, ఆయతనం- ఆధారమైనవాడు, స్వశబ్దాత్- తనకుసాధారణమైన ఆత్మశబ్దమువలన పరమాత్మ.

అథర్వణమందు "యస్మిన్ ద్యౌః పృథివీచాన్తరిక్షమోతం మనస్సహ ప్రాణైశ్చసర్వైః తమేవైకంజానథ ఆత్మానమన్యావాచోవిముఞ్చథ అమృతస్యైష సేతుః,, యనే వాక్యమందు పృథి

వ్యాద్యులకు నాధారంబుగ జెప్పబడిన వస్తువుజీవుడా - పరమాత్మా యనిసంశయము.

జీవుండని పూర్వపక్షము - ఎందువలననిన - జీవునికిమనస్సు మొదలైన ఇంద్రియములకుఆధారత్వ శ్రుతులుండుటవలనను-ముందర నాడీసంబంధమువలనను త్పత్తిచెప్పుటనుబట్టిన్ని.

సిద్ధాంతము - నిరుపాధికమైన ఆత్మత్వఅమృతత్వరూపంబులుపరమాత్మధర్మంబులగ శ్రవణముండుటవలన పరమాత్మయని తెలియవలయు- సమస్తమునునియన్తృత్వముచేత పొందబడువాడుగనుకఆత్మయనియు - అమృతమునకు ప్రాపకత్వముచేత సేతువనియు-ఆబ్రహ్మమే నాడీసంబంధము- బహుధాయుత్పత్తిమత్త్వము ''సస్తతం సిరాభిస్తులమ్బత్యాకోశ సన్నిభమ్,, ''అజాయమానో బహుధావిజాయత,, యనిసర్వ సమాశ్రయణీయత్వంబుకొలకువిడవబడని స్వభావము గలపరమాత్మకుసంభవించును.

సూత్రార్థమైతే, ద్యు, అంతరిక్షమునకు, భు-భూమికి, ఆది-మొదలుగా గలవస్తువులకు ఆయతనం ఆధారము పరమాత్మ స్వశబ్దాత్ తనకసాధారణమైన ఆత్మశబ్దముచేత నిర్దేశముండుటవలన జీవుడుగాదనియర్థము ద్యుప్రభృతుల కాధారమైనవాడు తనకసాధారణమైనఆత్మశబ్దమువలనజీవుండు గాడు.

తా.— ద్యుప్రభృతుల కాధారమైనవాడుతనకసాధారణమైన ఆత్మశబ్దమువలనజీవుడుగాడుపరమాత్మ.

౬౭. ముక్తోప సృప్యవ్యపదేశాచ్చ.

అ.—ముక్తః- బంధమువలనవీడబడినవాడు-ఉపసృప్యః-ప్రాప్యుడని, వ్యపదేశాత్ - చెప్పడమువలన.

''తదా విద్వాన్పుణ్యపాపే విధూయనిరఞ్జనః పరమం సామ్యముపైతి,, ''తథావిద్వాన్నామరూపాద్విముక్తఃపరాత్పరంపురుషముపైతిదివ్యమ్,, అనిపుణ్యపాపములను నామరూపములనునివర్తించుకొని యుండుననియు-చశబ్దమువలనముక్తులకుప్రాప్యుండని యునిర్దేశించుటవలన పూర్వోక్తశబ్దవాచ్యుండుపరమాత్మయనబడును.

తా.—సంసారబంధము విడవబడినవానిచేత ప్రాప్యుండు పరమాత్మయనిచెప్పబడును.

౬౮. నానుమానమతచ్ఛబ్దాత్ప్రాణభృచ్చ.

అ.—అనుమానం-ప్రధానమును, ప్రాణభృచ్చ-జీవుడును, అతచ్ఛబ్దాత్ తద్వాచకశబ్దము లేక పోవుటవలన, న-కాదు.

అనుమానం- అనుమాన గమ్యమైనప్రధానము- అతచ్ఛబ్దాత్ - తద్వా

చక శబ్దములేకపోవుట వలననేరీతిగా గ్రహింపబడదో- ఆప్రకారముగానే ప్రాణభృచ్చ- జీవుడును గ్రహింపబడడని తాత్పర్యము - అందు వలన పరమాత్మ.

తా.—ప్రకృతిజీవులకు దద్వాచకశబ్దములేకపోవుటనుబట్టి పరమాత్మ

౬౫. భేదవ్యపదేశాచ్చ.

అ.—భేదవ్యపదేశాచ్చ- భేదముచేత చెప్పడనువలన.

"అనీశయాశోచతి ముహ్యమానః జుష్టంయదాపశ్యత్యన్యమీశమ్,, యని జీవునికంటే, భేదముగా పరమాత్మను చెప్పబడెను.

తా.— జీవునికంటెభేదము పరమాత్మ.

౭౦. ప్రకరణాత్.

అ.— ప్రకరణాత్- ఈప్రకరణమందుపరమాత్మేప్రకృతుడౌటవలన

"అథపరాయ యాతదక్షర మధిగమ్యత,, యను శ్రుతిచేత పరమాత్మకేప్రకృ తత్వముండుట వలన పరమాత్మ.

తా.—శ్రుతియందు ప్రకృతత్వముండుటవలన పరమాత్మ.

౭౧. స్థిత్యదనాభ్యాంచ.

అ.—స్థితి - ఊరికెయుండడము, అదనాభ్యాంచ-భక్షణచేతను.

"తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి,, యనేశ్రుతిచేతకర్మ ఫలమునుననుభవింపక పరమాత్మయని ప్రకాశనుచేత నుండుటవలన జీవునికి కర్మపరవశత్వముచే దత్ఫలభక్షణము జెప్పుటవలన పరమాత్మకు జీవునికంటె భేదము తెలియబడుట వలన నమృతమునకు సేతువు అంతరిక్షభూమ్యాదుల కాధారుడు జీవుడుగాడు.

"అదృశ్యత్వాది గుణక,, యని అదృశ్యత్వాది గుణములు పరమాత్మయందు స్థాపింపబడుచుండ నాడీసంబంధము వలన బహుధా జాయమానత్వచిహ్నములచే అవాన్తర ప్రకరణవిచ్ఛేదశంకను ద్యుభ్వాద్యాయతనమని- నిరాకరింప బడుచున్నది. వైశ్వానరునికి త్రైలోక్య శరీరత్వాదులు పరమాత్మత్వ నిర్ణయనుఖ్యములమందువైశ్వానర విద్యనిరూపణ చేయబడినది.

సూత్రార్థము.స్థితి- కర్మఫలానుభవ పూర్వకంబుగ జీవుడుదేహాన్తర్వర్తియైయుండుటను, అదనాభ్యాం-అనగా దేహాంతర్వర్తియై కర్మఫలము ననుభవించుటను,బట్టిఅంతరిక్షాద్యాధారుడు పరమాత్మ.

తా.— శ్రుతియందుకర్మఫలమును భక్షింపక - పరమాత్మ ప్రకాశమానమై యుండుటచేతను - కర్మప

రవశత్వమునొంది తత్ఫలమనుభక్షిం చుటచేత - పరమాత్మకంటె జీవుడు భిన్నుడని తెలియవలయును-

అ-సం.—"యస్మిన్ ద్యౌః పృథివీచాన్తరిక్షమోతమ్మనస్సహప్రాణైశ్చసర్వైః," ఇత్యాదిఅధర్వణవాక్యమందు శ్రుతుడయిన దుభ్వాద్యాయతనుండు జీవుండు గావలెను - మనఃప్రాణసంబంధనాడ్యాధారత్వబహుధా జాయమానత్వాదులలో యను పూర్వపక్షమునకు - అమృతసేతుత్వ ఆత్మత్వసర్వజ్ఞత్వాది ధర్మసూచకపరమాత్మాసాధారణ శబ్దములచేత నిర్దేశింప బడుటవలన సర్వాధారునికే మనఃప్రాణనాడ్యాధారత్వము కూడుటచే నిచ్ఛమైన బహుధాజాయమానత్వము వీరికిన్నుండుటవలన దుభ్వాద్యాయతనుడు జీవుడు గాడు పరమాత్మేయని సిద్ధాంతము.

౧౯. భూమాధికరణము.

౭౨. భూమాసంప్రసాదాదధ్యుపదేశాత్.

అ.—భూమా-భూమగుణవిశిష్టుడు పరబ్రహ్మమే, సంప్రసాదాత్-ప్రత్యగాత్మకంటె, అధ్యుపదేశాత్- ఆధిక్యోపదేశమువలన.

ఛాందోగ్యమందు "యత్రనాన్యత్పశ్యతినాన్యచ్ఛృణోతినాన్య ద్విజానాతిసభూమా,, యనిభూమశబ్దముచేత జెప్పబడినదిఅత్యన్తాతిశయవిపులముతో గూడిన సుఖరూపుడు ప్రత్యగాత్మాలేకపరమాత్మాయనిసంశయము.

ప్రత్యగాత్మయని పూర్వపక్షము "తరతిశోకమాత్మవిత్,, యనియుపక్రమించినామాదిపరంపరలచే నుత్తరోత్తరము అధికంబుగ ప్రశ్నప్రతివచనములు ప్రవృత్తమైన ఆత్మోపదేశమునకు ప్రాణశబ్దముచే జెప్పంబడిన ప్రత్యగాత్మయందు సమాప్తియుండుటవలన జీవునికే భూమశబ్దము నిశ్చయమాచున్నది.

సిద్ధాంతము- ఎట్లుప్రశ్నప్రతివచనములచేత నుత్తరోత్తరమాధిక్యమ్ము జెప్పడము ప్రాణమంచే పర్యవసానముఅట్లుఆప్రాణవేదికిఅతివాదిత్వమును చెప్పి "ఏషతువా అతివదతి యస్సత్యేనాతివదతి,, యనితుశబ్దము చేత నుపాసకభేదమునుచెప్పి సత్యోపాసకుడైనవతనికి పూర్వముకంటె ఆధిక్యముచెప్పుటవలన సత్యశబ్దమునకర్థమైన పరబ్రహ్మమేభూమవిశిష్టము.

సూత్రార్థము. భూమా భూమగుణవిశిష్ట పరబ్రహ్మమే సమ్ప్రసాదాదధ్యుపదేశాత్ సంప్రసాదశబ్దమునకు జీవుండని యర్థమే ప్రకారమునిన "సఏషసమ్ప్రసాదోస్మాచ్ఛరీరాత్సముత్థాయపరం జ్యోతిరుపసమ్పద్య,, యనుశ్రుతిచే దెలియబడుచున్నదిగను

కజీవునికంటె అధ్యుపదేశాత్ ‹‹ఏష తువా అతివదతి,, యనిఆధిక్యోపదేశ మువలన అతివాదిత్వమనగా తనయొక్క ఉపాసాధిక్యమును చెప్పడమనుట.

తా.—జీవునికంటె నధికయుపదేశముండుట వలన భూమగుణ విశిష్టుండుపరబ్రహ్మ.

౭౩. ధర్మోపపత్తేశ్చ.

అ.—ధర్మ - వినబడినధర్మములకు,ఉపపత్తేశ్చ - బ్రహ్మయందేసంభవించుటవలన.

స్వాభావికయమృతత్వము స్వమహిమ ప్రతిష్ఠ తత్వము సర్వాత్మత్వముసర్వోత్పత్తి హేతుత్వాది విశేషముగా వినబడెడి ధర్మములు పరబ్రహ్మయందే యుపపత్తి కలుగును గనుక భూమశబ్ద వాచ్యము పరమాత్మయె.

తా.— స్పష్టము.

అ-సం.— యత్రనాన్య త్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా,, యనెఛాందోగ్య వాక్యమందు శ్రుతుడైన భూమగుణ విశిష్టడుజీవుడు గావలెను ‹‹తరతిశోకమాత్మవిత్,, యని ఆత్మజిజ్ఞాస యోపసన్నుండైన ముముక్షువుకు ప్రాణసహచారిత్వనిబంధనేన ప్రాణశబ్దనిర్దిష్టుండైనజీవునియందు నాత్మోపదేశముసమాప్తంబగుటచేనాజీవుని ముక్తావస్థయందునానందవైపుల్యంబునుభూమశబ్దముచే నిర్దేశించెసనె- పూర్వపక్షమునకు ‹‹యస్సత్యేనాతివదతి,, అనే వాక్యమందుసత్యశబ్దముచేశ్రుతుండైన పరమాత్మునియందు నాత్మోపదేశము సమాప్తంబేగాక ప్రాణశబ్దవాచ్యజీవోపదేశమందు సమాప్తముకాదుగనుక పరమాత్మునియానందవైపుల్యమును భూమశబ్దముచే చెప్పబడుటవలన భూమగుణవిశిష్టుడు జీవుండుగాడు పరమాత్మెయనిసిద్ధాంతము.

౨౦. అక్షరాధికరణము.

౭౪. అక్షరమంబరాంతధృతేః.

అ.—అక్షరం- అక్షరశబ్దవాచ్యుడుపరమాత్మ, అంబరాంతధృతేః-ఆకాశమునకు కారణమైన ప్రధానధరణమువలన.

వాజినాంగార్గిప్రశ్నయందు ‹‹సహోవాచైతద్వైతదక్షరంగార్గిబ్రాహ్మణావదంత్యస్థూలమనణ్వ హ్రస్వమదీర్ఘమలోహితమ స్నేహ మచ్ఛాయమ్,, యని అక్షర శబ్దముచే నిర్దిష్ట వస్తువు ప్రధానమా జీవుడా పరమాత్మాయని సంశయము.

ప్రధానముజీవుడౌను పరమాత్మకానిదపూర్వపక్షము‹‹కస్మిన్నుఖల్వాకాశ ఓతశ్చప్రోతశ్చ,, యనిఆకాశాధారత్వఅక్షరము.మగు ప్రధానమాజీవుడా. ప్రధానము వికారాధారత్వ

మైనందువలన జీవుడుఅచిద్వస్తువు కాధార మైయుండుటవలన ప్రధాన జీవులౌదురుగాని పరమాత్మ కాదు.

సిద్ధాంతము. ‘‘యదూర్ధ్వం గార్గి దివ,, యనియుపక్రమించిత్రికాలము లందుండెడుసమస్తమునకు నాధారత్వముచే నిర్దిష్టమైనఆకాశము అవ్యాకృతమువాయువుగలఆకాశముగాదు దానికంటె ‘‘కస్మిన్నుఖల్వాకాశఓతశ్చప్రోతశ్చ,, అనంతరము ఏఆకాశమందు ఈసమస్తమునుండునని అడుగగాఆవస్తువకు ఆధారత్వము చేత చెప్పబడిన నీఅక్షరము ప్రధానము కానేరదు.

జీవుడుకానేరదు ‘‘ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌవిధృతౌతిష్ఠతి,,యనిఆరంభించిశిక్షచే సర్వాధారత్వమును చెప్పుట వలన పరమాత్మ.

సూత్రార్థము-అక్షరం ‘‘ఏతద్వై తదక్షరంగార్గి,, యనే శ్రుతియందు నిర్దిష్టమైన యక్షరశబ్దము పరమాత్మ వాచకము ఎందువలననిన అమ్బరాంతధృతేః అమ్బరం అనగా వాయువు గలఆకాశను అంబరాంతమనగా అమ్బరమునకుపారభూతముఅంబరకారణమని తెలియవలయును కార్యాంతము కారణాపత్తియే అడేఅంబరాంతము అవ్యాకృతముప్రధానముతస్య ధృతేః- ధారణమువలన అవ్యాకృతముధరించుటవలన అక్షరశబ్ద వాచ్యముపరమాత్మ ఈప్రకారముచెప్పినందున జీవుడేయనిచెప్పవచ్చును జీవునికిప్రధానమును భరించడముప పన్నమగుననెడి పూర్వపక్షమునకు ఉత్తరసూత్రముచేత నివారణము చేయుచున్నారు.

తా.—ఆకాశకారణమైన ప్రకృతినిధరించుటవలన నక్షరశబ్దముచే జెప్పబడినవాడుపరమాత్మ.

౧౧. సాచప్రశాసనాత్.

అ.— సాచ - అంబరాంతము యొక్క- ధరణమును, ప్రశాసనాత్- అప్రతిహతాజ్ఞ వలన పరమాత్మకే యుపపత్తికలుగును.

సాచ అంబరాంతధారణము ‘‘ఏతస్యవాఅక్షరస్యప్రశాసనే గార్గి సూర్యా చంద్రమసౌ,, యని ప్రశాసనమువలన వినబడుచున్నది ప్రశాసనమనగా ప్రకృష్టమైన శాసనము అనగా అప్రతిహతాజ్ఞ అట్టి ఆజ్ఞ చేతచిదచిదాత్మకమైన జగద్ధరణము జీవునియందుప పన్నముకాదుగనుకజీవుడు కాడు.

తా.—శ్రుతియందు అంబరాంతధృతి వలన ప్రకృష్టశాసనమువలన పరమాత్మకే యుపపన్నమగును జీవుడుకాడు.

౨౬. అన్యభావవ్యావృత్తేశ్చ.

అ.—అన్యభావ-ఇతరపురుషత్వముయొక్క, వ్యావృత్తేశ్చ - వ్యావృత్తివల్లను.

అన్యభావః అనగా అన్యత్వము అక్షరమునకు పరమ పురుషునికంటె అన్యత్వమువ్యావర్తింప చేయుచున్న వాక్య శేషము ,,అదృష్టం ద్రష్టృ,, అనేవాక్యము సమస్తములచేత చూడ బడని ఈయక్షరము సర్వమునకుద్రష్ట యని ప్రధానమునకు జీవునికిని అసంభావితమైన యర్థము చెప్పుటవలన అక్షర శబ్ద వాచ్యము పరబ్రహ్మ.

అ.— సం॥ ,,ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి,, ఇత్యాదివాజసనేయక వాక్యమందు శ్రుతమైన అక్షరము ప్రధానజీవులు గానుండవలెను ,,అక్షరాత్పరతః పరః,, ,,అక్షరంతమసీలీయతే,, ఇత్యాది శ్రుతులలో ప్రధానజీవులయందక్షరశబ్ద ప్రయోగముకనుబడుటవలనననే పూర్వపక్షమునకు త్రైకాల్యవర్తివికారజాతాధారభూతా కాశశబ్దవాచ్య ప్రధానాధారత్వమువలన ప్రశాశనశ్రవణముచేత అక్షరశబ్దనిర్దిష్టము ప్రధానముగాదుజీవుడునుగాదు- పరమాత్మయనిసిద్ధాన్తము.

౨౧. ఈక్షతికర్మాధికరణము.

౨౨. ఈక్షతికర్మవ్యపదేశాత్సః.

అ.— ఈక్షతి - దర్శన మందు, కర్మ-ధ్యానకర్మయందు, సః - ఆపరబ్రహ్మ, వ్యపదేశాత్ - పరమాత్మధర్మంబులుగా జెప్పుటవలన.

ఆధర్వణిశ్రుతులయొక్క సత్యకామప్రశ్నయందు ,,యఃపునరేతంత్రిమాత్రేణ,, యని ఉపక్రమించి ,,ససామభిరున్నీయతే బ్రహ్మలోకంసఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరంపురిశయం పురుషమీక్షత,, యనేవరకుధ్యాయతి-ఈక్షతి-యనేవాక్యములకుకర్మగాచెప్పబడినపురుషుడుహిరణ్యగర్భుడా పరబ్రహ్మభూతపురుషోత్తముడా- యని సంశయము.

హిరణ్యగర్భుండని పూర్వపక్షము పూర్వవాక్యములందొకసారి ప్రణవోపాసనచేసినవానికిమనుష్యలోక ప్రాప్తిఫలమునుచెప్పి - రెండవసారి యుపాసనచేయడమందంతరిక్షలోకప్రాప్తినిచెప్పి అనంతరము ,,యఃపునరేతంత్రిమాత్రేణ,, యనిమూడవసారి ప్రణవోపాసనచేసినవానికిఫలత్వముచేత చెప్పంబడు బ్రహ్మలోక మందు పురుషుని దృష్టికి కర్మభూతుండైనపురుషుడు చతుర్ముఖుడేయని తెలియబడును - మనుష్యలోక అన్తరిక్ష లోకములయొక్క సాహచర్యము వలన బ్రహ్మలోకము క్షేత్రజ్ఞులలోకమని ని

శ్చయింపబడును - గనుకహిరణ్యగర్భుండని చెప్పవలెను.

సిద్ధాంతము ''పరాత్పరం పురిశయంపురుషమీక్షత,, యని ఈక్షతికర్మత్వముచేత చెప్పబడిన పురుష విషయమైనశ్లోకమందు ''తమోంకారే ణై వాయతనేనాన్వేతి విద్వాన్యత్తచ్ఛాన్తమజర మమృతమభయం పరంచ,, యని నిరుపాధిక శాన్తత్వము అమృతత్వముమొదలైన గుణములుచెప్పుట వలనపరమాత్మయేయని నిశ్చయింపబడుచున్నది.

ఈప్రకారము పరమాత్మయని నిశ్చయానంతరమందు బ్రహ్మలోకశబ్దము ఆపర మాత్మ స్థానమని చెప్పుచున్నది.

బ్రహ్మ విషయముగా చెప్పబడిన శ్లోకమందు ''యత్తత్క వయో వేదయన్తే,, యనినిత్యసూరులచేత దృశ్యత్వవచనముసీయర్థము నేదృఢపరచుచున్నది.

సూత్రార్థము-ఈక్షతి-ఈక్షతిధాతువునకుకర్మవస్తువు - సః-ఆపరమాత్మ-ధ్యాయతిఈక్షతియనే రెండుధాతువులకుఏకవిషయత్వముండుటవలన ధ్యాయతి యనే ధాతువునకు కర్మయును యతడేయని అర్థము వ్యపదేశాత్ ''తద్విషయకతయా,,శాన్తమ జరమమృతమభయంపరంచ,, యనే డిపరమాత్మధర్మములకథనముండుట వలన.

తా.— ధ్యాన దర్శనంబులందు శాన్త్యాదిఅమృతత్వాది గుణములు జెప్పుటచే పరమాత్మయనినిశ్చయింపబడుచున్నది-హిరణ్యగర్భుండుకాడు.

అ.—సం॥పరంపురుష మభిధ్యాయీత,, యను మొదలు ''పురిశయం పురుషమీక్షతే,, యనువరకుధ్యాయతి-ఈక్షతి-కర్మతయానిర్దిష్టుండైనపురుషుడుచతుర్ముఖుడుకాగలడు మనుష్యలోకంబునకు నంతరిక్ష లోకమునకునుపరితన బ్రహ్మలోకమందుఈక్షణీయత్వాది లింగములచేత యనేపూర్వపక్షమునకు ''యత్తచ్ఛాన్తమ జరమమృత మభయం,, ఇత్యాది వాక్యములందు శాన్తత్వా జరత్వ అమృతత్వాదిధర్మములు శ్రుతమాటచేత సర్వపాప వినిర్ముక్తుడైన ముక్తునకు ప్రాప్యత యోక్తమైన బ్రహ్మలోకంబు చతుర్ముఖ స్థానము కానందున ''యత్తత్క వయో వేదయన్తే,, యనికవిశబ్దవాచ్యులైననిత్యసూరులచేత దృష్టమైనవైష్ణవపదమును బ్రహ్మలోకశబ్దముచేత నిర్దేశించుట వలన తత్రస్థ్యుడైనవాడు చతుర్ముఖుండు కాడు-పరమాత్మేయనిసిద్ధాన్తము.

౨౨. దహరాధికరణము.

౬౪. దహరఉత్తరేభ్యః.

అ.—ఉత్తరేభ్యః - ఉత్తరవాక్యములనుబొందినబ్రహ్మమందుండెడి ధర్మములవలన- దహరః - దహరాకాశముపరబ్రహ్మ.

ఛాన్దోగ్యమందు ‶అథయదిదమస్మిన్ బ్రహ్మపురేదహరం వుండరీకం వేశ్మదహరోస్మిన్నన్తరఆకాశ స్తస్మిన్యద న్తస్త దన్వేష్టవ్యమ్ తద్వావవిజిజ్ఞాసితవ్యమ్,, యనిహృదయవుండరీకమధ్యమమందు వినబడిన ఆకాశను భూతాకాశమా - లేకజీవుడా- పరమాత్మాయని సంశయము - మొదట భూతాకాశమనిచెప్పడముయుక్తమనిపూర్వపక్షము - ఆకాశశబ్దమునకు భూతాకాశమందే అధికంబుగ ప్రసక్తియుండుట వలన - ఈయాకాశాన్తర్వర్తికంటే యన్యమునకు అన్వేష్టవ్యత్వంబు చెప్పుటచే భూతాకాశమని తెలియబడుచున్నది.

సిద్ధాన్తను ‶కింతదత్రవిద్యతేయదన్వేష్ట వ్యమితి చోదితే,, ‶యావాన్వాఅయమకాశ,, యని ఆరంభించి ‶ఏతత్సత్యంబ్రహ్మపురమ్,, యనువరకుదహరాకాశంబునకు సత్యంతాధిక్యము-సర్వాశ్రయత్వము-సత్యత్వములనుజెప్పి ‶అస్మిన్ కామాస్సమాహితాః,, యనిఆకాశాన్తర్వర్తియందుండెడుకామములు వెదకదగినవనిచెప్పిఆ దహరాకాశశబ్దముచేత నిర్దిష్టవస్తులేవి, వానియందుండెడుపదార్థములేవి అని యాక్షేపను సంభవింపగా ‶ఏషఆత్మాపహతపాప్మా,, యనియారంభించి ‶సత్య సఙ్కల్పః,, యనువరకునాకాశశబ్దనిర్దిష్టుండు యాత్మయనియు-కామశబ్దములుఅపహతపాప్మత్వాదులనువిశేషణభూతములనిప్రతిపాదించినవాక్యములుఆఅపహతపాప్మత్వాదివిశిష్ట పరబ్రహ్మమునే చెప్పినదై యుపక్రమమందు వెదుకుటకునర్హంబుగ ప్రతిజ్ఞచేయబడిన ఆకాశము ఆత్మయనియు- అతనియందుండెడిగుణములు అపహత పాప్మత్వాదులనియుచెప్పుచుండు నదియై ‶అథయ ఇహాత్మానమను విద్యవ్రజన్త్యేతాంశ్చసత్యాన్కామాన్ తేషాం సర్వేషులోకేషుకామచారోభవతి,, యని యుపసంహారమునుచెప్పును- గనుక ఈదహరాకాశము అపహతపాప్మత్వాదిగుణవిశిష్టుడైన పరబ్రహ్మమే. భూతాకాశముకాదనినిశ్చయము - అప్పటికి ఈవాక్యమందు ‶అథయఏష సమ్ప్రసాదోస్మాచ్ఛరీ రాత్సము త్థాయ,, యని జీవునికి ప్రతీతి యుండుట వలనా జీవునకును త్తదత్రచతుర్ముఖబ్రహ్మవాక్యములందు-అపహతపాప్మత్వాదిగుణములుచెప్పుటవలనప్రత్యగాత్మే దహరాకాశమని పూర్వ పక్షితలుచు

సిద్ధాన్తము. ప్రత్యగాత్మ కర్మప

రవశుడౌటవలన స్వప్నసుషుప్త్యాద్యవస్థలచేత నాచ్ఛాదనచేయబడిన అపహతపాప్మత్వాది గుణములు గలవాడై పరమాత్మనుబొంది అతని యనుగ్రహంబు వలన నుదయించిన గుణసమూహము గలవాడని ప్రజాపతి వాక్యమందు చెప్పం బడును - దహరాకాశమైతె అనాచ్ఛాదితమై నిరుపాధికమైన లపహతపాప్మత్వాదిగుణములుగలడై జీవుని యందసంభావితమైన సమస్తజగద్విధరణము- సమస్తచిదచిద్వస్తువుల యొక్క- నియమనము- ఇవిమొదలైనయనేకగుణములు గలవిగనుక దహరాకాశంబు పరమాత్మ-ప్రత్యగాత్మ యెంతమాత్రము కాదు.

సూత్రార్థము. దహరః-దహరశబ్దవాచ్యుండు పరబ్రహ్మ-ఉత్తరేభ్యః ఉత్తరవాక్యమందు చెప్పబడెడి అపహతపాప్మత్వాది రూపాసాధారణ ధర్మములనే హేతువువలనయని తెలియవలయును.

తా.—ఉత్తరవాక్యగతమైనయపహతపాప్మత్వాది ధర్మముల'వలన దహరాకాశముపరబ్రహ్మ.

౧౫. గతిశబ్దాభ్యాంతథాహిదృష్టం లిఙ్గంచ.

అ.—గతి-గతిచేత- శబ్ద- బ్రహ్మలోక శబ్దముచేత పరబ్రహ్మ- తథా- అట్లేప్రకారమే- దృష్టంహి- మరియొకస్థలమందు చూడబడినది- లింగంచ- హేతువునుయున్నది.

ఈదహరాకాశమందుసమస్తప్రజలకుప్రతిదినము ఆగమనమువినబడుచున్నది- దహరాకాశమునకు సూచకమైన తచ్ఛబ్దము సామానాధికరణ్యముచేత ఏబ్రహ్మలోకశబ్దము ప్రయోగింపబడినదో ఆగతిశబ్దములచేత దహరాకాశమే పరబ్రహ్మయని తెలియబడుచున్నది‘‘తద్యథాహిరణ్యనిధింనిహితమక్షేత్రజ్ఞా ఉపర్యుపరిసఞ్చరంతోనవిందేయురేవమేవేమాస్సర్వాః ప్రజా అహర హర్గచ్ఛన్త్య ఏతంబ్రహ్మలోకం నవిన్దన్త్యనృతే నహిప్రత్యూఢా,, యనేశ్రుతిచేతనుఆప్రకారమే మరియొకస్థలమందు పరబ్రహ్మయందేయిట్టిగమనము చూడబడినది. ‘‘ఏవమేవఖలుసౌమ్యేమాస్సర్వాః,, ప్రజాస్సతిసమ్పద్యన విదుస్సతి సంపత్స్యామహ‘‘యనియు,,సతఆగమ్యనవిదుస్సతఆగచ్ఛామహః‘‘యనియు ఆప్రకారమె బ్రహ్మలోకశబ్దము పరబ్రహ్మయందే వర్తించును- ‘‘ఏషబ్రహ్మలోకసమ్రాడితిహెూవాచ,, యని హేతువయునున్నది గనుక బ్రహ్మలోకశబ్దము బ్రహ్మపరమని తెలియవలయును-నితరస్థలమందును హేతువులేకపోయినను యీప్రకరణమందుసమస్తప్రజలకు వినబడుప్రతిదినము గ

మనమును- బ్రహ్మలోక శబ్దమును దహరాకాశమునకు పరమాత్మత్వము చెప్పడమందు హేతువుపూర్ణమైనది చశబ్దము అవధారణార్థకము - ఇదే పరిపూర్ణమైనదని తాత్పర్యము.

సూత్రార్థము. గతి- ఆగమనము చేతను-శబ్ద-బ్రహ్మలోక శబ్దముచేతను-దృష్టం-బ్రహ్మమేయని తెలియబడినది- లింగంచ-ఈగతిశబ్దము హేతువౌను.

తా.—శ్రుతియందు బ్రహ్మలోకశబ్దంబు పరబ్రహ్మయందే చూడబడుటవలన దహరాకాశంబునకు పరమాత్మ భావ మందనేక చిహ్నంబులుండుటవలనపరమాత్మ.

౧౦. ధృతేశ్చ మహిమ్నో స్యాస్మిన్నుపలబ్ధేః.

అ.—అస్య-పరబ్రహ్మయొక్క--ధృతేః- ధృతిరూపమైన- మహిమ్నః-మహిమకు-అస్మిన్- ఈదహరాకాశమునందు-ఉపలబ్ధేః- ఉపలబ్ధిసంభవించుటచేనీదహరాకాశముపరమాత్మ.

ధృతిః-ధృతియనగా. జగద్విధరణము- అదిపరమాత్మధర్మమనిమరియొకస్థలమందు వినబడుచున్నది - ‹‹ఏష సర్వేశ్వర ఏషభూతాధిపతిరేషభూతపాల ఏష సేతుర్విధరణ ఏషాంలోకానామసంభేదాయ,, యని ఆధృతి ఈదహరాకాశమందు కనబడుచున్నది- ‹‹అథయఆత్మాస సేతుర్విధృతి రేషాంలోకానామసమ్భేదాయ,, యనియు.

తా.— ఈదహరాకాశము నందు ధృతిరూపమైనమహిమము సంభవించుటవలన పరమాత్మ- ధృతియనగాజగద్విధరణము.

౧౧.— ప్రసిద్ధేశ్చ.

అ.—ప్రసిద్ధేశ్చ- ఆకాశబ్దముప్రసిద్ధిగాబ్రహ్మయందుండుటవలన.

‹‹కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాద్యదేష ఆకాశ ఆనందోనస్యాత్- సర్వాణిహవాఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యంతే,, యని ఆకాశశబ్దమునకు పరబ్రహ్మయందు ప్రసిద్ధియుండుటవలన ఆకాశశబ్దమే పరమాత్మయొక్కగుణములచేత విశేషితమైభూతాకాశ మనియెడి శంకనుపోగొట్టుచున్నది.

సూత్రార్థము.బ్రహ్మయందాకాశశబ్దము ప్రసిద్ధంబుగనుండుట వలనాకాశశబ్దవాచ్యుడుబ్రహ్మను.

తా.—ఆకాశశబ్దముపరబ్రహ్మధర్మముతోగూడిభూతాకాశశంకనునివర్తింపచేయుచున్నది.

౧౨. ఇతరపరామర్శాత్సఇతిచేన్నాసమ్భవాత్.

అ.— ఇతరః- జీవుడు- పరామర్శాత్-చెప్పటవలన సః-ఆజీవుడే ద

హారశబ్దవాచ్యుఁడు-ఇతిచేన్న-ఇట్లనుట కాదు- అసంభవాత్ - సంభవింపక పోవుటవలన.

ఇతరః-పరమాత్మకంటెనితరుడైనజీవుడు అతని ‘‘అథయఏష సంప్రసాదో స్మాచ్ఛరీరా త్సముత్థాయ,, యని పరామర్శయుండుటవలన ఆజీవుండే దహరాకాశమని చెప్పగూడదు పూర్వోక్తములైన గుణములా జీవునియందుపప త్తినిజెందదు.

సూత్రార్థను. ఇతరజీవుడు-పరామర్శాత్-చెప్పుటవలన-సః-ఆజీవుడే ఇతిచేత్-దహరశబ్దవాచ్యుడని- న-చెప్పకూడదు- అసంభవాత్-ఉత్తరత్ర చెప్పబడిన గుణములు జీవుని యందు సంభవింపదుగనుక జీవుడుకాడు.

తా.— స్పష్టను.

౧౩. ఉత్తరాచ్చే దావిర్భూత స్వరూపస్తు.

అ.—ఉత్తరాచ్చేత్- ప్రజాపతి ప్రత్యుత్తరమువలన - జీవుడనియన్నట్లయితే- ఆవిర్భూతస్వరూపస్తు- ముక్తుడుకాని.

ఉత్తరాత్ - ఉత్తరరూపమైన ప్రజాపతివాక్యమువలన-చేత్-అపహతపాప్మత్వాదిగుణములుగలజీవుడు తెలియబడునని చెప్పిన యెడలయుక్తము కాదు- ఆవిర్భూతస్వరూపః - జాగరూకాద్యవస్థలచేతననాదికాలప్రవృత్తములైన పుణ్యపాపకర్మ మూలకములై జాగరూకా ద్యవస్థలచేత తిరోహితమైన గుణములు గలవాడై పర బ్రహ్మోపాసన చేత పుట్టబడిన స్వ స్వరూపా విర్భావము గల అపహతపాప్మత్వాది గుణవిశిష్టుడైన జీవుడే ఆప్రజాపతి వాక్యమందపహతపాప్మత్వాదిగుణవిశిష్టుడుగా చెప్పబడును. దహరాకాశమైతే అతిరోహితస్వరూపము అపహతపాప్మత్వాను మొదలైన గుణములుగలవిగనుక ఈ దహరాకాశమందు జీవుడని భ్రాంతి చేయగూడదు.

సూత్రార్థము. ఉత్తరాత్ బ్రహ్మోత్తర వాక్యములవలన- ఇతిచేత్- జీవుడని తెలియబడుచున్నదనిన-ఆవిర్భూతస్వరూపః-ఆవిర్భూత-భగవదనుగ్రహము వలన పుట్టినట్టి-స్వరూపః-స్వస్వరూపముగలజీవుడు-అస్తు-అగుగాక-దహరవాక్యమందు జీవపరామర్శ యెందుకొఱకు చేయబడినదనిన యీ సంగతివివరించుచున్నారు.

౧౪. అన్యార్థశ్చపరామర్శః.

అ.—పరామర్శః- ఈదహరవాక్యమందుజీవునిపరామర్శణము,అన్యార్థః - ఈదహరాకాశమునకు జీవస్వరూపసంపాదకత్వసామర్థ్యమె-అర్థః ప్రయోజనముగాగలిగినది

‘‘అస్మాచ్ఛరీ రాత్సముత్థాయప

రంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణా
భినిష్పద్యత, యనిపరంజ్యోతిస్వరూప
మైనదహరాకాశోపసంపత్తిచేత- అ
నృతతిరోహితస్వరూపముగలయీజీ
వునకు స్వరూపావిర్భావము కలుగు
చున్నదనిదహరాకాశమును జగద్విధ
రణమునొదలైనవానివలెనె జీవస్వ
రూపావిర్భావసంపాదనరూపమైన
సంపద్విశేషముచెప్పుటకొఱకు జీవప
రామర్శ.

౨౧. అల్పశ్రుతేరితిచేతదుక్తమ్.

అ.—అల్ప- స్వల్పత్వముయొక్క- శ్రుతేః, వినుటవలన- ఇతిచేత్. ఈసూక్ష్మమైనజీవుడేయనిన- తత్, ఆసంగతి- ఉక్తం, పూర్వమే చెప్పబడెను.

"దహరోస్మిన్ యనుశ్రుతిచేతఅల్పపరిమాణముగలదనిచెప్పును- గనుక నీశ్రుతివిషయత్వముసూక్ష్ముడైనజీవునికేఉపపన్నమగును సర్వవస్తువులకంటెనధికుడైనబ్రహ్మకు సంభవింపదని చెప్పినయెడ- అక్కడ యేసమాధానముచెప్పదగినదో అది "నిచాయ్యత్వాత్" యనే గ్రంధముచేతమందే చెప్పబడినది.

౨౨. అనుకృతేస్తస్యచ.

అ.—తస్య- ఆజీవునికి, అనుకృతేః- దహరాకాశసామ్యముచెప్పుటవలనదహరాకాశ స్వరూపుడు జీవుడు కాడనియర్థము.

అనుకృతిః - అనగాఅనుకరణము తస్య, ఆపరమాత్మయొక్క- అనుకరణమువలనజీవునికిస్వరూపావిర్భావము అపహతపాప్మత్వాదిగుణములు సంభవించును- అందువలనయనుసరించెడుజీవునికంటె అనుకార్యుడైనపరబ్రహ్మస్వరూపమైన దహరాకాశముఅర్థాన్తరభూతము- దానియొక్క- అనుకారమనగాదానిసామ్యప్రాప్తియని "యదాపశ్యః పశ్యతేరుక్మ వర్ణంకర్తారమీశంపురుషంబ్రహ్మయోనిమ్ తదావిద్వాన్పుణ్యపాపేవిధూయనిరఞ్జనః పరమంసామ్యముపైతి" యనే శ్రుతియందుప్రసిద్ధముగానున్నది.

౨౩. అపిస్మర్యతే.

అ.—అపిస్మర్యతే- స్మృతిచేతను నీయర్థముచెప్పబడును

ఆబ్రహ్మోపాసనవలనతత్సామ్యప్రాప్తిరూపమైన అనుకరణముజీవునికి "ఇదంజ్ఞానముపాశ్రిత్యమమసాధర్మ్య మాగతాః। సర్గేపినోపజాయన్తేప్రళయేనవ్యధన్తిచ" యనిప్రసిద్ధముచేయబడుచున్నది.

అ.—సం "దహరోస్మిన్నన్తరఆకాశః" ఇత్యాదిఛాన్దోగ్యవాక్యశ్రుతమైనహృదయపుండరీకమధ్యవర్తిదహరాకాశము- భూతాకాశము- లేక జీవుండును గాని ఐ యుండవలెను భూతాకాశమందు ఆకాశశబ్దప్రసిద్ది

ప్రాచుర్యముచేత భూతాకాశముకా గలదు-ప్రజాపతి వాక్యమందుజీవునికి అపహత పాప్మత్వాదులుశ్రుతమా టచేత ప్రకాశాది యోగమువలన ఆ కాశశబ్దము జీవునియందు కూడుటవ లనజీవుడుగాగలడుయనే పూర్వపక్ష మునకుఅపహతపాప్మత్వాదులుభూ తాకాశమునకు ఘటింపనందున ప్ర జాపతివాక్యమందుశ్రుతమైనపరమా త్మసంపత్తి లబ్ధాపహత పాప్మత్వా దులుజీవునికినుండినను-దహరవాక్యో క్తాతిరోహితనిత్యసిద్ధాపహతపాప్మ త్వాదివైశిష్ట్యము-జీవునికిగూడనందు న-పరమాత్మునియందుఆకాశశబ్దప్ర యోగముశ్రుత్యంతర సిద్ధమైనందునద హరాకాశముప్రసిద్ధాకాశముగాదు జీవుండునుగాదు- పరమాత్మే యనిసి ద్ధాంతము.

౨౩. ప్రమితాధికరణము.

౮౮. శబ్దాదేవప్రమితః.

అ:—శబ్దాదేవ- ఈశానఃఅనుజ గన్నియామకవాచకశబ్దమువలన- ప్ర మితః - అంగుష్ఠ ప్రమితుడైన పురు షుడుపరమాత్మయని తెలియబడును, ‘‘ఈశానోభూతభవ్యస్య,, యనేప రమాత్మవాచకశబ్దమువలన.

కఠవల్లి యందు ‘‘అంగుష్ఠ మా త్రఃపురుషోమధ్య ఆత్మనితిష్ఠతిఈశా నోభూతభవ్యస్యన తతోవిజుగుప్సతే ఏతద్వైతత్,, అని యుత్తర శ్రుతి యందును ‘‘అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః,, అందుకు పూ ర్వమందున్నశ్రుతియందును ‘‘అఙ్గుష్ఠ మాత్రపురుషోన్తరాత్మా సదాజనా నాం హృదయే సన్నివిష్ట,, అనుశ్రు తులచేతఅంగుష్ఠమాత్రమితప్రమాణ ముగలపురుషుడుజీవుడా-పరమాత్మా యనిసంశయము.

జీవాత్మయని పూర్వపక్షము,, ఇ తరస్థలమందుగ్రహింపబడినస్పష్టజీవ భావముగలపురుషునియందు అంగుష్ఠ మాత్ర శ్రుతులుండును, యెటులనిన ‘‘ప్రాణాధిపస్సఞ్చరతి స్వకర్మభిరం గుష్ఠమాత్రోరవి తుల్యరూప,, యని సిద్ధాంతము- అచ్చట ‘‘స్వకర్మభిః,, యని తృతీయచేత జీవభావము నిశ్చ యింపబడునుఅటువలెఇచ్చటను‘‘ఈ శానో భూత భవ్యస్య,, యనిభూత భవ్యేశితృత్వదర్శనము వలన పరమా త్మేయనిస్ఫుటమౌచున్నది.

ఎట్లు,అనవచ్చిన్నమైనపరమాత్మ కుఅంగుష్ఠప్రమితత్వముసంభవించున ని ఆక్షేపించుకొని సమాధానము చె ప్పుచున్నారు.

తా.—పరమాత్మవాచకశబ్దంబు వలన నంగుష్ఠమాత్రుండుపరబ్రహ్మ.

౮౯. హృద్యపేక్ష యామనుష్యాధికారత్వాత్.

అ.— మనుష్యాధి కారత్వాత్ శాస్త్రమునకు మనుష్యులేయధికారులుగనుక, హృద్యపేక్షయాతు - వారి హృదయములనపేక్షించి అంగుష్ఠప్రమితత్వము చెప్పబడినది.

ఉపాసన కొఱకై యుపాసకుల హృదయ మందుండుట వలన, ఉపాసకహృదయమునకు అంగుష్ఠ మాత్రప్రమాణము కలుగుటవలన, దానియపేక్షచేత నిదియు అంగుష్ఠ మాత్రప్రమితత్వము - మనుష్యులకే యుపాసకత్వ సంభావనచే మనుష్యులకే అధికారమున్నదని శాస్త్రము ప్రవృత్తమౌటవలన మనుష్యహృదయాపేక్ష చేతనిట్లు చెప్పబడెను.

తా.— ఉపాసనకొఱకు- నుపాసకులహృదయ మందుండడము వలన హృదయమంగుష్ఠ ప్రమితత్వ మగుట చేతనాయపేక్షవలనఅంగుష్ఠ ప్రమితత్వము చెప్పబడినది.

అ-సం.—"అంగుష్ఠమాత్రః పురుషోమధ్యఆత్మనితిష్ఠతి", ఇత్యాదికఠవల్లీ వాక్యములో శ్రుతుడైన అంగుష్ఠ ప్రమితుడు జీవుండుకాగలడు- అంగుష్ఠప్రమితత్వము జీవునికి శ్రుత్యన్తర సిద్ధమౌటచేతననే పూర్వపక్షమునకు భూతభవ్యేశానత్వము జీవునికి అనుపపన్నమౌటచేత పరమాత్మకే యున్నదౌటవలన అఙ్గుష్ఠప్రమితుడు జీవుడుగాడు పరమాత్మయనిసిద్ధాన్తము.

౨౮. దేవతాధికరణము.

౯౦. తదుపర్యపి బాదరాయణస్సంభవాత్.

అ.—తత్ - ఆమనుష్యులకంటె, ఉపర్యపి- పైనుండు దేవతలకుకూడఅధికారముగలదు, సంభవాత్- దేవతలకు బ్రహ్మస్వరూప బ్రహ్మోపాసన ప్రకారజ్ఞానముల యపేక్షయును, ఆ యుపాసనా సామర్థ్యముల సంభవము వలన- దేవతలకునధికారముకలదని బాదరాయణులు తెలియుదురు.

బ్రహ్మోపాసన శాస్త్రము మనుష్యాధి కారకమని చెప్పిన ప్రసంగసంగతిచేత దేవాదులకుకూడ బ్రహ్మవిద్యయందధికారమున్నదో లేదోయని విచారముచేయబడుచున్నది.

దేవతలకు అధికారము లేదని పూర్వపక్షము, పరినిష్పన్నమైన బ్రహ్మమందు శబ్దమునకు ప్రామాణ్యముసంభవించినప్పటికిని దేవాదులకు దేహముండుననే ప్రమాణములేనందున మంత్రార్థవాదములకువిధి శేషత్వముచే దేహస్థితినిబోధింపనందున దేహధారులుచేయురీతిచే యడమునకు యోగ్యమైన ప్రతిదిన మనుష్ఠానవిషయమైనవివేకాదిసాధనసప్తకముచేసంపాద్యమైనమనస్సుచేత నిష్పన్నమైనయుపాసనానిర్వృత్తియందువారలకు సామర్థ్యము

లేక పోవుటవలన దేవతలకధికారము లేదనిపూర్వపక్షము.

సిద్ధాంతము. జగత్సృష్టి ప్రకరణమందు నామరూపవ్యాకరణశ్రుతిచే దేవాదులకు దేహముసిద్ధించుచున్నది- నామరూపవ్యాకరణమనగా - దేవతలకు దేహేంద్రియాదులుకలగ చేయడము-మంత్రార్థవాదములందునుఆదేహము స్ఫుటంబుగ పొందుటవలన ఆ మంత్రార్థవాదములకు అనుష్ఠానయోగ్య ప్రకాశన స్తుతిపరత్వము చెప్పినపక్షమందు దానియుపపత్తి కొఱకై దానిస్థితియందు ప్రమాణత్వ ముండుటవలన దేవాదులకుదేహముమొదలైనవిసంభవించును - దేహముండుటచే తస్తుతిప్రకాశము సహాసంభవించుచున్నది- లేనియెడలసంభవింపదు గనుక సామర్థ్యముండుటచేత దేవతలకధికారముకలదు.

ఇదిఏప్రకారముసంభవించుననిన- పూర్వమందుసంపాదింపబడిన జ్ఞానమువిస్మృతివలన జ్ఞానముసంభవించును తాపత్రయముచే పుట్టినదుఃఖపూర్వకబ్రహ్మగుణ జ్ఞానమువలనఅర్థిత్వముసంభవించును-సృష్టివాక్యమంత్రార్థవాదములందు దేహముచెప్పబడును గనుక వీనివలన సామర్థ్యంబు సంభవించును- ఆసంభవమువలన దేవతలకును అధికారముకలదని బాదరాయణాచార్యులు తెలియుదురు.

౫౧. విరోధకర్మణీతి చేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్.

అ.— కర్మణి - యాగాదికర్మలయందు, విరోధః-ఏకకాలావస్థితిరూపదోషము, చేన్న- సంభవించుచున్నదనిచెప్పకూడదు, అనేక ప్రతిపత్తేః- అనేకదేహసంబంధమునకు, దర్శనాత్ - ప్రత్యక్షముండుటవలన.

కర్మణి యాగాదులందువిగ్రహవత్వము చెప్పినపక్షమందు నొకనికి నేక కాలమందనేకయాగములసాన్నిధ్యమర్హముకాదు- గనుకవిరోధముకలుగునని చెప్పినట్టయితే అటులగాదు శక్తిమంతులైన సౌభరి ప్రభృతులకు నేక కాలమందనేకశరీరప్రతిపత్తిసంభవించును.

౫౨. శబ్దఇతిచేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యామ్.

అ.—శబ్ద- వైదికశబ్దమందు, చేన్న- విరోధమనిచెప్పగూడదు, అతః- వైదికశబ్దమువలన,ప్రభవాత్-నిర్మాణముచేత, ప్రత్యక్షానుమానాభ్యాం- శ్రుతిస్మృతులచేతనిశ్చయింపబడును.

విరోధః యనుశబ్దము వర్తించుచున్నది కర్మయందువిరోధముసంభవింపదువైదికశబ్దమందువిరోధముసంభవించును యెట్లు అనేక దేహములుం

డినను వానికి సావయ వత్వముండుట వలన ఉత్పత్తినాశము సంభవించును గనుక యుత్పత్తికంటె పూర్వమునాశముకంటెఅనన్తరమువైదికశబ్దముల కర్థశూన్యత్వము అనిత్యత్వము గలగునుయని చెప్పిన నటులనగూడదు అతః ప్రభవాత్ వైదికశబ్దమువలన ఇంద్రాదులకుత్పత్తియాటవలన.

పూర్వపూర్వ ఇంద్రాదులు నశించిపోయినను వేదోక్తమైన ఇంద్రాది ఆకృతి విశేషవాచకములైనశబ్దమువలనఇంద్రాద్యాకృతి విశేషములనుస్మరించిఆయాకారముగల మరియొకఇంద్రునిబ్రహ్మనిర్మాణముచేసును గనుక వైదికశబ్దమునకు ఏదోషములేదు.

దేవదత్తశబ్దమువలె ఇంద్రాదిశబ్దములువ్యక్తివిశేషమందు సంకేతపూర్వకంబుగ ప్రసరించినవికావుమరేమనినగవాదిశబ్దమువలె ఆకృతివిశేషవాచకములు. ఆకృతివాచకములకు నిత్యత్వముండుట మాత్రము చేతనెవాచ్యవాచకభావసంబంధము వేదప్రతిపాద్యమైనశబ్దమువలన దానిఅర్థవిశేషమునుస్మరించికులాలుడు ఘటాదులునువలెబ్రహ్మనిర్మాణముచేసుననే యర్థము దేనిచేత తెలియబడునంటె (ప్రత్యక్షానుమానాభ్యాం)అనగా శ్రుతిస్మృతులచేతనని అర్థము. శ్రుతులేవనిన "వేదేననామరూపేవ్యాకరోత్సతాసతీ ప్రజాపతిః," అటువలె "సపూర్వరితివ్యాహరత్ సభూమిమసృజతే," యనియు "నామరూపఞ్చభూతానాంకృత్యానాంచ ప్రపంచనమ్ వేదశబ్దేభ్యఏవాదౌదేవాదీనాం చకారస ఇతి," యని తెలియబడును.

౯౩. అతఏవచనిత్యత్వమ్.

అ.—అతఏవచ - ఆకారణమువలన-నిత్యత్వం-నాశములేకపోవడము-ఏకారణమువలన బ్రహ్మవైదికశబ్దముచేత తదర్థాకారమును స్మరించి ఆయాకారముగల సమస్తమును నిర్మించునో నాకారణమువలన వశిష్ఠవిశ్వామిత్రాదులకు మంత్రసూక్తాదినిర్మాతృత్వముండినను మంత్రమయ వేదనమునకునిత్యత్వమున్నది.

బ్రహ్మనైమిత్తిక ప్రళయానన్తరమందు "మన్త్రకృతోవృణీతే," "విశ్వామిత్రస్యసూక్తంభవతి," ఇత్యాదివేదశబ్దము అధ్యయనము చేయకనే మన్త్రాది దర్శనమందు సమర్థులైనవశిష్ఠాదులాకృతివిశేషమునుస్మరించివశిష్ఠత్వాదిపదములయొక్క ప్రాప్తికొఱకుచేయబడినకర్మవిశేషముగలవారినిస్మరించి వార్లకు వశిష్ఠాద్యాకారవిశేషములనునిర్మాణము చేసును.

వారలుఅధ్యయనముచేయకనేవైదికమన్త్రాదులనుస్వరవర్ణములంపుస్ఖలనములేకనే పఠింతురు, ఆకారణము

వలనవీర్లకు మంత్రాదికర్తృత్వముం డినను వేదనకునిత్యత్వముసుపపత్తిసం భవించును ప్రజాపతి మొదలుగాగల సమస్త అవ్యాకృత పర్యన్తము లైన తత్వములు, అవ్యాకృత పరిణామరూపములైన శబ్దమయ వేదములు నష్టమైనఅనంతరము అవ్యాకృతసృష్టియొక్క ఆవృత్తి ప్రాప్తమాచుండగా ఏ ప్రకారము వేదమునకు నిత్యత్వముసంభవించుననగా చెప్పుచున్నారు.

౯౪. సమాన నామ రూపత్వాచ్చా వృత్తావప్య విరోధో దర్శనాత్స్మృతేశ్చ.

అ.—ఆవృత్తావపి- రెండోసృష్టియందును, సమాన నామరూపత్వాత్ - సదృశమైన నామరూపాదు లుండుటవలన, అవిరోధః - విరోధములేదు, దర్శనాత్ - శ్రుతివలన, స్మృతేశ్చ స్మృతివలన ఈయర్థము దృఢమని తెలియవలయును.

అవ్యాకృతసృష్టి యావృత్తి యందు, సృజ్యములైనవస్తువులకు సమాన నామరూపముండుట వలన దోషము లేదు- ఆదిసృష్టియందుపరమపురుషుడుపూర్వాకృతిగలజగత్తును స్మరించి అదేప్రకారమేసృష్టిచేసును, పూర్వానుపూర్వి విశిష్టములైనవేదములనుస్మరించిహిరణ్యగర్భునికొరకిచ్చునుపూర్వప్రకారంబుగల జగత్తును నిర్మాణము చేసునని ఏప్రకారము తెలియబడునంటె, దర్శనాత్స్మృతేశ్చ-శ్రుతిస్మృతులవలన.

“అహో రాత్రాణి విదధద్విశ్వస్యమిషతోవశీ। సూర్యాచంద్రమసౌ ధాతాయథాపూర్వమకల్పయత్। దివంచ పృథివీంచాన్తరిక్షమథో సువరితి యోబ్రహ్మాణంవిదధాతిపూర్వంయోవై వేదాంశ్చప్రహిణోతితస్మై,, యనే శ్రుతులును “యథర్తుష్వృతు లిఙ్గానినానారూపాణిపర్యయే। దృశ్యన్తే తానితాన్యేవ తథాభావా యుగాదిషు,, యనేస్మృతియు ప్రమాణమని తెలియవలయును.

నిత్యత్వం బనగాఇదేను ఏకారణంబువలనపూర్వ పూర్వమైనయుచ్చారణనుస్మరించి పరమ పురుషుండదేక్రమముచేత నాయుచ్చారణమును తనయారాధనమునుదాని ఫలమును యాథాత్మ్యముగా బోధించు వేదమును పూర్వానుపూర్వవిశిష్టమైన వేదమునేస్మరించిచెప్పును అందువలన దేవాదులకుబ్రహ్మవిద్యాధి కారమందేమి దోషములేదు.

తా.— శ్రుతిస్మృతులవలన తెలియబడు ఆవృత్తియందు సృజింపబడినవానికినామరూపసామ్యముండుట వలనవిరోధములేదు.

అ.—సం॥ దేవతాదులు నిర్దుఃఖు

లు అశరీరత్వముచేత అర్థిత్వ సామర్థ్యాదులయొక్క అభావముచేత బ్రహ్మవిద్యయందధికారములేదనే పూర్వపక్షమునకుసృష్టి ప్రకరణములందు నుపాసన ప్రకరణములందుశరీరప్రతిపాదనముచేత తాపత్రయాభిభూతముచేత అర్థిత్వ సామర్థ్యములు సంభవించుటవలన వారికినధికారము గలదనిసిద్ధాన్తము.

౨౫. మధ్వధికరణము.

౯౫. మధ్వాదిష్వ సంభవాదనధికారంజైమినిః.

అ.—— మధ్వాదిషు- మధువిద్యలయందు-అనధికారం-అధికారములేదని జైమినిః, జైమినులు తెలియుచురు అసంభవాత్ -వసువులకే ఉపాస్యత్వఉపాసకత్వను సంభవింపదు గనుక వసుత్వము ప్రాప్తమైనదౌటవలన ప్రాప్యత్వముసంభవించదుగనుక అధికారములేదనియర్థము.

ఛాన్దోగ్యమందు ‘‘అసౌవా ఆదిత్యోదేవమధ్వితి,, అనిఆరంభించి ‘‘తద్యత్ప్రథమమమృతంతద్వసవ ఉపజీవన్తి,, అనిచెప్పి ‘‘నయ ఏతదేవ మమృతం వేదవసూనా మేవైకో భూత్వాగ్నినైవముఖేనైత దేవామృతం దృష్ట్వా తృప్యతి,, యనిఋుగ్యజుస్సామాది వేదములందు చెప్పబడినకర్మలనుసంపాదించి రసమునకాధారమాట వలన మధుమయుడైన సూర్యునికి పూర్వదక్షిణపశ్చిమోత్తరఊర్ధ్వభాగములనువసు రుద్రాదిత్య మరుత్సాధ్యులనే పేరుగల దేవసమూహమునకుభోగ్యత్వముచేతచెప్పి ఆయను భవాకారము చేతనే ఆదిత్యాంశంబులకునుపాస్యత్వమును పదేశించిఅదిత్యభాగములను ప్రాప్యములుగాను పదేశముచేయబడియున్నది.

ఇట్టియుపాసనలందు వస్వాదులకధికారమున్నదా- లేదాయని సంశయము - లేదనిపూర్వపక్షము,వస్వాదులకు ఉపాస్యకోటి ప్రవిష్టత్వమువలనకర్తృకర్మభావములకువిరోధము కలుగక పోవుట వలన నుపాస్యునిచే పొంద దగిన వసుత్వము పొందబడియుండును - గనుకఅధికారములేదని పూర్వపక్షము.

సిద్ధాన్తము.ఆయవస్థలుగలబ్రహ్మకేయుపాస్యత్వముండుటవలనవస్వాదిదేవతలకుతమఅవస్థగలబ్రహ్మోపాసనమందువిరోధములేదుమరిఒకకల్పమందుప్రాప్యమైనవసుత్వముయనిచెప్పడమందువిరోధములేదు - గనుకవస్వాదిదేవతలకుఅధికారముసంభవించుననితాత్పర్యము.

తా.—— జైమినులు వస్వాదులకుమధువిద్యయందధికారము గలదని తెలియుదురు.

౯౬. జ్యోతిషిభావాచ్చ.

అ.—జ్యోతిషి-పరబ్రహ్మమందు దేవ మనుష్యులకుండే తుల్యాధికారముకంటె-భావాచ్చ-వసువులకువిశేషముగాచెప్పును.

“తం దేవాజ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతేఽమృతమితి జ్యోతిషి,, యనిదేవమనుష్యులకుపరబ్రహ్మమందధికారము సమానంబుగ నుండినప్పటికి “జ్యోతిషాంజ్యోతిః,, “పరబ్రహ్మదేవా ఉపాసత,, యనివిశేషముగా చెప్పడము వస్వాదులకు కర్మకర్తృభావము విరుద్ధమగునని వారలకు ననధికారము తోపింప చేయుచున్నది.

“దేవా,, యని సామాన్య వచనమైతేనోవస్వాదిదేవ విశేషమనియితరులకువిరోధములేకపోవుటవలన అంగీకారముచేయబడుచున్నది.

౯౭. భావంతు బాదరాయణో ౽స్తిహి.

అ.—బాదరాయణః - బాదరాయణాచార్యులు-భావం - వస్వాదిదేవతలకుమధువిద్యయం దధికారముతెలియుదురు- అస్తిహి-వసువులకేయుపాస్యత్వము ప్రాప్యత్వమున్నదనిప్రసిద్ధము.

తుశబ్దము. పక్షమునువ్యావర్తిచెస్తున్నది - వస్వాదిదేవతలకు మధువిద్యాదులందధికారమున్నదని పూజ్యులైన బాదరాయణులు తెలియుదురు వస్వాదులకేయుపాస్యత్వము- ప్రాప్యత్వములు రెండునున్నవి - ఇప్పుడు వసుత్వ ముండినప్పటికి కల్పాంతమందువసుత్వమునకు ప్రాప్యత్వము సంభవించునుగనుక ప్రాప్యత్వముసంభవించును - తమఆత్మలకుబ్రహ్మభావముఅను సంధానము సంభవించునుగనుక ఉపాస్యత్వము సంభవించును “యఏతామేవం బ్రహ్మోపనిషదం వేదేతిహి,, యనిసమస్తమైన మధువిద్యకుబ్రహ్మవిద్యాత్వమవగతమౌను.

తా.— వస్వాదులకు మధువిద్యయందధికారము గలదని బాదరాయణులు తెలియుదురు.

అ.—సం॥వస్వాదుల కొఱకు వస్వాదులకుపాస్యత్వ యోగ్యము లేదనియు-మధ్వాదివిద్యాదులలోవస్వాదులకు అనధికారంబుగలదనిశంకించి వస్వాది శరీరకబ్రహ్మకే యుపాస్యత్వముండుటవలన కల్పాంతర మందు వస్వాదిత్యుల ప్రాప్యత్వముసంభవంబగుటచేత మధ్వాదివిద్యలలో వసువుమొదలగువారికి నధికారముగలదని సిద్ధాంతము.

౨౬. అపశూద్రాధికరణము.

౯౮. శుగస్యతదనాదర శ్రవణాత్తదాద్రవణాత్సూచ్యతేహి.

అ.—శుగస్య-బ్రహ్మవిద్యావైకల్యముచేత, తదనాదరశ్రవణాత్- తత్- హంసోక్తమైన, అనాదర- అనాదరవాక్యముయొక్క, శ్రవణాత్- వినడమువలన, తత్- అదేకాలమందే, ద్రవణాత్ - ఆచార్యుల ననుసరించి శీఘ్రముగా వచ్చె దానివలన. ఆచార్యునిచేత తస్య-ఆశిశ్రూష చేయుచునుండే శిష్యునికి-విద్య అలాభముచేతనైన - శుక్ దుఃఖము సూచన చేయబడుచున్నది. హి హేతువాచకము ఏ కారణమువలన శిష్యునికిదుఃఖముసూచింపబడుచున్నదో ఆహేతువవలన ఆచార్యుడు దుఃఖముచేతశూద్రాయనే సంబోధనచేసిపిలిచి ఆచార్యుడు ‘‘రైక్వఃజానశ్రుతింశూద్ర,, యనిఆహ్వానముచేయుచున్నాడు. జాతియోగముచేత కాదనియర్థము.

బ్రహ్మవిద్యయందు శూద్రాదులకధికారమున్నదా లేదాయని సంశయము అపేక్షారూపమైన సామర్థ్యము సంభవించుటవలన ఉన్నదనిపూర్వపక్షము శూద్రాదులకునగ్నివిద్యారహితత్వమున్నను మనోవృత్తిమాత్రత్వమాటవలనయుపాసనకుసామర్థ్యముసంభవించును.

బ్రహ్మస్వరూపమైనబ్రహ్మోపాసనప్రకార జ్ఞానమును ఇతిహాస పురాణాదులశ్రవణమువలననేనిష్పన్నమౌను శూద్రులకుఇతిహాసపురాణాదుల శ్రవణమందనుజ్ఞయునుండును ‘‘శ్రావయేచ్చతురో వర్ణాన్కృత్వా బ్రాహ్మణమగ్రత,, యనిఅదేరీతిగానచ్చట విదురాదులకు బ్రహ్మవిద్యానైపుణ్యముండును ఉపనిషత్తులందును ‘‘ఆజహారే మాశూద్రానేనైవముఖే నాలాపయిష్యథా,, యనేవాక్యమందు శూద్రశబ్దముచేత పిలువబడి బ్రహ్మవిద్యోపదేశ దర్శనమువలన శూద్రునికి యధికారము సూచన చేయబడుచున్నది.

సిద్ధాంతము. ఉపాసనకు మనోవ్యాపారరూపత్వముండినను అధ్యయనముచేయబడని వేదముగల శూద్రులకు యుపాసనకు కారణభూతమైన జ్ఞానముసంభవింపదు గనుకసామర్థ్యముసంభవింపదు.

కర్మవిధివలె యుపాసన విధియందును వేదాధ్యయనబలముగలత్రైవర్ణికవిషయమైన అధ్యయనముచేగ్రహింపబడిన వేదంబుచేత నుత్పన్నమైన జ్ఞానమేయుపాసనకు కారణమనిస్వీకరింపబడుచున్నది. ఇతిహాసాదులయందును అధ్యయనసిద్ధమైన జ్ఞానమును వృద్ధిబొందించును దానికంటెజ్ఞానలాభములేదు పాపనాశన ఫలముకొరకై శ్రవణాద్యధికారము చెప్పబడి యుండును విదురాదులకైతె జన్మాంతర

సంస్కారనుచేత ఆవేదజ్ఞానముసంభవించెనుగనుక బ్రహ్మనిష్ఠత్వముకలిగెను ఆపూర్వశ్రుతియందు ఆమంత్రణమున బ్రహ్మవిద్యావైకల్యము చేత నేదుఃఖమితనికి పుట్టెనని తాత్పర్యము గనుకశ్రవణాధికారమువినా యుపాసనాధికారములేదు.

తా.—— హంసో క్తమైనయనాదరవాక్య శ్రవణమప్పుడే వచ్చినందున దుఃఖముచేతగలిగిన సూచన చేయబడుశూద్రునికి బ్రహ్మవిద్యయందధికారముగలదు.

౯౯. క్షత్రియత్వగతేశ్చ.

అ.——క్షత్రియత్వ-క్షత్రియత్వము అవగతేశ్చ-తెలియడముచేత,

అస్య-ఈశ్రుశ్రూషచేయు మనుష్యునికి, క్షత్రియత్వగతేశ్చ - క్షత్రియత్వము తెలియడముచేత జాతిసంబంధమువలన ఆసంబోధనము కాదు.

ఆప్రకరణోపక్రమమందు ‹‹బహుదాయీ,, అనేవాక్యములచేత దానపతిత్వము అధికములైన పక్వాన్నదాయిత్వ క్షత్తృప్రేషణము, అధిక గ్రామాదులప్రదానముచెప్పబడుచున్నవి గనుక ఈజానశ్రుతికి శుశ్రూషచేయుచుండెడిక్షత్రియవిషయకత్వముతోచుచున్నయవి.

౧౦౦. ఉత్తరత్ర చైత్రరథేనలింగాత్.

అ.——ఉత్తరత్ర-ముందుభాగమందు, చైత్రరథేన- చైత్రరథుండనేగాజుతోనీయర్థములన్వితమౌను, ఆచైత్రరథుడనేయర్థము లింగాత్, హేతువవలనదెలియబడుచున్నది.

ఉపరిష్టాచ్చ, ముందుగా ఈవిద్యయందు బ్రాహ్మణక్షత్రియులకు నన్వయముచూడబడుచున్నది ‹‹అథహాశౌనకంచ కాపేయమభిప్రతారిణం,, యనువాక్యముచేత వంచకుండైన చైత్రరథుండు క్షత్రియుండు ఆవంచకునికి చైత్రరథత్వము క్షత్రియత్వము కాపేయసాహచర్య లింగమువలె తెలియబడుచున్నది మరియొక ప్రకరణమందు కాపేయ సహచారియైనవానికి చైత్రరథత్వము క్షత్రియత్వముతోచబడుచున్నది ‹‹ఏతేనవైచైత్రరథం కాపేయాఅయాజయన్,, అనియీయర్థము దృఢమౌనుగనుక‹‹తస్మాచ్చైత్రరథో నామైకః క్షత్రపతిరజాయత,, యని ఈవిద్యయందన్వితుడు బ్రాహ్మణాదితరుడైన జానశ్రుతియు క్షత్రియుడనుటకునర్హుడు.

తా.——ముందుచైత్ర రథునితోనన్వయముగలహేతువవలన క్షత్రియుడనుటకునర్హుండౌచున్నాడు.

౧౦౧. సంస్కారపరామర్శాత్తదభావాభిలాపాచ్చ.

అ.——సంస్కార- ఉపనయనాది సంస్కారములయొక్క, పరామరా

త్-చెప్పుటవలన, తత్- ఆసంస్కార ముయొక్క, అభావాభిలాపాచ్చ- అభావము చెప్పుటవలన పూర్వోర్థము దృఢమని తెలియబడును.

విద్యోపదేశమందు ‹‹ఉపత్వానేష్య,, యనియుపనయనాది సంస్కారపరామర్శ వలనశూద్రునికితదభావవచనమువలన బ్రహ్మవిద్యాధికారము లేదు.

ఈసంస్కారము ‹‹నశూద్రే పాతకంకించిన్నచ సంస్కారమర్హతి,, యను వాక్యమందు నిషేధము చేయబడుచున్నది.

తా.— ఉపనయనాది సంస్కారము లేమివలన బ్రహ్మ విద్యయందు శూద్రుని కధికారము లేదని తాత్పర్యము.

౧౦౨. తదభావ నిర్ధారణేచప్రవృత్తేః.

అ.—తదభావనిర్ధారణేచ- శూద్రత్వా భావజ్ఞానముయొక్క యుపదేశమందు,ప్రవృత్తేః ప్రవృత్తియుండుటవలన.

‹‹నైతదబ్రాహ్మణోవివక్తుమర్హతి సమిధం సోమ్యాహర,, యనేవాక్యముచేశుశ్రూష చేయుచు నుండెడి జాబాలికి శూద్రత్వా భావ నిశ్చయమందేయుపదేశ ప్రవృత్తిగలుగుటవలనయధికారముకలదు.

౧౦౩. శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్.

అ.—శ్రవణ-వినడము- అధ్యయన-పఠనము-అర్థ-అర్థము తెలుసుకొనడముయొక్క-ప్రతిషేధాత్ - నిషేధము చేయబడుటవలన.

వేదాధ్యయనశూన్యునికి - శ్రవణము-అధ్యయనము పఠనముమొదలైనవినిషేధముచేయబడుచున్నవి‹‹తస్మాచ్ఛూద్రసమీపేనాధ్యేతవ్య,, యనిశ్రవణములేని యెడల అధ్యయన సామగ్ర్యముసంభవింపదు.

౧౦౪. స్మృతేశ్చ.

స్మృతేశ్చ-స్మృతులవలన తెలియబడుచున్నది.

అ.—స్మృతులయందు శూద్రునకు వేదమువినడమువలన దండనగలుగునని ‹‹అథహాస్య వేదముప శృణ్వతః త్రపుజతుభ్యాం శ్రోత్రప్రతి పూరణముదాహరణే జిహ్వాచ్ఛేదో ధారణేశరీరభేద,, యనిచెప్పబడును.

ప్రసంగమువలన సంభవించినప్రసక్తిని ముగించి ప్రకృతమందు పరిసమాప్తినిపొందించుచున్నారు.

అ.—సం॥ రైక్వునివలన జానశ్రుతుని శూద్రాయని పిలవబడి వానికొఱకు బ్రహ్మవిద్యను యుపదిష్టత్వమువలనశూద్రులకుబ్రహ్మవిద్యయందధికారముకలదనిశంకించి-శూద్రశబ్దము [illegible]

చిత్పృవాచ్యమైనందుచేత శూద్రాదులకుఅధ్యయన నిషేధమువలన సామర్థ్యాభావముకలిగినందున శూద్రాదులకధికారములేదు.

ప్రమితాధికరణ శేషము.

౧౦౫. కంపనాత్.

అ.—కంపనాత్ - అగ్నివాయుసూర్య ప్రభృతులకు భయముండుటవలన.

అంగుష్ఠ ప్రమిత ప్రకరణముయొక్క మధ్యమందు "యదిదంకిఞ్చ జగత్సర్వం ప్రాణఏజతినిస్సృతమ్। మహద్భయంవజ్రముద్యతం "భయాదస్యాగ్నిస్తపతి,, ఇత్యాదులందు ప్రాణశబ్దనిర్దిష్టుండైన అంగుష్ఠ ప్రమితునివలనపుట్టినభయ నిమిత్తమునుంచిఅగ్నివాయుసూర్యులు మొదలైనసమస్తజగముయొక్క కంపనము వినబడుటవలనఅంగుష్ఠ ప్రమితుడైన పురుషుడుపరమాత్మయని నిశ్చయింపబడుచున్నది.

తా.—ప్రాణశబ్దనిర్దిష్టుండైనపరమాత్మవలన అగ్నివాయుసూర్యప్రభృతులగుజగత్తుకుభయముశ్రుతమాటచేతఅంగుష్ఠప్రమితుడుపరమాత్మ.

౧౦౬. జ్యోతిర్దర్శనాత్.

అ.—జ్యోతిః - పరంజ్యోతియొక్క-దర్శనాత్ - దర్శనమువలనఅంగుష్ఠప్రమితుండుబ్రహ్మను.

ఈప్రకరణమందంగుష్ఠప్రమితపురుషుని సంభన్ధిత్వము వలన,, "నతత్ర సూర్యోభాతి,, యని యారంభించి "తస్యభాసా సర్వమిదంవిభాతి,, యనువరకుసమస్తతేజస్సులనాచ్ఛాదనముచేయుననియు-'అనవధికాతిశయమైనభాశ్శబ్దముచేత చెప్పబడినబ్రహ్మస్వరూప జ్యోతిస్సుకు చూడడముండుటవలన అఙ్గుష్ఠప్రమితుడు పరమాత్మ.

తా.— పరంజ్యోతి దర్శనమువలననంగుష్ఠప్రమితుడుపరమాత్మ.

౨౭. అర్థాన్తర త్వాది వ్యపదేశాధికరణము.

౧౦౭. ఆకాశోర్థాన్తర త్వాది వ్యపదేశాత్.

అ.—ఆకాశః-ఆకాశశబ్దవాచ్యుడుపరమాత్మ-అర్థాన్తరత్వాత్-జీవునియందులేని నామరూపనిర్వాహత్వమును - వ్యపదేశాత్ - చెప్పుటవలన అర్థాన్తరభూతుడగు పరమాత్మేగావలెను.

ప్రత్యగాత్మ కర్థాన్తర భూతుండైనపరమాత్మే నామరూపములకునిర్వాహకుడు- బద్ధావస్థగలజీవుడునామరూపములచేత స్పృశింపబడినవాడును - నామరూపములకుపరవశుడగనుకనిర్వాహకుడుకాడు-ముక్తజీవునకజగత్సృష్ట్యాదులు లేనిదానివలననిర్వాహత్వముసంభవింపదు - ఆదిశబ్దముచేతబ్రహ్మత్వఅమృతత్వాదులు

మొదలైన గుణములకు సంగ్రహముగానైననిరుపాధికములైన గుణములు ముక్తునికిసంభవింపదు.

ఛాన్దోగ్యోపనిషత్తందు ‘‘ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా తేయదన్తరా తద్బ్రహ్మ తదమృతంసఆత్మ,, యనిఆకాశ శబ్దముచేత చెప్పబడినవస్తువుముక్తాత్మా-పరమాత్మా-యనిసంశయము.

ముక్తుండనిపూర్వపక్షము- ఉత్తర వాక్యమందు ‘‘ధూత్వా శరీరమకృతంకృతాత్మా బ్రహ్మలోకమభిసంభవామి,, యని ముక్తునికి అనన్తరశ్రవణముండుటవలననని చెప్పుదురు.

సిద్ధాన్తము. ‘‘నామరూపయోర్నిర్వహితా తేయదన్తర,, యని స్వయమస్పృష్ట నామ రూపము గలదై నామరూపములకు నిర్వాహకముగా వినబడు-ఆకాశ శబ్దము బద్ధముక్తులని రెండవస్థలుగలజీవునికినర్థాన్తర భూతుడైన పరమాత్మనే బోధించును.

తా.—నామరూప నిర్వాహకత్వమువలన నర్థాన్తరత్వము చెప్పుటచే ఆకాశశబ్దవాచ్యుండు పరబ్రహ్మ.

తత్త్వమస్యాది వాక్యములచేత నైక్యము చెప్పుట వలన ‘‘నేహనానాస్తి,, యని భేదము నిషేధించుటచేత ప్రత్యగాత్మకుఅర్థాన్తర భూతుడుపరమాత్మ కాదని యాక్షేపించుకొని సమాధానము చెప్పుచున్నారు.

౧౦౮. సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన.

అ.—సుషుప్త్యుత్క్రాన్త్యోః - సుషుప్తి-యుత్క్రాంతులయొక్క - భేదేన-భేదము-వ్యపదేశాత్ చెప్పుటచేత.

‘ప్రాజ్ఞేనాత్మనాసంపరిష్వక్తః, ‘‘ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢ,, యని సుషుప్త్యుత్క్రాన్త్యాదులచేలుప్తమైన సకలవిశేషవిజ్ఞానముగల ప్రత్యగాత్మకంటే యాకాలమందు సర్వజ్ఞత్వముచే భేదముచెప్పుటవలన ప్రత్యగాత్మకర్థాన్తరభూతుడైన పరమాత్మే యౌను.

తా.—సుషుప్తియుత్క్రాంతులనెడియవస్థలందులుప్తవిజ్ఞానముకల జీవునికంటె సర్వజ్ఞత్వభేదము చెప్పుటవలన అర్థాన్తరభూతుడు పరమాత్మే గావలెను.

౧౨౯. పత్యాదిశబ్దేభ్యః.

అ.—పత్యాదిశబ్దేభ్యః- సర్వస్యవశీయనెడిపతిశబ్దములవలన.

పరిష్వఙ్గకుడైన ప్రాజ్ఞునకు వినబడుచుండెడి పత్యాదిశబ్దములకర్థమునీప్రత్యగాత్మకర్థాన్తర భూతుండైన పరమాత్మ ‘‘సర్వస్యాధిపతిస్సర్వస్యవశీసర్వస్యేశాన,, యనే యిత్యాదులలో ఐక్యోపదేశభేద నిషేధమందు బ్రహ్మయొక్క కార్యత్వ నిబంధన

మని ''తజ్జలానితి సర్వం ఖల్విదం బ్రహ్మ,, యనే శ్రుతులచేత నీయర్థము వ్యక్తమౌను.

అ.—సం॥ ''ఆకాశోహవై నామరూప యోర్నిర్వహితా,, ఇత్యాదిఛాందోగ్యవాక్యమందు శ్రుతుడైన నాకాశశబ్దవాచ్యుండు ముక్తాత్ముడై యుండవలెను ''అశ్వ ఇవరోమాణి విధూయ పాపమ్,, ఇత్యాద్యనన్తరవాక్యమందుముక్తుడు ప్రకృతుడైనందువలన-ముక్తునికిని పూర్వావస్థయందుకర్మకృత నామరూప నిర్వాహము కూడుననిశంకించి-సకలజగన్నిర్మాణదురంధరుండైన పరమాత్మకే నామరూపనిర్వోఢృత్వము శ్రుతిశతసమధిగతమౌటచేత ''బ్రహ్మలోకమభిసంభవాని,, యని బ్రహ్మలోక శబ్దవాచ్యుడైనపరమాత్మయనుఅనన్తరప్రకృతుడైనందుచేనాకాశశబ్దనిర్దిష్టుడు జీవుడుగాడు - పరమాత్మయనిసిద్ధాన్తము.

సర్వాత్మత్వ ప్రకాశమందు హేయాస్పృష్టత్వము - నిరతిశయానందయోగము- ఇవియుసర్వాత్మత్వప్రకారమే-ప్రశాసితృత్వము- ముక్తప్రాప్యత్వము-నిరతిశయభోగ్యగుణత్వము-తల్లివలెఅన్తర్వర్తియైనయెంబెరుమానుకుజుగుప్సలేనందున పితృవలెశిక్షకత్వేనభయహేతుత్వము - అధికారానధికారనుప్రాసంగికము- సుషుప్త్యాదిసర్వావస్థలందును పరమాత్మసబంధముప్రోక్తము.

తృతీయపాదము ముగిసెను.

ప్రథమాధ్యాయము-చతుర్థపాదము.

౨౮. అనుమానాధికరణము.

౧౧౦. అనుమానికమప్యేకేషామితిచేన్న శరీరరూపకవిన్యస్తగృహీతేదర్శయతిచ.

అ.—అనుమానికమపి- ప్రధానమును-ఏకేషాం-కఠవల్లీయుపనిషత్తుందు - ఇతిచేత్ - కారణమనిచెప్పబడుచున్నదంటె-న - కాదు - శరీరరూపక - రథిరథభేదనుచేతచెప్పబడినశరీరము - గృహీతేహి - గ్రహణముగచా - దర్శయతిచ - కొన్నిశ్రుతులునీయర్థమునేచూపుచున్నవి.

కఠవల్లియుపనిషత్తందు ''ఇంద్రియేభ్యఃపరాహ్యర్థా అర్థేభ్యశ్చపరం మనః । మనసశ్చ పరాబుద్ధిర్బుద్ధేరాత్మామహాన్పరః । మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః । పురుషాన్నపరం కిఞ్చిత్సా కాష్ఠాసాపరాగతి,, యనిఇందు చెప్పబడినసాఙ్ఖ్యోక్తమైన ప్రధానశబ్ద మవ్యక్త బోధకమా-కాదాయని సంశయము - ప్రధానమనిపూర్వపక్షము ''మహతఃపర,, యనేఆయాయితంత్రప్రక్రియచేతప్ర

ధానమని తెలియ బడుచున్నది ‘‘పురుషాన్న పరం కిఞ్చిత్,, యని పంచ వింశకుండైన పురుషునికంటెనతిరిక్తమైన తత్త్వమును నిషేధించుటవలన.

సిద్ధాన్తము - ఈస్థలమందుఅవ్యక్తశబ్దముచేత ప్రధానము గ్రహింపబడ నేరదు - పూర్వ ప్రక్రియయందు ‘‘ఆత్మానం రథినంవిద్ధి శరీరంరథమేవచ,, ఇత్యాదుల యందు నుపాసన పరిసమాప్తికొరకు నింద్రియవశ్యత్వ సంపాదన గురించి ఏఆత్మ-శరీర-బుద్ధి-సారథి- పగ్గములు-గుఱ్ఱములుయని నిరూపణము చేయబడినవో నా వశీకృతమందు నాసక్తములని ‘‘ఇంద్రియేభ్యః పరా,, ఇత్యాదులలో చెప్పబడుచున్నది.

అక్కడ ఇంద్రియాదులు స్వశబ్దముచేత నే గ్రహింపబడుచున్నది - రథత్వముచేత చెప్పబడిన శరీర మిక్కడలవ్యక్త పరిణామము గనుకఅవ్యక్త శబ్దముచేత గ్రహింప బడుచున్నది. ఇచ్చటనైతే తంత్ర ప్రక్రియా ప్రత్యభిజ్ఞానగంధము సంభవింపదు ‘‘అవ్యక్తాత్పురుషః పర,, యని పంచవింశకుండైన పురుషుండు చెప్పబడదు-ప్రాప్యుండైన పరమాత్మే చెప్పబడును- అన్తర్యామిచే చెప్పుటవలననుపాసనకునుపాయభూతుడని యిచ్చట నాపరబ్రహ్మ వశీకరణమందు పరాకాష్ఠగా ‘‘పురుషాన్న పరం కిఞ్చిత్,, యని చెప్పబడినది.

సూత్రార్థము-ఏకేషాం - కఠవల్లియుపనిషత్తందు ననుమాన గమ్యమైన ప్రధానము జగత్కారణత్వముచేత ‘‘మహతః పరమవ్యక్తమ్,, యని చెప్పబడెనదని చెప్పకూడదు - అవ్యక్తశబ్దముచేత శరీరాఖ్యరూపక విన్యస్తముయొక్క గ్రహణము చేయబడును.

పూర్వము ఆత్మాదులందు రథిరథాదుల రూపంబుగ చెప్పబడిన రథముగాని రూపితమైనశరీరమునకునిచ్చటనవ్యక్తశబ్దముచేత గ్రహణమనియర్థము-గనుకవశీకరణ మందాసక్తములనియిచ్చట చెప్పబడుచున్నది.

తా.—కఠవల్లి శ్రుతియందు జగత్కారణమని చెప్పంబడుప్రకృతిరథరూపముగా చెప్పినశరీరమునకు నర్థమని ప్రతిపాదించుచున్నది.

ఈయర్థమును మరియొక వాక్యమందు చెప్పుచున్నది ఇంద్రియాదుల యొక్కనియమనక్రమమునుప్రతిపాదనచేయుచుండే ‘‘యచ్ఛేద్వాఙ్మనసీ,, ఇత్యాదులు. అవ్యక్తశబ్దమునకు శరీరమేప్రకారమర్థమౌననిన నాశంకనుపరిహరించుచున్నారు.

౧౧౧. సూక్ష్మంతుతదర్హత్వాత్.

అ.—సూక్ష్మంతు- అవ్యక్తమేశ

రీరమగుచున్నది, తదర్హత్వాత్ - కార్యమునకు యోగ్యత్వముండుటవలన. తుశబ్దము- అవధారణార్థకము, సూక్ష్మం-అవ్యక్తమే, అవస్థాంతరముతో కూడినశరీరమగుచున్నది - సూక్ష్మావస్థవిశిష్టమునకె-తదర్హత్వాత్, కార్యమునకు యోగ్యత్వముండుటవలనయని భావము.

తా.—— అవ్యక్తమేయవస్థాంతరముతో గూడిశరీరమై కార్యమునకు యోగ్యమగును.

రూపకాలంకారంబుగా చెప్పబడినయాత్మాదులను స్వాధీనపరచుకోవడమందుపరములై ‹‹ఇంద్రియేభ్యః పరా,, యని యెప్పుడు గ్రహింపబడుచున్నదో యప్పుడు ‹‹అవ్యక్తాత్పురుషః పరః పురుషాన్నపరం కించిత్,, యనిపురుషగ్రహణమెందుకనిన చెప్పుచున్నారు.

౧౧౨. తదధీనత్వాదర్థవత్.

అ.——తత్ - ఆబ్రహ్మకు, అధీనత్వాత్- అధీనమగుటవలన, అర్థవత్- ప్రయోజనముకలిగినదగును.

అంతర్యామిరూపంబులచేత నుండెడిపురుషునికిస్వాధీనమగుటవలనరథికత్వాకారముచేనిరూపణచేయబడిన సమస్తాత్మాదులు అర్థవతు ప్రయోజనముకలిగినదగును.

ఆకారణమువలన నుపాసనాంతమందువశీకార్యకాష్ఠపరమపురుషుడై నందున నిచ్చటరూపక విన్యస్తవస్తువులు గ్రహింపబడిన దగుచునుండగా పరమపురుషునికి గ్రహణము భాష్యప్రక్రియచేతనైన నీసూత్రార్థము నిష్కర్ష చేయతగినది. పరమపురుష శరీరతయా పరమపురుషాధీనత్వ ముండుటవలన భూతసూక్ష్మమైన అవ్యాకృతము ప్రయోజనముకలిగినదని యావస్తు విచ్చటయవ్యక్త శబ్దముచేత గ్రహింపబడుచున్నది అబ్రహ్మాత్మకతంత్రసిద్ధమైన స్వనిష్ఠను గ్రహింపబడదు.

తా.——అంతర్యామిరూపమైనపరమాత్మకు సర్వజగత్తు స్వాధీనమగుటవలన ఆత్మాదులు ప్రయోజనముగలదగును.

౧౧౩. జ్ఞేయత్వావచనాచ్చ.

అ.—— జ్ఞేయత్వ - తెలియుటకు యోగ్యమని, అవచనాచ్చ-చెప్పకపోవుటవలన.

తంత్రసిద్ధమైనయర్థమిక్కడ నంగీకరింపబడిన దైతేయప్పుడవ్యక్తమునకు జ్ఞేయత్వముచెప్పదగినది ‹‹వ్యక్తావ్యక్తజ్ఞ విజ్ఞానాత్,, వ్యక్తావ్యక్తవిజ్ఞానమువలన నాప్రక్రియయుండును ఆయవ్యక్తమిచ్చట తెలియుటకునర్హముకాదుగనుక ఆయవ్యక్తప్రక్రియ గంధంబిచ్చటసంభవింపదు.

తా.—— శ్రుతియందువ్యక్తావ్యక్త

ములు తెలియుటకో అవ్యక్తమును చెప్పడమే గాని యాయవ్యక్త మిక్కడ తెలుసుకోతగినదిగా చెప్పలేదు.

౧౧౪. వదతీతిచేన్న ప్రాజ్ఞోహి ప్రకరణాత్.

అ.—వదతీతిచేత్ - ప్రధానమునకు జ్ఞేయత్వము చెప్పుచున్నదనియంటేన - కాదని, ప్రకరణాత్ - ప్రకరణమువలన, ప్రాజ్ఞోహి - బ్రహ్మనే చెప్పును.

"అశబ్దమస్పర్శ" యనియారంభించి "మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే" యనేవరకు ప్రధానమునకు జ్ఞేయత్వము తత్రత్ర చెప్పబడుచున్నదనిన నటుల చెప్పకూడదు అశబ్దమస్పర్శయని ప్రాజ్ఞుడైనపరబ్రహ్మమే యిచ్చట చెప్పబడును "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదమ్" "ఏషసర్వేషుభూతేషుగూఢోత్మా న ప్రకాశత" యని ప్రాజ్ఞునికే ప్రకృతత్వముండుటవలనని తెలియవలయు.

తా.—అశబ్దమస్పర్శమనే శ్రుతులు చెప్పుచున్నవనిన నటుల చెప్పగూడదు ప్రకృతమైన ప్రస్తావమువలన పరమపురుషుడని దృఢము చేయబడినది.

౧౧౫. త్రయాణామేవచైవ ముపన్యాసః ప్రశ్నశ్చ.

అ.—త్రయాణాం - పరమపురుషుడు, అతనిపుపాసన- ఉపాసకుడు, ఈమూటికి- ఏవం, జ్ఞేయమని - ఉపన్యాసప్రశ్నశ్చ- ఉపన్యాసప్రశ్నములందు చెప్పబడును.

ఈప్రకరణమందు "యేయం ప్రేతేవి చికిత్సా మనుష్యే" అనియుపక్రమించి పరిసమాప్తివరకు పరమపురుషుడు అతనియుపాసన ఉపాసకుడు ఈ మూటిని నీప్రకారంబుగ తెలుసుకోవలెనని యుపన్యాసమును చేయబడియున్నది ఆప్రకారమే ప్రశ్నయును చూడబడియున్నది తంత్రసిద్ధమయిన ప్రధానమునకు సంగతి లేదు గనుక ప్రధానమిచ్చట జ్ఞేయత్వార్హముగా చెప్పబడలేదు.

౧౧౬. మహద్వచ్చ.

అ.—మహద్వచ్చ-మహచ్ఛబ్దమువలన మహత్తత్వము గ్రహింపబడదు.

ఏప్రకారము "బుద్ధేరాత్మా మహాన్పర" యనిఆత్మశబ్దసామానాధికరణ్యమువలనమహచ్ఛబ్దముచేత తాంత్రికమైనమహత్తత్వము గ్రహింపబడదో యటువలెయవ్యక్తశబ్దముచేత తాంత్రికమైన ప్రధానము గ్రహింపబడనేరదు.

తా.— ఏప్రకారముగా మహచ్ఛబ్దముచేత మహత్తత్వము గ్రహింపబడదో ఆప్రకారమవ్యక్తశబ్దముచేత ప్రధానముగ్రహింపబడదు.

అ.—సం॥జగత్తు యొక్క-అతధీనత్వము ‹‹తదధీనత్వాదర్థవత్,, యను సూత్రమందు బ్రహ్మాత్మకత్వముజగత్తుకుసాధించుటచేత- నిరస్తమైనది.

౨౯. చమసాధికరణము.

౧౧౭. చమసవదవిశేషాత్.

అ.—చమసవత్-చమసమువలెనే-అవిశేషాత్-విశేషములేకపోవుటవలన.

శ్వేతాశ్వతరమందు ‹‹అజామేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీః ప్రజాస్సృజమానాం సరూపాః । అజోహ్యేకోజుష మాణోను శేతే జహాత్యేనాం భుక్త భోగామజోన్య,, యనినిచ్చట అజాశబ్దముచేత తంత్రసిద్ధమైన ప్రకృతిని చెప్పబడుచున్నదా-బ్రహ్మాత్మికమైనప్రకృతిని చెప్పుచున్నదా-యనిసంశయము.

తంత్రసిద్ధమేయని పూర్వపక్షము ‹‹అజామేకాం,, యనుటవలన అకార్యత్వప్రతీతియనేక ప్రజలకుస్వాతంత్రముచేత కారణమువినబడుటవలన.

సిద్ధాన్తము - ఇచ్చటతంత్రసిద్ధమైనప్రకృతికి గ్రహణములేదు - యుక్తివిరహ శ్రవణమాత్రముచేతతంత్రసిద్ధప్రతీతికినియమములేదు- లోకమందుయౌగికములైన శబ్దములకువిశేష్యవ్యవస్థాపకములైనయర్థప్రకరణాదులు వినావిశేషమందు శక్తిజ్ఞానము పుట్టదు- మరియునిస్వాతన్త్రేణసృష్టిహేతుత్వమిచ్చట చెప్పబడియుండలేదు-మరేమనినసృష్టి హేతుత్వమాత్రమే చెప్పబడును - ఆకారణత్వము బ్రహ్మాత్మికమైనప్రకృతికి విరుద్ధముకాదు ఈయంశమందు బ్రహ్మాత్మకమైనదాని కేశాఖాన్తర సిద్ధమందు ఏతత్సరూపమంత్రంబునందుత్పన్నమైన ప్రకృతికిప్రత్యభిజ్ఞ చేత బ్రహ్మాత్మకమని నిశ్చయింపబడుచున్నది.

సూత్రార్థము - ఈయజాశబ్దము తంత్రసిద్ధమైన ప్రధానవిషయముగాదు- ఎందువలనంటె - చమసవదవిశేషాత్- ఏప్రకారము ‹‹అర్వాగ్బిలశ్చమస,, యనేమంత్రమందు చమనసాధనత్వయోగముచే ప్రవృత్తమైనచమసశబ్దమునకు శిరస్సందు బోధకత్వముచేత ‹‹యదేదంతచ్ఛిర ఏషహ్యర్వాగ్బిలశ్చమస,, అనేవాక్య శేషమందెటుల విశేషముచూడ బడుచున్నదో అదేప్రకారను - ‹అజామేకామ్, యనే అజాశబ్దమునకుతంత్రసిద్ధమైన ప్రధానమందుశక్తి చెప్పడమువిశేషముగాదుగనుకతద్గ్రహణము న్యాయముకాదు.

బ్రహ్మాత్మకమైన ప్రకృతి గ్రహణమందువిశేషమున్నదని వక్కాణించెదరు.

౧౧౮. జ్యోతిరు పక్రమాతుతథాహ్యధీయతఏకే.

అ.—జ్యోతిః - బ్రహ్మ- ఉపక్రమాత్-కారణమని- తథా- ఆప్రకారమే-ఏకే-కొన్నిశాఖలు- అధీయతే-ప్రతిపాదింపుచున్నది.

జ్యోతిః-బ్రహ్మ-యస్యాః - ఏమిటికి-ఉప్రక్రమః-కారణమో-సా - అది-జ్యోతిరుపక్రమయని పించుకొనును తుశబ్దము-అవధారణార్థము- బ్రహ్మమే కారణముగా గల ఈ అజశబ్దవాచ్యము (తథాహ్యధీయతఏకే) ఏమంత్రమునందెట్టిరూపనుఅజకుప్రతిపాదించబడినదోయామంత్రమందే నారూపముగల బ్రహ్మాత్మకమైన ఆఅజకుప్రతిపాదనమనికొన్నిశాఖలు చెప్పచున్నవి. ‘‘అణోరణీయాన్మహతో మహీయాన్,, యనిబ్రహ్మను ప్రతిపాదించి ‘‘సప్త ప్రాణాః ప్రభవన్తితస్మాత్సప్తార్చిషస్సమిధస్సప్తజిహ్వాః। సప్తేమేలోకాయేషుచరన్తి ప్రాణాగుహాశయానిహితాసప్తసప్త। అతస్సముద్రాగిర యశ్చసర్వ,, ఇత్యాదులందు బ్రహ్మవలన పుట్టేటట్టుగాబ్రహ్మాత్మకత్వముచేత సమస్తజనుల యనుసంధానా చరణకాలమందు ‘‘అజామేకాంలోహిత శుక్లకృష్ణాం బహ్వీంప్రజాం జనయంతీం స్వరూపామ్,, యని ప్రతిపాద్య మానమైన బ్రహ్మాత్మకమే- యనిదానిప్రత్యభిజ్ఞవలననిచ్చట బ్రహ్మాత్మకమైనదే అజయని నిశ్చయింపబడుచున్నది.

అజాత్వము-జ్యోతిస్సు వలనఉత్పత్తి- ఈరెండు ఏప్రకారములుపపన్నమనిన చెప్పుచున్నారు.

౧౧౯. కల్పనోపదేశాచ్చ మధ్వాదివదవిరోధః.

కల్పన-సృష్టియొక్క - ఉపదేశాత్-ఉపదేశమువలన - మధ్వాదివత్-సూర్యునివలెనె- అవిరోధః - విరోధములేదు.

కల్పన - అనగాసృష్టి ‘‘సూర్యాచంద్రమసౌధాతాయథా పూర్వమకల్పయత్,, ఇత్యాదిదర్శనము వలన ‘‘అస్మాన్మాయీసృజతే విశ్వమేతత్,, యనియిచ్చటగదా సృష్టినియుపదేశింపుచున్నది.

ప్రళయవేళయందీ ప్రకృతి పరమపురుషదేయాశ్రయముగా గలిగినదై కారణావస్థయందతి సూక్ష్మమైన శక్తిరూపముచేతనుండును- ఆయవస్థాభిప్రాయముచేత దీనికి అజాత్వముండును. సృష్టివేళయందు తిరిగితచ్ఛరీరమువలన బ్రహ్మకుస్థూలావస్థపుట్టును ఆయవస్థజ్యోతిరుపక్రమాయని చెప్పటకునేవిరోధములేదు - (మధ్వాదివత్) ఏప్రకారము ఆదిత్యునొక్కనికే కార్యావస్థయందు ‘‘అసౌవా ఆదిత్యోదేవమధు,, వనివస్వాది దేవతుల యనుభవమునకు యోగ్యమైనరసము

కాధారమౌటవలన మధుత్వమతనికే ‘‘అథతతఊర్ధ్వ ఉదేత్యా నైవోదేతా నాస్తమేతై కల ఏవమధ్యేస్థాత్,, ఇత్యాదులలో నామరూప త్యాగము చేత కారణావస్థయందు సూక్ష్మమేకమునకేస్థితి యేప్రకారము విరుద్ధము కాదో యాప్రకారమని తెలియదగినది

అ.—సం॥ ‘‘అజాంమేకాం లోహితశుక్లకృష్ణామ్,, ఇత్యాది శ్వేతాశ్వతరమందుజగత్తుకు అబ్రహ్మకార్యత్వముతోచుచున్నదనిశంకించి తైత్తిరీయమందు ‘‘అజామేకామ్,, ఇత్యాది వాక్యాను గుణ్యేనబ్రహ్మకార్యత్వమునుసాధించి అతత్కార్యమును నిరసించిరి.

౩౦. సఙ్ఖ్యోపసఙ్గ్రహాధికరణము.

౧౨౦. నసఙ్ఖ్యోపసఙ్గ్రహాదపినానాభావాదతిరేకాచ్చ.

అ.— సంఖ్య - సంఖ్యయొక్క, ఉపసంగ్రహాదపి-ఉపసంగ్రహముండినను, న-తాంత్రికములుకావు, నానాభావాత్-పృథక్త్వమువలన, అతిరేకాచ్చ - తత్వాతిరేకముయొక్క ప్రతీతివలన.

వాజసనేయకమందు ‘‘యస్మిన్పంచపంచజనా ఆకాశశ్చప్రతిష్ఠితఃతమేవంమన్యఆత్మానంవిద్వాన్బ్రహ్మామృతోమృతమ్,, యనినిచ్చట సాంఖ్యులచేతచెప్పబడిన పంచవింశతి తత్వములు ప్రతిపాదింపబడుచున్నదా లేదా యనిసంశయము.

అదేయనిపూర్వపక్షము ‘‘పంచపంచజనా,, యనిగదా పంచసంఖ్యావిశిష్టమైనపంచజనులనిపంచవింశతి యనిలబ్ధమౌను. యెటులనిన పంచజనా యనెడి సమాహారవిషయక సమాసము పంచపూల్యః యనినటువలె.

పఞ్చభిర్జనైరారబ్ధసమూహః, యను సమాసముచేత పఞ్చజనీయనిఅర్థము లింగవ్యత్యయ ఛాందసము - పఞ్చజనాయని బహువచనముండుట వలన సమూహబహుత్వమవగతమౌచున్నది - అవియెన్నియనిశంకగలిగిన పక్షమందుశబ్దపంచక విశేషితములైన పఞ్చవింశతితత్వములౌను - గనుకమోక్షాధికారమువలన తాంత్రికములని నిశ్చయింపబడుచున్నవి.

ఈప్రకారముగా నిశ్చయానంతరమందు ‘‘తమేవం మన్యఆత్మానం విద్వాన్బ్రహ్మామృతోమృతమ్,, యని పంచవింశకుండైనబ్రహ్మభూతాత్మను తెలిసినవిద్వాంసుడుముక్తుడౌనని పూర్వపక్షము.

సిద్ధాంతము. ‘‘యస్మిన్పంచపంచజనాఆకాశశ్చప్రతిష్ఠిత,, యనియచ్ఛబ్దముచేతనిర్దిష్టమైనబ్రహ్మాధారత్వమువలన ఆఆధేయములైన తత్వములకు బ్రహ్మాత్మకత్వము తెలియబడును ఆయ

చ్ఛబ్దనిర్దిష్టవస్తువను "తమేవమన్య ఆత్మానమ్," యనితచ్ఛబ్దముచేత పరామర్శచేసి "బ్రహ్మామృతమ్," యని నిర్దేశముండుట వలన బ్రహ్మమని నిశ్చయింపబడుతున్నదిగనుక తాంత్రికప్రసంగముకాదు.

సూత్రార్థము. "పఞ్చ పఞ్చజనా," యనుచోటు పఞ్చవింశతి సంఖ్యచేత సంగ్రహించుట వలన ఈతత్వములు తాంత్రికములుకావు - యస్మిౝ యని యచ్ఛబ్దముచేతనిర్దిష్టమైన బ్రహ్మాధారకతయా తాంత్రికములు నానాభావమాటవలన నీతత్వములకు పృథగ్భావమనియర్థము (అతిరేకాచ్చ) తాంత్రికములకంటె తత్వాతిరేకముయొక్క ప్రతీతివలనయస్మిౝ అనిచెప్పబడినతిరిక్తమైనయాకాశము - నసఙ్ఖ్యోపసంగ్రహాదపియని అపిశబ్దముచేత సఙ్ఖ్యోపసంగ్రహముకానేరదు - ఆకాశమునకు భిన్నముగానుండుటవలన-గనుక పఞ్చజనాయనేవాక్యము సమాహారవిషయముకాదు - మరేమనిన "దిక్సఙ్ఖ్యే సంజ్ఞాయామ్," అని సంజ్ఞావిషయము. పఞ్చజన సంజ్ఞితములైనవికొన్ని- అవిపఞ్చయని వ్యవహరింపబడును. సప్తసప్తఋషులన్నట్టువలెనె.

౧.౨౧. ప్రాణాదయో వాక్యశేషాత్.

అ.—వాక్యశేషాత్ - మరియొక వాక్య శేషమువలన - ప్రాణాదయః పంచజన సంజ్ఞకములైన ప్రాణాదులనిచెప్పబడినది.

పఞ్చజనసంజ్ఞికములైన అయిదు పదార్థములు ప్రాణాదులని వాక్యశేషమువలన తెలియబడుచున్నది "ప్రాణస్య ప్రాణముతచక్షుషశ్చక్షుః శ్రోత్రస్య శ్రోత్రమన్నస్యాన్నం మనసోయేమనోవిదుః," యని. బ్రహ్మాత్మకమైనయింద్రియములు పఞ్చపఞ్చజనాయని నిర్దిష్టములైనవి ఉత్పత్తివలనజనాశబ్దమైనది. కాణ్వపాఠమందుఅన్నరహితములైన నాలుగు వస్తువులేయనినిర్దేశముచేయుటవలన పఞ్చజనసంజ్ఞలుగలయింద్రియములనియేప్రకారము తెలియబడుచున్నదనిన - చెప్పుచున్నారు.

౧.౨.౨. జ్యోతిషైకేషామసత్యన్నే.

అ.—ఏకేషాం - కణ్వాదులయొక్క-వాక్యశేషమందు-అన్నే - అన్నశబ్దము-అసతి- లేకపోయినను- జ్యోతిః- జ్యోతిశ్శబ్దార్థము ఇంద్రియములు.

ఏకేషాం కాణ్వాదుల వాక్యశేషమందుఅన్నశబ్దము లేకపోయినప్పటికి వాక్యోపక్రమముపొందిన "తందేవా జ్యోతిషాంజ్యోతిః," యని జ్యోతిశ్శబ్దముచేత పఞ్చజనులనగా ఇంద్రియములని తెలియబడుచున్నవి ఎట్లనిన. జ్యోతిషాం జ్యోతిషియని బ్రహ్మమందు ని

ర్దేశముచేయడము ప్రకాశక వస్తువుల కుప్రకాశకుడు బ్రహ్మయని ప్రతీతిలో చుచున్నది. ప్రకాశక వస్తువు లేవియని ''పఞ్చపఞ్చజనా,, యని తెలియబడని విశేషముగల పఞ్చ సంజ్ఞ చేత యెంచబడిన ప్రకాశక పఞ్చేన్ద్రియములని తెలియ బడుచున్నవి. గనుక ''యస్మిన్పఞ్చ పఞ్చ జనా ఆకాశశ్చ ప్రతిష్ఠిత,, ఇంద్రియములు భూతములుబ్రహ్మయందు ప్రతిష్ఠితములు, తాంత్రికత్వగంధముకాదు.

తా.—— అన్నశబ్దము లేకపోయినను జ్యోతిశ్శబ్దార్థ మింద్రియములని కణ్వుల వాక్య శేషము అనగా నింద్రియములు భూతములు బ్రహ్మయందుప్రతిష్ఠితములు గనుక ప్రకృతికి సంబంధములేదు.

అ.——సం॥ ''యస్మిన్పఞ్చ పఞ్చ జనాః,, ఇత్యాది వాక్యములలో చెప్పేప్రకారము, సాఙ్ఖ్య ప్రక్రియచేత జగత్తుఅబ్రహ్మాత్మకమని శంకించి బ్రహ్మాత్మకత్వమును జగత్తుకు సాధించి అతదాత్మకత్వమునునిరసించిరి.

3౧. కారణత్వాధికరణము.

౧౨3. కారణత్వేన చాకాశాదిషుయథావ్యపదిష్టోక్తేః.

అ.—— ఆకాశాదిషు-ఆకాశాదులయందు కారణత్వేన- కారణత్వముచేత చెప్పుటవలన- యథావ్యపదిష్ట సర్వజ్ఞత్వ గుణములచేత చెప్పబడిన ప్రకారమే-ఉక్తేః-చెప్పడమువలన.

జగత్కారణత్వము చెప్పుచునుండెడివేదాంతవాక్యములు ప్రధానకారణత్వవాదమే పర్యవసానముగాగలిగినదా లేకబ్రహ్మ కారణత్వవాదమే పర్యవసానము గలిగినదాయని సంశయము. ప్రధానకారణత్వ వాదమేపర్యవసానముగలిగినదని. పూర్వపక్షము''సదేవసోమ్యేదమగ్రఆసీత్,,యని ఒక స్థలమందు సద్వస్తు పూర్వకంబుగా సృష్టివినబడుచున్నది. మరొకచోట''అసదేవేదమగ్రఆసీత్,, ''అసద్వాఇదమగ్ర ఆసీత్,, అటువలెనె ''తద్ధేదంతర్హ్య వ్యాకృత మాసీత్తన్నామ రూపాభ్యాం వ్యాక్రియత,, యనిఅవ్యాకృతమువలనసృష్టివినబడుచున్నది. అవ్యాకృతమనగా ప్రధానము-గనుక ప్రధానమునకు కారణత్వమునిశ్చయమౌటవలన అదేముఖ్యప్రయోజనమని.

సిద్ధాన్తము ''సత్యంజ్ఞానమనన్తం బ్రహ్మ,, యని యుపక్రమించి ''తస్మాద్వాఏతస్మాదాత్మనఆకాశస్సంభూతః,, తదైక్షత బహుస్స్యాం ప్రజాయేయేతితత్తేజోऽసృజత,, ఇత్యాదులలోసర్వజ్ఞుండైనపరబ్రహ్మకే కారణత్వము ప్రతిపాదనము చేసుటవలననాబ్రహ్మమునకే కారణావస్థయం

దునామరూప విభాగములకు సంబంధముగానుండక పోవుట వలన అసదవ్యాకృతాది శబ్దములచేత బ్రహ్మమె చెప్పబడునని బ్రహ్మకారణ వాదమే ముఖ్యప్రయోజనము.

సూత్రార్థము. ఆకాశాదిపద చిహ్నములచే కూడియుండెడి ‟తస్మాద్వాఏతస్మాదాత్మన ఆకాశస్సంభూత„ ఇత్యాదివాక్యమందు సర్వజ్ఞుండైనపరబ్రహ్మకే కారణత్వముచెప్పుటవలన సమస్తసృష్టి వాక్యములందునిటులచెప్పబడినదానికే కారణత్వము ప్రతిపాదనమైనదని బ్రహ్మ కారణ వాదమేముఖ్య ప్రయోజనము ఏరీతిచెప్పబడినదనగాసర్వజ్ఞత్వాదిగుణయుక్తముగామాచేత చెప్పబడినదని యర్థము. ఆపక్షమందు ‟అసద్వాఇదమగ్రఆసీత్„ యనియెందుకు చెప్పుచున్నదనగా చెప్పుచున్నారు.

౧౨౪. సమాకర్షాత్.

అ.—సమాకర్షాత్ - సర్వజ్ఞునికి అసచ్ఛబ్దముచేత కారణావస్థయందు నామరూపసంబంధిత్వములేకపోవుట వలనసమాకర్షణమౌను.

‟సోఽకామయతబహుస్యాంప్రజాయేయేతి„ యనిబహుభవనసంకల్పపూర్వకముగా జగత్తునుసృష్టి చేయుచుండెడి సర్వజ్ఞుండైన బ్రహ్మకు ‟అసద్వాఇదమగ్రఆసీత్„ యనేస్థలమందు సమాకర్షాత్ అను సంధానము చేసుకొనుటవలన కారణావస్థందునామరూప సంబంధిత్వము లేకపోవుటవలన అసత్తనిచెప్పుచున్నది. ఈ ప్రకారమే ‟తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్„ ఇత్యాదులందు ‟సఏషఇహానుప్రవిష్టఆనఖాగ్రేభ్యః„ ‟పశ్యత్యచక్షుః„ అనేపూర్వాపర పర్యాలోచనచేత ఆయా యిస్థలమందు సర్వజ్ఞునికి సమాకర్షణము చూడబడుచున్నది.

అ.—సం॥ ‟సదేవ సోమ్యేదమగ్రఆసీత్„ ‟అసద్వాఇదమగ్ర ఆసీత్„ ఇత్యాదులలో రెంటియందు సృష్టి చెప్పడము వలన బ్రహ్మమే ఏకకారణమని నిశ్చయింప కూడదని శంకించి ‟తస్మాద్వా ఏతస్మాత్„ ఇత్యాదుల యందు సార్వజ్ఞత్వ గుణయుక్తమై కారణత్వము చెప్పుటచేత సదాది శబ్దాదులు బ్రహ్మ పరమైనందునబ్రహ్మమే కారణమని నిశ్చయించుటశక్యము.

౩౨. జగద్వాచిత్వాధికరణము.

౧౨౫. జగద్వాచిత్వాత్.

అ.—జగద్వాచిత్వాత్ - కర్మశబ్దమునకుజగద్వాచిత్వమువలన, కారణభూతుడుపరబ్రహ్మ.

కౌషీతకీ యందు ‟బ్రహ్మతే బ్రవాణీ„ యనియుపక్రమించి ‟యో

వై బాలాకఏతేషాం పురుషాణాం కర్తాయస్యచైతత్కర్మసవై వేదితవ్య,, యనే స్థలమందు తెలుసుకో వలెనని యుపదేశముచేయబడినవస్తువు సాంఖ్యతంత్రమందు ప్రసిద్ధమైన పురుషుడా పరమాత్మాయనిసంశయము. ప్రకృతివియుక్త పురుషుడేనని పూర్వపక్షము ,,యస్యచైతత్కర్మ,, పుణ్యపాపరూపసమ్బంధిత్వముచేతనుపలక్షితుడౌటవలన.

సిద్ధాంతము. ,,యస్య చైతత్కర్మ,, యనికర్మశబ్దమునకు క్రియతఇతికర్మయనే సమాసముచేత జగద్వాచకమౌటవలన సమస్తమైన జగత్తైవనికార్యమో ఆపరమపురుషునే తెలుసుకోవలెననియుపదేశముచేయబడినది సూత్రవ్యాఖ్యానము చేయబడినది.

తా.—కర్మశబ్దమునకు జగద్వాచకమౌటవలన సమస్తజగత్తు పరమపురుషుని కార్యమని తెలియబడును.

౧౩౬. జీవముఖ్యప్రాణలిఙ్గాన్నేతిచేత్తద్వ్యాఖ్యాతం.

అ.—జీవముఖ్య - జీవునికిముఖ్యమైన, ప్రాణలింగాత్ - ప్రాణరూపమైనలింగమువలన, నేతిచేత్ - కాదని నట్టుయితే, తత్ - ఇది, వ్యాఖ్యాతం- వ్యాఖ్యానముచేయబడినది.

,,ఏవమేవైషప్రజ్ఞాత్మైతై రాత్మభిర్భుఙ్క్తే,, ఇత్యాదిభోక్తృత్వరూపలింగమువలన ,,అథాస్మిన్ప్రాణఏవైకధాభవతి,, యని ముఖ్యప్రాణలింగముచేత నితడుపరమాత్మకాదనిచెప్పినట్టయితే దీనికిపరిహారము ప్రతర్దనవిద్యయందేవ్యాఖ్యానముచేయబడియున్నది. పూర్వాపరప్రకరణపర్యాలోచనచేత ఈవాక్యముపరమాత్మపరమనినిశ్చయము గనుక అన్యమైనహేతువులుఅందుకనుగుణముగానే చెప్పవలెననియర్థము.

ఓయీ ,,తౌహసుప్తం పురుషమాజగ్ముః,, యని ప్రాణనామములచేత యామంత్రణాశ్రవణముయొక్క దండప్రహారపూర్వకముగా లేపుటచేతశరీరేంద్రియ ప్రాణాదులకంటె నతిరిక్తుడైన జీవాత్మసద్భావ ప్రతిపాదనపర మీవాక్యమని తెలియబడుచున్నదనినయుత్తరము చెప్పుచున్నారు.

౧౩౭. అన్యార్థంతుజైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపిచైవమేకే.

అ.—అన్యార్థంతు- ఇతరార్థముకొఱకైతె, ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం- ప్రశ్న ప్రతివచనముల చేత తెలియబడునని, జైమినిః- జైముసులు, అపి-ఈ అర్థమును, ఏవమేకే- కొన్నిశాఖలందుకొందరు చెప్పుచున్నారనిరి.

తుశబ్దము శంకానివృత్త్యర్థము జీవ సంకీర్తనము అన్యార్థముగలది అనగా జీవాతిరిక్తుడైన బ్రహ్మసద్భా

వ బోధనముకొరకని ప్రశ్న ప్రతివచనములచేత తెలియ బడుచున్నది. ప్రశ్నఅంతవరకుజీవునిచెప్పుటకంటె ననంతరనుందు ‘‘క్వైషఏతద్బాలాకేపురుషోఽశయిష్ట,, ఇత్యాదులుసుప్తుడైన జీవునికాశ్రయమైన వస్తువిషయకత్వముచేత పరమాత్మ పరమని నిశ్చయింపబడియున్నది. ప్రతివచనమందును ‘‘అథాస్మిన్ప్రాణఏవైకధా భవతి,, ఇత్యాదులు పరమాత్మ విషయములు.

సుప్తపురుషుని కాశ్రయముచేత ప్రాణశబ్దనిర్దిష్టుడుపరమాత్మయె ‘‘సతాసోమ్యతదాసమ్పన్నోభవతి,, ఇత్యాదులు-జైమినులవలన జీవగ్రహణము చెప్పబడినయర్థమునకు పూజ్యత్వముతోచుటకొరకు (అపిచైవమేకే) ఏకేవాజసనేయులు ఈబాలాక్యజాతశత్రుసంవాదగతమైన ప్రశ్నప్రతివచనరూపమైనవాక్యమును పరమాత్మవిషయము స్పష్టమనిచెప్పుదురు ‘‘క్వైషఏతత్,, ఇత్యాదులు ‘‘యఏషోన్తర్హృదయఆకాశ స్తస్మిఞ్ఛేతే,, యనెవాక్యాంతమువరకు.

తా.—జీవసంకీర్తనము అన్యార్థప్రయోజనముకొరకైనది అనగాపరబ్రహ్మబోధకమని ప్రశ్న ప్రతివచనములచేత నిశ్చయింపబడినవి.

అ.—సం॥ సదన్యాకృతాది శబ్దమువలన ప్రతిపన్నవస్తువుకు అతదాత్మకత్వమునుశంకించి అదియుబ్రహ్మాత్మకమని పరిహరించి జగత్తుయొక్క అతదాత్మకత్వమునునిరసించిరి.

౩౩. వాక్యాన్వయాధికరణము.

౧౨౮. వాక్యాన్వయాత్.

అ.—వాక్య - సమస్తమైనవాక్యము, అన్వయాత్ - పరమాత్మయందన్వయమువలన.

బృహదారణ్యక మైత్రేయీ బ్రాహ్మణమందు ‘‘నవా అరేపత్యుః కామాయపతిః ప్రియోభవత్యాత్మనస్తు కామాయ,, యని ఆరంభించి ‘‘ఆత్మావా అరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యోనిదిధ్యాసితవ్య,, యిత్యాదులందుద్రష్టవ్యః అనినిర్దిష్టుడైన పురుషుడు తంత్రసిద్ధుడా లేక పరమాత్మాయని సంశయము.

తంత్రసిద్ధుడైనపంచవింశకుడేయనిపూర్వపక్షము- పతిపత్ని పుత్రవిత్తమిత్రపశ్వాదిప్రియవస్తువులకు సంబంధియైనఆత్మపరమాత్మకానేరదు. అతడే ‘‘ఆత్మావా అరేద్రష్టవ్య,, యని ప్రతిపాదనచేయబడుచున్నాడు.

సిద్ధాంతము. పత్యాదుల కామముకొరకు పత్యాదులు ప్రియనుకానేరరు ఆత్మయొక్క కామము కొరకేనని చెప్పి ‘‘ఆత్మావా అరేద్రష్టవ్య,, అనినిర్దిష్టుడైన ఆత్మజీవాతిరిక్తుడైన స

త్యసంకల్పత్వ సర్వజ్ఞత్వముగల పరమాత్మే పత్యాదులకు స్వసంబంధి వస్తువులను గురించి ప్రియత్వమ్మెవని సంకల్పమున కాయత్తమైనదో నతడె సత్యసంకల్పుడు పరమాత్మ, పరమాత్మజ్ఞానముచేత చెప్పబడ బొయ్యే సమస్తజ్ఞానములును పరమాత్మయందేసంభవించుచున్నది.

సూత్రార్థము. వాక్యస్య సమస్తమైనవాక్యమునకు పరమాత్మయందే యన్వయముండుటవలన ద్రష్టవ్యత్వముచేతనిర్దిష్టుడైనఆత్మ పరమాత్మ ''అమృతత్వస్యతు నాశాస్తివిత్తేన,, ఆత్మనిఖల్వరేదృష్టే శ్రుతేమతేవిజ్ఞాతే ఇదంసర్వం విదితం,, ''ఇదం సర్వం యదయమాత్మా,, తస్యహవా ఏతస్యమహతోభూతస్యనిశ్వసితమేతద్యదృగ్వేదః ''యేనేదం సర్వంవిజానాతితంకేనవిజానీయాత్,, యనేవాక్యములుపరమాత్మయందే యన్వయము చూడబడుచున్నది.

తా.—సమస్తమైనవాక్యమునకు పరమాత్మయందే యన్వయముండుట వలన పరమాత్మద్రష్టవ్యుడనినిర్దిష్టుడు.

''ఏతేభ్యో భూతేభ్యస్సముత్థాయతాన్యేవానువినశ్యతి,, యని ఈ భూతములవలననుంచిపైకిలేచి వాట్లనే ప్రవేశిస్తున్నదని జీవలింగములకుమతాంతరముచేత సమాధానముచెప్పుచున్నారు.

౧౨౯. ప్రతిజ్ఞాసిద్ధేర్లింగ మాశ్మరథ్యః.

అ.—ప్రతిజ్ఞా-ప్రతిజ్ఞయొక్క, సిద్ధేః-సిద్ధికి, లింగం-సూచకమని, ఆశ్మరథ్యః-ఆశ్మరథ్యులమతము.

ఏకవిజ్ఞానముచేత సర్వవిజ్ఞానముయొక్క ప్రతిజ్ఞాసిద్ధికొరకు జీవునికిపరమాత్మకార్యత్వముండుటవలన పరమాత్మకంటె యనన్యుడుజీవుడని జీవశబ్దముచేత పరమాత్మ కభిధానమని ఆశ్మరథ్యాచార్యులమతము.

తా.—ప్రతిజ్ఞాసిద్ధికొరకు జీవశబ్దముచేత సూచకమైనది పరమాత్మ.

౧౩౦. ఉత్క్రమిష్యతఏవం భావాదిత్యౌడులోమిః.

అ.—ఉత్క్రమిష్యత - శరీరమునుంచిలేచిపోయెడుజీవునికి, ఏవంభావాత్ - బ్రహ్మ స్వభావము గలుగునని, ఔడులోమిః - ఔడు లోముల మతము.

''పరంజ్యోతిరు పసమ్పద్యస్వేన రూపేణాభినిష్పద్యత,, యనిశరీరమునుంచి యుత్క్రమించెడు జీవునికిపరమాత్మ స్వభావముగలుగుట వలనజీవశబ్దముచేత పరమాత్మ కభిధానమని ఔడులోములమతము.

౧౩౧. అవస్థితేరితికాశకృత్స్నః

అ.—అవస్థితెరతి-జీవాత్మయందన్తరాత్మతయాపరమాత్మయుండుట వలనయని - కాశకృత్స్నః- కాశకృత్స్నమతము.

"యఆత్మనితిష్ఠన్," యనిజీవాత్మయందంతరాత్మయైపరమాత్మయుందునని చెప్పుటవలన జీవాత్మశబ్దము పరమాత్మయందు పర్యవసానము వలనజీవాత్మశబ్దముచేతపరమాత్మ చెప్పబడునని కాశకృత్స్నఆచార్యులు నిశ్చయింతురు.

ఇదేసూత్రకారులకుయిష్టమనితోచుచున్నది మూడుమతములకుపరస్పరమువిరోధముంచుటవలన దీనికంటె యనంతరమందింకేమిచెప్పకపోవుట చేతనిదేవారియిష్టమనితోచుచున్నది.

తా.— శ్రుతివలనజీవాత్మయందంతరాత్మ గా పరమాత్మకు స్థితిచెప్పుటవలన జీవాత్మ శబ్దముచేత పరమాత్మచెప్పబడు చున్నాడనికాశకృత్స్నమతము.

అ.—సం॥విశేషించిచేతనుడు అతదాత్మకమని శంకించి బ్రహ్మాత్మకమునుసాధించిజీవుని యతదాత్మకత్వమునిరసించిరి.

౩౮. ప్రకృత్యధికరణము.

౧౩౨. ప్రకృతిశ్చప్రతిజ్ఞాదృష్టాన్తానుపరోధాత్.

అ.— ప్రతిజ్ఞ ప్రతిజ్ఞకు దృష్టాన్త-దృష్టాన్తమునకు-అనుపరోధాత్ అనుసరణముండుటవలన- ప్రకృతిశ్చ ఉపాదాన నిమిత్త కారణములు పరమాత్మ.

పరబ్రహ్మ జగత్తును గురించినిమిత్తకారణ మాత్రమూలేక ఉపాదాన కారణమగునాయనిసంశయము.

నిమిత్తమాత్రకారణమనిపూర్వపక్షము-లోకములో వృత్కులాలాదులయందు నిమిత్తమునకు ఉపాదానమునకు భేదముండుటవలన "అస్మాన్మాయీసృజతేవిశ్వమేతత్," ఇత్యాదులలో భేదము చెప్పుటవలన బ్రహ్మకుయవికారత్వ శ్రుతివిరోధము వలన బ్రహ్మకుయుపాదాన కారణముసంభవించదు.

సిద్ధాన్తము. ఏనాశ్రుతంశ్రుతం," యని బ్రహ్మజ్ఞానముచేత సర్వవిజ్ఞానముగలుగునదడి ప్రతిజ్ఞవేరె ప్రకారముగా యుపపన్నము కాదు గనుక "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వంమృన్మయం," అనిమృత్తు తత్కార్యమైనఘట దృష్టాన్తముచేత దానిని యుపపాదనముచేయుటవలనజగదుపాదానకారణము బ్రహ్మమేయని తెలియబడుచున్నది.

ప్రమాణాన్తరముచేత తెలియబడినసకలవస్తు విలక్షణుడై శాస్త్రైకసమధిగమ్యుడై సర్వజ్ఞుడై సర్వశక్తుడై

నపరబ్రహ్మకు కార్యకారణోభయావస్థలందు స్వశరీరభూతములైనచిదచిత్తులనుప్రకారముగా గలిగిన యొకనికేనిమిత్త కారణత్వము యుపాదానకారణత్వమువిరుద్ధముకానేరవు.

శరీరభూత యచిద్వస్తు గతములయిన వికారములు కార్యావస్థచేతనుండెడి శరీరియైన పరమాత్మకు సంభవించదుగాన అవికారత్వము సిద్ధమౌను చిదచిద్వస్తు శరీరకుడయినబ్రహ్మకే యుపాదానత్వ ముండుటవలన బ్రహ్మకుయపురుషార్థములైన వికారములయొక్క సంబంధాభావను చూపడముకొరకు "అస్మాన్మాయీసృజతేవిశ్వమేతత్తస్మింశ్చాన్యోమాయయా సన్నిరుద్ధ,, యనె వ్యపదేశము.ప్రతిజ్ఞాదృష్టాన్తయను సరణవలన యుపాదానకారణ్ణము బ్రహ్మమేయనిసూత్రార్థము.

తా.—ప్రతిజ్ఞాదృష్టాన్తములచేత పర బ్రహ్మమునకు జగదుపాదన కారణమును స్థాపించిరి.

౧౩౩. అభిధ్యోపదేశాచ్చ.

అ —అభిధ్యోపదేశాచ్చ-బ్రహ్మకుజగదాకారముచేత - బహుభవన చిన్తనోపదేశ ముండును.

"సోకామయతబహుస్యాం,,"తదైక్షతబహుస్యాం ప్రజాయేయేతి,, యనిసృజించెడిబ్రహ్మమునకేజగదాకారముచేత బహుభవనచింత నోపదేశమువలన జగత్తుకు పాదాన నిమిత్తకారణములు బ్రహ్మయనినిశ్చయింపబడుచున్నది.

౧౩౪. సాక్షాచ్చోభయామ్నానాత్

అ.—సాక్షాత్-సాక్షాత్తుగా-ఉభయ-ఉపాదాననిమిత్తకారణములు ఆమ్నానాత్-చెప్పుటవలన.

"కింస్విద్వనంకసవృక్షఆసీత్ ఇత్యాదులచేత జగదుపాదాన నిమిత్తకారణములుఅడగబడినట్టయితే "బ్రహ్మవనంబ్రహ్మసవృక్షఆసీత్బ్రహ్మధ్యతిష్ఠత్,, బ్రహ్మవనము బ్రహ్మవృక్షము ఆయెనని బ్రహ్మదులచేత వుండబడెడిదియని యుపాదాన నిమిత్తములు రెండు బ్రహ్మమేయని ప్రత్యక్షముగా చెప్పబడుచున్నది గనుక ఉభయవిధకారణములుబ్రహ్మ.

౧౩౫. ఆత్మకృతేః.

అ.—ఆత్మకృతేః-నిర్మాతయైనయాత్మకేజగదాకారముచేత నుపదేశము చేయ బడుచున్నది.

"తదాత్మానం స్వయమకురుత,, యని నిర్మాతైనపరమాత్మకు జగదాకారముచేతకృతి యుపదేశముచేయబడుచున్నదిఅందువలనఉభయమునామ రూపములయొక్క భావాభావములచేతనొకవస్తువుకెకర్మకర్తృత్వములు విరుద్ధములు కావు.

తా.— ద్రష్టయైనబ్రహ్మకే జగదాకృతి చెప్పబడుచున్నది.

బ్రహ్మతన్నుజగదాకారముగాచేసినవాడైనట్టయితే యప్పుడు బ్రహ్మకునపహతపాప్మత్వ యనవధికాతిశయానంద స్వరూపసర్వజ్ఞత్వాది గుణములకు విరుద్ధమౌను మరియును అజ్ఞత్వదుఃఖత్వ కర్మవశ్యత్వముమొదలైనవిపరీతములు సంభవించుననేపూర్వపక్షమునకు సమాధానము చెప్పుచున్నారు.

౧౩౬. పరిణామాత్.

అ.— పరిణామాత్ - జగచ్ఛరీరియగుబ్రహ్మమునకు శరీరమైన స్థూలసూక్ష్మావస్థలుగల కృత్స్నమైన చిదచిద్వస్తువు ద్వారాపరిణామము గలుగుటవలన.

అజ్ఞబ్రహ్మవివర్తవాదమందాదోషములుసంభవించును. అజ్ఞానము చేతచేయతగిన రూపానంతాపురుషార్థముగాగల అజ్ఞానమునకు • వేదాంతజన్య జ్ఞానముచేత నివర్త్యత్వముండుటవలన బ్రహ్మయందే అన్వయమగును. అప్పుడు శాస్త్రములు భ్రాంతులచేతచెప్పబడినది కానియానెడిదోషములుసంభవించును.

అవిభక్తములైననామరూపములు గలయతిసూక్ష్మచిదచిద్వస్తు శరీరకబ్రహ్మమునకునవిభక్తనామరూపచిదచిద్వస్తుశరీరత్వముచేత పరిణామముచేదాంతములందు చెప్పబడుచున్నది.

"తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యాంవ్యాక్రియత" అనువానిచేత శరీరభూతమైన చిదచిద్వస్తుగతమైన వికారములు యపురుషార్థములు కార్యావస్థయందు కారణావస్థయందుఆత్మభూతమైనబ్రహ్మమపహతపాప్మత్వాది గుణములుగలదిస్థూల సూక్ష్మావస్థలుగల కృత్స్నమైనచిదచిద్వస్తువులకుబ్రహ్మశరీరత్వము, బ్రహ్మకుఆవస్తువులయొక్క-ఆత్మత్వము "యఃపృథివ్యాంతిష్ఠన్" "యస్య పృథివీశరీరం" యని ఆరంభించి "యస్యావ్యక్తంశరీరం యస్యాక్షరం శరీరంయస్యమృత్యుశ్శరీరం ఏషసర్వభూతాంతరాత్మా పహతపాప్మాదివ్యోదేవ" ఈమొదలైన శ్రుతిశతముచేతసమధిగతమౌను గనుకఏమిదోషముసంభవించదు.

తా.—నిర్వికారస్వరూపముగల పరబ్రహ్మమునకుస్థూలసూక్ష్మసమస్తచిదచిద్వస్తుశరీరద్వారా శ్రుతికదంబమువలనపరిణామముచెప్పుచున్నది.

౧౩౭. యోనిశ్చహిగీయతే.

అ.—యోనిశ్చహిగీయతే- సమస్తభూతజాతములకు పరమపురుషునియోనిగచెప్పబడుచున్నది.

"యద్భూతయోనింపరిపశ్యంతిధీ

రాః,, ''కర్తారమీశంపురుషంబ్రహ్మయోనిం,, అనేవాక్యములందు సమస్త భూతసమూహమునకు పరమపురుషుడేకారణమనిచెప్పబడును. హియను శబ్దము హేతువాచకము ఏకారణమువలన యోనియని చెప్పబడునో అదే హేతువువలన ఉపాదాన కారణము బ్రహ్మము, యోనిశబ్దము ఉపాదానమునకు పర్యాయపదము.

అ.—సం॥ లోకమందు నిమిత్తోపాదానాదులుదర్శనమాటచేతసర్వజ్ఞుడైన బ్రహ్మనిమిత్తమాత్రముడుపాదానముగాదనిశంకించి సర్వశక్తిగల బ్రహ్మమునకుభయవిధ కారణత్వము పపన్నమాటవలన ''బ్రహ్మవనమ్ ,, ఇత్యాదులందుభయవిధకారణత్వము ప్రతిపాదితమై యున్నందున బ్రహ్మముపాదానమనియుచెప్పబడినది. సేశ్వరసాఙ్ఖ్యోక్తమైనజగత్తుయొక్క బ్రహ్మాత్మకత్వమును శంకించి బ్రహ్మోపాదాన సమర్థనముఖేన బ్రహ్మాత్మకత్వమునుసమర్థించి అబ్రహ్మాత్మకత్వమునునిరసించిరి.

౩౫. సర్వవ్యాఖ్యానాధికరణము.

౧౩౮. ఏతేన సర్వేవ్యాఖ్యాతాః వ్యాఖ్యాతాః.

అ.—ఏతేన - ఇదివరకుచెప్పబడినన్యాయ సమూహములచేత, సర్వేన్యాఖ్యాతావ్యాఖ్యాతాః- సమస్తవేదాంతములు బ్రహ్మపరములుగావ్యాఖ్యానముచేయబడినవి.

''యతోవాఇమాని,, ఇత్యాదులందువుదాహరించబడిన వాక్యములవలన ''జన్మాద్యస్యయతః,, అనేవాటిలోచెప్పబడిన న్యాయసమూహములచేత సమస్తవేదాంతములు బ్రహ్మపరముగావ్యాఖ్యానము చేయబడినవి పదాభ్యాసము అధ్యాయపరిసమాప్తిద్యోతనార్థము.

అ.—సం॥ పూర్వాధికరణములలోనుదహరించబడినయశేషవాక్యములలోనేవి జగత్కారణత్వ మాత్రమని వినబడినవోవానికి ఈక్షణ విశేషాదులు లేనందునను పరమపురుషాసాధారణములైనధర్మములువినబడుచున్నందునను ప్రతిపన్నవస్తుయంగీకారమందువిరోధము లేనందునను వాటికిపరమైన ఆత్మపరమనిశంకించి నదికాదని పరబ్రహ్మసాధారణమైన ధర్మాంతరమందుశ్రవణముండిననుజగత్కారణత్వయీక్షణవిశేషమువలె పరమపురుషయసాధారణ్యము పూర్వాధికరణములలోనిర్ణయించబడిన జగత్కారణమే చిదచిద్విలక్షణ సర్వవిధ కారణభూతమైన పరబ్రహ్మశబ్దవాచ్యదేవతావిశేష పరమనినా వాక్యములందే ప్రతిపాదింపబడినదని సిద్ధాంతము.

ప్రథమాధ్యాయము- ముగిసెను.

శ్రీగురుభ్యోనమః.

## ద్వితీయాధ్యాయము - ప్రథమపాదము.

౩౬. స్మృత్యధికరణము.

౧౩౯. స్మృత్యనవకాశ దోషప్రసంగ ఇతిచేన్నాన్యస్మృత్య నవకాశ దోషప్రసంగాత్.

అ.— స్మృత్యనవకాశదోష ప్రసంగఇతిచేత్ - స్మృతులకుదోషప్రసంగమునకవకాశములేదు- న - అని చెప్పకూడదు - కపిలాదిస్మృతులకు దోషముండుటవలన-అన్యస్మృతులను ఆప్రకారమే దోషయుక్తమని చెప్ప చూచినట్టయితే- అన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్- మన్వాదిస్మృతులలోనట్టిదోషప్రసంగమున కవకాశములేనందున.

వేదాంతములలోసమస్తమైనచిదచిద్వస్తువులకంటె విలక్షణుడైన అస్పృష్ట హేయగంథముగల సర్వజ్ఞత్వాది యనంతకల్యాణగుణాకర బ్రహ్మైకపరత్వ ప్రతిపాదకత్వము కాపిలస్మృతికి విరోధమౌటవలన చలింపుటకు శక్యమౌనా కాదాయనిసంశయము.

చలింపచేసుట కర్హమని పూర్వపక్షము.

శ్రుతివిరుద్ధమైనస్మృతికి అనాదరణీయ్యమున్నప్పటికి వేదాంత వేద్యమైనఅర్థమును గ్రహించుటయం దశక్యముండుటవలన అల్పమైనశాస్త్రాభ్యాసముగల మందబుద్ధులకు ఆప్తులచేత చేయబడిన స్మృతులయొక్క ఉపబృహ్మణమువినా నిశ్చయ ముపపన్నము కానేరదు. కపిలస్మృతి కేవలముతత్వమాత్రబోధకను దానిచేతనే ఉపబృహ్మణమునకుయోగ్యములేకపోయినయడల ఆప్తప్రణీతమైన కేవలతత్వపరమైనఈస్మృతికిఅవకాశమే లేకపోనియనేదోషము సంభవించును గనుక వేదాంతములచేత తెలియుటకు యోగ్యమైన జగత్కారణము ప్రధానమే యనిపూర్వపక్షము.

సిద్ధాంతము. వేదాంతములకు ఉపబృహ్మణాపేక్ష యుండినప్పటికి అత్యంతమాప్తులైనమన్వాదులయొక్క వేదాంతమునకునవిరోధములైనస్మృతులచేతనే ఉపబృహ్మణము యోగ్యమగును లేకపోయినయడలవానికి సావకాశముగలుగునుగనుక అధికదోషప్రాప్తికలుగును.

వానికి ధర్మప్రతిపాద నాంశమందుప బృహ్మణత్వమునకు సావకాశ

త్వము చెప్పవచ్చును ఏకారణమువలన సమస్తధర్మముల స్వరూపము పరబ్రహ్మమైన పరమపురుషుని యొక్క ఆరాధనమో ‹‹ఇష్టాపూర్తం బహుధాజాతం జాయమానం విశ్వం బిభర్తి భువనస్యనాభిః,, ‹‹తదేవాగ్నిస్తద్వాయుస్తత్సూర్యస్తదుచంద్రమాః,, ‹‹యజ్ఞైస్త్వమిజ్యసేనిత్యం సర్వదేవమయాచ్యుత,, ఇత్యాదిశ్రుతిస్మృతులు ఆకారణములను దృఢపరచుచున్నవి సూత్రమువ్యాఖ్యానముచేయబడినది.

అతీంద్రియములైనఅర్థసాక్షాత్కారములందు సమర్థుడైనకపిలునికి వేదాంతములయందు బ్రహ్మపరత్వము కనబడలేదు గనుక ప్రధానపరత్వమే ఆశ్రయింపతగినదని యనేపక్షమందు వుత్తరముచెప్పుచున్నారు.

౧౪౦. ఇతరేషాంచానుపలబ్ధేః.

అ.— ఇతరేషాం - మన్వాదుల యొక్క- అనుపలబ్ధేః- వేదాంతమునకుప్రధాన పరత్వప్రత్యక్షము లేకపోవుటవలన.

ఇతరులైనవేదవేత్తలలో శ్రేష్ఠులైన అతీంద్రియ వస్తువులయొక్క సాక్షాత్కారముగల మన్వాదులకు ప్రధానపరత్వప్రత్యక్షము కలగకపోవుటవలన బ్రహ్మపరత్వప్రత్యక్షము కలుగుటవలన బ్రహ్మపరత్వమే ఆశ్రయింపతగినది.

వేదాంత ప్రతిపన్నములైన అర్థమునకు విరుద్ధమైనకపిల ప్రత్యక్షమునకు భ్రాంతిమూలకత్వము కల్పనచేయతగినది.

తా.— వేదవేత్తలలో నగ్రేసరులైనమన్వాదులచేత ప్రకృతికి పరత్వము చెప్పకపోవుటవలన బ్రహ్మపరత్వముచెప్పుటవలన బ్రహ్మపరత్వమే యాశ్రయింపతగినదిగాని వేదాంత ప్రతిపన్నమైనఅర్థమునకు విరుద్ధమైన కపిలస్మృతికి భ్రాంతిమూలత్వము కల్పనచేయదగినది.

అ.—స౦॥ వేదాంతవాక్యములలో చెప్పబడినబ్రహ్మకారణత్వమునకుమహర్షిప్రణీతమైన సాంఖ్యస్మృతులలో నిరవకాశప్రసంగముండుటవలన ప్రధానమేజగత్కారణమనిశంకించి మన్వాదిమహర్షి జనసమూహముచేత చెప్పబడిన స్మృతులందనవకాశ దోషప్రసంగములేనందున బ్రహ్మమేకారణము.

## ౩౭. యోగప్రత్యుక్త్యధికరణము.

౧౪౧. ఏతేనయోగప్రత్యుక్తః.

అ.—ఏతేన - ఈప్రకారముగా చెప్పుటచేత- యోగః- యోగము-ప్రత్యుక్తః- కొట్టుబడిపోయెను.

వేదాంతమునకు యోగస్మృతు

లు ఉపబృహ్మణమునకు యోగ్యమా కాదాయనిసంశయము.

యోగ్యమని పూర్వపక్షము సమస్తమైనవేద ప్రవర్తనమం దధికారముగలబ్రహ్మచేత చేయబడుటవలన యోగమునకు ఈశ్వరునియొక్క సద్భావమం దంగీకారమువలన యోగ్యమౌను గనుకయోగస్మృతులచేత నుపబృంహితములైన వేదాంతములకు బ్రహ్మాత్మకముకాని ప్రధానమునకు ఉపాదాన బోధకత్వము సంభవించును.

సిద్ధాన్తము- కపిలస్మృతివలెనె వేదవిరుద్ధముగనుక విశేషమేమి లేకపోవుటవలనఆదరింపతగినది గాదు - హిరణ్యగర్భునికిని త్రేత్రజ్ఞమధ్యపాతిత్వనుండుటవలన భ్రమసంభవించునుగనుకయోగస్మృతులకు భ్రాంతిమూలకత్వము - సూత్రార్థము స్ఫుటముగా చేయబడినది.

తా.—వేదవిరుద్ధమౌటవలనకపిలస్మృతివలెనెయోగస్మృతులు భ్రాంతిమూలమేను.

అ.—సం॥యోగస్మృతులు సర్వవేదప్రవర్త నాధికృత హిరణ్యగర్భునివలన ప్రణీతమైనందున దానికియును రోధేనవేదాంతార్థము నిర్ణయకార్యమనిశంకించి-హిరణ్యగర్భుఁడును త్రేత్రజ్ఞుఁడును-రజస్తమోభి భూతుడౌటచేత అతనివలనచెప్పబడినపురాణాంతరమువలె యోగస్మృతులు భ్రాంతిమూలములనియు - అవి వేదంతోపబృంహణముకాదనియు సిద్ధాంతము.

౩౮. నవిలక్షణత్వాధికరణము.

౧౮౩. నవిలక్షణ త్వాదస్య తథాత్వంచశబ్దాత్.

అ.— అస్య- ప్రపంచమునకు-విలక్షణత్వాత్ - విలక్షణ్యమువలన-బ్రహ్మకార్యత్వము-న-లేదు- తథాత్వంచ-బ్రహ్మవిలక్షణమైతేనో - శబ్దాత్ శ్రుతివలన తెలియుచున్నది.

వేదాన్తములు జగత్కారణముగ ప్రధానమునుబోధించుచున్నదా-లేక బ్రహ్మను బోధించుచున్నదాయని సంశయము. ప్రధానమును బోధించుచున్నదని పూర్వపక్షము- అజ్ఞత్వరూపహేతువుచేత జగత్తుకుబ్రహ్మ విలక్షణత్వముండుటవలన బ్రహ్మ కార్యత్వము చెప్పడముసంభవించదు సమానలక్షణములుండుటచేత ప్రధానకార్యమని చెప్పడముసంభవించును-ఈరెండు హేతువులచేతప్రకృతిపరత్వమేను

సిద్ధాన్తము మక్షికాదులవలనవిలక్షణములైనక్రిమిమొదలైనవాటికి నుత్పత్తిసంభవించుట వలన బ్రహ్మవిలక్షణమైనజగత్తుకు బ్రహ్మవలన నుత్పత్తిసంభవించును.

సూత్రార్థము - అజ్ఞత్వము చేతన

సుఖముచేత పొందబడెడి నీచిదచిన్మిశ్రమైనజగత్తుకు - సర్వజ్ఞుడై హేయగుణరహితుడై అధికానందముగలబ్రహ్మకంటె విలక్షణమౌటవలన ఈజగత్తుకుబ్రహ్మకార్యత్వమును చెప్పడము వేదాన్తములకు సంభవించదు- ఆప్రకారముండడము యావిలక్షణత్వశబ్దముచేతనే తెలియబడుచున్నది - కేవలప్రత్యక్షమాత్రమేకాదు ‹‹విజ్ఞానంచావిజ్ఞానంచ,, ‹‹అనీశయాశోచతిముహ్యమానః,, ‹‹అనీశశ్చాత్మాబధ్యతేభోక్తృభావాత్,,ఇత్యాదులు.

తా.— తేనెటీగమొదలైన మాక్షికాదులవలనవిలక్షణములైనకీటము మొదలైన వాటికి లోకమందు త్పత్తి వుండుటవలన బ్రహ్మవిలక్షణమైన జగత్తుకుతత్కార్యత్వము సంభవించుచున్నది.

‹‹ఆపోవాఅకామయన్త,, తంపృథివ్యబ్రవీత్ ‹‹ఇత్యాదులందు పృథివ్యాదులకుజ్ఞానకార్యత్వము వ్యపదేశముచేయుచున్నది- గనుక ‹‹అవిజ్ఞానంచ,, యనిదానికన్య పరమని యంపెవుత్తరముచెప్పుచున్నారు.

౧౮౩. అభిమాని వ్యపదేశస్తు విశేషానుగతిభ్యాం.

అ.—విశేష- విశేషణముచేత-అనుగతిభ్యాం - వాగాదులందను ప్రవేశముచేతను - అభిమాని వ్యపదేశస్తు పృథివిమొదలైన యభిమాని దేవతలకువ్యపదేశము.

తుశబ్దము చోద్యాంశమునువ్యావర్తిచేయుచున్నది-పృథివ్యాద్యభిమానదేవతులవిషయమైనదీవ్యపదేశములు.

ఏమిటివలన తెలియబడు చున్నదనిన (విశేషానుగతిభ్యాం) విశేషఃవిశేషణము ‹‹హన్తాహమిమా స్తిస్రోదేవతా,, యనిపృథివ్యాదులకు దేవతాశబ్దములు విశేషణములుగానున్నవి ‹‹సర్వాహవై దేవతా అహంశ్రేయసేవివదమానా,, యనియువాగాదులుమొదలుకొని ప్రాణపర్యంతము నకునటులయను ప్రవేశమున్నది - అగ్న్యాదులకు వాగాదులందను ప్రవేశముచ్చూడ బడుచున్నది ‹‹అగ్నిర్వాగ్భూత్వాముఖంప్రావిశత్ ఆదిత్యశ్చక్షుర్భూత్వాక్షిణీప్రావిశత్ వాయుఃప్రాణోభూత్వానాసికెప్రావిశత్,, ఇత్యాదులచేత ధృవముచేయబడును.

తా.— వాగాదులందను ప్రవేశవిశేషణముచేతతత్తదభిమాన దేవతులకునిర్దేశమున్నది.

౧౮౪. దృశ్యతేతు.

అ.—దృశ్యతేతు- మక్షికాదులవలనవిలక్షణమైన క్రిమిమొదలైనవాటికినుత్పత్తిచూడబడుచున్నది.

తుశబ్దము పక్షమును వ్యావర్తిచేయుచున్నది మక్షికాదులవలన విలక్షు

ణమైనక్రియ్యాదులకు నుత్పత్తిచూడబ డుచున్నదిగనుక బ్రహ్మ విలక్షణమైన జగత్తుకుతత్కార్యత్వముసంభవించు చున్నది.

౧౮౫. అసదితిచేన్న ప్రతిషేధ మాత్రత్వాత్.

అ.—అసత్- అసత్కార్యవాద ము-ఇతిచేత్-ఈప్రకారమనిచెప్పినట్ట యితే- న- కాదు - ప్రతిషేధమాత్ర త్వాత్ - కార్యకారణములకుసామ్య నిషేధమాత్రమువలన.

కార్యమునకు కారణమునకంటె వి లక్షణస్వభావమునంగీకరించబడినప్పు డు కార్యమందుకారణముసంభవింప దని అసత్కార్యవాదము నంగీకరించ వలసివచ్చును. అప్పటికి "సర్వంఖల్వి దంబ్రహ్మ" యనెడి సామానాధికర ణ్యముఘటింపకుండా పోనియనియం టే అటుల చెప్పకూడదు కార్యకార ణములకు సమాన లక్షణములయొక్క నియమనిషేధమాత్రమే మ్మాచేతపూ ర్వమందుచెప్పబడినది. కార్యకారణ ములకు ఏకద్రవ్యత్వముస్వీకరింప బడి యున్నది కారణావస్థమైన ఏకద్రవ్య మేకార్యావస్థనుపొంది సమానలక్షణ ములుగల యవస్థయు విలక్షణమైన యవస్థయుగలదౌనని తాత్పర్యము.

౧౮౬. అపీతౌతద్వత్ప్రసంగాద సమంజసం.

అ.—అపీతః- జగత్తునకుబ్రహ్మ యందప్యయముండినప్పటికి- తద్వత్- జగత్తువలెనే-ప్రసంగాత్ అజ్ఞత్వాప త్తివలన-అసమంజసం-అయుక్తము.

సర్వజ్ఞత్వసత్యసంకల్పత్వ నిరతిశ యానంద అపహతపాప్మత్వాది స్వ రూపముగలబ్రహ్మమే తద్విపరీతమైన జగదవస్థను పొందినట్టయితే యప్పు డుపిండత్వ ఘటత్వాద్యవస్థగలమృత్తు వలెనే సర్వజ్ఞత్వముయపహతపాప్మ త్వము అజ్ఞత్వము కర్మపరవశత్వము బ్రహ్మకుసంభవించుననెడి విరుద్ధమైన యర్థమును చెప్పుటవలన వేదాన్తవా క్యము అసమంజసముకాని- అపీతావి తియనగా ప్రదర్శనార్థము- జగత్తుకు బ్రహ్మయందుత్పత్తివైనయడల అపీ తి- యనియర్థము- అప్యయమనగావు త్పత్తియనుట.

౧౮౭. నతుదృష్టాంత భావాత్.

అ.— దృష్టాన్త - దృష్టాన్తము యొక్క-భావాత్- భావమువలన-న తు-బ్రహ్మయందజ్ఞత్వాదులు సంభ వింపవు.

బ్రహ్మయందజ్ఞత్వాది గుణములు సంభవింపవుగనుక వేదాంతమునకు అసామంజసములేదు తుశబ్దము ప్రస క్తమైన యసంభావనీయత్వమును ప్ర కాశింపచేస్తున్నది, ఒకవస్తువుకే అవ స్థాద్వయమందన్వయముచెప్పినప్పటికి

గుణదోషముల వ్యవస్థయందుదృష్టాంతసద్భావముండును ఏలాగనిన మనుష్యునివలనపుట్టినవాడు బాలుడుస్థవిరుడుయువ్వనవంతుడు యాచున్నాడనే స్థలమందు మనుష్యశరీరకుడైన చేతనమునకే సర్వావస్థలందు అన్వయమున్నప్పటికి జన్మము- బాల్యము-యువ్వనము-వృద్ధత్వములు- నాత్మయందే ప్రకారముసంగతిలేదో- ఆప్రకారమేజ్ఞానము సుఖదుఃఖాదులు శరీరమందుండనేరవు నిదేప్రకారము చిదచిద్వస్తుశరీరకుడైన పరబ్రహ్మకు కార్యావస్థయందు కారణావస్థయం దన్వయముండినప్పటికి కర్మవశ్యత్వము- అజ్ఞత్వము శరీరభూతమైన చిదచిద్వస్తుగతమయిన వికారములు నపహతపాప్మత్వ సర్వజ్ఞత్వగుణములుగల ఆత్మభూతుడైన పరమాత్మయందుండవు.

సర్వావస్థగల చిదచిద్వస్తులవుకు బ్రహ్మశరీరత్వము- బ్రహ్మకుతదాత్మత్వమున్ను- “యస్యపృథివీ శరీరం,, యని అంతర్యామి బ్రాహ్మణములయందవగతమైనది గనుక ఏలాటిదోషముసంభవింపదు.

౧౮౮. స్వపక్షదోషాచ్చ.

అ.—స్వపక్ష- ప్రకృతికి కారణత్వము చెప్పేమతమందు- దోషాచ్చ- దోషమువలన.

కేవలముగా బ్రహ్మకారణత్వవాదమునకు నిర్దోషమాత్రముచేత నేదానినాశ్రయింపకూడదు- ప్రధానమునకు కారణత్వము చెప్పడమందుప్రత్యక్షముగాదోషములుండుటవలన- దాన్నివిడిచిపెట్టి - వానినే యవలంబించతగినది.

ప్రధానమునకు కారణము చెప్పేమతమందు నిర్వికారియైన చిన్మాత్రస్వరూపుడైనపురుషునికిప్రకృతిసన్నిధానముచేత చేయబడిన ప్రకృతిధర్మముల యధ్యాసమూలమైన జగత్ప్రవృత్తియంగీకరింపబడుచున్నది- ఆమతమందు ప్రకృతిసద్భావమాత్రసన్నిధానమైనపక్షమందు-ముక్తునికిదానిధర్మములయొక్క- అధ్యాసప్రసక్తిరూపదోషముసంభవించును- ఆసన్నిధానమువికార విశేషరూపమైనట్టయితే కృత్స్నమైనవికారవస్తువుకునధ్యాసపూర్వకత్వములేకపోవుటవలన సన్నిధానము- వికారమందు హేతువుకాకుండాపోని- సమస్తమైన వికారమునకు నధ్యాసపూర్వకత్వముండుట వలన అధ్యాసమునకు వికారము హేతువు కాదని విరుద్ధార్థక ధనరూపమైన అసమంజసత్వ రూపదోషము సంభవించునని ఆపక్ష మెంత మాత్ర మవలంబించతగినది కాదు.

తా.—ప్రధానకారణ వాదము దోషయుక్తమైన మతము.

౧౪౯. తర్కాప్రతిష్ఠానాదపి.

అ.—తర్క-తర్కమునకు-అప్రతిష్ఠానాదపి-ప్రతిష్ఠితత్వము లేకపోవుటవలన నాపక్షముసంభవింపదు.

కాపిలసంబంధమైన సిద్ధాన్తమునకు తర్కమూలకత్వముండుటచేత శాక్యముమొదలయిన తర్కములచేత కొట్టుబడినదౌటచేత ఈతర్కమునకు ప్రతిష్ఠితత్వము లేకపోయినందున, తత్పక్షముసంభవముగాదు.

తా.— శాక్యాదితర్కప్రతిహతమువలననీతర్కమునకు ప్రతిష్ఠితత్వములేనందుచేనీపక్షముసంభవింపదు.

౧౫౦. అన్యథానుమేయమితిచే దేవమప్యనిర్మోక్షప్రసంగః.

అ.—అన్యథా- మరియొకప్రకారముచే-అనుమేయమితిచేత్- అనుమేయించెదమనియంటే- ఏవమపి- అట్లైనను-అనిర్మోక్షప్రసంగః- అనిర్మోక్షప్రసంగదోషముదుర్వారము.

ఇప్పటికంటె పూర్వముందుండెడి తర్కములచేత అప్రతిహతత్వమేప్రకారముసంభవించునో నాప్రకారమే ప్రధానకారణత్వముచెప్పెడిసిద్ధాన్తమును సమ్మతింతామనిచెప్పినట్టయితే నట్లుచెప్పకూడదు- అప్పటికిని తర్కాప్రతిష్ఠానరూపదోషములవలన అనిర్మోక్షత్వరూపప్రసంగను దుర్వారముగానుండును- నీకంటెనధికమైనకు తర్కకుశలులచేత దూష్యత్వమేలాగైననుసంభవింపజేయబడును.

అ—సం॥అచేతనంబైనజగత్తుసర్వజ్ఞత్వముగలబ్రహ్మమునకువిలక్షణముగా నుండుటనుబట్టి కార్యకారణభావము సంభవించనందునయచేతనమైన ప్రధానమేజగత్కారణమనియు కార్యకారణములైన జగద్బ్రహ్మలకుమృద్ఘటాదులవలెసాలక్షణ్యము లేదనిశంకించి గోమయవృశ్చికాది విలక్షణవస్తువులకును కార్యకారణభావము దర్శనమౌటచే సలక్షణనియమము లేదు బ్రహ్మమే జగత్కారణమని సిద్ధాంతము.

౩౯. శిష్టాపరిగ్రహాధికరణము.

౧౫౧. ఏతేనశిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః.

అ.— ఏతేన-ఈదూషణముచేత శిష్టాః-శిష్టులవలన- అపరిగ్రహా-కణాదస్మృతులుమొదలయినవి- వ్యాఖ్యాతాః-త్యాజ్యములని వ్యాఖ్యానముచేయబడినవి.

వైదికులచేత పరిగ్రహముకాకుండనందున అపరిగ్రహములు - శిష్టులచేత అపరిగ్రహములు- శిష్టాపరిగ్రహములు- ముఖ్యముగా తర్కాప్రమా[illegible]నమే లక్షణముగాగల కపిలస్మృ[illegible] నహేతువులచేత ముగించినకం[illegible]

దిస్మృతులు నిరస్తములని వ్యాఖ్యానముచేయబడినవి.

పరమాణువులకు కారణము చెప్పెడి వాదముసర్వసమ్మతమని వాట్లకు తర్కాప్రతిష్ఠితత్వము లేదని అధికముగా శంక చేయకూడదు. తర్కమూలత్వముండడమందు విశేషములేదు- పరమాణువులకు శూన్యత్వమందునను - ద్రవ్యత్వమందునను వివాదముండుటవలన తర్కమునకప్రతిష్ఠితత్వమేయున్నదనిపరిహారము.

తా.—— ఈదూషణముల చేతను శిష్టుల చేతను- కణాదస్మృతులు త్యాజ్యములు.

అ.——సం॥ కణాదాక్షపాదబుద్ధాదుల యనేక తంత్రోక్తమైన పరమాణు జగత్కారణత్వనిరూపణమునకు ప్రాబల్యముచెప్ప వలసి వచ్చినందుకు యనేకమతనిరూపితపరమాణు కారణత్వము కేవలతర్కమూలము లౌటవలన వేదప్రతిపాద్యబ్రహ్మకారణత్వమునకుబాధకనుగాక పోవుటవలన.

౪౦. భోక్త్రాపత్త్యధికరణము.

౧౫౨. భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్.

అ.—— భోక్తృ-సుఖ దుఃఖ భోక్తృత్వములకు-ఆపత్తేః- ప్రాప్తివలన అవిభాగః- వైలక్షణ్యములేదు- ఇతిచేత్ -ఈప్రకారమన్నట్టయితే-లోకవత్ - లోకమువలెనే-స్యాత్ - కాగలదు.

సర్వాత్మభూతుడైన పరబ్రహ్మకు స్వశరీర భూతుడైన జీవునికంటే నిరతిశయానంద స్వభావముగలవాడౌటచేత విభాగముచెప్పబడెను-నావిభాగముసంభవించునా-లేదా- అని సంశయము- సంభవింపదనిపూర్వపక్షము- సర్వచిదచిద్వస్తుశరీరకుడౌటచేత- శరీరిత్వము బ్రహ్మకు సంభవించినదిగనుక-శరీరికిసుఖదుఃఖభోక్తృత్వాపత్తివలన నవిభాగము సంభవించకుండాపోని- ‘‘నహవై సశరీరస్యసతఃప్రియాప్రియయోరపహతిరస్తిఅశరీరంవావసంతం నప్రియాప్రియేస్పృశత,, యనెడి శ్రుతివలన.

సిద్ధాన్తము- జీవునికంటే పరుడైన బ్రహ్మకుకర్మకువశత్వములేకపోవుటవలన విభాగముకానేయాను-శరీరసంబంధమువలన సుఖదుఃఖసంబంధమెంతమాత్రము సంభవింపదు-మరేమనిన శాస్త్రవశ్యత్వము చేత సుఖదుఃఖము నతిక్రమింప చేయబడినవి- ‘‘సఏకధాభవతిత్రిధాభవతి,, యని తెలియ బడిన శరీరముగల ముక్తునికి-సశరీరసహితుడైనను శాస్త్రవశ్యత్వము లేకపోవడమునుబట్టినిరస్తనిఖిలదుఃఖముగలవాడనివిదితమాను ఏప్ర

కారమనిన లోకమందు రాజశాసనములకధీనములయినట్టి శరీరులకు నారాజశాసన మాతిక్రమణమే నిమిత్తముగాగల దుఃఖప్రాప్తిపుండి నటువలె- సశరీరుడైన రాజైనప్పటికి స్వశాసనమునకుఅవశ్యుడయినాదానిఅతిక్రమణమునుబట్టి దుఃఖ సంబంధమే ప్రకారము సంభవింపదో నారీతిగానని తెలియవలయు - విభాగమనగా వైలక్ష్యణ్యము- సూత్రము స్ఫుటముగానర్థముచేయబడినది.

తా.—జీవునికంటెపరబ్రహ్మకు నకర్మవశ్యత్వమునుబట్టి విభాగముగలదుయెటువలెనంటే లోకమందురాజ శాసనవశ్యులైన దేహధారులకు రాజశాసన తిరస్కార నిమిత్తమైన దుఃఖముండును శరీరముతోకూడియుండినరాజునకు స్వశాసనాతిక్రమణముచేతదుఃఖములేనటువలెనే.

అ.—సం॥ చిదచిద్రూపకార్యగతమైన పరిణామిత్వసుఖిత్వ దుఃఖిత్వాదిదోషంబులు బ్రహ్మమునకుప్రసంగించుటచేత వనిశంకించి సూక్ష్మచిదచిద్విశిష్టబ్రహ్మము కారణమై స్థూలచిదచిద్విశిష్టబ్రహ్మము కార్యంబుగనుండినప్పటికి కర్మముచేగలిగిన చిదచిద్రూపకార్యగతదోషంబులు కర్మవశ్యతలేని విశేష్యమైన బ్రహ్మమందు ప్రళయకాలములో సహాప్రసంగించదనిసిద్ధాంతముచేయబడినది.

## ౪౧. ఆరంభణాధికరణము.

౧౫౩. తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః.

అ.—తత్-బ్రహ్మకంటె- అనన్యత్వ- అభేదము-ఆరంభణ శబ్దాదిభ్యః- ‹‹వాచారంభణ,,మనెడిశ్రుతులచేత జెప్పంబడును.

బ్రహ్మకార్యభూతమైనజగత్తు బ్రహ్మకంటె భిన్నమూ లేక అభిన్నమాయని సంశయము భిన్నమని పూర్వపక్షము. అదేప్రకారముగా తెలియుటవలన లోకమందు జ్ఞానము శబ్దాంతరములకు కారణములకంటె కార్యములకునభేదముండినను ఏప్రకారముగానైన నుపపత్తి పొందదు కారణవ్యాపారమునకనన్యత్వమందు వ్యర్థత్వము సంభవించునుగనుకవస్తువు విరోధమునుబట్టిఅభేదశ్రుతులులక్షణచేతనైననాక అర్థబోధకములని చెప్పవలెను.

సిద్ధాంతము. ‹‹వాచారంభణంవికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం,, ‹‹సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవా ద్వితీయం తదైక్షత బహుస్స్యాంప్రజాయేయేతి తత్తేజోఽసృజత,, ‹‹ఐతదాత్మ్యమిదంసర్వం తత్సత్యం సఆత్మాతత్త్వమసి శ్వేతకేతో,, ‹‹ సర్వంఖల్విదం బ్రహ్మతజ్జలానితి,, ‹‹తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్

న్నామరూపాభ్యాం వ్యాక్రియత,, ఇత్యాదిశ్రుతిశతసిద్ధమైనది కార్యమైనజగత్తుకు కారణమైనబ్రహ్మకంటే యనన్యత్వము. ఇచ్చటవస్తువిరోధగంధములేదు లోకమందుకారణమైన మృత్తుమొదలైన ద్రవ్యములకే పృథుబుధ్నోదరా ద్యవస్థాంతరము యొక్క ప్రాప్తిచేతజ్ఞానము మరియొక శబ్దము నుపపన్నమౌను. గనుక కారకవ్యాపారమునకు సార్థకత్వము సంభవించును కారణమునకే కార్యావస్థయందు తెలియబడుచూనుండెడి దానికే యవస్థాంతర ప్రాప్తిచేతనే సమస్తముపపన్నమౌచునుండగా అనుపలబ్ధమైన మరియొకద్రవ్యకల్పన మెంతమాత్రముసంభవింపదు ఆకారణమువలన బ్రహ్మకంటే భిన్నములేదు.

సూత్రార్థము. తత్-ఆబ్రహ్మకంటే-అనన్యత్వం- కార్యమైనజగత్తుకు-ఆరంభణ శబ్దాదిభ్యః - ఈశబ్దములే మొదలుగాగల అనన్యత్వముసేయుపపాదన చేస్తూనుండెడు వాక్యములవల్ల తెలియబడుచున్నవి ఏవాక్యములకు ఆరంభణశబ్దాదులు, అవిఅనన్యత్వముపపాదనచేస్తున్నవి.

౧౫౭. భావేచోపలబ్ధేః.

అ.—భావే - ఘటనుమొదలైన కార్యమందు - ఉపలబ్ధేః - ప్రత్యక్షమువలన.

ఘటాదికార్యభావమందు ననుయదేమృదాత్మకద్రవ్యము ఈప్రకారము న్నదని కారణమునకు ప్రత్యక్షముండుటవలన కారణమునకంటే కార్యమునకనన్యత్వముసంభవించును ఎటువలె బాల్యయౌవనాద్యవస్థావిశిష్ట కార్యుడైనదేవదత్తునికి సభేదముసంభవించునోనటువలె.

తా.— ఘటాదికార్య భావమందు మృద్ద్రవ్యమైనకారణమునకు ప్రత్యక్షమునుబట్టి కారణమున కంటే కార్యమున కనన్యత్వము చెప్పబడుచున్నది.

౧౫౮. సత్త్వాచ్చాపరస్య.

అ.— అపరస్య - కార్యకారణమందు-సత్త్వాచ్చ- కారణమునకంటే కార్యమున కనన్యత్వముండుటవలన.

అపరస్య- కార్యముకారణమందు సత్త్వాచ్చ-వుండుటనుబట్టి-కారణమునకంటె యభిన్నముకార్యము సమస్తమైన నీఘటశరావాదులు మొదలైన కార్యమంతయు ప్రాతఃకాలమందు మృత్తేఆయెనని కారణమందు కార్యము తెలియబడుచున్నది అనగా ఘటశరావాద్యవస్థచేత కూడిన మృద్రూపమైన ద్రవ్యమే పూర్వకాలంమందు పిండాకారముగా తెలియ బడెనని భావము.

౧౫౯. అసద్వ్యపదేశాన్నేతి చే

న్నధర్మాంతరేణ వాక్యశేషాద్యుక్తే శ్శబ్దాంతరాచ్చ.

అ.—అసత్-అసత్యము-వ్యపదేశాత్-చెప్పుటవలన-ఇతి-ఈయర్థము-నేతిచేత్- కాదన్నట్లయితే- న- అన కూడదు-ధర్మాంతరేణ- మరియొకధర్మసంబంధముచేత - ఆవ్యపదేశమెటువలెతెలియబడునంటే - వాక్యశేషాద్యుక్తేః-వాక్యశేషముచేతయుక్తిచేతను-శబ్దాంతరేచ్చ- మరియొకశబ్దమువలన తెలియబడును.

‘‘అసదేవేదమగ్రఆసీత్,, యనే వాక్యములందు కారణావస్థలో కార్యమునకు నసత్త్యము చెప్పుటనుబట్టి కారణమందుకార్యమునసత్తుఅని చెప్పడముపపన్నముకాదని చెప్పకూడదు సత్ యనెడి వ్యవహారమునకు హేతుభూతమైన నామరూపావస్థలకు విరోధియైన సూక్ష్మావస్థయనే పేరుగలమరియొకధర్మముచేతసంబంధముండుటవలన అసత్తనిచెప్పకూడదు ఇది ఏప్రకారము తెలియబడు చున్నదని న. (వాక్యశేషాద్యుక్తేశ్శబ్దాంతరాచ్చ) వాక్యశేషమువలన యుక్తిచేతను మరియొకశబ్దముచేతను తెలియబడుచున్నది వాక్యశేషమనగామరియొకవాక్యము ‘‘తదసదేవసన్మనోఽకురుతస్యామ్,, యనిఇట్టివాక్యమందసత్తనిచెప్పబడినవస్తువుకేమనస్సు చేసెనని చెప్పుటనుబట్టి అసత్తనేవ్యపదేశముమరియొకధర్మయోగమువలన యని తెలియబడుచున్నది.

యుక్తియోమరియొకధర్మముయొక్క—యోగమునే ఆఅసత్తనేవ్యవహారమందు హేతువుగా తెలియబడుచున్నది ఘటమున్నది ఘటములేదు యనెడు నీరెండుసదసద్వ్యవహారములకు ఘటత్వముక్షీకపాలత్వమనెడి పరస్పరవిరుద్ధధర్మములకే హేతుత్వము సిద్ధమౌచునుండగా తదతిరిక్తా నుపలబ్ధమైన తుచ్ఛత్వమునకు హేతుత్వకల్పనమందు హేతువులేకపోవుటనుబట్టి అదేప్రకారముగానే శబ్దాంతరమునున్నది ఏలాగంటే ‘‘సదేవ సోమ్యేదమగ్రఆసీత్,, యనిసచ్ఛబ్దముసమానమైన ప్రకరణమందుండెడియసచ్ఛబ్దమునుధర్మాంతరయోగసంబంధము వలన వచ్చినదని తెలియ చేయుచున్నది.

౧౮౭. పటవచ్చ.

అ.—పటవచ్చ- పటమువలెనే.

ఏప్రకారము తంతువులేసంబంధవిశేషముచే కార్యాంతరాదులను పొందిపటమనే నామరూపములుగలవైయుండునో నాప్రకారమే బ్రహ్మమనియర్థము.

౧౭౮. యథాచప్రాణాదిః.

అ.—యథా - ఏప్రకారమువా

యువు ప్రాణాదిః- ప్రాణముమొదలైనసంజ్ఞలనుపొందునో.

ఎటుల వాయువొక్కటే శరీరమందు స్థానవిశేషములనుపొంది ప్రాణాపానాది నామరూపములుగలిగి కార్యాంతరమునుపొందునో నటుల బ్రహ్మముయని తెలియవలయుగనుక జగత్తుకు బ్రహ్మమునకంటే అనన్యత్వముసిద్ధించును.

అ.—సం॥ కార్యోపాదానములకు నైయ్యాయికమతరీత్యా భేదము చెప్పవలసినందున నిమిత్తోపాదానైక్యము గూడదనిశంకించి కార్యోపాదానైక్యము శ్రుతిశతసమధిగతమాటచేత గూడుననిసిద్ధాంతము.

౪౨. ఇతరవ్యపదేశాధికరణము.

అ.—ఇతర వ్యపదేశాద్ధితా కరణాదిదోషప్రసక్తిః.

అ.—ఇతర - జీవుడని - వ్యపదేశాత్ -.చెప్పుటవలన - హితాకరణాదిదోషప్రసక్తిః- ఇష్టమునుచేయకపోవడము- అనిష్టమునుజేయడము మొదలుగాగలదోషములు సంభవమౌను.

బ్రహ్మమునకు జగత్కారణత్వము సంభవించుచున్నదా- లేదా- యనిసంశయము- సంభవింపదని పూర్వపక్షము॥ ‹‹అయమాత్మాబ్రహ్మ›› ‹‹తత్వమసీ›› యనెడి సామానాధికరణ్యముచేతజీవుడే బ్రహ్మమని తెలియబడుటవలన, జగత్సృష్టికి జీవదుఃఖహేతుత్వముండుటవలన, ఆత్మకుహితమునుచేయకుండాపోవడము-అహితమునుచేయడముమొదలైనదోషములుసంభవించుటవలన - సర్వజ్ఞుడైసత్యసంకల్పుడైనబ్రహ్మకు జగత్కారణత్వము అనుపపన్నమౌను - జీవపరబ్రహ్మలకు భేదమును చెప్పెడిశ్రుతులు జగద్బ్రహ్మలక భేదము చెప్పేనిచేతవిడువబడినవి - భేదముండిన పక్షమందనన్యత్వము సిద్ధించక పోవును ఔపాధిక భేదవిషయములుభేద శ్రుతులు-స్వాభావికమైన యభేదవిషయములభేదశ్రుతులు, యనిచెప్పినట్టయితే-ఇక్కడ విచారణచేయతగిన యంశమిది - స్వభావమువలన తనకంటే యభిన్నమైనటువంటిది జగత్తని కారణ బ్రహ్మ తెలుయుచున్నాడా - లేదా- తెలియడని చెప్పినపక్షమందు-సర్వజ్ఞత్వమునకుహానిప్రాప్తమౌను- తెలిసినపక్షమందు తనకంటేనభిన్నుడైనజీవునికిసంభవించెడి దుఃఖమునుస్వదుఃఖమని తెలిసినప్పటికి బ్రహ్మకుహితమునుచేయకపోవడము- అహితమును చేయడము మొదలైన దోషములు వారణ చేయుటకు అసాధ్యములౌను జీవబ్రహ్మలకు నజ్ఞానకృతమైన భేదముకద్దు - తద్విషయకమైనది భేదశ్రుతి యనిచెప్పే పక్షమందు - అచ్చటనుజీ

వునికినజ్ఞానముచెప్పే పక్షమందుపూర్వోక్తమైనరెండువికల్పములు సంభవించును-ఆఫలమునదే ప్రకారముగానుండును-బ్రహ్మకే యజ్ఞానముచెప్పినపక్షమందుస్వ ప్రకాశస్వరూపుడైనబ్రహ్మకుఅజ్ఞానసాక్షిత్వముదానిచేతచేయబడిన జగత్సృష్టిన్ని సంభవింపదు-అజ్ఞానముచేత ప్రకాశముతిరోహితమనిచెప్పి నప్పుడు తిరోధానమునకు ప్రకాశముచేత నాశహేతుత్వముండుటవలన ప్రకాశమునకేస్వరూపత్వ ముండుటనుబట్టీ, స్వరూపనివృత్తేకలగని యనెడి స్వరూప నాశాదిరూపములైనదోషములు సంభవించనియనిఅనేకదోషములు భాష్యమందు విస్తారముగా చెప్పబడియున్నది.

సిద్ధాంతము ‹‹అస్మాన్మాయీసృజతే విశ్వమేతత్తస్మిం శ్చాన్యోమాయయాసన్నిరుద్ధః,, ‹‹తయోరన్యఃపిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యోఅభిచాకశీతి, ప్రధాన క్షేత్రజ్ఞపతిర్గుణేశః,పృథగాత్మానంప్రేరితారంచమత్వా,, యనెడి శ్రుతులందు ప్రత్యగాత్మకునర్థాంతరభూతుడుబ్రహ్మమని తెలియుటవల్లన, జీవునికికర్మానుసారముచేత జగత్సృష్టి బ్రహ్మమునకు లీలా ప్రయోజనత్వముండుటవలన, జగత్కారణత్వము సంభవిస్తున్నది ‹‹తత్త్వమసి,, యనే సామానాధికరణ్యనిర్దేశము‹‹యస్యాత్మాశరీరం,, యనెడిశ్రుతులుజీవునికి బ్రహ్మశరీరత్వము తెలుపునుగనుక ఆ బ్రహ్మశరీరము జీవుడౌటచేతజీవ ప్రకారముగాగలవాడు బ్రహ్మమనేయర్థమునుబోధించును-సూక్ష్మచిదచిద్వస్తువులను శరీరముగాగలబ్రహ్మమేకారణావస్థగలిగినది- స్థూలచిదచిద్వస్తువులనుశరీరముగాగలిగినబ్రహ్మమేకార్యావస్థగలదిగాన కార్యకారణములకనన్యత్వము- ఇట్లయినప్పటికిశరీరమైనచిదచిద్వస్తువులకు,శరీరియైనబ్రహ్మమునకు దుఃఖిత్వపరిణామిత్వహేయప్రత్యనీకత్వ కల్యాణగుణాకరత్వముమొదలైన స్వరూపస్వభావములుశ్రుతిసిద్ధములు ఈప్రకారమువ్యవస్థకలిగయుండుట వలన జగత్కారణత్వము సంభవించును.

సూత్రార్థము. (ఇతర వ్యపదేశాద్ధితా కరణాదిదోష ప్రసక్తిః) బ్రహ్మకంటేనితరుడుజీవుడు- బ్రహ్మను జీవత్వముచేత చెప్పుటవలన, జీవునికి దుఃఖముండుటచేత, హితరూపమైన జగత్తునుచేయక పోవడము, అహితరూపమైన జగత్తునుచేయడము, మొదలైనదోషముల సంబంధముబ్రహ్మకుసంభవించునుగనుక బ్రహ్మముజగత్కారణముకాదనిన.

అనంతరము సమాధానముచెప్పుచున్నారు.

౧౬౦. అధికస్తు భేదనిర్దేశాత్.

అ.—భేదనిర్దేశాత్ - భేదముచెప్పుటవలన - అధికంతు - అర్థాంతరభూతుడుపరబ్రహ్మ.

తుశబ్దముపక్షమును వ్యావృత్తిచేసును- ప్రత్యగాత్మకు నధికుండైనవాడుయర్థాంతరభూతుడైనపరబ్రహ్మ ఏమిటివల్లనంటె-(భేదనిర్దేశాత్)“స కారణంకరణాధి పాధిపః - ప్రధాన క్షేత్రజ్ఞపతిర్గుణేశః- పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా,, ఇత్యాదులచేతప్రత్యగాత్మైన జీవునికంటే పరబ్రహ్మకు భేదముచెప్పబడుచున్నది.

తా.—శ్రుతులందు ప్రకృతిజీవులకుపతియనియు ప్రత్యగాత్ముడైన జీవునికంటేపరబ్రహ్మము భేదమనిచెప్పబడుచున్నది.

౧౬౧. అశ్మాదివచ్చ తదనుపపత్తిః.

అ.—అశ్మాదివచ్చ - అశ్మకాష్ఠలోష్ఠతృణాదులవలెనే-తదనుపపత్తిః జీవునికిబ్రహ్మభావముసంభవింపదు.

పాషాణకాష్ఠలోష్ఠ తృణాదిరూపమైన యచేతనమైన వస్తువు వలెనే అనంత దుఃఖములుగల జీవునికి నిరతిశయానంద స్వరూపుడై సత్య సంకల్పుడైన బ్రహ్మస్వరూపము రానేరదు భేదశ్రుతులచేతనే కేవలభేదము తెలియ బడేదిలేదు - వస్తుతఃఅభేదమున్ను - అనుపపత్తియాను జీవబ్రహ్మలకు సామానాధికరణ్యానిర్దేశము- యస్యాత్మాశరీరం - యనేదుయనేకశ్రుతిశతసిద్ధమైన జీవులను ప్రకారముగాగల బ్రహ్మమును చెప్పుచున్నవని అవస్థితేరితి కాశకృత్స్నయని అచ్చటనేచెప్పబడినది.

తా.— పాషాణాదులైన అచేతనములకువలె అనంతదుఃఖాకరుడైనజీవునికి పరబ్రహ్మమువలె నిరతిశయానందము సత్యసంకల్పము సంభవింపదు.

అ.—సం॥ జీవుడు స్వాధీనుడైనట్టయితే హితాకరణాదిదోషము ప్రసంగించునని శంకించి బ్రహ్మమునకు జీవునికి విశిష్టైక్యమేగాని స్వరూపైక్యములేనందున హితాకరణాది దోషముప్రసంగించదని సిద్ధాంతము.

౪౩. ఉపసంహార దర్శనాధికరణము.

౧౬౨. ఉపసంహార దర్శనాన్నేతిచేన్నక్షీరవద్ధి.

అ.—ఉపసంహార - కారకవ్యాపారముల యుపసంహారమునకు - దర్శనాత్ - ప్రత్యక్షముండుటనుబట్టి - నేతిచేత్-బ్రహ్మమునకు కారణత్వము సంభవింప దన్నట్టయితే- న- కాదు క్షీరవద్ధి - దధిరూపముగా పరిణమించుక్షీరము వలెనేసంభవించుననుట.

బ్రహ్మమునకు జగత్కారణత్వము సంభవించునా - లేదా - యని సంశయము - సంభవింపదని పూర్వపక్షము - లోకమందు కార్యసృష్టికి సమర్థమైనవస్తువుకు నాయాయి కార్యోత్పత్తియందుఅనేక కారకములయపేక్షచూడబడుటవలన విచిత్రమైన జగన్నిర్మాణమందు సమర్థుడైనప్పటికిస హాయరహితుడైనబ్రహ్మమునకు కారణత్వానుపపత్తిసంభవించుటచేతనని. సిద్ధాన్తము. క్షీరమునకుదధిరూపముగాపరిణమించుటయందు అనన్యాపేక్షయుండుటవలన అనేక కారకాపని యమము సర్వత్రనుండదు. గనుకఅన్యాపేక్ష లేనట్టి బ్రహ్మమునకే కారణత్వముసంభవించుచున్నది. సూత్రార్థము స్ఫుటముయ్యేయున్నది. క్షీరవతు యని ప్రసిద్ధముగా నిర్దేశము చేయడము చోద్యమాంద్యపరమని తెలియవలయును.

తా.—క్షీరమునకన్యాపేక్ష లేక నే దధిభావముకూడునటువలె పరబ్రహ్మమునకు కారణత్వము సంభవించును.

౧౬౩. దేవాది వదపిలోకే.

అ.—లోకే - తమతమలోకమందు-దేవాదివత్ - ఏరీతిగా దేవతలు స్వాపేక్షితములైనవానితమసంకల్పముచేత నే సృష్టిచేతురో అరీతిగాబ్రహ్మమునకువిచిత్రశక్తిగలిగియుండును ఏప్రకారము దేవాదులుతమతమ లోకములందు తమతమ అపేక్షితమైనవస్తువులను తమసంకల్పము వలననే నిర్మాణము చేయుదురో నటువలెనే బ్రహ్మమున్ను నిర్మాణము చేసునని తెలియవలయు. దేవాదులకుశాస్త్రముచేత తెలియదగినశక్తి గలిగియుండడమువలన బ్రహ్మ సామ్యము లేక్కపోయినప్పటికి దేవాదిగ్రహణము బ్రహ్మమునకువిచిత్రశక్తిత్వముయొ సులభగ్రహణార్థమని మననముచేద్దర్శితగినది.

తా.__దేవతులు తమతమలోకమందు తమ అపేక్షిత[illegible]లను నిర్మాణముచేయు భంగి బ్రహ్మకున్నటువలె నే విచిత్రశక్తికలిగియుండును.

అ.__సం॥ లోకమందు తత్కార్య జనన శక్తియుక్తునికి ఉపకరణాపేక్షయగుపడుటవలన సర్వశక్తియుక్తమైనపరబ్రహ్మమున్ను ఉపకరణము లేనిచో కారణముకానేరదని శంకించి క్షీరాదులలో నుపకరణనిరపేక్షంబుగ దధ్యాదిభావముచేత పరిణామము కనబడుటనుబట్టి పరబ్రహ్మమునకు ఉపకరణనిరపేక్షముగా కారణత్వము గూడును ఈసూత్రద్వయమందు లౌకికమైనక్షీరమును - వైదికులైనదేవతలను - బ్రహ్మమునకు సామగ్రీనిరపేక్షంబుగ కారణత్వముగూడుననిఉదాహరించిరి - లౌకికమైన దృష్టాంత

మందు వైదికదృష్టాంతము మిక్కిలి అలౌకికమైనబ్రహ్మవిషయమందు పరిగ్రాహ్యమనేచోట - "దేవాదీనాం వేదావగతశక్తీనాం దృష్టాంతతయోపాదానం బ్రహ్మణో వేదావగతశక్తేస్సుఖగ్రహణాయేతి ప్రతిపత్తవ్యం" యని యిటుల లోకవేదసిద్ధములు దృష్టాంతముగా చెప్పబడినవి.

౨౬-౪౮. కృత్స్నప్రసక్త్యధికరణము.

తిర్గుణ౨౮. కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా.

౨౮. అ.—కృత్స్న-బ్రహ్మమునకు- ప్రసక్తిః - కార్యత్వముచేతనుపయోగము కలగనియంటే - నిరవయవత్వశబ్దకోపో వా - నిరవయవత్వమును చెప్పెడు వాక్యమునకు బాధకలుగును.

బ్రహ్మమునకు జగత్కారణత్వము సంభవించునా- లేదా- యనిసంశయము సంభవింపదని పూర్వపక్షము- అవయవరహితుడైనబ్రహ్మమునకు జగదుపాదానకారణత్వము చెప్పినపక్షమందు సమస్తప్రపంచముబ్రహ్మమునకు జగదాకారముచేత యుపయోగముకలగనియనే దోషముప్రాప్తమౌను. ఆదోష నివారణమందిచ్చుచేత సావయవత్వము చెప్పినప్పుడు - "సదేవసోమ్యేదమగ్రఆసీ దేకమేవాద్వితీయం" యనేడు కారణావస్థయందు నిరవయవత్వబోధకమైన వాక్యములుబాధనుపొందును. ఎట్లైననుసూక్ష్మచిదచిద్వస్తుశరీరకమైన బ్రహ్మము కారణమనియు, స్థూలచిదచిద్వస్తుశరీరకమైనబ్రహ్మము కార్యమనియునంగీకరింపబడుచున్నది. ఐనను నాశరీరాంశమునకు కార్యత్వమంగీకరించుటవలన కృత్స్నప్రసక్తియైన నిరవయవత్వశబ్దమునకు దోషమైనను సంభవించని.

సిద్ధాంతము. సకలేతరవస్తువులకంటే విలక్షణమై శ్రుతిమాత్రముచేతనే తెలియుటకు యోగ్యమై సర్వశక్తులచేతకూడిన బ్రహ్మమునిరవయవుడైనప్పటికి కారణము కార్యముడౌచున్నాడు, పరిమితమైనశక్తిగలవస్తువనిన అక్కడచోద్యముసంభవింపదు. ఏప్రకారము జాతినంగీకరించేవానిమతమందుఒక్కజాతియే అమూర్తమైననుఖండముండాములందును- అనంతములందునుఅత్యంతవిలక్షణములైనవస్తువులందునుపరిసమాప్తిపొందేయుండును. అచ్చటఇతరవస్తుప్రేరణయేమియునుండదు. గనుక బ్రహ్మము జగత్కారణము కానేయౌను.

సూత్రార్థము. (కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపావా) బ్రహ్మకారణత్వపక్షమందు ప్రపంచము బ్రహ్మకార్యత్వముచేత నుపయోగము కలగని, నిరవయవత్వ రూపహేతువుండుటవలన, సావయవత్వము చెప్పినపక్షమందు నిరవయవత్వశబ్దము

నకు సంకోచముకలగని - అనగా నిర వయవత్వబోధకమైనశబ్దమునకు బాధకలగనియనిఅర్థము.

౧౬౫. శ్రుతేస్తుశబ్దమూలత్వాత్.

అ.—శ్రుతేః - ప్రమాణములైన శ్రుతులకు - శబ్దమూలత్వాత్ - శబ్దమూలత్వమువలన.

తుశబ్దము పక్షవ్యావృత్త్యర్థము. శ్రుతులకు ప్రామాణ్య ముండుటవలన నీప్రకారము గాదోషములురా నేరవు. (శబ్దమూలత్వాత్) శబ్దమొక్కటే మూలముగాగలిగినదౌటచేత సకలేతరములకంటెవిజాతీయము గాయుండుటవలెనని యర్థము.

౧౬౬. ఆత్మనిచైవం విచిత్రాశ్చహి.

అ.—ఏవం - ఈప్రకారము - ఆత్మనిచ - ఆత్మయందునను - విచిత్రాశ్చహి - విచిత్రములుండునుగదా.

(ఆత్మనిచైవం) జీవాత్మయందచేతన ధర్మములు ప్రసక్తికానేరవు అచేతనవిజాతీయడౌటవలనయని యర్థము.

(విచిత్రాశ్చహి) అచేతనములై విజాతీయములైన అగ్ని జలాదులందు విచిత్రములైనశక్తులు చూడబడుచున్నవి. అటువలెనే పరమాత్మకున్ను చేతనాచేతన విలక్షణత్వముచేత విచిత్రములైనశక్తులు సంభవించునని తాత్పర్యము.

౧౬౭. స్వపక్షదోషాచ్చ.

అ.—స్వపక్ష - తమపక్షమందు-దోషాచ్చ - దోషములవలన.

ప్రధానమునకు కారణముచెప్పెడి పక్షమందు దోషముసంభవించుటవలన బ్రహ్మమేజగత్కారణము-అచ్చటలౌకికవస్తువులయొక్క సజాతీయత్వముచేతప్రధానమునకుపూర్వోక్తములైనదోషములున్ను - మరికొన్ని సంభవించును.

౧౬౮. సర్వోపేతాచ తద్దర్శనాత్.

అ.—సర్వోపేతాచ - సమస్తశక్తులతో నుండుననుచు - తద్దర్శనాత్ - అటుల శ్రుతియందు చూడబడును.

సకలేతర వస్తువిలక్షణమౌటచేతను సర్వశక్తులచేకూడియుండుటచేతను కేవలముపరదేవతగా చెప్పబడేది లేమ (తద్దర్శనాచ్చ) సర్వశక్తి సంబంధబోధకమైన శ్రుతులవలన యని యర్థము. శ్రుతిసమస్తశక్తులయొక్క సంబంధములను చూపించు చున్నది. "పరాస్యశక్తి ర్వివిధైవశ్రూయతే స్వాభావికీజ్ఞాన బలక్రియాచ" యనేదే మొదలుగా గలిగినవి.

౧౬౯. వికరణత్వాన్నేతిచేత్తదుక్తం.

అ.—వికరణత్వాత్ - కరణములవలన శూన్యమౌటచేత- నేతిచేత్ -

కారణము కాదన్నట్టైతె - తదుక్తం - అది చెప్పబడినది.

చెప్పబడిన అర్థమునకు దార్ఢ్యము కలుగుటకొఱకై చోద్యపూర్వకముగా పూర్వమందు చెప్పబడిన అర్థము నుస్మరింపచేయుచున్నారు - వికరణత్వాత్ - కరణవిరహితుడౌటవలన బ్రహ్మము కారణము కాదని చెప్పినట్టైతె- "నతస్య కారణం కరణంచవిద్యత" యనిగదా వినబడుచున్నది (తదుక్తం) అక్కడయేది చెప్పతగినదో అది పూర్వమందే చెప్పబడెనని తాత్పర్యము - "శబ్దమూలత్వాత్" "విచిత్రాశ్చహి" యనుస్థలమందు చెప్పబడినదే యుక్తి, శబ్దమొక్కటే మూలముగాకలిగినదౌటచేత సకలేతరవస్తువులకంటే బ్రహ్మమునకు విలక్షణత్వముండుటవలన, విలక్షణమైన వస్తువులకు శక్తివైలక్షణ్యము లోకమందు చూడబడుచున్నందున సమస్తము పపన్నమానని తాత్పర్యము.

తా.—కరణరహితుడైనందుచేత బ్రహ్మము కారణము కాదన్నట్టైతె అటులనగూడదు - అతనియందు కార్యము కరణము విద్యమానము కాదని శ్రుతిచూపుచున్నది.

అ.—సం॥ బ్రహ్మము కార్యమైపరిణమించునపుడు నిరవయవమైనకృత్స్న బ్రహ్మము కార్యంబుగ ప్రసంగించుటచేత శ్రుతులలో నిరవయవమైన బ్రహ్మము విచిత్రజగత్కారణత్వముచేత చెప్పుటనుబట్టి - శ్రుతిప్రతిపన్నార్థమునకు యుక్త్యాబాధ లేనందున బ్రహ్మకారత్వము సమంజసము.

౮౫. ప్రయోజనవత్త్వాధి కరణము.

౧౭౦. నప్రయోజనవత్త్వాత్.

నప్రయోజనవత్త్వాత్ - సృష్టిప్రయోజనము పరిపూర్ణుడైన ఈశ్వరునికి లేకపోవుటవలన నిర్కార్తృత్వము లేదని తాత్పర్యము.

బ్రహ్మమునకు జగత్కారణత్వము సంభవించునా - లేదా - యనిసంశయము - సంభవింపదనిపూర్వపక్షము - బుద్ధిపూర్వకములైన వుద్యోగముల కుప్రయోజనసహితత్వ ముండుటవలన, స్వతస్సిద్ధముగ నవాప్తసమస్తకామముగల ఈశ్వరునికి జగత్సృష్ట్యారంభమందు ప్రయోజనమేమి లేక పోవుటవలనను - గర్భవాసాది దుఃఖరూపత్వమునుబట్టి సృష్టికి నితరానుగ్రహమందున్ను ప్రయోజనము సంభవింపదనిపూర్వపక్షము.

సిద్ధాంతము - పరిపూర్ణుడైన వాడైనప్పటికి ఈశ్వరునికి లీలారూపమైన ప్రయోజనముకొఱకు జగత్సృష్టియందు వుద్యోగముపపన్నమాను. ఏ ప్రకారము లోకమందు సప్తద్వీపము లుగలభూమండలమును ప్రభుత్వముచే

యుచుండెడురాజు పరిపూర్ణుడైనప్పటికివినోదమాత్రమేముఖ్యఫలముగా గలిగిన కంతుకాదుద్యోగములుచూడబడుచున్నవో-ఆప్రకారమేనీశ్వరునికిజగత్కారణత్వముసంభవించును.

సూత్రార్థము - (నప్రయోజనవత్త్వాత్) సృష్టికిప్రయోజనముండుట వలన,ఈశ్వరుడుస్వతస్సిద్ధముగాపరిపూర్ణుమైనవాడు గనుక ప్రయోజనము లేకపోవుటవలన నిర్మాతృత్వము లేదనియర్థము.

తా.— ఈశ్వరుడు స్వతఃపరిపూర్ణమైనవాడుగనుక ప్రయోజనము లేకపోవుటవలన సృష్టినిచేయడు.

౧౭౧. లోకవత్తులీలాకైవల్యం.

అ.—లోకవత్తు- లోకమందురాజుకుపుట్టచెండ్లాడమెటువలెవినోదమో అటువలె-లీలా - బ్రహ్మకుసృష్ట్యాదిలీలలందు, కైవల్యం - కేవలలీలామాత్రమేప్రయోజనము.

(లీలాకైవల్యం) లీలా - వినోదమునకు ప్రయోజనత్వముండుటవలన ముఖ్యత్వముసంభవించుచున్నది. ముఖ్యమైనలీలచేతనేసృష్టిద్యోగమందు ప్రయోజనత్వముసంభవించునని తాత్పర్యము (లోకవత్) యేప్రకారముగాలోకమందు రాజుకు కంతుకాదులయుద్యోగములందు లీలామాత్రమే ప్రయోజనమున్నదో అదేప్రకారమని యర్థము.

తా. [illegible]లోకమందురాజుకు పుట్ట చెండ్లాడ[illegible]లెవినోదమో అ[illegible] వలెబ్రహ్మ[illegible]ష్ట్యాదు[illegible] వలలీలామాత్ర[illegible]

ఓయీ ఈశ్వరునికివినోదమొకటేఫలముగాగలిగినట్టి జగత్సృష్టి సంభవించుచున్నదని చెప్పకూడదు, దేవతులుమనుష్యులు మొదలైనవారి వ్యత్యాసనిర్మాణముచేతపక్షపాతప్రసంగముసంభవించును. సహించుటకసాధ్యమైనదుఃఖమేగర్భమందుగాగలిగినదౌటవలన- దయారహితత్వము యొక్క ప్రసక్తిరూపదోషమువలనపరమకరుణాశాలియైన- పరిపూర్ణుడైనట్టిపరబ్రహ్మకు లీలార్థముకొఱకు జగత్సృష్టి సంభవింపదనెడి పూర్వపక్షమునకుసమాధానముచెప్పుచున్నారు

౧౭౨. వైషమ్యనైర్ఘృణ్యేనసాపేక్షత్వాత్తథాహిదర్శయతి.

అ.—వైషమ్య - ఈశ్వరునికి వైషమ్యమువలన పుట్టిన పక్షపాతము- నైర్ఘృణ్యే - దయలేకపోవడము - న- లేదు - సాపేక్షత్వాత్ - జీవులకర్మసాపేక్షవలన - తథా - ఆప్రకారముగా విషమసృష్టిచేయునని-దర్శయతి- శ్రుతులందు చూడబడుచున్నది.

ఈశ్వరునికి విచిత్రమైన జగత్సృష్టియందు దేవాదివైషమ్యప్రయుక్తమైన పక్షపాతము, దుఃఖప్రదమైనజగత్సృష్టియందునిర్ఘృణత్వము,నీరెం

డుసంభవింపవు. వైషమ్యాదులయం దీశ్వరునికి జీవునియొక్క కర్మసాపేక్షత్వ ముండుటవలన అని తెలియవలయును. జీవుల పూర్వపూర్వకర్మములను ఆలోచించి పూర్వపూర్వకర్మానుగుణముగా విషమమైన జగన్నిర్మాణము జేయును గాక ర్మేనీవైషమ్యమందు హేతువగునని తాత్పర్యము. ఆప్రకారము దేహాదియోగము జీవులకు తత్తత్కర్మసాపేక్షచేత నగునని శ్రుతియందు చూడబడుచున్నది. "సాధుకారీసాధుర్భవతి పాపకారీపాపోభవతి" యని.

తా.— పరబ్రహ్మకు విషమసృష్టివలనపుట్టిన పక్షపాతమును దయలేకపోవడమును లేవు. ఐతే ప్రాణులకర్మాపేక్షనుబట్టి విషమసృష్టి యాచున్నదని శ్రుతిచెప్పెను.

౧౭౩. నకర్మావిభాగాదితిచేన్నానాదిత్వాదుపపద్యతే చాప్యుపలభ్యతేచ.

అ.—నకర్మ- సృష్టికిపూర్వముకర్మలేదని, అవిభాగాత్ - అవధారణమువలన తెలియబడును. ఇతిచేత్ -ఇట్లన్నట్టైతే - న - కాదు, అనాదిత్వాత్ - జీవులకు అనాదిత్వమును బట్టి- ఉపపద్యతే - ఉపపన్నమౌను - ఉపలభ్యతేచ - శ్రుతులును ఈసంగతిని తెలియజేసును.

సృష్టికంటే పూర్వమందు జీవులు లేకపోవడమువలన కర్మవుండదు- ఆజీవాభావము "సదేవసోమ్యేదం" యనెడు అవధారణముచేత తెలియబడిన అభేదమునుబట్టి దృఢపడుచున్నదంటేనటుల జెప్పకూడదు-అనాదిగా నీజీవులకు తత్తత్కర్మలకు ప్రవాహరూపములుగానుండును. "తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యాంవ్యాక్రియత" యని నామరూపముల కరణమాత్రమునకే శ్రవణముండుటవలన జీవులకు స్వరూపముచేత అనాదిత్వము సిద్ధమౌను.

జీవులకు స్వరూపానాదిత్వముండినను నామరూప విభాగ అభావమువలన అవిభాగశ్రుతియుపపన్నమౌను. లేకపోయినయడల చేయబడనికర్మలయొక్క ప్రాప్తియు, చేయబడినకర్మల నాశముకలగని అనునట్టి దోషములుసంభవించును. జీవులకుఅనాదిత్వము శ్రుతిస్మృతులందు దెలియబడుచున్నవి - ఆశ్రుతులేవియనగా "జ్ఞాజ్ఞౌద్వావజావీశనీశౌ" "నిత్యోనిత్యానాం" "ప్రకృతింపురుషంచైవ విద్ధ్యనాదీఉభావపి" "నజాయతే" ఇత్యాదులు.

తా.—సృష్టికంటే పూర్వముజీవులు లేనందున, అవిభాగమువలన కర్మ లేదనియనగూడదు-జీవులకు అనాదిత్వముండుటను శ్రుతిచెప్పుచున్నది.

౧౭౪. సర్వధర్మోపపత్తేశ్చ.

అ.—సర్వధర్మోపపత్తేశ్చ - సర్వ ధర్మములుకారణత్వోపపాదకములైన బ్రహ్మమందుపపత్తిగలిగియుండుటనుబట్టి బ్రహ్మమే పరమ కారణము.

ప్రధాన పరమాణు జీవులందనుపపన్నములైన - "స్వపక్షదోషాత్" యనేస్థలమందు చెప్పబడినకారణత్వములకు నిమిత్తభూతములైన సమస్తధర్మములు బ్రహ్మమం దుపపత్తి నిజెందుటవలన బ్రహ్మమే కారణము ప్రధానపరమాణ్వాదులకు పరిమితశక్తియుండుటవలనను లోకమందు దృష్టమైన వస్తుసజాతీయత్వము చేతను అనుపపత్తులనేకప్రకారముగా సంభవించును. బ్రహ్మకారణత్వము చెప్పిన పక్షమందు శాస్త్రమొకటి చేతనే దెలియదగిన బ్రహ్మమునకు సకలేతర వైలక్షణ్యముండుటనుబట్టి అచింత్యశక్తిసంభవించుటచేత అనేకశక్తులుండునని శ్రుతులవలన సమస్తముపపన్నమౌనని తాత్పర్యము.

అ.—సం॥అవాప్తసమస్తకాముడైన బ్రహ్మమునకు ప్రయోజనాభావమువలనను - పరిపూర్ణబ్రహ్మమునకు జగత్కారణత్వ స్రష్టృత్వములు గూడదనే పూర్వపక్షమునకు అవాప్తసమస్తకాముడైనను లీలారూపప్రయోజనము సంభవించుటవలనజగత్స్రష్టృత్వము బ్రహ్మమునకు సంభవించునని సిద్ధాంతము.

ద్వితీయాధ్యాయము - ప్రథమపాదము ముగిసెను.





శ్రీ గురుభ్యోనమః.

## ద్వితీయాధ్యాయము - ద్వితీయపాదము.

### ౪౬. రచనానుపపత్త్యధికరణము.

౧౭౫. రచనానుపపత్తేశ్చ నానుమానం ప్రవృత్తేశ్చ.

అ.—రచన - విచిత్ర జగత్సృష్టి చేయుటకు - అనుపపత్తేః - అనుపపత్తిసంభవించుటవలన - అనుమానం - ప్రధానము - న - కారణము కాదు - ప్రవృత్తేశ్చ - స్పందరూపమైన ప్రవృత్తికి అనుపపత్తివర్తించును.

సాంఖ్యతంత్రసిద్ధ ప్రధాన కారణవాదమునందియు క్తిమూలకమా - కాదా - యని సంశయము. సమీచీనయుక్తిమూలమని పూర్వపక్షము. ఘటాదులవలె విచిత్రమైన సన్నివేశముగల జగద్రూప కార్యము, ఘటాదులవలె తనకు సమానమైన కారణముచేత నిర్మాణము చేయబడినది. సుఖదుఃఖ మోహాద్యాత్మకముచేత సత్వాదిరూపమైన జగత్తు సత్వరజస్తమో మూలకము. అక్కడ మహత్తుమొదలు పృథివికొనగాగల సమస్తమునకు ఘటాదులవలె పరిణామిత్వముండుటనుబట్టి కారణము నపేక్షించడమందేమివిశేషము లేదు గనుక నవి జగదుత్పత్తియందు కారణకాష్ఠ కానేరవు. వానికి పరిమితత్వముండుటవలన నపరిమిత జగదుత్పాదనమందు శక్తిగలిగి యుండవు, తక్కువ కాని అధికము కాని సామ్యముగల అపరిమితములైన సత్వరజస్తమస్సులుగల - అవ్యక్తప్రధాననామముగలది జగత్కారణము.

సిద్ధాంతము. రథమునకు - గృహమునకు హేతువులైన కాష్ఠాదులవలె అచేతనమైన ప్రధానము తనస్వరూపము దెలిసిన చేతనముతో గూడక యే విచిత్రజగన్నిర్మాణమందు సమర్థము నుపొందదు గనుక కేవలము ప్రధానమే కారణము కాదు.

సూత్రార్థము. (రచనానుపపత్తేశ్చ నానుమానం) ఊహింపబడునది గనుక అనుమానము - అనగా ప్రధానము. అచేతనమైన నావస్తువుకు ప్రాజ్ఞునిచేఅధిష్ఠింపబడకపోతే దానికివిచిత్రమైన అవస్థగల జగన్నిర్మాణసామర్థ్యముకలగదు గనుక నది కారణము కాదు. చకారముచేత సత్వాదిగుణములకు ద్రవ్యగుణత్వముండుటవలన తెలుపుమొదలైన రూపాదులకువలె నుపాదాన కారణత్వము సంభవించదని సముచ్చయము చేయబడుచున్న

ది-సత్త్వాదులు కార్యమునుపొంది లఘుత్వప్రకాశమందు హేతుభూతము లై కారణభూతములైన పృథివ్యాదులనుపొంది దాని స్వభావవిశేషములగును (ప్రవృత్తేశ్చ) అనుపపత్తేః అను పదమును అధ్యాహారము చేయవలయును. ప్రాజ్ఞునిచేత అనధిష్ఠితమైన ప్రధానమునకు విచిత్రమైన జగద్రచనానుగుణమైన స్పందరూపమైనప్రవృత్తికి నుపపత్తిలేకపోవుటవలన ప్రధానము కారణంబుగాదు.

తా.—ప్రాజ్ఞుడధిష్ఠితముకాని ప్రకృతికి విచిత్రమైన జగద్రచనసంభవింపదు-గానప్రధానము కారణముకాదు.

౧౭౯. పయోంబువచ్చేత్తత్రాపి,

అ.—పయః - క్షీరము, అంబువచ్చేత్ - నారికేళ జలమువలె అన్నట్లైతే - తత్రాపి - అచ్చటయునుప్రధానము కారణముకాఁజాలదు.

ఎటువలె క్షీరమునకు - వుదకమునకు ప్రాజ్ఞునిచేత నధిష్ఠితముగాకపోయినను, దధినారికేళ చూతాదులు విచిత్రరసరూపముచేత నేరీతిగా పరిణామము చూడబడుచున్నదో, ఆప్రకారముగా ప్రధానమునకును కేవల జగదాకారముచేత పరిణామ ముపపన్నమాచున్నదంటే - పరిహరించుచున్నారు-(తత్రాపీతి)అదియు పక్షముగా చేయబడినదని యర్థము. యొక్కడ రథాదులైన యచేతనములకుప్రాజ్ఞాధిష్ఠితత్వము చూడబడినదో దానికి వ్యతిరిక్తమైన దంతయుపక్షీకృతము చేయబడినది. "యోఽప్సుతిష్ఠన్" ఇత్యాదిశ్రుతులందు నదియు ప్రాజ్ఞాధిష్ఠితమని తెలియబడును.

తా.—క్షీర, ఉదకములు, దధినారికేళ విచిత్రరసముగాపరిణమించునట్లుప్రకృతిజగదాకారముగాపరిణమించుచున్నదనిచెప్పవచ్చునంటే - నచ్చటయును ప్రాజ్ఞాధిష్ఠితము శ్రుతియందు జెప్పబడుచున్నది.

౧౮౦. వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్

అ.—వ్యతిరేక - సర్గవ్యతిరేకముచే-అనపేక్షత్వాత్-ఇతరాపేక్షలేకపోవుటవలన - అనవస్థితేః-అనవస్థసంభవించును.

సర్గవ్యతిరేకేణ రెండవసృష్ట్యవస్థస్థితి లేకపోవడమనెడి దోషము ప్రాప్తమాటచే. కేవలము ప్రధానము కారణముకాదు. ఇతరాపేక్ష లేదుగనుక సర్వదా సృష్టికలగనియనెడి దోషము ప్రాప్తమగును.

౧౮౧. అన్యత్రాభావాచ్చనతృణాదివత్.

అ.—అన్యత్ర వృషభభుక్తతృణమందు అభావాచ్చ - క్షీరరూపము చేత ... మము లేకపోవుటవలన-న తృ... వత్ - తృణమువలెకాదు.

ధేనువుచేత గ్రసింపబడిన తృణో

దకాదులు తానే క్షీరాకారేణపరిణమించుచున్నది. ఆప్రకారమే ప్రధానమని చెప్పడము సంభవింపదు - ధేన్వాదులచేత భక్షింపఁబడినతృణాదులకును క్షీరాకారముగాపరిణామము ప్రాజ్ఞాధిష్ఠితత్వము వుండుటవలననే యగుచున్నదియని చెప్పవలెను.

ఏప్రకారమంటే ( అన్యత్రాభావాత్ ) వృషభములచే భక్షింపఁబడిన జల తృణాదులయందు క్షీరాకారముగా పరిణామము లేకపోవడమునుబట్టి యనియర్థము.

౧౭౯. పురుషాశ్మవదితిచేత్తథాపి.

అ.—పురుష- దృష్టిశూన్యుడైన పురుషుడు-అశ్మవత్ - అయస్కాంతమణులవలె నుపపన్నమౌనని - ఇతి చేత్ -అన్నట్టయితె - తథాపి- అట్లైనప్పటికి ప్రధానమునకు ప్రవృత్తిగలగనేరదు.

ప్రాజ్ఞానధిష్ఠితమైనను ప్రధానమును చైతన్యమాత్రస్వరూపుడై క్రియారహితుడైనపురుషుడు తనసాన్నిధ్యమాత్రముచేతనే సృష్టియందు ప్రవర్తింపచేసును.

ఏప్రకారము దృక్ఛక్తిగల గమనశక్తిలేనిపంగుపురుషుడు ప్రవృత్తిశక్తిగలదృక్ఛక్తిలేనిపురుషుని, స్వసాన్నిధ్యమువలన నేరీతి ప్రవర్తింపచేసునో, ఎటులఅయస్కాంతమణి తనసాన్నిధ్యమందుండెడు అయస్సును ప్రవర్తింపచేసునో అటువలెయని చెప్పినట్టయితె వారణముచేయుచున్నారు.

ఆప్రకారమైనను ప్రధానమునకు ప్రవృత్తి యుపపన్నముకానేరదు. ఆస్థలమందు పంగువైనపురుషునికి గమనశక్తి లేకయుండినను మార్గోపదేశము మొదలైన వ్యాపారములు వొప్పుడైనను చూడబడియున్నవి. అంధునకు చాక్షుషవ్యాపారము లేకపోయినను పంగువ యుపదేశగ్రహణరూపమైన చేతనధర్మమున్నది. అయస్కాంతమణికిని అయఃప్రవృత్తియందొకానొకకాలమందు అయస్సన్నిధానమున్నది-ఇచ్చటసన్నిధికంటేఅతిరిక్తమైనవిశేషము రెండుస్థలములందు లేదు-పురుషసన్నిధానమునకునిత్యత్వముండుటచేతనిత్యముసృష్టిప్రసక్తికలగని-ఆరీతిగా వొప్పినపక్షమందు రెండవసృష్టియభావము - మోక్షముయొక్క- అభావముకలగని.

తా.—దృష్టిశూన్యపురుషుడుదృక్ఛక్తిగలవానివలన నెటుల ప్రవర్తించునో - స్వాంతమువలన అయమెటులప్రవర్తించునోనటువలె పరమపురుషునివలనప్రకృతిప్రవర్తించును.

౧౮౦. అంగిత్వానుపపత్తేశ్చ.

అ.—అంగిత్వ-ఉత్కర్షరూపమైనఅంగిత్వమునకు-అనువపత్తేశ్చ-ఉపపత్తిలేకపోవడమువలన-దీనికంటే-గుణములకుఆధిక్యన్యూనత్వ రూపముల

వలనఅంగాంగిభావముచేత జగత్ప్రవృత్తియు రెండవ సర్గావస్థలయందు సామ్యావస్థయుగలిగిన వాటియందొకటికివృత్కృష్టరూపమైనఅంగిత్వమునకుఉపపత్తిసంభవింపకపోవుటవలన సంభవింపదు. ఆచ్ఛటను యొక అతిశయమున్నదని చెప్పినట్లైతె సర్వకాలమందును సృష్టియేవుండవలయునని తాత్పర్యము.

తా.—గుణములకు ఆధిక్యన్యూనత్వరూపమైన అంగాంగిభావముచేత జగత్ప్రవృత్తి రెండవ సర్గావస్థయందునొకటికిఉత్కృష్టరూపమైన అంగిత్వముసంభవింపదుగనుక ప్రాజ్ఞుడధిష్ఠితముగాని ప్రకృతికి కారణత్వముగలుగనేరదు.

౧౮౧. అన్యథానుమితౌచజ్ఞశక్తివియోగాత్.

అ.—అన్యథా- మరియొక ప్రకారము-అనుమితౌచ-ప్రధానమునుఅనుమేయించినపక్షమందును - జ్ఞశక్తివియోగాత్-జ్ఞాతృత్వశక్తిలేకపోవడమువలన పూర్వదోషము సంభవమౌను.

చెప్పబడినప్రకారమునకంటేమరియొక ప్రకారము ప్రధానమును యనూహించినపక్షమందు ప్రకృతికిజ్ఞాతృత్వమైనశక్తిలేకపోవడమువలన నిర్మాణమునకుఅనుపపత్తిసంభవించని యనెడుదోషములుఅని వారిణీయ్యములుగనుండును,

తా.—మరియొక ప్రకారము ప్రకృతికి కారణత్వమూహించినపక్షమందుజ్ఞాతృత్వ శక్తిలేక పోవడమువలన సంభవింపదు.

౧౮౨. అభ్యుపగమేప్యర్థాభావాత్.

అ.—అభ్యుపగమేపి - అంగీకారమందునను-అర్థాభావాత్ - ప్రయోజనము లేకపోవడమువలన.

ప్రధానమునకనుమానమంగీకరించినను ప్రధానముచేత ప్రయోజనము లేకపోవడమువలననది న్యూహించతగినది కాదు. పురుషునికి భోగమోక్షఫలకమాటచే ప్రధానప్రవృత్తికి ప్రయోజనము చెప్పతగినది- చైతన్యమాత్రమే దేహముగల క్రియారహితుడైననిర్వికారిదైమైనపురుషునికి ఇతరేతర అధ్యాసముచేత చేయబడిన ప్రకృతిసంబంధరూపమైనభోగము- తన్నివృత్తిరూపమైన మోక్షముసంభవింపదు.

నిర్వికారునికే ప్రకృతిసాన్నిధ్యముచేత భోగముసంభవించునని చెప్పినపక్షమందు రెంటికినిత్యత్వముండుటచేతను సర్వగతత్వముచేతను నాసాన్నిధ్యమునిత్యముగనుక మోక్షము సిద్ధింపకుండాపోని - ఆవిధమైనసన్నిధికే మోక్షహేతుత్వము చెప్పిన పక్షమందుభోగముసిద్ధించకుండాపోని యనెడిదోషము లూహింపవలెను.

తా.—ప్రకృతికి జగత్కారణ

త్వాంగీకారమందు ప్రయోజనము లేదు.

౧౮౩. విప్రతిషేధాచ్చా సమంజసం.

అ.—విప్రతిషేధాచ్చ-పరస్పరవిరుద్ధమాటవలన-అసమంజసం-అయోగ్యమాను.

ఈసాంఖ్యసిద్ధాంతమునిషేధము చేయబడినది - ప్రకృతికిప్రయోజనత్వముచేతపురుషుడుద్రష్టృవు, అధిష్ఠాత భోక్తాయని చెప్పుదురు - ఆప్రకృతివలనపురుషునికి మోక్షముకలుగుటవలననతనికిప్రయోజనముగలదు - సాధనభూతమైన ప్రకృతిచేత నే పురుషుడు భోగమును - మోక్షమునను భవించుచుండునని చెప్పబడును. పురుషుడు చైతన్యమాత్రస్వరూపుడు నిత్యుడునిర్వికారుడుద్రష్టృవు కాడు-భోక్త కాడుకర్త కాడనియు చెప్పబడును. గానపురుషుడు బంధింపబడడు, మోక్షమునకు సాధనమునుఅనుసరించడు, విడువబడినవాడు కానేరడు యనియు చెప్పుదురు.

అచేతనభూతమైనప్రకృతియే పురుషసాన్నిధ్యమువలనపురుషధర్మమైనచైతన్యమును తనయందునను స్వధర్మమైనకర్తృత్వముగలపురుషునియందునను, అనుసంధానముకొఅనుకట్టబడుచున్నది- మోక్షసాధనమైనదానినను సరించును- విడువబడుచున్నదని చెప్పుదురు- అధ్యాసరూపమైనయనుసంధానముచేతనధర్మము.

ఆప్రకారమే ప్రకృతి అనుపకారియైనపురుషునికిభోగాపవర్గ స్వరూపమైనప్రయోజనమునుసాధించుచున్నదిగానపుపకారియనియు చెప్పుదురు - అధ్యాసరూపమైన బంధాదులు పురుషునికి లేదనిచెప్పినపక్షము దానికియుపకారమేమి- ఈప్రకారముగాఅన్యోన్యవిరుద్ధ భాషణములుండుటవలన అయుక్తమని తెలియవలయు.

అ.—సం॥ప్రకృతిఅచేతనమైనందున-అచేతనములు చేత నాధిష్ఠితములైన కార్యారంభకత్వము. వ్యతిరేకము నిశ్చయింపబడుటనుబట్టి కేవలప్రధానకారణవాదమందు జగద్రచన సంభవింపదు-సాంఖ్యోక్తమైనఅబ్రహ్మాత్మక ప్రధాననిరసన ముప్రకృతిమహదహంకారాది తత్త్వములకును పరమాత్మే కారణమని జెప్పుటచేసూచితము - సర్వజగత్సంహారియనుటచే సాంఖ్యమందీశ్వరునియంగీకరించక కేవలప్రధానమే స్వతంత్రమైపరిణమించు నప్పుడుసర్గవ్యతిరేకేణ ప్రతిసర్గావస్థలేకనష్టమైపోవలెనుయనేదూషణము - సూచితము.

౪౭. మహద్దీర్ఘాధికరణము.

౧౮౪. మహద్దీర్ఘవద్వాహ్రస్వపరిమండలాభ్యాం.

అ.—హ్రస్వ పరిమణ్డలాభ్యాం

ద్వ్యణుకపరమాణువులచేత- మహద్దీర్ఘవత్-ద్వ్యణుకోత్పత్తివలెనే.

కణాదులచేత నంగీకరింపబడినపరమాణుకారణవాదము సమీచీనయుక్తిమూలమా-కాదా - యనిసంశయము. సమీచీనయుక్తిమూలమనిపూర్వపక్షము- అవయవములసంయోగమువలనఅవయవ్యుత్పత్తిదర్శనమౌను,అవయవముల అల్పత్వప్రాచుర్యముచేతసర్షపమహీధరమునకు తారతమ్యముగలుగును, అవయవమునకు అల్పత్వకాష్ఠఅవశ్యమంగీకరించ తగినదని పరమాణుసిద్ధియౌను. అవినాల్గువిధములు-ఆపరమాణువులుపరిపక్వమైన క్షేత్రజ్ఞునిఅదృష్టసచివులై పరమేశ్వరాధిష్ఠితములైద్వ్యణుకాదిక్రమము జగదారంభకమౌను.

సిద్ధాంతమైతే - అవయవములు స్వకీయమైన యూరుపార్శ్వములచే గూడినవై తమతమయధికమైన యవయవిని పుట్టించునని పరమాణువులందునదేప్రకారముత్పాదకత్వ మొప్పతగినది-అప్పటికిపరమాణువులును తమఅంశములైస్వకీయములైన అవయవములుగలదై అవి స్వకీయములని ఎక్కడను కారణమునకు విశ్రాంతి లేకపోవును

సూత్రార్థమైతే - (మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యాం) అసమంజసమనివర్తించుచున్నది- వాశబ్దముచకార్థకము- హ్రస్వపరిమండలాభ్యాం- ద్వ్యణుకపరమాణువులచేత- మహద్దీర్ఘవత్-త్ర్యణుకద్వ్యణుకోత్పత్తివలెనేఅన్యులచేత నంగీకరింపబడినసర్వము అసమంజసము.

తా.—హ్రస్వ పరమాణు వులు ద్వ్యణుకపరమాణువులువీటిచే కారణమౌననియంటే- ద్వ్యణుకత్ర్యణుకోత్పత్తివలెనే ఆరంభకత్వముకారణభూతమైనవస్తువయొక్క అనవస్థవలనసమంజసముగాదు.

ద్వ్యణుకాదిక్రమముచేతవుత్పత్తి కారణానవస్థితములకసమంజసముగలుగునుగనుక అయుక్తము - ఇచ్చట మరేమి యసంగతమన్నను చెప్పుచున్నారు.

౧౨. ఉభయథాపిన కర్మాతస్తదభావః

అ.—ఉభయథాపి - రెండువిధములుగాను-నకర్మ- క్రియసంభవింపదు-అతః-ఆకారణమువలన - తదభావః-పరమాణుసంయోగాభావమౌను.

పరమాణువుల మొదటికర్మఅదృష్టముచేతచేయబడినదనియంగీకరింపబడుచున్నది. ఆఅదృష్టముపరమాణువునుపొందినదా-లేక- క్షేత్రజ్ఞునిపొందినదా. రెండుపక్షములందును అదృష్టముసర్వదానుండుటవలన సర్వదా జగదుత్పత్తి ప్రసంగముండుటనుబట్టి

ష్టమయ్యెడి పరమాణువులుప్రళయకాలము సంహతియందువ్యాపించును- యెప్పుడుకూడదును. సంహతియందువ్యాపించినవై అదేక్షణమందే నష్టమైనయెడల-యేవికూడదును. విజ్ఞానస్వరూపుడైనవాడెవడు, యెప్పుడేవిషయమును స్పృశించును, యెవడెప్పుడుయేమిటిని తెలుసును, యెవడెప్పుడేయర్థమును పరిగ్రహించును, స్పృశించినవాడునష్టుడాయెను, స్పృశింపబడినది నష్టమాయెను, తెలిసినవాడునష్టమాయెను, తెలియబడినదినష్టమాయెను,ఎట్లు అన్యునిచేత స్పృశింపబడినది యన్యుడుదెలుసుకొనును, ఎట్లు యొకనిచేతదెలియబడిన దాన్ని మరి వొకడు పరిగ్రహించును, సంతానైకత్వముసిద్ధమైనను సంతానికంటేసంతానము నకుయథార్థముగావస్త్వంతరత్వమంగీకరింపకపోవుటవలన,అపారమార్థికమైనసంతానము వ్యర్థమాను. స్థిరత్వమైన అవిద్యచేతను సంఘాతోత్పత్తి సంభవించదు-శుక్తికాదులందు రజతావిద్యచేత శుక్తికాద్యుత్పత్తిసంభవించదు. పూర్వవిద్వాంసుడు నష్టుడాయెగనుక రెండోవాడైనఅజ్ఞునిచేతపూర్వమువినష్టుడైనవిద్వాంసునిచే దెలియబడిన అర్థోపాదానము సంభవించదు- సంస్కారాశ్రయత్వముచేత నొకడుస్థిరుడు నొకడస్థిరుడుగానంగీకరింపబడేదిలేదు. గాన జగదుత్పత్తియు లోకవ్యవహారమునుపపాదన చేయుటకసాధ్యము.

సూత్రార్థము - (సముదాయఉభయహేతుకేపి తదప్రాప్తిః) ఉభయహేతుకేపి-సముదాయమందు సముదాయత్వప్రాప్తిలేదు,పరమాణుహేతుకముగల పృథివ్యాది సముదాయము, పృథివ్యాదిహేతుకముగలశరీరఇంద్రియ సముదాయము, నీరెండు హేతుకములైన సముదాయములుక్షణికత్వముగా నంగీకరింపబడుటవలన చెప్పబడిన న్యాయముచేత సంభవించదనియర్థము.

తా.—పరమాణువులను హేతువుగాగలపృథివ్యాది సముదాయము, పృథివ్యాదులను హేతువుగాగల శరీరేంద్రియసముదాయము,నీరెండుక్షణికత్వములుగాన కార్యారంభకత్వముఘటింపదు.

౧౯-౨. ఇతరేతరప్రత్యయత్వాదుపపన్నమితిచేన్నసంఘాతభావానిమిత్తత్వాత్.

అ.—ఇతరేతరప్రత్యయత్వాత్ - పరస్పరహేతుకత్వమునుబట్టి- ఉపపన్న - లోకవ్యవహారము - ఇతిచేన్న- అనగూడదు - సంఘాతభావానిమిత్తత్వాత్ -సంఘాతభావమునకుకారణత్వము లేకపోవుటవలన.

సమస్తభావములు క్షణికములైననుఅవిద్యాదులకే పరస్పరహేతు

త్వము చెప్పుటనుబట్టి లోకవ్యవహారముపపన్నమౌను. అస్థిరమందుస్థిరత్వబుద్ధిరూపమైనఅవిద్యచేత ఆయాయిస్థలములందు రాగద్వేషాదులు సంభవించును - ఇదే మొదలైన పరంపరలచేత పునహ అవిద్యాచక్రమువలననెఱుగునని చెప్పినట్లయితే అదివుపపన్నముకానేరదు. సంఘాతభావమందు అవిద్యకు నిమిత్తత్వముండును - ఎట్లయినను అవిద్యచేత విపరీతమైన బుద్ధి క్షణికము స్థిరత్వముచేత విషయీకరించుకొనును - అట్లైనను నావస్తువస్వభావముస్థిరముకాదు గాన స్వభావము గాస్థిర కార్యమును జేయ నేరదుగనుక సంఘాతభావమున్నుసిద్ధించదనియర్థము. అస్థిరమందుస్థిరబుద్ధియుక్తమైనవిజ్ఞానాత్మకుఅప్పుడే నాశము సంభవించుటవలన యెవనికిరాగద్వేషములుసంభవించునని రాగద్వేషపరంపరయును సిద్ధించదని యభిప్రాయము.

౧౯౩. ఉత్తరోత్పాదేచపూర్వనిరోధాత్.

అ.—ఉత్తరోత్పాదేచ - ఉత్తరఘటోత్పత్తికాలమందును - పూర్వనిరోధాత్ - పూర్వవస్తువుకు నాశనముండును.

దీనికంటె - ఉత్తరక్షణఘటోత్పత్తివేళయందు పూర్వమైనఘటమునకు నాశనముకలుగుటవలన ఆఘటాభావమునకే కారణత్వము చెప్పినయడలవిశేషమేమిలేక పోవడమునుబట్టి సమస్తవస్తువులకుసర్వదా యుత్పత్తి సంభవించుననెడి దోషములు సంభవించును. పూర్వక్షణమందుండెడు వానికి హేతుత్వముచెప్పేయడలస్థిరమైనవిశేషముగలదేశాదులకునొకటియునంగీకారము లేకపోవుటవలనవుత్తరక్షణవర్తి సమస్తవస్తువులకు హేతువుకాని.

౧౯౪. అసతిప్రతిజ్ఞోపరోధోయాగపద్యమన్యథా.

అ.—అసతి- అసత్తుకుత్పత్తిని చెప్పినపక్షము-ప్రతిజ్ఞోపరోధః- ప్రతిజ్ఞాభంగము-అన్యథా - ప్రకారాంతముగా-యౌగపద్యం ఘటక్షణద్వయము సంభవించును.

అసత్తుకుత్పత్తి చెప్పినచో మీకుప్రతిజ్ఞావిరోధముసంభవించును-అధిపతికిసహకారికారణమునకును జ్ఞానోత్పత్తిహేతుత్వముప్రతిజ్ఞచేయబడును - అనంతరమీదోషమును పోగొట్టుటకొఱకైపూర్వఘటక్షణమున్నదని చెప్పినపక్షమందుఅప్పుడేకకాలమందే ఘటక్షణములు రెంటికి ప్రత్యక్షముకలగని-ఆప్రత్యక్షముసంభవించదు. ఉపరోధమనగా-విరోధము.

సద్వస్తువుకు నిరన్వయవినాశము సంభవించదని చెప్పుచున్నారు.

౧౯౫. ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యా

నిరోధాప్రాప్తిరవిచ్ఛేదాత్.

అ.—ప్రతిసంఖ్యా ప్రతిసంఖ్యానిరోధ-స్థూలసూక్ష్మవినాశములకు- అప్రాప్తిరవిచ్ఛేదాత్ - విచ్ఛేదము లేకపోవుటవలనప్రాప్తి లేదు.

ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యా నిరోధాప్రాప్తిః- అనగా స్థూలసూక్ష్మములవినాశముయొక్క అప్రాప్తియని యర్థము. స్థూలవినాశము-ముద్గరాభిఘాతమునకంటె యనంతరము కాతగినప్రత్యక్షమునకు యోగ్యము - సూక్ష్మమైతే-ప్రతిక్షణమందు కాతగిన ప్రత్యక్షమునకనర్హము - ఈ రెండునిరన్వయములు కానేరవు, ఉత్పత్తివినాశధర్మముగలద్రవ్యమునకు విచ్ఛేదము లేకపోవును. “తదనన్యత్వం” అనుసత్కార్యవాద ముపపాదన చేయబడినదనియభిప్రాయము ఘటాదులందు కపాలాది రూపమైన యవస్థచేనిరన్వయవినాశమునకు నిర్మనముండుటచేదీపాదులాగ్నబడినను సూక్ష్మావస్థను అప్రాప్తి యుండుటవలన విరోధము లేదు.

౧౯౬. ఉభయథాచదోషాత్.

అ.—ఉభయథాచదోషాత్ - వుత్పన్నమునకుతుచ్ఛత్వము, తుచ్ఛత్వమువలనయుత్పత్తి. నీ రెండును దోషములు.

పుట్టినవస్తువుకు తుచ్ఛత్వము చెప్పినను - తుచ్ఛత్వముందుత్పత్తియు నీ రెండుకల్పనలకు దోషముసంభవించునుగనుక రెండుసంభవించవు. ఉత్పన్నమునకుతుచ్ఛత్వము జెప్పెపక్షము అనంతరను దానివలన పుట్టిన జగత్తునకుతుచ్ఛత్వమేసంభవించని-సృత్సువర్ణాదులవలన పుట్టినఘటకిరీటాదులకు మృత్సువర్ణాదిస్వరూపత్వ ముండినటువలెగానతుచ్ఛతోత్పత్తియు తుచ్ఛత్వాంగీకారమసంభవింపను.

తా.—వుత్పన్నమునకుతుచ్ఛత్వము; తుచ్ఛత్వమువలన యుత్పత్తి నీ రెండును దోషములు.

౧౯౭. ఆకాశేచావిశేషాత్.

అ.—అవిశేషాత్ - అబాధితప్రతీతియందువిశేషము లేకపోవుటవలన- ఆకాశేచ - ఆకాశమందుతుచ్ఛత్వముసంభవించదు.

ఆకాశమందు తుచ్ఛత్వరూపము సంభవించదు. అబాధితప్రతీతిచేసిద్ధమైనపృథివిమొదలైన వానివలెనే ఆ ఆకాశమందు అబాధితమైన ప్రతీతిఅవిశేషంబుగనుండును - ఏప్రకారము యాకాశము తెలియబడుననిన - యిచ్ఛటశ్యేనముపడుచున్నదిచ్ఛటగృధ్రమనిశ్యేనాదుల పతనదేశత్వముచేత నాకాశము దెలియబడును.

౧౯౮. అనుస్మృతేశ్చ.

అ.—అనుస్మృతేశ్చ - ప్రత్యక్షవిషయజ్ఞానముకలుగును.

ప్రత్యభిజ్ఞాత్మకజ్ఞానమునుబట్టి ఘ

తువుకాదనినిష్ప్రయత్నులైనవారను ష్యులకుఐహికాముష్మికసర్వార్థసిద్ధి కలగని.

అ.—సం॥క్షణికములైన పరమాణ్వాదులకుకార్యారంభకత్వముఅను పపన్నములు-వైభాషిక సౌత్రాంతిక పక్షమందును అసమంజసము.

౨౭. ఉపలబ్ధ్యధికరణము.

౨౦౧.—నాభావవుపలబ్ధేః.

అ.—అభావః - జ్ఞానభిన్నమైన స్వభావము-ఉపలబ్ధేః- ప్రత్యక్షమువవలన - అనగాజ్ఞానమునందుకర్తృకర్మలు తెలియబడునుగనుక-న - చెప్పుటకసాధ్యము.

యోగాచారులచేనంగీకరింపబడినజ్ఞానమాత్రసద్భావవాదముసమీచీనయుక్తిమూలమగాదాయనిసంశయము - సమీచీనయుక్తిమూలకమనిపూర్వపక్షము - బాహ్యార్థసద్భావమునుచెప్పెడు మతమందునుఅయాయువస్తుజ్ఞానమునకు ప్రకాశమానత్వముఅవశ్యముగా ఆశ్రయించదగినది. సమస్తవస్తువునకు ప్రకాశమానముస్వాసాధారణాకారముచేత ప్రకాశముచెప్పబడుచున్నది- అచ్చటఘటపటాదిజ్ఞానమునకు ఘటపటాదులఆకారమే- ఆకారము లేకపోయినపక్షమందు అజ్ఞానమునకు ఘటాసాధారణ్యమసంభవించదు- ఏకమైనఆకారమే ప్రత్యక్షవిషయమాచున్నది. అదిజ్ఞానమునకేగాని దానికతిరిక్తమైనపదార్థమున్నదనిచెప్పడమనుపపన్నము- అంతమాత్రముచేతనే నీఘటముదెలియదగినదనియనెడులోకవ్యవహారముపపన్నమౌను. ఆఘటముబాహ్యపదార్థమువలెనేదోచడము నిర్మూలమౌటవలన భ్రాంతికృతమని దెలియవలయును.

సిద్ధాంతము. ఘటము నేను దెలియుచున్నాననెడుకర్మసహిత-కర్తృసహితమైనజ్ఞాధాత్వర్థమునకు భేదనమువలెనేసర్వలోకసాక్షికంబుగ ప్రత్యక్షవిషయమయ్యెడు వస్తువుకు కర్తృకర్మలఅభావముచేత కేవలమునకేస్థితినిపవున్మత్తుడు జెప్పినవాడౌను. స్వాసాధారణమైన ఆకారమే భేదనాదులవలెనే ఆయాయి వ్యవహారములకుయోగ్యతాపాద నాకారముచేప్రత్యక్షవిషయమాచున్నది. ఇదే ప్రకారమేభేదనాదులందుఆకారము రెండువిధములుగాభావనాదిహేతువుగాగలదై కర్తృగతమైన ప్రత్యక్షమాచున్నది. అమూర్తములైనక్రియాదులకు కర్తృకర్మలచే నిరూపణీయ్యమైనస్వాకారముగలవానికికర్మాకారత్వముస్వీకరింపబడదు.

సూత్రార్థము - (నాభావఉపలబ్ధేః) జ్ఞానమునకంటెవ్యతిరిక్తమైనలర్థాభావముచెప్పుటకసమర్థమయ్యేదిలేదు. (ఉపలబ్ధేః)ఘటమును నేనుదెలియుమను అజ్ఞాధాతువుకు కర్తృత్వ

ము చేక ర్తృత్వము చేత నుపలబ్ధియుం డుటవలన.

౨౦౨. వైధర్మ్యాచ్చనస్వప్నాదివత్.

అ.—వైధర్మ్యాత్ - నిద్ర మొదలైనదోషములు లేకపోవుటవలన-స్వప్నాదివత్ -స్వప్నమువలెమిథ్యాత్వము జెప్పకూడదు.

స్వప్నజ్ఞానమువలె నే జాగ్రదవస్థయందు సంభవించెడుజ్ఞానమునకు మిథ్యాభూతవస్తువిషయకము సంభవించదు-దానికంటే వైధర్మ్యముండుట వలన-ఆవైధర్మ్యమేదనగా-నిద్రమొలైన కరణదోషరూపమైన బాధకప్రత్యయ రహితత్వము చేత నని తాత్పర్యము. చకారమువలనవియుయథార్థములనిఅభిప్రాయము.

౨౦౩. నభావోనుపలబ్ధేః.

అ.—అనుపలబ్ధేః- ప్రత్యక్షము లేకపోవుటవలన-భావః- అర్థశూన్యజ్ఞానభావము న-సంభవింపదు.

కేవలముఅర్థశూ నకుభావముసంభవించదు- యెచ్చటను ప్రత్యక్షము లేకపోవుటవలన-అబాధితమైనవస్తువుకు సద్భావముచెప్పినపక్షమందుజ్ఞానమాత్రమునకు సద్భావము వారణచేసెడు కొఱకు సమర్థము కాదనితాత్పర్యము.

తా.—యెచ్చటనుప్రత్యక్షము లేకపోవుటవలన కేవలముఅర్థశూన్యమై నజ్ఞానమునకుభావముసంభవించదు.

అ.—సం॥ యోగాచారాభిమతముజ్ఞానాదులకొఱకు అర్థశూన్యత్వమునిశంకించిజ్ఞాతురర్థవిశేషసిద్ధిరూపము చేత నే జ్ఞానము ప్రత్యక్షముగనుక స్వప్నజ్ఞానమువలెబాధాదర్శనమువలనఅదియుక్తము.

౫౦. సర్వథానుపపత్త్యధికరణము

౨౦౪. సర్వథానుపపత్తేశ్చ.

అ.—సర్వథా - సర్వప్రకారములందును-అనుపపత్తేశ్చ - దోషమువల్లను.

మాధ్యమికుని చేత జెప్పబడినసర్వశూన్యవాదముసంభవించుచున్నదా-లేదా-యనిసంశయము. సంభవించుచున్నదని పూర్వపక్షము. విజ్ఞానముఘటాదులుసమస్తభావములును లేవు యేమిటివల్లనంటే- ఉత్పత్తినిరూపణము లేకపోవుటవలన. ఘటాదిభావములకుభావమువలన అంతమాత్రముయుత్పత్తిసంభవించదు - ఘటాదులుపుట్టుచూనుండెడువైఅసమ్మృదితమైన మృత్పిండాదులవలనపుట్టేది లేదు. అభావమువలనవుట్టుచుందని చెప్పడమునకు యుక్తముకానేరదు. అభావమువలనఉత్పన్నమైనఘటాదులుఅభావస్వరూపమేకానియనిసర్వశూన్యవాదమే యుక్తము.

సిద్ధాంతమైతె - లోకమందుభావాభావశబ్దములకు వానిబుద్ధికిని ప్ర

మాణముచేత నుపలభ్యమానమైన వస్తువులకు యవస్థావిశేషమే భావరూపమైనవిషయము. వర్తమానత్వముచేత దెలియబడెడు యవస్థా విశేషమే భావబుద్ధివిషయము-తద్విరోధ్యవస్థా విశేషము అభావబుద్ధివిషయముగను కయేమిటివలనను యతనిచేత నంగీకరింపబడిన తుచ్ఛత్వముపపన్నము కానేరదు.

సూత్రార్థము. (సర్వథానుపపత్తేశ్చ) సర్వశూన్యమును చెప్పెడువాది సర్వము సత్తని ప్రతిజ్ఞచేసి స్వేష్టార్థములుసాధించునా-అసత్తని జెప్పి సాధించునా-లేక మరియొక ప్రకారము ప్రతిజ్ఞ చేసిసాధించునా ఏప్రకారమునందునను సర్వశూన్యత్వమునకనుపపత్తి సంభవించుటవలన స్వేష్టార్థము సంభవించదు - సదసద్భావములకువిద్యమానవస్తుధర్మత్వము చెప్పుటవలన అని తాత్పర్యము.

తా.—శూన్యవాది సమస్తమును సత్తనే ప్రతిజ్ఞచేత తన అభిప్రాయమును సాధించునా, లేక అసత్తయనునా-లేక ప్రకారాంతముగానా - అనియంటే - సదసద్భావముగలవస్తువయొక్క ధర్మత్వమును జెప్పుటవలనసమస్తవిధములుగా సర్వశూన్యత్వము సంభవింపదుగనుక స్వాభిప్రాయమునకు సిద్ధిలేదు.

అ.—సం॥ సత్త్వాసత్త్వములను అవస్థారూపవిశేషమువలన అసత్తు యనే ప్రతిజ్ఞ యందునను, సత్తనే ప్రతిజ్ఞవలెనే మాధ్యమికులయొక్క అభిమతము తుచ్ఛత్వానుపపత్తులవల్ల ఆమతము యోగ్యము కాదు.

౫౧. ఏకస్మిన్నసంభవాధికరణము.

౨౦౫. నైకస్మిన్నసంభవాత్.

అ.—ఏకస్మిన్-ఒకటియందు-అసంభవాత్-విరుద్ధములు సంభవించుటలేదుగనుక-న - జైనమతము యుక్తము కాదు.

జైనమతముయుక్తికలిగినదా-కాదా-యనిసంశయము-యుక్తికలిగినదని పూర్వపక్షము. జీవాజీవశబ్దములచేత చెప్పుటకు యోగ్యమైన భోక్తృభోగ్యాద్యాత్మకమైన జగత్తుకు సత్త్వాసత్త్వము నిత్యానిత్యము భిన్నత్వాభిన్నత్వము లనెడు ధర్మములచేత అనైకాన్త్యము సంభవించును - ద్రవ్య తత్పర్యాయాత్మలచే యవస్థితమైనందున కృత్స్నమైన జగత్తు ద్రవ్య స్వరూపత్వముచేత సత్త్వైకత్వము - నిత్యత్వముయుపపన్నమౌను-పర్యాయస్వరూపము చేతవిపరీతములు-(అనగా-అసత్త్వము,అనిత్యత్వము,అభిన్నత్వములు)సంభవించును-పర్యాయ యనగా - ఘటపటత్వాద్యవస్థావిశేషములు-ద్రవ్యస్వరూపమునకేకత్వము స్థిరత్వసద్బుద్ధిబోధ్యత్వ [illegible]

చేయదేరూపమువలన ఏకత్వాదులు యుక్తము, పర్యాయశబ్దముచే దెలియదగిన అవస్థా విశేషణమునకు అనేకత్వా స్థిరత్వమువలన అసద్బుద్ధి బోధ్యత్వాత్ నారూపముచే అసత్వానిత్యత్వ నానాత్వములు యుక్తము. ప్రతీతిచే వ్యవస్థ చేయుటకు నీసంగతి అర్థమౌను, సర్వవస్తువుకు ఉభయాకారమైనప్రతీతివుండుటవలన నఉభయముపపన్నమౌను.

సిద్ధాంతము. ఒకవస్తువుకు అస్తిత్వము నాస్తిత్వముచేత అనైకాంతికత్వము యుక్తముకానేరదు. ఒకవస్తువుయందు అస్తిత్వానాస్తిత్వాదులకు విరుద్ధములైన ఛాయాతపములవలెనే యేకకాలవృత్తిత్వము సంభవించదు. ఆప్రకారముగా - ద్రవ్యమునకుదాని యందువిశేషణభూతమైన పర్యాయమునకు-ఇత్థంఅనేశబ్దమునకర్థమైన అవస్థావిశేషమునకును-ఇదియీరీతిగానున్నదనే ప్రతీతివలన ప్రకారప్రకారిత్వముచేత భిన్నపదార్థత్వములవలన నొకవస్తువందువిరుద్ధములైన సత్వాసత్వరూపధర్మములకు సమావేశము ఏకకాలమందుసంభవింపదు.ఉత్పత్తి వినాశములనే పేరుగల పరిణామవిశేషాస్పదమైనద్రవ్యమునకనిత్యత్వము దానికివిపరీతమే నిత్యత్వము, దానియందేప్రకారము రెండుసంభవించును. విరుద్ధధర్మాశ్రయత్వమునే భిన్నత్వము, దానివిపరీతముచే అభిన్నత్వము-వానియందెటుల సంభవించును. యేప్రకారము అశ్వమహిషత్వముల కేకకాలమందేకవస్తువయందు సంభవము లేదోనటువలె ఒకటైనపృథివీద్రవ్యమునకుఘటత్వముశరావత్వము ప్రదేశభేదముచే యేకప్రదేశముచేనుభయాశ్రయత్వముసంభవింపదు. ఎట్లుకాలభేదముచేనొక్కడైనదేవదత్తునికుత్పత్తి వినాశములో అంతమాత్రముచేత నేవస్తువుకుద్విస్వరూపత్వము సంభవించదు-మరేమంటే పరిణామశక్తియోగమాత్రముసంభవించును - గనుక జైనమతము యుక్తి కలిగినది కాదు.

సూత్రార్థము. ( నైకస్మిన్నసంభవాత్ ) జైనమతము యుక్తము కాదు - యేమిటివల్లనంటే - ఒకటియందును మేముచెప్పినక్రమముచేతనొకకాలమందు విరుద్ధధర్మములకు సమావేశము సంభవింపక పోవుటవలన.

తా.—ఒకవస్తువుకు అస్తిత్వానాస్తిత్వములకు విరుద్ధములైన ఛాయాతపములవలెనే ఏకకాల వృత్తిత్వము సంభవించదు.

౨౦౬. ఏవంచాత్మాకార్త్స్న్యం.

అ—ఏవం-ఇదేప్రకారము-ఆత్మ-ఆత్మకు-అకార్త్స్న్యం- అకృత్స్నత్వమువలన అనుపపత్తిగలుగును.

ఈప్రకారమాత్మ అకార్త్స్న్య ముపలనఅనుపపన్నము-ఆత్మకు శరీర పరిణామత్వమందు బృహచ్ఛరీరమం దుండిఅల్పశరీరప్రవేశము, అల్పశరీర మందుబృహచ్ఛరీరప్రవేశమందునను అకార్త్స్న్యము అనగా అపరిపూర్ణదోషముప్రసక్తియగును.ఆకాలమం దల్పపరిమాణత్వముండుటవలన.

తా.—ఆత్మకు శరీరప్రమాణత్వముచెప్పేవిషయమందు బృహచ్ఛరీరమందుండిఅల్పశరీరప్రవేశము, అల్పశరీరమందు బృహచ్ఛరీరప్రవేశమైన అపరిపూర్ణదోషప్రసక్తికలుగునని తాత్పర్యము.

౨౦౭. నచపర్యాయాదప్యవిరోధోవికారాదిభ్యః.

అ.—వికారాదిభ్యః-వికారాదులవలన-పర్యాయాదపి-పర్యాయాములచేత - అవిరోధః - అవిరోధము - నచ-లేదు.

అటువంటి స్వల్పావస్థ సంబంధముచేతను అవిరోధము సంభవింపదు-ఘటపటాదులవలెనే వికారతత్ప్రయుక్తదోషము లితనికి సంభవించనియనెడుదోషప్రసంగమువలన.

తా.—తథావిధమయినఅల్పత్వావస్థాయోగముచేతను ఘటపటాదులవలెవికారప్రయుక్తదోషమువచ్చును గనుక అటువలెచెప్పకూడదు.

౨౦౮. అంత్యావస్థితేశ్చోభయనిత్యత్వాదవిశేషః.

అ.—అంత్య-అంత్యపరిమాణమునకు-అవస్థితేః-ఏకరూపముచే నుండుటవలన-ఉభయనిత్యత్వాత్-ఆత్మకు పరిమాణమునకునిత్యత్వమువలన-అవిశేషః-విశేషములేదు.

ఏదిజీవునికి అంత్యమయినపరిమాణము మోక్షావస్థో-దానికనంతరమందేకరూపముచేనుండుటవలననదేస్వాభావికమయినపరిమాణమనిఆత్మకుఅతని పరిమాణమునకు రెంటికినిత్యత్వముండుటచే పూర్వమందుననుశరీరపరిమాణత్వము సిద్ధించదుగనుక పూర్వావస్థయందేమివిశేషములేదు గనుక జైనమతముఅసంగతమే.

అ.—సం॥నను స్తుజగత్సుసత్వాసత్వాదులచేననేకములని జైనమతము శంకించి - వాక్య-జైనవస్తువందు సత్వాసత్వాదులైన విరుద్ధధర్మములను పపత్తియగుటచే నామతముఅనాదరణీయము.

౫౨. పశుపత్యధికరణము.

౨౦౯. పత్యురసామంజస్యాత్.

అ.—పత్యుః-పశుపతిమతము-అసామంజస్యాత్ - అసమంజసత్వము వలనఆదరించతగినది కాదు.

పశుపతిమతము మోక్షార్థులచే నాదరించతగినదా- కాదాయనిసంశయము. ఆదరణీయ్యమని పూర్వపక్షము. పరమపురుషార్థ సాధనావబోధ

త్వముచేత నిఖిలవస్తు సాక్షాత్కార సమర్థముపశుపతిచేప్రణీతమాటవలన

సిద్ధాంతమాయితే-అనాదినిధన అవిచ్ఛిన్నపాఠ సంప్రదాయ నిరస్తప్రమాదాదినిఖిలదోషగన్ధ వేదసిద్ధపరావరతత్త్వములను వ్యత్యయముగాప్రతిపాదించుటవలన, నిమిత్తోపాదానములకు భేదము చెప్పుటవలన, నరాకుంభస్థాపనము దానియందుండెడు దేవతార్చనము, ముద్రికాషట్క విజ్ఞానము - దానిధారణము మొదలైన వేదవిరుద్ధాచార ప్రతిపాదన పరత్వమునుబట్టి అసామంజసముగానఅనాదరణీయము.

సూత్రార్థము - పత్యురసామంజస్యాత్ -నైకస్మిన్నసంభవాత్ -ఇచ్చట-న-అనేపదమును వుంచుకోవలెను- పత్యుః-పశుపతిమతము- ఆదరించతగినదికాదు-యెందువల్లనంటే- వేదవిరుద్ధతత్త్వాచారములను బోధించుటవలన అసామంజస్యముసిద్ధించును.

తా.—వేదవిరుద్ధతత్త్వాచారబోధనముచేలసమంజసమైయుండుటవలన పశుపతిమతముఅనాదరణీయము.

౨౧౦. అధిష్ఠానానుపపత్తేశ్చ.

అ.—అధిష్ఠాన-అధిష్ఠానమునకు - అనుపపత్తేశ్చ - వుపపత్తిలేకపోవుటవలన.

అనుమేయించతగిన ఈశ్వరాంగీకారముచేత ప్రధానమున కధిష్ఠానమీశ్వరుడని చెప్పబడుచున్నది. సశరీరులైనకులాలాదుల కేఅధిష్ఠానప్రత్యక్షము నుబట్టిఅశరీరుడైన ఈశ్వరునికి ప్రధానాధిష్ఠానత్వమనుపపన్నమైనందునఅసామంజసము. సశరీరాంగీకారమందు ఆశరీరముయొక్క సావయయమునకునిత్యత్వా నిత్యత్వమందు పూర్వోక్తదోషముకలదనియభిప్రాయము.

తా.—ఈశ్వరునికి ప్రధానాధిష్ఠానత్వముయుపపన్నముకాదు.

౨౧౧.—కరణవచ్చే న్నభోగాదిభ్యః.

భోగాదిభ్యః - సుఖదుఃఖభోగాదులవలన-కరణవచ్చేన్న- జీవునికితనకరణమువలె నేవుపపన్నముకాదు.

క్షేత్రజ్ఞునికి స్వకరణక లేబరాద్యధిష్ఠానమువలెయుపపన్నమానని చెప్పకూడదు-పుణ్యాపాపరూపకర్మనిమిత్తమువలన, క్షేత్రజ్ఞాధిష్ఠాన ఈశ్వరునికిన్ని- అట్లుచెప్పినయెడలతత్ఫలభోగాదినిఖిలతత్స్వభావముప్రసక్తమౌను.

౨౧౨. అన్తవత్త్వమసర్వజ్ఞతా వా.

అ.—అంతవత్త్వం - నాశవత్త్వము-అసర్వజ్ఞతావా-అసర్వజ్ఞత్వమునుకలుగును.

వాశబ్దము చకారార్థము. ఆప్రకారముపుణ్యాపుణ్యవత్త్వమందంతవత్త్వము,సృష్టిసంహారాస్పదత్వము అసర్వజ్ఞత్వముసంభవించనీయనుటచే యీమతము అసమంజసమే.

తా.—పుణ్యాపుణ్యవత్వమంద న్తవత్వము, సృష్టిసంహారాస్పదత్వము అసర్వజ్ఞత్వము సంభవించుటవలన అసమంజసము.

అ.—సం॥ వేదవిరుద్ధమువలనఅసమంజసమైనపశుపతి మతమాదరించ తగినది కాదు- యీమతమందుపరమాణువులుజగత్తు కుపాదాన కారణమనియు, ఆగమసిద్ధేశ్వరుడునిమిత్తకారణమనియు, సంసారమనాది-ఆగమోక్తమైనకర్మానుష్ఠానముచేపశుపతిసారూప్యమునుపొందుట మోక్షమనియు చెప్పబడియున్నది.

౫౨. ఉత్పత్త్యసంభవాధి కరణము

౨౧౩. ఉత్పత్త్యసంభవాత్.

అ.—ఉత్పత్త్యసంభవాత్ - జీవునికుత్పత్తిలేకపోవుటవలన.

సాంఖ్యాదితంత్రమువలెపాంచరాత్రతంత్రమ ప్రమాణమా-కాదాయని సంశయము అప్రమాణమని పూర్వపక్షము. «వాసుదేవాత్సంకర్షణోనామజీవోజాయత" యనిశ్రుతివిరుద్ధజీవోత్పత్తిప్రతిపాదనమువలన- «చతుర్షువేదేషు పురుషార్థ మలభమాన" యని వేదసమూహమున కనాదరవచనమువలన.

సిద్ధాంతమైతే - సంకర్షణ-ప్రద్యుమ్న - అనిరుద్ధులైన పరబ్రహ్మభావములకు-«అజాయమానోబహుధావిజాయత" యని శ్రుతిప్రసిద్ధస్వేచ్ఛావతారప్రతిపాదనముచే శ్రుతివిరోధము సంభవించదు. జీవాహంకార మనశ్శబ్దములు తత్తచ్ఛరీరకులైన సంకర్షణాదులకే నామధేయములు-తేజప్రభృతిశబ్దములవలెనె- «చతుర్షువేదేషుపురుషార్థమలభమాన" యని అనుదితహోమనింద ఉదితహోమనిందాప్రశంసార్థమువలెనె. యెటుల «ఋగ్వేదంభగవోధ్యేమి" యని యారంభించిచతుర్షువేదేషు- « ఇతిహాసపురాణంపంచమం" ఇత్యాదులచేసమస్తమైనవిద్యాస్థానములందాత్మకు వేదనాభావ వచనము వక్ష్యమాణప్రశంసార్థముకొఱకు - ఈతంత్రమందు వేదాన్తోదిత బ్రహ్మోపాసనవిధానముచే వేదమునకువిరుద్ధము కానితదర్చనాదివిధానములు జెప్పుటచేప్రమాణమగును.

సూత్రార్థమైతే- (ఉత్పత్త్యసంభవాత్) «నజాయతేమ్రియతే" యిత్యాదిశ్రుతులలోజీవునికుత్పత్త్యసంభవమువలన జీవోత్పత్తి వచనములు ప్రమాణము కావు.

తా.—శ్రుతియందు జీవులకుత్పత్తిచెప్పకపోవుటవలన జీవోత్పత్తి చెప్పడము ప్రమాణము కాదు.

౨౧౪. నచకర్తుఃకరణం.

అ.—కర్తుః-జీవునివలన-కరణం - మనస్సు-న-సంభవించదు.

“సజ్కర్షణాత్ప్రద్యుమ్నసంజ్ఞం మనఉత్పద్యత” యనిమనస్సనేకరణముకర్తృవైనజీవునివలనయుత్పత్తి యనుట శ్రుతివిరుద్ధమాటచే సంభవించదు. “ఏతస్మాజ్జాయతే ప్రాణోమనస్సర్వేన్ద్రియాణిచ” యనిమనస్సుకు బ్రహ్మమందుత్పత్తివినబడుచున్నది.

తా.—శ్రుతివిరుద్ధముగా మనస్సు జీవునిచేనుత్పత్తియనకూడదు.

౨౧౫. విజ్ఞానాదిభావేవాతదప్రతిషేధః

అ.—విజ్ఞానాదిభావః-విజ్ఞానాది తాత్పర్యము బ్రహ్మభావమందు జెప్పుటనుబట్టి-తదప్రతిషేధః- ప్రామాణ్యములకు ప్రతిషేధము లేదు.

వాశబ్దముపక్షమును వ్యావర్తించుచున్నది-విజ్ఞానము- ఆదియు-విజ్ఞానాది-బ్రహ్మ. సంకర్షణాదులకు బ్రహ్మభావమైనను- “అజాయమానోబహుధావిజాయత” యని శ్రుతిసిద్ధస్వేచ్ఛావతారములకే అచ్చట అభిధానముగాన ప్రామాణ్యమునకు ప్రతిషేధము లేదు. సంకర్షణాదులకు జీవాదిసామానాధికరణ్యముగా నిర్దేశము వారలకు అధిష్ఠాతృత్వముచేత ఉపపన్నమౌను.

తా.—బ్రహ్మమే జీవాద్యధిష్ఠానసంకర్షణాదిరూపములుగా అవతరించినందున ప్రమాణములకు విరోధము లేదు.

౨౧౬. విప్రతిషేధాచ్చ.

అ.—విప్రతిషేధాచ్చ - జీవోత్పత్తి నిషేధముండుటనుబట్టి విరుద్ధము కాదు.

ఈతంత్రమందు జీవోత్పత్తినిషేధముండుటవలన తంత్రము విరుద్ధము కాదు. “వ్యాప్తిరూపేణసంబంధఃతస్యాశ్చపురుషస్యహి । సహ్యనాదిరనంతశ్చపరమార్థేనసిశ్చిత” యనిపురుషునికుత్పత్తినిషేధింపబడుచున్నది

తా.—శ్రీపాంచరాత్రతంత్రమందు జీవులనాది అనియు పుత్పత్తినిషేధము చెప్పియున్నది.

అ.—సం॥ “వాసుదేవాత్సంకర్షణోనామ జీవోజాయత” యని ఇత్యాదులలో వేదవిరుద్ధ జీవోత్పత్త్యాదులు ప్రతిపాదించుటవలన పాంచరాత్రతంత్రము ప్రమాణము కాదని శంకించి-జీవాదిశబ్దాదులు జీవాద్యభిమానియైన పరబ్రహ్మవ్యూహపరత్వంబై జీవోత్పత్తిప్రతిపాదనపరత్వాభావమైనందున పరమాప్తనారాయణప్రణీతమైన పాంచరాత్రశాస్త్రము ప్రమాణము.

ద్వితీయాధ్యాయము - ద్వితీయపాదము ముగిసెను.





శ్రీగురుభ్యోనమః.

## ద్వితీయాధ్యాయము - తృతీయపాదము.

౫౮. వియదధికరణము.

౨౧౭. నవియదశ్రుతేః.

అ.__నవియత్ - అన్తరిక్షముత్ప త్తిచెందదు - అశ్రుతేః- శ్రవణము లేకపోవుటవలన.

అంతరిక్షముత్పత్తియౌనా - కాదాయనిసంశయము- వుత్పన్నముకాదనిపూర్వపక్షము.నిరవయమైనసర్వగతాత్మవలె వుత్పత్తి సంభవించదు. అసంభావనీయమునకు శ్రవణమున్న సంభవించదు. గనుకఉత్పత్తిశ్రుతిగౌణార్థము.

సిద్ధాంతమైతే - అంతరిక్షముత్పన్నమౌను-ఉత్పత్తి శ్రుతియుండుటవలన - అతీంద్రియములగుఅర్థములనునిర్ణయించే శ్రుతిచే చెప్పబడిన అర్థమందు నిరవయత్వహేతువుచే అనుమానముపుట్టుటకుఅర్హముకాదు. ఆత్మకుఅనుత్పత్తిశ్రుతివలననే నిత్యత్వము-నిరవయవత్వాదులచేతకాదు.

సూత్రార్థమైతే - (నవియదశ్రుతేః) వియత్తుపుట్టదు-ఎందువల్లనంటే (అశ్రుతేః) శ్రవణాభావమువలన- అసంభావనియ్యమునకుశ్రవణముసంభవించమగనుక.

తా,—శ్రవణము లేకపోవుటవల నఅంతరిక్షముబుట్టదు.

౨౧౮. అస్తితు.

అ.—వియత్తుకున్నుత్పత్తిగలదు.

వియత్తుకున్నుత్పత్తిగలదు - "ఆత్మనఆకాశస్సంభూతః" యనేశ్రుతులు - అతీంద్రియార్థవిషయమైనశ్రుతిచేత ప్రమాణాంతరా ప్రతిపన్నవియదుత్పత్తిప్రతిపాదనము సంభవించును అగ్నిచేత సేచనము చేయకూడదనే వాక్యమువలెఅయోగ్యమనియర్థము

తా.—వియత్తుకున్నుత్పత్తిగలదు

౨౧౯. గౌణ్యసంభవాచ్ఛబ్దాచ్చ.

అ.—అసంభవాత్ - సంభవించకపోవుటవలన-శబ్దాచ్చ - వుత్పత్తిచెప్పేడుశ్రుతి,గౌణీ,గౌణార్థముగలది.

"తత్తేజోఽసృజత" యనిప్రతిపన్నతేజఃప్రాథమ్యమునకువిరోధముండుటవలన మధ్యమమందుత్పత్తిసంభవించదనియుత్పత్తిశ్రుతి గౌణార్థము- "వాయశ్చాంతరిక్షంచైతదమృతం" యనిఅమృతత్వశ్రవణముండుటవలన.

తా.—ఆకాశోత్పత్తివలనసంభవించకపోవుటవలన వుత్పత్తిజెప్పేడు శ్రుతిగౌణార్థముగలది.

౨౨౦. సాచై్చకస్య బ్రహ్మశబ్ద వత్.

అ.—ఏకస్య-వొకటి-శబ్దము- బ్రహ్మశబ్దవత్ -బ్రహ్మశబ్దమువలెనే-స్యాత్ - గౌణత్వ ముఖ్యత్వములు రెండు కాగలదు.

ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుఃవాయోరగ్నిః" ఇత్యాదులందును-సర్వత్రానుషంగము చేయబడినవేకమైనసంభూతశబ్దమునకు ఆకాశమునందుగౌణత్వము- వాయ్వాదులందు ముఖ్యత్వముసంభవించుచున్నది. (బ్రహ్మశబ్దవత్) యెటుల నొక బ్రహ్మశబ్దమునకొక ప్రకరణమందు వినబడుచుండెడు-«తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నంచజాయత" యని ప్రధానమందు గౌణత్వము - «తపసా చీయతే బ్రహ్మ" యని బ్రహ్మమందుముఖ్యత్వముశ్రవణావృత్తియందువలెనే అనుషంగమందనను అభిధానావృత్తికి అనుషంగమున్ను తత్తుల్యమని యభిప్రాయము.

తా.—ఎటువలెయేకమైనబ్రహ్మశబ్దవాచ్యునియందు ముఖ్యత్వ గౌణత్వములువున్నవో-అటువలె ఆకాశాదులయందు ముఖ్యత్వ గౌణత్వములు వున్నవి.

పరిహారము చేయబడుచున్నది.

౨౨౧ ప్రతిజ్ఞాహానిరవ్యతిరేకాత్.

అ.—అవ్యతిరేకాత్ - వ్యతిరేకాభావము చేతనే-ప్రతిజ్ఞా- ప్రతిజ్ఞకు- అహానిః-హాని లేదు.

« యేనాశ్రుతం శ్రుతం" యని బ్రహ్మవిజ్ఞానము చే ఆకాశాది సర్వవిజ్ఞానము గలుగునని చేయబడిన ప్రతిజ్ఞకు భంగము లేకపోవడము-ఆకాశమునకు బ్రహ్మవలన యుత్పత్తి చెప్పుటచే దాని వ్యతిరేకాభావమువలనయాను.

౨౨౨. శబ్దేభ్యః.

అ.—శబ్దేభ్యః-శబ్దములచేనుత్పత్తిధృవమౌను.

దీనికంటే-«స దేవసోమ్యేదమగ్ర ఆసీత్ "«ఐతదాత్మ్యమిదంసర్వం" ఇత్యాదులలో బ్రహ్మమునకు ప్రాక్సృష్టియం దేకత్వావధారణము సర్వాత్మత్వాదివాదములైన శబ్దములచేత నంతరిక్షమున కుత్పత్తివినబడుచున్నది - « తత్తేజోఽసృజత " యనెడు వాక్యమందాకాశమునకుత్పత్తి చెప్పకపోవడమువలన ప్రతీయమానమైన తేజః ప్రాథమ్యము సమానప్రకరణమందును- ప్రకరణాంతరమందునను యుండెడుశబ్దములచే ప్రతీయమానమైనవియదుత్పత్తిని నివారణము చేయచాలదనిఅభిప్రాయము.

తా.—శ్రుతియందు సృష్టికి పూర్వమునేకత్వ సర్వాత్మకత్వములను జెప్పెడు శృతులచే ఆకాశోత్పత్తి ప్రత్యక్షముగ జెప్పకపోయినను తోచుచున్నదనియభిప్రాయము.

౨౨౩. యావద్వికారంతువిభాగోలోకవత్.

అ.—యావద్వికారః- వికృతములైనవస్తువులందంతటను-విభాగః- వుత్పత్తి-లోకవత్ - లోకమందువలెనే చెప్పబడినది.

ఛాందోగ్యమందేదైతే - "తత్తేజోఽసృజత" యనురీతి యాకాశోత్పత్తిస్వరూపముచేచెప్పబడేది లేదు. అట్లయినను వాక్యమందు - "ఐతదాత్మ్యమిదంసర్వం" ఇత్యాదులలోనా కాశాదిసర్వవస్తువులకుబ్రహ్మవికారవచనమువలన యావద్వికారం విభాగః - ఉత్పత్తిచెప్పబడినదని దెలియబడుచున్నది.(లోకవత్)యెటులలోకమందుయీసర్వము దేవదత్తునిపుత్రులనిచెప్పిఅందులోకొందరికి దేవదత్తునివలనయుత్పత్తిని ప్రతిపాదించుట సమస్తులకునున్నత్పత్తి చెప్పుటకొఱకని దెలియబడును.ఆకాశమునకమృతత్వవచనముదేవతలవలె చిరకాలముండునని అభిప్రాయము.

తా.—ఛాందోగ్యమందు ఆకాశాదిసమస్తవస్తువులకు బ్రహ్మవికారత్వము చెప్పుటవలన ఆకాశోత్పత్తి దెలియబడుచున్నది.

౨౨౪. ఏతేనమాతరిశ్వా వ్యాఖ్యాతః.

అ.—ఏతేన-పూర్వోక్తార్థముచే- మాతరిశ్వా-మాతరిశ్వశబ్దము- వ్యాఖ్యాతః-వ్యాఖ్యానముచేయబడినది.

ఇదేన్యాయముచేత నేవాయువుకున్నుత్పత్తిచెప్పబడినది అధికమైన శంకాభావమువలన ఈన్యాయము న్యాయాతిదేశము కాదు. "తేజోఽత స్తథాహ్యాహ" యని వాయువుయందు తేజస్సుకు యుత్పత్తినిచెప్పుటకొఱకు పృథకుగా తీసుకొనబడెను.

తా.—ఈన్యాయముచే వాయువుకున్నుత్పత్తిచెప్పబడినది.

౨౨౫. అసంభవస్తుసతోఽనుపపత్తేః.

అ.—అనుపపత్తేః-దోషమువలన- సతః-బ్రహ్మమునకు-అసంభవస్తు-ఉత్పత్తిసంభవింపదు.

తుశబ్దము-అవధారణార్థము.సతః- పరమకారణమైనపరబ్రహ్మకు - అసంభవః-వుత్పత్తిసంభవించదు - బ్రహ్మవ్యతిరిక్తమైనసర్వజగత్తుకుఏకవిజ్ఞానముచేసర్వవిజ్ఞానప్రతిజ్ఞకు భంగమువచ్చునుగనుక యుత్పత్తిచెప్పబడినదని యర్థము.

తా.—పరమకారణమైన బ్రహ్మమునకుత్పత్తి సంభవించదు.

అ.—సం॥ఛాందోగ్యమందువియదుత్పత్త్యశ్రవణముచే- వియత్తు బ్రహ్మకార్యముకాదనిశంకించి - తైత్తిరీయమందు వియదుత్పత్తి శ్రుతమాటచే ఛాందోగ్యములోనుసర్వశాఖాప్రత్యయన్యాయముచే వియదుత్పత్తివచ్చు

టనుబట్టిబ్రహ్మకార్యమని నిర్ణయించ బడినది.

౫౫. తేజోధికరణము.

౨౯౬. తేజోఽత స్తథాహ్యాహ.

అ.—తథా-అటువలె-అతః-వాయువువలన - తేజః- తేజస్సుపుట్టెను అని-ఆహ-చెప్పబడెను.

"ఆకాశాద్వాయుః" అనివ్యవహితమైనకార్యములుస్వానంతరమందుచెప్పబడిన యాకాశమువలన నేవుత్పన్నమౌనా-లేక-తచ్ఛరీరకుడైనపరబ్రహ్మవలననా యనిసంశయము. అనంతరమైన (యాకాశము) వలననే యనిపూర్వపక్షము. "ఆకాశాద్వాయుఃవాయోరగ్నిః"యని కేవలాకాశమునందుత్పత్తిశ్రవణ ముండుటవలన. "ఏతస్మాజ్జాయతేప్రాణః" యనిపరబ్రహ్మమువలనసమస్తోత్పత్తివాదము పరంపరగానుపపన్నమౌను.

సిద్ధాంతమైతే- "తత్తేజఐక్షతబహుస్స్యాం" "తాఆపఐక్షంతే"యని బహుభవనసంకల్పపూర్వకసృష్ట్యుపదేశమువలన కేవలతేజస్సునకీదృశసంకల్పముయనుపపన్నమౌను - "యస్తేజసితిష్ఠన్" "యస్య తేజశ్శరీరం" "యస్యాకాశశ్శరీరం" యని సమస్తములకు పరబ్రహ్మశరీరత్వశ్రవణంబుచే తత్తచ్ఛబ్దవాచ్యుడైనపరబ్రహ్మవలన సాక్షాత్తేజఃప్రభృతులకు సృష్టి యౌను.

సూత్రార్థము-(తేజోఽత స్తథాహ్యాహ) అతః-ఆవాయువువలననే తేజస్సుకుత్పత్తిచెప్పబడుచున్నదనిశ్రుతి అటులచెప్పును - "వాయోరగ్నిః" యని.

తా.—సమస్తములకు పరబ్రహ్మ శరీరత్వశ్రవణముండుటచేత సాక్షాత్తుగాపరబ్రహ్మమందే తేజఃప్రభృతులకుసృష్టిచెప్పబడినది.

౨౯౭. ఆపః.

అ.—ఆపః - తేజస్సువలనఉదకముపుట్టినది.

ఆకారణముచే- తథాహ్యాహాయనిఅనువర్తించును-ఆహేతువువలనతేజస్సునందుదకముపుట్టుచున్నది- "అగ్నేరాపః" "తదపోఽసృజత" యని చెప్పుచున్నది.

౨౯౮. పృథివీ

అ.—పృథివీ - భూమి యుదకమునందుబుట్టును.

ఇటులనే పృథివి ఉదకమువలనపుట్టుచున్నది-"అద్భ్యఃపృథివీ" "అన్నమసృజన్త" యనిచెప్పబడును.

ఎట్లు అన్నశబ్దముచే పృథివిచెప్పబడుచున్నదనినజెప్పుచున్నారు.

౨౯౯. అధికారరూపశబ్దాన్తరేభ్యః.

అ.—అధికారరూప శబ్దాన్తరేభ్యః - మహాభూతసృష్ట్యాదులవలన. అన్నశబ్దముచేపృథివిచెప్పబడుచు

న్నాది-మహాభూతసృష్ట్యధికారము వలన-అనంతరము మహాభూతరూపసంకీర్తనము వలన సమాన ప్రకరణమందు «యత్కృష్ణం తదన్నస్య" యనిరూపసంకీర్తనము- «అద్భ్యః పృథివి" యనిపృథివిశబ్దశ్రవణము వలన.

తా.—అన్నశబ్దము-మహాభూతసృష్ట్యధికారము వలన పృథివిఅని సంకీర్తనము చేయబడుచున్నది.

౧౩౦. తదభిధ్యానాదేవతు తల్లింగాత్సః.

అ.—లింగాత్-చిన్హమైన-తదభిధ్యానాత్-అటువంటి సంకల్పము వలన-సఏవసః-తచ్ఛరీరకుడైన పరమాత్మే కారణము.

తుశబ్దము పక్షవ్యావృత్త్యర్థము. తేజఃప్రభృతులు కేవలము స్వానంతరములకు కారణము గావు. మరేమనిన-తత్తచ్ఛరీరకుడైన ఆపరమాత్మయే వానికి కారణము- ఎందువల్లనంటే - పరమాత్మకు ధ్యానాదిసృష్టిలింగములుండుటవలన. ఎట్లనగా «తత్తేజ ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత" యనియు «తత్తేజ ఐక్షత బహుస్యాం ప్రజాయేయేతి" యని బహుభవన సంకల్పరూపమైన అభిధ్యానము కనుపించుచున్నది- ఈదృశమభిధ్యానము పరమాత్మునికే సంభవించుచున్నది.

తా.—తేజస్సు మొదలుగాగల భూతములు తామేతమకంటే అనంతర భూతములకు కారణములుగావు మరేమనిన - తత్తచ్ఛరీరకుడైనపరమాత్మకే అభిధ్యానాదులు సంభవించుటవలన.

౧౩౧. విపర్యయేణతు క్రమోఽత ఉపపద్యతే చ.

అ.—అతః-యీప్రకారము- విపర్యయేణ-వ్యత్యాసముచే చెప్పబడిన-క్రమః-క్రమము-ఉపపద్యతే చ- ఉపపన్నమౌను.

«ఆకాశాద్వాయుః వాయోరగ్నిః" యని పారంపర్యక్రమము వలనవ్యత్యాసముచే- «ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ। ఖం వాయుర్జ్యోతిరాపః పృథివి" యని బ్రహ్మమునకు రూపమైన భూతములు ఏక్రమము గానున్నదో ఆక్రమముగా నేతత్తచ్ఛరీరకుడైన బ్రహ్మమందే సృష్టి చెప్పడము యుపపన్నమౌను.

౧౩౨. అన్తరావిజ్ఞానమనసీ క్రమేణతల్లింగాదితిచేన్నావిశేషాత్.

అ.—విజ్ఞానమనసీ-ఇంద్రియమనస్సులు-అంతరా-అంతరాళమందు-క్రమేణ-క్రమముగా-తల్లింగాత్ - ప్రళయాభిజ్ఞానరూపలింగము వలన పుట్టునని - ఇతిచేన్న - అనగూడదు - అవిశేషాత్ - సాక్షాదుత్పత్త్యవిశేషము వలన.

విజ్ఞానసాధనత్వాత్ - ఇంద్రియ

ప్రాణములను, విజ్ఞానమని చెప్పబడును. “ఏతస్మాజ్జాయతే ప్రాణ” యనెడుయీవాక్యము ఆకాశతన్మాత్ర పంచక అంతరాళమందు విజ్ఞానమనస్సులు క్రమముగాబుట్టును. ఈయర్థబోధకము- “పృథివ్యప్సులీయత” యనియారంభించి “వాయురాకాశేలీయతే ఆకాశమింద్రియేషు యింద్రియాణితన్మాత్రేషుతన్మాత్రాణి భూతాదౌలీయన్త” యని ప్రళయక్రమప్రత్యభిజ్ఞలింగములుండుటవలన శ్రుత్యంతరవిరోధము లేనందున సాక్షాత్తుగాబ్రహ్మముచే సమస్తము సృష్టింపపడెననే దీవాక్యము-మరేమనిన- శ్రుత్యంతరసిద్ధపారంపర్యక్రమ పరమనియంటే-పరిహరించబడుచున్నది( నావిశేషాత్ ) భూతతన్మాత్రాన్తరాళమందు విజ్ఞానమనస్సుల కుత్పత్తియుండినను తత్తచ్ఛరీరకుడైనబ్రహ్మమునకుబోధించుటవలన సమస్తభూతేంద్రియమనఃప్రాణశబ్దములకు సాక్షాత్తుగా ఉత్పత్తియందు విశేషములేకపోవుటవలన తత్పరమందే యీవాక్యము తాత్పర్యముగలిగినది.

లోకమందు ఆయాయివస్తువాచకములుగా సిద్ధమైన శబ్దజాతములకు బ్రహ్మమందువృత్తి-ముఖ్యముగాసిద్ధించదనిశంకించిచెప్పుచున్నారు.

తా.—ఇంద్రియమనస్సులు యాకాశ - తన్మాత్రయంతరాళమందుక్రమముగాబుట్టును-శ్రుత్యన్తరసిద్ధత త్తచ్ఛరీరకుడైనబ్రహ్మమునకుబోధకమైనందున కేవలముపీనికివిశేషము లేదు.

౨౩౩. చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశోఽభాక్తస్తద్భావభావిత్వాత్.

అ.—చరాచరవ్యపాశ్రయః-స్థావరజంగమాత్మక ప్రపంచమున కాశ్రయభూతమైన-తద్వ్యపదేశః-తద్వాచకశబ్దము- తద్భావభావిత్వాత్ -బ్రహ్మ ప్రకారమాటవలన - అభాక్తః-ముఖ్యవృత్తిగలదౌను.

తుశబ్దము శంకానివృత్త్యర్థము - స్థావరజంగమవస్తువుల కాధారవ్యపదేశమున్నందున తద్వాచిశబ్దములు-బ్రహ్మమును చెప్పడము ముఖ్యమే-యేమిటివల్లనంటే - (తద్భావభావిత్వాత్ ) ఆత్మగాబ్రహ్మభావభావిత్వమువలనసమస్తవస్తువులకుతచ్ఛరీరతయాతత్ప్రకారమై యుండుటవలన - తద్వాచకశబ్దములుబ్రహ్మమందేపర్యవసించును-ప్రకారవాచిశబ్దములుప్రకారిపర్యవసాయులై యుండును గవాదిశబ్దములలోసిద్ధమైనటువలె.

తా.—స్థావర జంగమ వస్తువుల కాధారమైన వ్యపదేశము బ్రహ్మమందుముఖ్యము. ప్రకారవాచిశబ్దములు ప్రకారియందుపర్యవసానమౌను.

అ.—సం॥అనంతరము పూర్వకారణమైన కేవలాకాశాదులందు అవ్య

వహితానన్తరవాయ్వాదులుత్పన్నం
బైనదనిశంకించిఆకాశశరీరకపరమా
త్మునివలన వాయ్వాద్యుత్పత్తి గాని
కేవలపూర్వతత్వమువలన వాయ్వా
ద్యుత్పత్తిలేదనినిర్ణయము.

౫౬. ఆత్మాధికరణము.

౨౩౪. నాత్మాశ్రుతేర్నిత్యత్వా
చ్చతాభ్యః.

అ.—శ్రుతేర్నిత్యత్వాచ్చ-శ్రు
తులలోనిత్యత్వము వినబడుటవలన -
తాభ్యః-వానికొఱకు-నాత్మా- జీవు
లుపుట్టుట లేదు.

ఆత్మయుత్పన్నుడౌనా - లేదా -
యనిసంశయము. ఉత్పన్నుడౌనని పూ
ర్వపక్షము-ఏకవిజ్ఞానముచేసర్వవిజ్ఞా
నప్రతిజ్ఞవలన. "సోయేనజీవాన్వనుప్ర
జ్ఞభూమ్యాం" "ప్రజాపతిః ప్రజాఅ
సృజత" ఇత్యాది సృష్టివచనములవ
లనను ఆత్మకునిత్యత్వముచెప్పె శ్రుతు
లను ఆకాశమునకమృతత్వముచెప్పిన
వచనమువలెనయించవలసినది.

సిద్ధాంతమైతే- అనుత్పత్తిశ్రుతు
లచేనాత్మయుత్పన్నుడుకాడు-"నజా
యతేమ్రియతేవావిపశ్చిత్" యనిజీ
వోత్పత్తిని నిషిద్ధము చేయుచున్నది.
అందువలననిత్యుడు- "నిత్యోనిత్యా
నాం" ఇత్యాదిశ్రుతులచేనిత్యత్వము
తెలియుటవలన. జీవోత్పత్తిచెప్పినప
క్షసంధము చేయబడనిదానికి ప్రాప్తి
యుచేసినదానికినాశము మొదలైనప్ర
సంగమువలన, వైషమ్యనైర్ఘృణ్యప్ర
సంగము కలుగుటవలనను జీవసృష్టిని
చెప్పేవచనములకుభోక్తృత్వమునక
నుగుణమైనజ్ఞానవికాసాభిప్రాయము
ప్రాక్సృష్టియందు ఏకత్వావధార
ణాదపిభాగవచనమునకు నామరూప
విభాగాభావాభిప్రాయము. సూ
త్రార్థముస్ఫుటమైనది.

తా.—శ్రుతులయందు నిత్యత్వము
చెప్పడమువలనఆత్మపుట్టదిలేదు.

అ.—సం॥ "సోయేనజీవానావిస
సర్జ" ఇత్యాదిశ్రుతులలోజీవునికియు
త్పత్తియున్నదనిశంకించి "నజాయతే
మ్రియతే" ఇత్యాదిశ్రుతులలోనిత్య
త్వముశ్రుతమాటచేనుత్పత్తిశ్రుతిజ్ఞా
నసంకోచవికాసమును చెప్పినదేగాని
స్వరూపానిత్యత్వమును చెప్పనందున
జీవునికుత్పత్తిలేదనినిర్ణయము.

౫౭. జ్ఞాధికరణము.

౨౩౫. జ్ఞోతఏవ.

అ.—అతః-శ్రుతివలన-జ్ఞోతఏవ-
జీవుడుజ్ఞాతయే.

జీవుడుచైతన్యమాత్ర దేహముగ
లవాడా- లేకజడస్వరూపుడయ్యే ఆ
గంతుకచైతన్యగుణకుడా- లేక జ్ఞాతృ
త్వము ముఖ్యస్వరూపము గలవాడా
యని సంశయము. చైతన్యమాత్ర దే
హుడని ప్రథమపూర్వపక్షము - "వి
జ్ఞానంయజ్ఞంతనుతే" "యోవిజ్ఞా
నేతిష్ఠన్" "జ్ఞానస్వరూపమత్యంత

నిర్మలం” ఇత్యాదిశ్రుతిస్మృతులవలన. రెండవపూర్వపక్షమైతే-సుషుప్తిమూర్ఛాదులందుసత్తైనయాత్మకుచైతన్యప్రత్యక్షము లేకపోవుటవలన- జాగరూకుడైనను ఇంద్రియ వ్యాపారాన్వయవ్యతిరేకములచే ననుసరించిచేయడ ముండుటవలన చైతన్యమునకు “నప్రేత్యసంజ్ఞాస్తి” యని ముక్తునికి చైతన్యప్రతిషేధమునుబట్టి పాషాణకల్పుడయ్యేఆగంతుక చైతన్యగుణముగలవాడగును. సర్వత్ర కార్య ప్రత్యక్షముండుటవలన- సర్వత్రసన్నిధానమువలన, శరీరగమనముచేత నే కార్యసంభవమందు గతికల్పనము సంభవించదు, గనుకసర్వగతుడు ఆత్మ.

సిద్ధాంతమైతే-“అథయో వేదేదంజిఘ్రాణీతిసఆత్మా” “మనసైతాన్కామాన్పశ్యన్రమతే” “నపశ్యో మృత్యుంపశ్యతి- సర్వంహపశ్యఃపశ్యతి” “ద్రష్టాశ్రోతాఘ్రాతారసయితా” ఇత్యాది శ్రుతులలో బద్ధముక్త ఉభయావస్థగల ఆత్మజ్ఞాతయే. జ్ఞానమాత్రవ్యపదేశమందైతే జ్ఞానము ప్రధానగుణముగా వుండుటవలన, స్వరూపానుబంధిత్వముచేస్వరూపనిరూపకగుణత్వముగానుండుటవలన ఆత్మస్వరూపమునకుజ్ఞానమువలెనే స్వప్రకాశత్వ ముపపన్నమౌను. సుషుప్తిమూర్ఛాదులందుజ్ఞానముండిననుకర్మచేత అసంకుచితమై అభివ్యక్తము కాకపోయినదైనను జాగరాదులందు వికాసమునుపొందియభివ్యక్తమౌనుగాన విరోధములేదు. “నప్రేత్యసంజ్ఞాస్తి” యనిసాంసారికదేహాది అస్మరణవిషయము“నోపజనంస్మరన్నిదంశరీరం” ఇత్యాదులుప కార్థము-సర్వగతత్వవాదము అణుత్వగత్యాది శ్రుతివిరుద్ధము. సూత్రార్థము.(జ్ఞోతఏవ)అతః-శ్రుతివలనజ్ఞాతయే.

౨౩౬. ఉత్క్రాంతిగత్యాగతీనాం.

అ.—ఉత్క్రాంతి-ఉత్క్రమణము- గతి-గమనము- ఆగతీనాం-ఆగమనము మొదలైనవానియొక్క శ్రవణమువలనజీవుడణుస్వరూపుడు.

శ్రుతేఃయని అనువర్తనము చేసుకోవలసినది- “తేనప్రద్యోతేనైషఆత్మానిష్క్రామతి” “యేవైకేచాస్మాల్లోకాత్ప్రయన్తి చన్ద్రమసమేవతే సర్వేగచ్ఛన్తి” “తస్మాల్లోకాత్పునరేత్యస్మైలోకాయకర్మణ” యని ఉత్క్రాంతిగతిఆగతులను శ్రుతిచెప్పుటవలనజీవుడణువు.

౨౩౭. స్వాత్మనాచోత్తరయోః.

అ.—ఉత్తరయోః- గమనాగమనములు-స్వాత్మనాచ- తనచేతనేసంపాదనచేయబడినది.

చ శబ్దము అవధారణార్థము. ఉత్క్రాంతియందుస్థిరుడైనవానికి శరీరవియోగముచేతఎట్లైననుసంపాద్య

త్వమున్నది - ఉత్తరయోః-గమనాగమనాదులకై తే తనచేత నే సంపాద్యత్వమవశ్యము గాలంగీకరించతగినది.

౨౩౮. నాణురతచ్ఛ్రుతేరితిచేన్నేతరాధికారాత్.

అ.—అతచ్ఛ్రుతేః - మహత్త్వప్రభృతివలన- నాణుః- అణుస్వరూపుడు కాదు-ఇతిచేన్న - అనగూడదు - ఇతరాధికారాత్ - పరమాత్మప్రస్తావము వలన.

"యోయంవిజ్ఞానమయ" యని జీవునిప్రస్తుతించి "సవాఏషమహానజ ఆత్మా" యనిమహత్త్వశ్రుతివలనజీవుడణువు కాదని జెప్పకూడదు- ఇతరాధికారాత్ - "యస్యానువిత్తఃప్రతిబుద్ధ ఆత్మా"యనిమధ్యమమందుపరమాత్మ ప్రస్తుతుడాయెను.

తా.—మహత్త్వ శ్రుతివలన పరమాత్మప్రస్తుతుడౌటవలన - అణుస్వరూపుడగుజీవుడు గాడు.

౨౩౯. స్వశబ్దోన్మానాభ్యాంచ.

అ.—స్వశబ్ద - అణుశబ్దము చేతను-ఉన్మానాభ్యాంచ- ఉన్మానముచేతను జీవుడణుస్వరూపుడు.

"ఏషోణురాత్మా చేతసా వేదితవ్యః యస్మిన్ప్రాణః పఞ్చధా సంవివేశ" యనిపాఠౌక్తుగా అణుశబ్దముచేతఆత్మఅణువు-ఉన్మానమువలన అణువే. ఉన్మానం-ఉద్ధృత్యమానం - "ఆరాగ్రమాత్రోహ్యవరోపిదృష్ట" యని ఆరాగ్రమును యెత్తి దానిపరిమాణముజీవునికిచెప్పబడుచున్నది.

ఆత్మకణుపరిమాణత్వమందుసకలదేహమందుకలిగే సుఖాద్యనుభవము యేప్రకారముపపన్నమౌనని యెడప్రశ్నకుత్తరము చెప్పుచున్నారు.

౨౪౦. అవిరోధశ్చన్దనవత్.

అ.—చందనవత్ - చందనబిందువువలెనే-అవిరోధః-విరోధము లేదు.

ఏప్రకారము హరిచందనబిందువు దేహైకదేశమందుండినను సకలదేహమందుండెడు నాహ్లాదమునుపుట్టించుచున్నదో నాప్రకారము విరోధము లేదనిభావము.

తా.—దేహైకదేశవర్తి చందనబిందువు దేహమాద్యంతమందెటువలెనాహ్లాదమునుపుట్టించునోనటువలెనని తాత్పర్యము.

౨౪౧.—అవస్థితివైశేష్యాదితిచేన్నాభ్యుపగమాద్ధృదిహి.

అ.—అవస్థితి-స్థితియొక్క-వైశేష్యాత్ -విశేషత్వమువలన-ఇతిచేన్న-అనకూడదు-అభ్యుపగమాత్ - ప్రత్యక్షమువలన- హృదిహి - ఆత్మకుహృదయమందునికివినబడును.

చందనబిందువు దేహదేశవిశేషమందుండే టటువలె - దానియభావము-ఆత్మకాప్రకారము లేదని జెప్పగూడదు - ఆత్మకున్నాప్రకారము భావమంగీకరించుటవలన- హృదయమందీ

యాత్మ వుంటున్నాడని వినబడుచున్నది- "యోయంవిజ్ఞానమయః ప్రాణేషుహృద్యన్తర్జ్యోతిః" ఇత్యాదులలో.

స్వమతముచే సమాధానము చెప్పుచున్నారు.

౨౮౨. గుణాద్వాలోకవత్.

అ.—గుణాత్ -జ్ఞానమువలన - ఆలోకవత్ -వ్యాపించినటువలె.

వాశబ్దము మతాంతర వ్యావృత్త్యర్థము. ఆత్మస్వగుణమైన జ్ఞానము చేసకల దేహము వ్యాపించియుండును. ఏప్రకారము సూర్యమణిప్రభృతులు ఏకదేశమందుండినవైనను గుణభూతమైనప్రభ అనేక దేశమందు వ్యాపించియున్నదోనటువలె.

తా.—యెటుల మణిద్యుమణిప్రభృతులేక దేశమందుండియు ప్రభయెక్కడను వ్యాపించేటట్లు ఆత్మహృదయమందుండినను స్వగుణమైన జ్ఞానముచే దేహమంతట వ్యాపించియుండును అని తాత్పర్యము.

"విజ్ఞానంయజ్ఞంతనుత" ఇత్యాదులందు విజ్ఞానమే ఆత్మయని చెప్పబడుచున్నదనియంటే సమాధానము చెప్పుచున్నారు.

౨౮౩. వ్యతిరేకోగన్ధవత్తథాచ దర్శయతి.

అ.—గంధవత్ -గంధము పృథివికంటే-వ్యతిరేక- ఎట్లు భేదమో-తథాచ - ఆప్రకారమే - దర్శయతి-చూడబడును.

జ్ఞానమునుజానామియని ఆత్మగుణత్వముగా ప్రత్యక్షముండుటవలన భేదమంగీకరించతగినది - గంధవతీపృథివి అను ప్రత్యక్షమందు గంధము పృథివి కంటే యేప్రకారము వ్యతిరిక్తమో అటువలె శ్రుతిచెప్పుచున్నది. "జానాత్యేవాయంపురుష"యని.

తా.—ఎటుల గంధము పృథివికంటే అన్యమో అటుల జానము ఆత్మకంటే అన్యము.

౨౮౪. పృథగుపదేశాత్.

అ.—పృథగుపదేశాత్ -ప్రత్యేకోపదేశమువలన.

ముఖ్యముగా ప్రత్యేక ప్రత్యక్షమాత్రమే హేతువుకాదు. ఆత్మకంటే భేదముగా జ్ఞానము నుపదేశము చేయబడుచున్నది - "నవిజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపోవిద్యత" యని.

విజ్ఞానమని ఆత్మను వ్యపదేశించుటవలనజ్ఞాతయనడము ఎట్లుపపన్నమాననగా జెప్పుచున్నారు.

౨౮౫. తద్గుణసారత్వాత్తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్.

అ.—తద్గుణసారత్వాత్ - జ్ఞానసారుడౌటవలన-తద్వ్యపదేశః-జ్ఞానమనెడివ్యపదేశము - ప్రాజ్ఞవత్ -బ్రహ్మవలెనే.

జ్ఞానము సారభూతగుణమైయుండుటవలనజ్ఞానమనివ్యపదేశింపబడెను

ఏప్రకారమనగా ప్రాజ్ఞః బ్రహ్మము "బ్రహ్మణావిపశ్చితా" "యస్సర్వజ్ఞస్సర్వవిత్" యనిసర్వజ్ఞుడైనను జ్ఞానగుణసారుడౌటవలన "సత్యంజ్ఞానమ్" యనివ్యపదేశముచేయబడినది.

౨౮౬. యావదాత్మభావిత్వాచ్చనదోషస్తద్దర్శనాత్.

అ.—యావదాత్మభావిత్వాత్-ఆత్మయుండెడువరకు జ్ఞానముండుటవలన-నదోషః-దోషములేదు-తద్దర్శనాత్-అటులప్రత్యక్షమువలన.

జ్ఞానము ఆత్మస్వరూపముండువరకుండుటవలన జ్ఞానమని వ్యపదేశించడముదోషావహముకాదు. ఖండాదులందుఆప్రకారము ప్రత్యక్షముండుటవలన. ఖండాములందుయావత్స్వరూపభావియైనధర్మముండుటవలనగోత్వమునకు గౌయని వ్యవహారముండును.

సుషుప్త్యాదులందుజ్ఞానమునకుప్రత్యక్షము లేకపోవుటవలన యావదాత్మభావిత్వము సంభవింపదనే దోషమునకుసమాధానముచెప్పుచున్నారు

౨౮౭. పుంస్త్వాదివత్త్వస్యసతోభివ్యక్తియోగాత్.

అ.—పుంస్త్వాదివత్ - పుంస్త్వాదులవలెనే-సతః-స్థితిగల-అస్య- యీజ్ఞానమునకు-అభివ్యక్తియోగాత్-ప్రత్యక్షమువలన.

తుశబ్దము శంకానివృత్త్యర్థము. సుషుప్త్యాదులందుండిన అనభివ్యక్తమైన జ్ఞానమునకు జాగ్రదవస్థయందభివ్యక్తిసంభవించుటవలన యావదాత్మభావియేజ్ఞానము. (పుంస్త్వాదిత్) పుంస్త్వమనగాపురుషులకసాధారణమైనధాతువుచెప్పబడుచున్నది. ఏప్రకారమనినశరీరముసప్తధాతువికారమైనదిగనుక పుంస్త్వము బాల్యమందు అభివ్యక్తముగాక యవ్వనమందభివ్యక్తియైనటులదెలియవలయును.

ఈప్రకారము ఆత్మకు జ్ఞాతృత్వము అణుత్వముచెప్పి పక్షాంతరమందుదోషమును చెప్పుచున్నారు.

౨౮౮. నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగోన్యతరనియమోవాన్యథా.

అ.—అన్యథా-జ్ఞానాత్మవాదమందు-నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగః-వుపలబ్ధ్యనుపలబ్ధులు నిత్యముగా సంభవించని-అన్యతరనియమోవా-రెంటిలోనొకటి నిత్యముగా నుండుననెడుదోషముప్రాప్తమౌను.

అన్యథా-జ్ఞానాత్మవాదమందు-సర్వగతాత్మవాదమందును - ప్రత్యక్షాప్రత్యక్షభావములు నిత్యమువలెసంభవించని. ఉపలబ్ధ్యనుపలబ్ధ్యులందుఅన్యతరనియమముగా గాని. జ్ఞానాత్మపక్షమందు అంతమాత్రజ్ఞానమునకుప్రకాశస్వభావత్వమువలన ప్రకాశాంతరములయొక్క యుపలబ్ధిచేనిత్యమువలెప్రసక్తిసంబంధముఅనివార్యము.జ్ఞానమువుండినను హేత్వంతర

ము చేతఅనుపలబ్ధిజననమునకు యోగ్యముల వలన జ్ఞానమే అనుపలబ్ధియైనను హేతువునంగీకరించవలెనది. జ్ఞానము సర్వదా వర్తమానమగుటవలన సర్వదా రెండు సంభవించని ఏక కాలమందు విరుద్ధకార్యముపుట్టుట కయోగ్యమువలన జ్ఞానముయుపలబ్ధ్యనుపలబ్ధులకు హేతువని చెప్పుదురు-అప్పుడు రెంటయొకటికినియమముకలగని-సర్వగతత్వపక్షమందుననుజ్ఞానాత్మవాదుల కేప్రకారమో నాప్రకారమే హేతుజన్యజ్ఞానవాదులకుసమస్తాత్మలకుసర్వగతత్వమందు సమస్తాత్మమనస్సంయోగాదులకు హేతువు సమస్తములకు సాధారణత్వముండుటవలన అదృష్టముయొక్క-వుత్పత్తిహేతువుకుసర్వసాధారణత్వమువలన అదృష్టమందునువ్యవస్థకలగదు.

అ.-సం॥ప్రాసంగికముగా «యోవిజ్ఞానేతిష్ఠన్» ఇత్యాదిశ్రుతులలో ఆత్మ కేవలజ్ఞానస్వరూపుడనిశంకించి «విజ్ఞాతారం» ఇత్యాదిశ్రుతులుజీవుని జ్ఞాతాయని ప్రతిపాదించుట వలన-స్వరూపమునుజ్ఞానంబనుటస్వయంప్రకాశద్రవ్యప్రయుక్తమైనజ్ఞాతృత్వమునకు బాధకముగానందున ఆత్మజ్ఞాతయనిపరిహరించిరి.

## ౫౮. కర్త్రధికరణము.

౨౮౯. కర్తాశాస్త్రార్థవత్త్వాత్.

అ.—శాస్త్ర-శాస్త్రములు-అర్థవత్త్వాత్ -ప్రయోజనపడుటకు - కర్తా-ఆత్మనుకర్తగాఅంగీకరించవలెను.

ఆత్మకుజ్ఞాతృత్వమువలెకర్తృత్వమున్నదా-లేదా - యనిసంశయము. ప్రధానమునకేకర్తృత్వముండుటవలనఆత్మకుకర్తృత్వములేదని పూర్వపక్షము. «అహంకారవిమూఢాత్మాకర్తాహమితిమన్యతే» «నాన్యంగుణేభ్యఃకర్తారం» ఇత్యాదులలోగుణములకేకర్తృత్వముచెప్పుటవలన.

సిద్ధాంతమైతే- స్వర్గాపవర్గసాధనానుష్ఠాన విధాయకములైన శాస్త్రములకు ప్రయోజనము కలుగుటకొఱకుఆత్మనుకర్తగాఅంగీకరించవలెను జ్ఞానముకలిగినవానియందేశాస్త్రప్రవర్తకత్వముండును - అచేతనమైనప్రధానమునకుకాదు - «యజేత» «ఉపాసీత» యనికర్తరిలకారము. సూత్రమువ్యాఖ్యానముచేయబడినది.

తా.—స్వర్గాపవర్గ సాధనానుష్ఠానమైన శాస్త్రములకు ప్రయోజనత్వమువలనకర్తృత్వముగలవాడాత్మ

౨౫౦. ఉపాదానాద్విహారోపదేశాచ్చ.

అ—ఉపాదానాత్ - ఉపాదానమువలన - విహార - విహారముయొక్క- ఉపదేశాచ్చ - వుపదేశమువలనను.

« ఏవమేవైష ఏతాన్ప్రాణాన్గృహీత్వా స్వేశరీరే యథాకామంపరివ

ర్తత" యనిపరిగ్రహామునకువిహారము నకునుకర్తృత్వోపదేశమునుబట్టిఆత్మ కర్తయగును.

౨౫౧. వ్యపదేశాచ్చ క్రియాయాం నచేన్నిర్దేశవిపర్యయః.

అ—క్రియాయాం-కర్మయందు- వ్యపదేశాచ్చ - కర్తృత్వముజెప్పుట వలనకర్తృత్వముగలవాడు- నచేత్ - కాకపోయినను-నిర్దేశవిపర్యయః-కర ణవిభక్తినిర్దేశముయొక్క- వ్యత్యాస ముగలుగును.

"విజ్ఞానంయజ్ఞంతనుతే కర్మాణి తనుతేపిచ" యనియజ్ఞాదికర్మలయం దు - ఆత్మకుకర్తృత్వోపదేశవలనక ర్తయగును. విజ్ఞానశబ్దముచేతఆత్మను వ్యపదేశించలేదువితేలంతఃకరణరూ పమైనబుద్ధియనిచెప్పినయడలఅప్పుడు న్నువిజ్ఞానమందు కరణవిభక్తి నిర్దేశ మేకలగదు.

౨౫౨. ఉపలబ్ధివదనియమః.

అ—ఉపలబ్ధివత్ పూర్వమం దుజెప్పబడినయుపలబ్ధికి నియమము లే కపోవుటవలన-అనియమః - భోక్తృ త్వనియమముకలగదు.

ప్రధానమునకు కర్తృత్వముచేత ఆత్మకు భోక్తృత్వమనే పక్షమం దు పూర్వము జెప్పబడిన యుపల బ్ధుల కనియమమువలె ప్రధానమునకు సర్వసాధారణత్వము వలన భోక్తృ త్వనియమము లేకపోవును-అంతఃకర ణభేదమందును సమస్తాత్మలకు సర్వ గతత్వ ముండుటవలన సాధారణము నివార్యము.

౨౫౩. శక్తివిపర్యయాత్.

అ.—శక్తి-భోక్తృత్వశక్తికి-విప ర్యయాత్ -వత్యాసముండుటవలన.

బుద్ధికికర్తృత్వము జెప్పినయడల కర్తకన్యునికిభోక్తృత్వము లేకపోవు టవలన భోక్తృత్వరూపశక్తిన్ని బుద్ధి కేయని జెప్పవలెను గాన ఆత్మకుభో క్తృత్వశక్తిలేనందున - హానికలుగున నియర్థము.

౨౫౪. సమాధ్యభావాచ్చ.

అ—సమాధ్యభావాచ్చ - మో క్షసాధనసమాధ్యభావమువలన.

ప్రకృతికికర్తృత్వము జెప్పిన పక్ష ము మోక్షమునకుసాధనభూతమైనస మాధ్యభావముకలగని- ప్రకృతికన్యు డునైతినననెడు సమాధానమందుప్ర కృతికికర్తృత్వము సంభవింపకపోవు టవలన.

౨౫౫. యథాచతక్షోభయథా.

అ.—యథాచ- యెట్లనిన - ఉభ యథా-రెండురీతులచేత-తక్ష - తక్ష శబ్దమువలె.

ఆత్మకుకర్తృత్వముండినయడల భోగవాంఛచేసినను-లేనియడలచేయ దుఅనెడురెండుప్రకారవ్యవస్థలుయు పపన్నమగును. యెట్లనినతక్షుడు స్వ కార్యమందిచ్ఛచేతనే వ్యవస్థితుడగు

ను-బుద్ధికికర్తృత్వముండినయెడల అచేతనముగావుండుటవలన స్వేచ్ఛలేకపోవుటవలనవ్యవస్థసిద్ధించదని యభిప్రాయము.

అ.—సం॥ ఆత్మయొక్క కర్తృత్వము "హన్తాచేత్" ఇత్యాదిశ్రుతులవలననిషేధింపబడినందున స్వరూపముకాదనిశంకించి- స్వర్గమోక్షాదిఫలసాధనబోధకశాస్త్ర ప్రయోజనసిద్ధ్యర్థముగాకర్తృత్వమంగీకరించవలసినందున-కర్తృత్వ నిషేధశ్రుతిసాంసారికక్రియలు - సత్త్వరజస్తమోగుణసంసర్గకృతములు- స్వరూపప్రయుక్తములుగావనిజెప్పవచ్చినదిగానకర్తృత్వముస్వరూపమని నిర్ణయించబడినది

౫౯. పరాయత్తాధికరణము.

౨౫౬. పరాత్తుతచ్ఛ్రుతేః.

అ.—పరాత్తు-జీవునికర్తృత్వము పరమాత్మాధీనమని-తచ్ఛ్రుతేః-శ్రుతులందు వినబడుచున్నది.

౨౫౭. కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః.

అ.—విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః - విధినిషేధశాస్త్రములకువైయర్థ్యమువలన - కృతప్రయత్నాపేక్షస్తు - చేయబడినకృత్యముయొక్క అపేక్షగలదు.

ఈజీవునికుండెడు కర్తృత్వముపరమాత్మాధీనమైనదా-లేక స్వాయత్తమైనదాయనిసంశయము- స్వాయత్తమనిపూర్వపక్షము-విధినిషేధశాస్త్రములకువైయర్థ్యముసంభవించును. ఎవడుస్వబుద్ధిచేతప్రవృత్తినివృత్తియందు శక్తుడో అతడేనియోజ్యుడునిగ్రహానుగ్రహములకాస్పదుడౌచున్నాడు.

సిద్ధాంతము - "అన్తఃప్రవిష్టశ్శాస్తాజనానాంసర్వాత్మా" "యఆత్మానమన్తరోయమయతి" ఇత్యాదిశ్రుతులచేతపరమాత్మాధీనమే కర్తృత్వము-అదిజీవునిస్వబుద్ధివలనజేయబడినప్రయత్నము నపేక్షించిపరమాత్మ అనుమతిచేయుటవలన విధినిషేధములకువైయర్థ్యములేదు.

సూత్రద్వయము వ్యాఖ్యానముజేయబడినది.

తా.—శ్రుతులందు జీవునికర్తృత్వముపరమాత్మాధీనమని చెప్పియున్నది - జీవునిస్వబుద్ధిచేజేయబడెడు ప్రయత్నమునపేక్షించి పరమాత్మ అనుమతిచేయుటవలనవిధినిషేధవైయర్థ్యమురాదు.

అ.—సం॥ పూర్వాధికరణసిద్ధజీవకర్తృత్వముపరమాత్మాధీనమనిచెప్పబడినది.

౬౦. అంశాధికరణము.

౨౫౮. అంశోనానావ్యపదేశాదన్యథాచాపిదాశకితవాదిత్వమధీయత ఏకే.

అ.—అంశః - పరమాత్మాంశము జీవుడు-నానావ్యపదేశాత్ - భేదము

ను జెప్పుటవలన-అన్యథాచ- అభేదవ్య పదేశమువలన - ఏకే-కొన్నిశాఖలు-దాశకితవాదిత్వం-బ్రహ్మదాసాయనెడువాక్యములు దాశకితవాదిత్వమును అధియతే-చెప్పుచున్నవి.

జీవుడుపరమాత్మకంటె అత్యంత భిన్నుడా-లేక అజ్ఞుడైనపరమాత్మేనా-లేక ఉపాధిసంబంధమైనపరమాత్మా-లేకపరమాత్మాంశమాయని సంశయము. అత్యంతభిన్నుడని మొదటిపక్షము «పృథగాత్మానం ప్రేరితారంచమత్వా» «తయోరన్యఃపిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యోఅభిచాకశీతి» «అనీశశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్» «సర్వస్యవశీసర్వస్యేశానః» యిత్యాదిభేదశ్రుతులలోజీవపరమాత్మలకు కర్మపరతంత్ర, తద్విపరీతత్వములు వినబడుటవలన. అభేదశ్రుతులునరపతియేసమస్తలోకములని చెప్పే టటువలె ఔపచారికము - భేదశ్రుతులకవిద్యావిషయమువల్లనైనను ఉపాధిసంబన్ధవిషయములనైనను అముఖ్యవృత్తి సంభవించుటచేత అభేదశ్రుతి ముఖ్యమయ్యెడికొఱకు అజ్ఞుడు పరమాత్మ అనిగాని ఉపాధిసంబంధుడు జీవుడనిగాని చెప్పడము యుక్తము.

సిద్ధాంతము. పరమాత్మకు సత్యసంకల్పత్వ సర్వజ్ఞత్వ నిరవద్యత్వ శ్రుతివలన అజ్ఞత్వము యుపాధిసంబంధత్వము సంభవించనందున, జీవశబ్దమునకు జీవశరీరకపరమాత్మవాచకముండుటవలన «తత్త్వమసి» «అయమాత్మాబ్రహ్మ» అనేసామానాధికరణ్యమునకు ముఖ్యత్వము వలన శరీరశరీరులకు విశేషణవిశేష్యత్వముండుటవలన స్వరూపస్వభావభేదములచేత భేదశ్రుతికిని ఖ్యత్వము సంభవించుటవలనను విశిష్టవస్త్వైకదేశమాటచే విశేషణము పరమాత్మాంశమైనజీవుడు. జీవశరీరత్వము పరమాత్మకు «యస్యాత్మాశరీరం» యిత్యాదులందుసిద్ధము.

సూత్రార్థము - అంశః-పరమాత్మాంశమైనజీవుడు - (నానావ్యపదేశాత్) భేదముగా చెప్పబడుటవలనను (అన్యథాచ) అభేదముగా చెప్పుటవలనను - అనగా చెప్పినప్రకారముభయమునకు ముఖ్యత్వము కొఱకని యభిప్రాయము. (దాశకితవాదిత్వమధీయత ఏకే) «బ్రహ్మదాశా బ్రహ్మదాసా» యనెడువాక్యముచేత దాశకితవాదిత్వమును కొన్నిశాఖలు చెప్పుచున్నారు-సర్వజీవవ్యాపిత్వమువలన అభేదోపదేశమునకు అచ్చటయుండెడి ఆదరము ప్రతీతమౌచున్నదని అర్థము.

౨౪౫. మన్త్రవర్ణాత్.

అ.—మన్త్రవర్ణాత్ - మంత్రవర్ణమువలన.

అంశమేజీవుడు - «పాదోస్యవిశ్వాభూతాని» యనిపాదశబ్దముఅంశవాచీ.

౪౮. అపిస్మర్యతే.

అ.—అపిస్మర్యతే- స్మృతియందు ననుజెప్పబడును.

"మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" యని జీవునికి పరమాత్మాంశము స్మరింపబడుచున్నది.

ఏకద్రవ్యమందేకభాగము అంశమాయెనుగనుక జీవునికి బ్రహ్మము యొక్క యేకభాగత్వముండుటవలన జీవదోషములు బ్రహ్మమునకు కలుగనిఅంటే అందుకు సమాధానము చెప్పుచున్నారు.

౪౯. ప్రకాశాదివత్తునైవంపరః.

తా.—ఏవం-ఈప్రకారముగా - ప్రకాశాదివత్ -ప్రకాశాదులవలె- పరః-పరబ్రహ్మ-న-కాదు.

తుశబ్దము శంకానివృత్త్యర్థము-ప్రకాశముగలమణిద్యుమణిప్రభృతులకు ప్రకాశము విశేషణభూతముగనుకనే ప్రకారమంశమౌ- ఆప్రకారము బ్రహ్మము జీవశరీరకుడౌటచేత, జీవవిశిష్టుడైన బ్రహ్మమునకు అంశము జీవుడు- విశిష్టవస్తువు యొక్క ఏకభాగమౌటచేత విశేషణము విశిష్టమునకు అంశము- అది శబ్దమువలన ద్రవ్యవిశేషణత్వమైన స్వభావమైనజాతిగుణశరీరములు గ్రహింపబడుచున్నది. విశేషణ విశేష్యములకు స్వరూపస్వభావములచే భేదములు కలిగియుండుటవలన విశేషణభూతుడైన జీవుడు యెట్టిస్వరూపము యెట్టిస్వభావము గలవాడో పరబ్రహ్మ అట్టివాడుగాదు- సర్వజ్ఞుడు సత్యసంకల్పుడు నిత్యుడు నిరవద్యుడు యని అర్థము.

౫౦. స్మరన్తిచ.

అ.—స్మరన్తిచ - ప్రకాశాదులవలె జీవుని అంశముగా పరాశరాదులు తెలియుదురు.

ప్రకాశాదులవలె జీవునికి "ఏకదేశస్థితస్యాగ్నేర్జ్యోత్స్నా విస్తారిణీ యథా। పరస్యబ్రహ్మణశ్శక్తిస్తథేదమఖిలంజగత్" యని బ్రహ్మమును గూర్చి అంశత్వమున్ను "యతిర్ఋత్విజస్సుజ్యతే యేనతత్త్వజాతేన వైద్విజతస్య స్పృజ్యస్యసమ్భూతౌ తత్సర్వం వై హరేస్తనుః" అని శరీరత్వమున్ను వున్నదని పరాశరాదులు సాయించియున్నారు. బ్రహ్మాంశత్వముచేత సమస్తాత్మలకు సమత్వ ముండుటవలన వేదాధ్యయనాదులయందు కొందరికి అనుజ్ఞయు కొందరికి పరిహారము యే ప్రకారము ఉపపన్నమౌనననగా చెప్పుచున్నారు.

౫౧. అనుజ్ఞాపరిహారౌ దేహసమ్బన్ధాజ్జ్యోతిరాదివత్.

అ.—అనుజ్ఞా-సమ్మతి-పరిహారౌ-నిషేధము-దేహసంబంధాత్ - శుచ్యశుచి దేహ సంబంధసంయోగమువలన-జ్యోతిరాదివత్ - అగ్ని మొదలైనవానికివలె నేకలుగును.

బ్రాహ్మణులు మొదలైనవారికి పరిశుద్ధా పరిశుద్ధదేహసంబంధమువలన అనుజ్ఞా పరిహారము లుపపన్నమౌను.

(జ్యోతిరాదివత్-)జ్యోతిః-అగ్ని-యెటుల శ్రోత్రియుల గృహములయందు అగ్నితీసుకొని రాబడునో - స్మశానాదులయందు పరిహరింపబడునో - యెటువలె శ్రోత్రియాదుల స్నానములు సమ్మతింప బడునో దుష్టులఅన్నము పరిహరింపబడునో ఆప్రకారమనియర్థము

౪౯. అసన్తతేశ్చావ్యతికరః-

అ.—అసన్తతేశ్చ- అచ్చటచ్చట అవచ్ఛిన్నుడౌటవలన - అవ్యతికరః- భోగవ్యతికరము లేదు.

జీవులకు ప్రతిశరీరము భిన్నముగా వుండుటవలనను అణుత్వముచేత ఆయాయి శరీరములందవచ్ఛిన్నమౌటవలనను భోగవ్యతికరత్వముకలుగదు. అజ్ఞబ్రహ్మజీవవాదమందును- ఉపహితబ్రహ్మజీవవాదమందునను - అజ్ఞానసంబంధముఉపాధిసంబంధము గలిగినదిబ్రహ్మమేగనుకభోగవ్యవస్థసిద్ధించదనిఅభిప్రాయము.

౫౦. ఆభాసఏవచ.

అ.—ఆభాసఏవచ- పరబ్రహ్మమునకుఅజ్ఞానస్వరూప తిరోధాన కల్పనలు-ఆభాసము లేను.

అజ్ఞబ్రహ్మజీవవాదమందు సర్వజ్ఞుడైనబ్రహ్మమునకుఅజ్ఞానకల్పనము స్వరూప తిరోధాన కల్పనము మొదలైన హేతువులుఆభాసము లేను. చకారమువలన నిరవద్యత్వాది శ్రుతివిరోధముకలుగును.

పారమార్థికోపాధిసంబంధముగలబ్రహ్మమేజీవుడనిచెప్పేపక్షమందు అనాదియైన అదృష్ట ప్రవాహముచేత ఉపాధిప్రవాహమునకు అనాదిత్వమువలనదానికిసంబంధిదినవానియందునుదోషములోఅవిబ్రహ్మయందు ప్రసక్తములు కాదనిచెప్పినయెడలదోషము చెప్పుచున్నారు.

౫౧. అదృష్టానియమాత్.

అ.—అదృష్టానియమాత్ - అదృష్టనియమములైన దోషములు లేకపోవుటవలన.

అదృష్టములచేతను తత్కృతయుపాధులచేతను బ్రహ్మమునకు భేదము సంభవించకపోవుటవలనతత్కృతమైనదోషములు బ్రహ్మయందే సంభవించును.

౫౨. అభిసన్ధ్యాదిష్వపిచైవం.

అ.—అభిసన్ధ్యాదిషు - అభిసన్ధి మొదలైనవాటియందు - ఏవం-యీప్రకారమే.

అదృష్టమునకు హేతుభూతమైన అభిసంధ్యయందు ఉపాధి బ్రహ్మకంటేవ్యతిరిక్తమైన వస్త్వంతరము లేకపోవుటవలనసర్వోపాధి యుక్తమైనది బ్రహ్మమే గానయేమివిశేషము లేదు.

౫౩. ప్రదేశభేదాదితిచేన్నాన్తర్భావాత్.

అ.—ప్రదేశభేదాత్ - ప్రదేశభేదముయొక్క- భేదమువలన-ఇతిచేన్న-

అనగూడదు - అన్తర్భావాత్ -అంతర్భావమువలన.

ఉపాధిసంబంధియైనబ్రహ్మప్రదేశమునకంటే అనుపహిత బ్రహ్మప్రదేశము భేదమునుపొందును. ఆ కారణమువలనవ్యవస్థగలిగియున్నదని చెప్పినట్లైతే అట్లు చెప్పకూడదు. ఉపాధులు అక్కడక్కడపోవుటవలన సర్వప్రదేశములయందు సర్వోపాధ్యంత ర్భావముకలిగివుండును.

అ.—సం॥ జీవుడు బ్రహ్మముతోనత్యన్తభిన్నుడుగాదు - భ్రాంతబ్రహ్మమేజీవుడైవుంటూవుండడముగాదు - సత్యోపాధ్యవచ్ఛిన్నబ్రహ్మమేజీవుడైయుండడము లేదు- వస్తుతఃబ్రహ్మాభిన్నమైబ్రహ్మాంశమూటచేఅత్యంత భేదములేక జీవుడున్నాడని జీవస్వరూపము నిర్ణయించబడినది.

ద్వితీయాధ్యాయము - తృతీయపాదము ముగిసెను.



శ్రీగురుభ్యోనమః.

## ద్వితీయాధ్యాయము - చతుర్థపాదము.

౯౧. ప్రాణోత్పత్త్యధికరణము.

౨౬౯. తథా ప్రాణాః.

అ.—ప్రాణాః-ప్రాణశబ్దనిర్దిష్టుడు-తథా-పరమాత్మ.

జీవునివలె యింద్రియములుపుట్టేదిలేదా - లేక అంతరిక్షమువలనపుట్టుచున్నదా- అనిసంశయము-పుట్టేదిలేదనిపూర్వపక్షము. ప్రళయ కాలమందుస్థితిప్రతిపాదకమైనశ్రుతివలన - వుత్పత్తిశ్రుతులనుజీవోత్పత్తిశ్రుతులవలెనే పించుకోవలసినది- "అసద్వా ఇదమగ్ర ఆసీత్ ఋషయోవావ తేఽగ్రేనదాసీత్ - కే తేఋషయ" యని "ప్రాణావావఋషయ" అనిఇంద్రిములకుఅప్పటిస్థితివినబడుచున్నది.

సిద్ధాంతము - ప్రాక్సృష్టియందేకత్వావధారణమువలన యింద్రియాదులకు "ఏతస్మాజ్జాయతే" యనియుత్పత్తిచెప్పుటవలన, ఉత్పత్తినిషేధనిత్యత్వవచనము లేకపోవుటవలన అంతరిక్షమేవలెవుట్టుచున్నది-"ప్రాణావావఋషయః" యనిప్రాణశబ్దనిర్దిష్టడు పరమాత్మ-ఋషయఅనివానికేంద్రష్ట్రత్వమునంభవించుటవలన.

బహుత్వము సంభవించకపోవుట వలనబహువచన శ్రుతిగౌణమని చెప్పు చున్నారు.

౨౬౦. గౌణ్యసమ్భవాత్తత్ప్రాక్ఛ్రుతేశ్చ.

అ.—గౌణ్యసంభవాత్ - బహువచనశ్రుతికి గౌణత్వము సంభవించదు-తత్-పరమాత్మకు - ప్రాక్ఛ్రుతేశ్చ- సృష్టికిపూర్వమునందుమేకత్వము చెప్పుటవలన.

"ప్రాణావా" యనేబహువచన శ్రుతిర్గౌణము - అప్పుడుబహుత్వము సంభవించనందునసృష్టికి పూర్వమందుపరమాత్మఒకఁడేవుండినట్లు శ్రుతిచెప్పుటవలన.

౨౬౧.తత్పూర్వకత్వాద్వాచః.

అ.—తత్పూర్వకత్వాత్ - వియదాదిసృష్టిపూర్వకముగా- వాచః-పరమాత్మవ్యతిరిక్తనామధేయము వినబడుచున్నది.

ఏప్రకారమనిన - వాచః - అంతరిక్షాది సృష్టిపూర్వకముగా ముందు పరమాత్మవ్యతిరిక్తనామధేయమువినబడుచున్నది - "తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్తన్నామ రూపాభ్యాం వ్యాక్రియత" ఇత్యాదిశ్రుతులు-గనుకప్రాణశబ్దనిర్దిష్టుడేపరమాత్మ.

అ.—సం॥జీవోపకరణములైనఇంద్రియములకు ప్రళయకాలావస్థానప్రతిపాదనశ్రుతివలన నిత్యత్వముసిద్ధమనిశంకించి- ఆశ్రుతిసర్వజ్ఞుడైనజగత్కారణబ్రహ్మమునుప్రతిపాదించుచున్నదేగాక ఇంద్రియములను జెప్పనందున శ్రుత్యంతరమందు యింద్రియోత్పత్తి కంఠోక్తమైనందువలననిత్యత్వముగూడదనిపరిహరించబడెను.

౬౭. సప్తగత్యధికరణము.

౨౬౨. సప్తగతేర్విశేషితత్వాచ్చ.

అ.—సప్త - సప్తసంఖ్యగలయింద్రియములయొక్క-గతేః- గమనము వినబడుటవలన-విశేషితత్వాచ్చ- విశేషముగాయింద్రియములు సప్తసంఖ్యగలది.

ఇంద్రియములేడా - లేకపదునొకండాయనిసంశయము- ఏడనిపూర్వపక్షము- "సప్తప్రాణాఃప్రభవన్తి" యని సప్తసంఖ్యగల యింద్రియములకే జీవునితోసహసంచారశ్రవణముండుటవలన "యదాపఞ్చావతిష్ఠన్తేజ్ఞానానిమనసాసహ। బుద్ధిశ్చతిసప్తానామేవయోగకాలేజ్ఞానాని" యనివిశేషితత్వముండుటవలన శ్రోత్రాదులైన జ్ఞానేంద్రియములుఐదుమనస్సు, బుద్ధి, గూడి యేడనిపూర్వపక్షము.

సిద్ధాంతము. శ్రోత్రాదులైనజ్ఞానేంద్రియములు- వాగాదులైనకర్మేంద్రియాదులు, మనస్సు-అనిపదకొండు వాగుపస్థ మొదలైనవానికి శ్రోత్రాదులవలెనేకార్యభేదముచేతజీవోపకరణములుగావుండడముఅవిశేషముల

లన-"దశ మేపురుషే ప్రాణా ఆత్మైకాదశః" "ఇంద్రియాణిదశైకంచ"యిత్యాదిశ్రుతిస్మృతులచేత వాగాదులకుజీవునితోసహగమనము లేకపోవుటవలనసప్తేంద్రియములకే ప్రయాణకాలమందుగతిశ్రవణము - యోగకాలమందు విశేషితత్వముగా జ్ఞానేంద్రియములకు మనస్సుకు ప్రాధాన్యముండుటవలన.

సూత్రార్థము-(సప్తగతేర్విశేషితత్వాచ్చ) సప్తకమునకే గతిశ్రవణమువలన, జ్ఞానేంద్రియములైదు మనస్సు బుద్ధియని విశేషము జెప్పుటవలన, అవిసప్తసంఖ్యగలవే.

౨౭౩. హస్తాదయస్తుస్థితే౽తో నైవం.

అ.—అతః-ఆకారణమువలన- ఏవం-యీప్రకారము-న - కాదు-స్థితే-శరీరముండినయడల-హస్తాదయః-హస్తము మొదలైన యింద్రియములుండును.

ఇవిసప్తేంద్రియములేకాదు- శ్రోత్రాదులైన జ్ఞానేంద్రియములైదు - వాగుపస్థాదులైన కర్మేంద్రియములు అయిదు, మనస్సుఇవిపదకొండు-అచ్చటశ్రోత్రములైనయింద్రియములుజీవునితోశరీరాన్తరగమనమునందు పోవుచున్నది. వాక్కు-హస్తాదులైన కర్మేంద్రియములైతె శరీరముండినపక్షమందువుండి శరీరముతోడనేయుత్పత్తివినాశములుగలిగి వుపకారములగును - గనుకసప్తసంఖ్యకలిగినది కాదని తెలియవలయును - ఉపకారముచేయుటయందు విశేషము లేకపోవుటను బట్టి "దశమే పురుషే ప్రాణా ఆత్మైకాదశ" యిత్యాదివచనములుండుటవలనయనియభిప్రాయము.

అ.—సం॥ సప్తఇమే లోకాయేషుచరన్తి" ఇత్యాదివాక్యమందుజీవునితోసహగమనముగా పొయ్యేవిసప్తేన్ద్రియములేయనిశంకించి "దశమే పురుషే ప్రాణాఆత్మైకాదశ" ఇచ్చటపదునొకండనిశ్రవణముండుటచేతహస్తాదులుదేహస్థజీవోపకరణత్వావిశేషమువలనఏకాదశమని నిర్ణయించబడినది.

౬౩. ప్రాణాణుత్వాధికరణము.

౨౭౪. అణవశ్చ.

అ.—అణవశ్చ-ప్రాణములుఅణుపరిమాణముగలది.

ఇంద్రియములుఅణువులా సర్వగతములాయనిసంశయము - సర్వగతములనిపూర్వపక్షము- "తఏతేసర్వఏవసమాస్సర్వేనన్తా"యనిప్రాణములకుఆనంత్యముచెప్పుటవలన.

సిద్ధాంతము - "ప్రాణమనూత్క్రామన్తం" "సర్వేప్రాణాఅనూత్క్రామన్త"యనిశ్రవణముండుటవలనపరిమితత్వమందునను అప్రత్యక్షత్వమువలనఅణువులు. అనన్త్యశ్రుతులైతె

స్తుత్యర్థముకొఱకు-“అథయోఽహైతా ననస్త్రాను పాస్త”యనిఉపాసనవిధానమువలన ఉపాసనకు ఫలబాహుళ్యముపిషయము.

౨౭౫. శ్రేష్ఠశ్చ.

అ.—శ్రేష్ఠశ్చ - శ్రేష్ఠప్రాణము ఉత్పత్తియగుచున్నవి.

శ్రేష్ఠః-శరీరస్థితికి హేతువైనందున శ్రేష్ఠమని చెప్పబడే ప్రాణముపుట్టుచున్నది - ఇచ్చట న్యాయమునకు అతిదేశము లేదు - అధికమైనశంక లేకపోవుటవలన. ప్రత్యేకముగా యోగము చేయడము యుత్తరచింతనకొఱకు - శ్రేష్ఠః- పంచవృత్తిప్రాణము. ప్రాణశ్రేష్ఠ్యమైతే ప్రాణ సంవాదమందు ప్రాణమునకుశ్రేష్ఠత్వము చెప్పియుండుటవలన.

అ.—సం॥ఇంద్రియములు విభువులుగాశ్రుతిప్రతిపన్నంబులనిశంకింది - ఉత్క్రాన్తిశ్రవణమువలన విభువులుగావు అణుపరిమాణములనినిర్ణయింపబడినది.

౮౪. వాయుక్రియాధికరణము

౨౭౬. నవాయుక్రియే పృథగుపదేశాత్.

అ.—పృథక్-ప్రత్యేకముగా-ఉపదేశాత్-చెప్పుటవలన-వాయుః- వాయువు - క్రియ - క్రియ-న-ప్రాణము కాదు.

ఈ శ్రేష్ఠమైన ప్రాణము వాయుమాత్రమా - లేకదానిక్రియా-లేక కొంత విశేషమును పొందిన వాయువా- అనిసంశయము. వాయుమాత్రమని మొదటిపక్షము- “యఃప్రాణస్సవాయుః” యనివ్యపదేశముండుటవలన-వాయుమాత్రమంటే ప్రాణమునకు ప్రసిద్ధిలేకపోవుటవలన, పుచ్ఛాన్యనిశ్వాసరూపమైన వాయువుక్రియాములలో ప్రాణమునకు ప్రసిద్ధివలన వాయువుయొక్క- క్రియావిశేషమేప్రాణమని రెండవపక్షము.

సిద్ధాంతమైతే- వాయువుమాత్రమేప్రాణము కాదు - దాని క్రియయును ప్రాణముగాదు-మరేమంటే దేహధారణమునకు యోగ్యతాదిరూపమైనవిశేషణము పొందినవాయువే “ఏతస్మాజ్జాయతేప్రాణో మనస్సర్వేంద్రియాణిచ । ఖంవాయుః” అనివాయువుప్రాణములకుపృథగుత్పత్తియుపదేశమువలన- క్రియలకుపృథగుపదేశము సంభవింపదు, తేజఃప్రభృతులయందుపదేశము లేనందువలన, చక్షురాదికరణసహిత జీవోపకరణత్వముపదేశ ముండుటవలన, దేహేంద్రియధారణరూపమైనయుపకారాధిక్యముచేతను చక్షురాదులకంటే ప్రాధాన్యవచనమువలన.

సూత్రార్థము-(నవాయుక్రియేపృథగుపదేశాత్) వాయువుమాత్రము-దానిక్రియలుగానిప్రాణము కాదు-పృ

థగుపదేశమువలన- "ప్రాణో జాయ తేఖంవాయుః" యనిపృథగుత్పత్తిచె ప్పుటవలన.

వాయువుకంటె ప్రత్యేకముగాచె ప్పుటవలనదానికంటెఅన్యమైనప్రాణ ముఅగ్నివలెభూతాంతరమాయనిశం కించిసమాధానముజెప్పుచున్నారు.

౨౭౭. చక్షురాదివత్తు తత్సహ శిష్ట్యాదిభ్యః.

అ.—చక్షురాదివత్ - చక్షురిం ద్రియమువలెజీవునికిఉపకరణము - త త్సహ-ఆసంగతికూడా- శిష్ట్యాదిభ్యః- శాసనము మొదలైనవానియందు తెలి యబడును.

తుశబ్దము శంకానివర్తకము-ప్రా ణము ఆకాశమువలె భూతాంతరము కాదు-మరేమంటే- వాయువేఅవస్థా న్తరాపన్నమైనదై చక్షుస్సువలెనే జీవునికుపకరణమౌచున్నది, ఆవుపక రణత్వమువుపకరణభూతములైన ఇం ద్రియములతోగూడి శిష్ట్యాదుల వలన దెలియబడుచున్నది. శిష్టి-శాసనము- ఉపదేశము. ప్రాణసంవాదములందు ఈ ప్రాణముచక్షురాదులతో ఉపదే శముచేయబడియున్నది. తత్సజాతీయ త్వముచేతయిదివుపపన్నము - ప్రాణ శబ్దముచేత చెప్పబడినకరణములందు దీనికి- "అథయోఽయంముఖ్యప్రాణ" యని విశేషముగా ఆదిశబ్దముచేతచె ప్పబడినది - అదియుతత్సజాతీయత్వ మందే సంభవించుచున్నది.

౨౭౮. అకరణత్వాచ్చ నదోష స్తథాహిదర్శయతి.

అ.—అకరణత్వాత్ - క్రియారహితత్వమువలన-నదోషః- దోషము లేదు- స్తథాహిదర్శయతి - అప్రకార మేశ్రుతిచెప్పును.

(అకరణత్వాత్)కరణం-క్రియ-అక రణత్వం - క్రియారహితత్వము-అక్రి యత్వమువలన యీప్రాణమునకు జీ వునిగూర్చి వుపకారవిశేషరూపమైన క్రియలేకపోవడమువలన యేదోషము చెప్పబడుచున్నదో-ఆదోషము లేదు- ఏకారణమువలనఉపకారవిశేషరూప మైనశరీరేంద్రియ ధారణాత్మకక్రియ ను శ్రుతిచెప్పుచున్నదో "యస్మిన్నుత్క్రాంతఇదంశరీరం పాపిష్ఠతరమి వదృశ్యతేసవఃశ్రేష్ఠ" యనిచెప్పివా గాది ముఖ్యప్రాణపర్యన్తముగా గల వుపకరణములను ప్రత్యేకముగచేర్చో నిప్రాణోత్క్రమణమందుశరీరేంద్రి యములకుశైథిల్యముజెప్పును.

ప్రాణాపానాది భేదముచేత అ యిదు విధములుగాయుండెడి ఒకటి ప్రాణమనిచెప్పుచున్నారు.

౨౭౯. పఞ్చవృత్తిర్మనో వద్వ్య పదిశ్యతే.

అ.—మనోవత్ -మనస్సువలె-పం చవృత్తిః- పంచవిధవృత్తిగలదైనప్రా ణమని-వ్యపదిశ్యతే-చెప్పబడును

ప్రాణాపానాది వృత్తిభేదముచేత ప్రాణమే పంచవిధములుగా చెప్పబడుచున్నది- (మనోవత్)యెటులఒకఁడే మనస్సె కామాదివృత్తిభేదముచేత ఆయాశబ్దములచే చెప్పబడుచున్నదో అటులని శ్రుతి చెప్పును- "కామస్సంకల్ప" యని మొదలు "హ్రీర్ధీర్భీః" యనువరకు యివి మొదలైనవిమనస్సె - యిదే ప్రకారము అపానము మొదలుసమానపర్యంతము చెప్పి - "ఏతత్సర్వం ప్రాణఏవ" యని వ్యపదేశమువలన ప్రాణమే పంచవృత్తికలిగినదని తెలియబడుచున్నది.

అ.—సం॥ ప్రాసంగికముగా ముఖ్యప్రాణము కేవల వాయుమాత్రము న్నుడుచ్ఛ్వసనిశ్వాసాదిక్రియలుకాదు వాయువే అవస్థాంతరాపన్నమై ప్రాణమని పేరుగలిగియున్నదని నిర్ణయము.

౬౫. శ్రేష్ఠాణుత్వాధికరణము.

౨౮౦. అణుశ్చ.

అ.—అణుశ్చ - ప్రాణము అణుస్వరూపముగలది.

ఈప్రాణముసర్వవ్యాపకమా-పరమాణుస్వరూపమాయని సంశయము-సర్వగతమనిపూర్వపక్షము- "సమఏభిస్త్రిభిర్లోకైస్సమ" యిత్యాదులందు ప్రాణమున కానన్త్యవ్యపదేశముండుటవలన.

సిద్ధాంతము - "తముత్క్రామన్తంప్రాణోఽనూత్క్రామతి" యని యుత్క్రాంతివచనమువలన ఇంద్రియములవలెనే ప్రాణముఅణుస్వరూపము. అణుత్వమునిశ్చయమాయుండగా సమస్తమునకు ప్రాణాధీనమైనస్థితిచేత విభుత్వవాదము గలుగదు. సూత్రము వ్యాఖ్యానము చేయబడినది.

అ—సం॥ఉత్క్రాంత్యాదిశ్రవణమువలన ప్రాణునికిన్ని విభుత్వముగూడదు, అణుత్వమేముఖ్యప్రాణపరిమాణమనినిర్ణయింపబడ్డది.

౬౬. జ్యోతిరాద్యధిష్ఠానాధికరణము.

౨౮౧. జ్యోతిరాద్యధిష్ఠానంతు తదామననాత్ప్రాణవతాశబ్దాత్.

అ.—ప్రాణవతా- జీవునితోగూడ-జ్యోతిరాది - అగ్ని మొదలైనవానికి-అధిష్ఠానం - వాగాద్యధిష్ఠానము-తదామననాత్ - బ్రహ్మసంకల్పమువల్లయౌనని-శబ్దాత్ -శ్రుతివలన తెలియబడును.

అగ్న్యాదులుపరమాత్మాయత్తస్థితికలిగినవిజీవునికి యింద్రియాధిష్ఠానముపరమాత్మాయత్తమైనట్లు- "పరాత్తుతచ్ఛ్రుతేః" యనిపూర్వము జెప్పబడినఅర్థమునుస్మరింపచేస్తున్నది-విషయ వ్యాప్తి జ్ఞాపనార్థము కొఱకు - ప్రాణముతోగూడిన జీవునితో గూడ జ్యోతిరాదులు - అగ్న్యాదులకు వాగాద్యధిష్ఠానమననముండుటవలన పర

మాత్మమననమగుచున్నది.ఆమననం-ఆభిముఖ్యముచేతమననము. పరమాత్మసంకల్పముచేత నేజేచున్నదనియర్థము- "యోఽగ్నౌతిష్ఠన్- యోఽగ్నిమన్తరోయమయతి" ఇత్యాదిశ్రుతులవలన.

౧౮౨. తస్యచనిత్యత్వాత్.

అ.—తస్యచ-నియమనమునకు-నిత్యత్వాత్ - నైరంతర్యమువలనసర్వదాఅనియర్థము.

సమస్తములలో ఆత్మగాఅనుప్రవేశముచేసి సర్వమునునియమించుచు పరమాత్మకునిత్యముంటుటవలన- అవర్జనీయత్వమున్నదనిఅర్థము.

అ.—సం॥ జీవునికిన్నిఅగ్న్యాదిదేవతలకున్నఇన్ద్రియాద్యధిష్ఠానము స్వాతన్త్ర్యేణవున్నదనిశంకించి పరమాత్మాధీనాధిష్ఠానమే వారలకున్నదనినిర్ణయింపబడినది.

౬౭. ఇన్ద్రియాధికరణము.

౧౮౩. తఇన్ద్రియాణితద్వ్యపదేశాదన్యత్రశ్రేష్ఠాత్.

అ.—శ్రేష్ఠాత్-శ్రేష్ఠమునకంటే-అన్యత్ర-మరియొకస్థలముందు ఏప్రాణములుగలవో-తఇన్ద్రియాణి-అవియింద్రియములువానియందే- తద్వ్యపదేశాత్ - ఇంద్రియ వ్యపదేశము గలుగును.

ప్రాణశబ్దముచేత నిర్దిష్టమైనది 'సమస్తేంద్రియములా- లేక శ్రేష్ఠప్రాణములాయనిసంశయము - సర్వములేయని పూర్వపక్షము. సమస్తములకు అవిశేషముచేత - ప్రాణశబ్దనిర్దేశముండుటవలనను కరణత్వ ముండుటవలనను.

సిద్ధాంతము-శ్రేష్ఠప్రాణవ్యతిరిక్తములైనప్రాణములే ఇంద్రియములు-వానికేఇంద్రియశబ్దముచేత నిర్దేశముండుటవలన - "ఇన్ద్రియాణిదశైకంచ" "ఏకాదశంనశ్శ్రోత్ర" యనిఇంద్రియములకు ప్రాణశబ్దముచేత చెప్పడముప్రాణాధీనమైనవృత్తియుండుటవలన-అటువలెశ్రుతి-"తఏతస్యైవసర్వేరూపమభవన్ తస్మాదేతఏతేనాఖ్యాయన్తే" యనిరూపమభవన్-శరీరములాయెను- దానికిస్వాధీనమైనవ్యాపారముగలవారాయెననిఅర్థము.

సూత్రార్థము - శ్రేష్ఠప్రాణమునకంటే వ్యతిరిక్తములైన ఏప్రాణములో-అవియింద్రియములు- వానికేఇంద్రియవ్యపదేశములు.

౧౮౪. భేదశ్రుతేర్వైలక్షణ్యాచ్చ.

అ.—భేదశ్రుతేః- భేదోత్పత్తిప్రతిపాదనశ్రుతికి-విలక్షణ్యాచ్చ-విలక్షణత్వముంటుటవలన.

"ఏతస్మాజ్జాయతేప్రాణోమనస్సర్వేంద్రియాణిచ" యనిమనస్సహితములైన ఇంద్రియములకంటే భేదముగాప్రాణమునకు యుత్పత్తిచెప్పుటవలన,ఇంద్రియములు శాంతములైనను

ప్రాణవృత్తికివృత్తివైలక్షణ్యమువలన

తా.—శ్రుతియందుమనస్సహిత యింద్రియములకంటె భేదముగాప్రాణమునకుయుత్పత్తిచెప్పుటవలన, ఇంద్రియములుఉపరతములైనను- ప్రాణవృత్తికి వృత్తివిలక్షణత్వముచేత పూర్వసూత్రార్థమే యుక్తమని తాత్పర్యము.

అ —సం॥ ప్రాణశబ్ద నిర్దిష్టముల న్నియుఇంద్రియములనిశంకించి శ్రేష్ఠ ప్రాణ వ్యతిరిక్త ప్రాణములు ఇంద్రియంబులనినిర్ణయింపబడినవి.

౬౮. సంజ్ఞా మూర్తిక్లృప్త్యధికరణము.

౨౦. సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వతఉపదేశాత్.

అ.—సంజ్ఞా-నామము-మూర్తి-రూపము-క్లృప్తిః-కరణము- త్రివృత్కుర్వతః - త్రివృత్కరణముచేసెడుపరమాత్మకు-ఉపదేశాత్ - వుపదేశముండుటవలననతనికేననిఅర్థము.

ప్రపంచవ్యష్టిసృష్టి జీవభూతుడైన చతుర్ముఖునివల్లనా - లేకతచ్ఛరీరకుడైన పరమాత్మవల్ల నాయనిసంశయము. చతుర్ముఖునివల్లనేఅని పూర్వపక్షము- ‹‹అనేనజీవేనాత్మనాను ప్రవిశ్యనామరూపేవ్యాకరవాణి ›› యని వ్యతిరేకశ్రుతులవలన-జీవునికిపరమాత్మాంశత్వముచేత వ్యాకరవాణీ యనెడిఉత్తమపురుషనిర్దేశము అత్యంత ప్రయాసచేతఉపపన్నమౌను.

సిద్ధాంతము-‹‹నామరూపేవ్యాకరవాణితాసాంత్రివృతంత్రివృతమేకైకాంకరవాణి›› యని త్రివృత్కరణమునుజేసెడువానికే నామరూపవ్యాకరణోపదేశమువలన పరమాత్మకు నామరూప వ్యాకరణ రూపమైన వ్యష్టిసృష్టిసంభవించును. త్రివృత్కరణమైతే చతుర్ముఖునిచేత చేసుటకసాధ్యము, అండసృష్టికంటె యుత్తరకాలమందుచతుర్ముఖోత్పత్తి వుండుటవలన తేజస్సు యుదకము అన్నముతోకూడినత్రివృత్కరణముచేత నేఅండసృష్టి సంభవించును- ‹‹తదణ్డమభవద్ధైమం సహస్రాంశు సమప్రభం। తస్మిఞ్జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోక పితామహ›› యనిస్మృతియుండును- ‹‹నానావీర్యాః పృథగ్భూతా స్తతస్తేసంహతిం వినా। నాశక్నువన్ప్రజాస్స్రష్టుమసమాగమ్యకృత్స్నశః। సమేత్యాన్యోన్యసంయోగంపరస్పర సమాశ్రయాః। మహదాదయోవిశేషాన్తా హ్యణ్డముత్పాదయన్తి›› యనియు. అందువలనచతుర్ముఖశరీరకుడైన పరమాత్మవలన యీవ్యష్టిసృష్టి. అటులైనందున ‹‹వ్యాకరవాణి››యనిఉత్తమపురుషనిర్దేశము సమంజసము. ‹‹అనేనజీవేన›› యని వ్యతిరేకనిర్దేశమందున్నజీవశరీరకుడైనపరమాత్మ వలనఅనేయన్వయముచేతసమంజసము - జీవశబ్ద

ము తేజశ్శబ్దాదులవలెజీవశశరీరకుడైన బ్రహ్మమును చెప్పుట యుక్తము - "అనేనజీవేనాత్మన" యని సామానాధికరణ్యమున్నముఖ్యము- "అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" యని సమానకర్తృకత్వ నిర్దేశమున్నయుక్తము.

సూత్రార్థము. (సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు) తుశబ్దము శంకానివర్తకము- నామరూపక్లృప్తిః పరమాత్మకే యుక్తము. ఎట్లనిన- త్రివృత్కుర్వతఉపదేశాత్ - త్రివృత్కరణమును చేసెడువానికే నామరూపవ్యాకరణోపదేశము. త్రివృత్కరణమైతే పరమాత్మకార్య మనడము యుక్తము.

"అన్నమశితంత్రేధా విధీయత" ఇత్యాదులందు చతుర్ముఖసృష్టమైనవస్తువులకుత్రివృత్కరణప్రకారము చూడబడుచున్నది-గనుక కేవల చతుర్ముఖబ్రహ్మచేత నే శక్యమౌనని యాక్షేపమునకుసమాధానము జెప్పుచున్నారు.

౨౧. మాంసాదిభౌమంయథాశబ్దమితరయోశ్చ.

అ — మాంసాదిభౌమం-భూసంబంధములైనవస్తువులు-ఇతరయోశ్చ పరమాత్మేతరులకున్ను,యథాశబ్దమ్-యెట్లుగుననిశబ్దముగలదో అట్లగును.

"తాసాంత్రివృతంత్రివృత మేకైకాంకరవాణి" యని నిర్దిష్టమైన త్రివృత్కరణము. "అన్నమశితంత్రేధా విధీయత" ఇత్యాదులలో యుపదేశము చేయబడదు. "తస్యయస్థవిష్ఠో ధాతు స్తత్పురీషం భవతి యో మధ్యమ స్తన్మాంసం యో౽ణిష్ఠ స్తన్మన" యని మాంసాదులున్ను భౌమమనియుపదేశము చేయుచున్నది. "అన్నమశితం త్రేధ" యని యుపక్రమించి "అన్నమయంహిసోమ్యమన" యని వాక్యశేషముండుటవలన "తేజో౽బన్నానాం" తేజోజలపృథివులకుత్రివృత్కరణప్రకార ముపదేశము చేయబడిన యెడల మాంస మనస్సులు పురీషమునకంటే భౌమమైన అణుత్వముచేత అణీయస్త్వముచేత ఆప్యత్వముతైజసత్వము సంబంధమౌచున్నది. అటువలె వుదక తేజః పర్యాయములకును "ఆపఃపీతాః తేజో౽శితం" యని మూడుమూడు భాగముల కెటువలె ఆప్యత్వమైనశబ్దమో అటువలె తైజసత్వముందే ఉపదేశము చేయబడుచున్నది అచ్చటను "ఆపఃపీతాః తేజో౽శితం" యనియుపక్రమము. వాక్య శేషమున్న- "ఆపోమయః ప్రాణః తేజోమయీవాక్" యని పూర్వమందు చెప్పబడిన త్రివృత్కరణ ప్రకారము మూత్రప్రాణములకు బృహత్వ అల్పత్వముల చేతభౌమత్వతైజసత్వములు సంభవించును-"తేజో౽శితం"యను స్థలమందు పూర్వపు రెంటికి భౌమత్వఆప్యత్వముల ప్రసక్తిగలుగును గ

నుకఇచ్చటపూర్వమందే త్రివృత్కృతమైన అన్నాదులవలన యొకటొకటి మూడు మూడు విధములుగా పరిణామము యుపదేశము చేయబడుచున్నది.

పూర్వమందే త్రివృత్కృతమైన యెడల యేప్రకారము కేవలమైన అన్నాదిశబ్దముచేత చెప్పబడుచున్నదనిన చెప్పుచున్నారు.

౨౮౭. వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః.

అ.— వైశేష్యాత్తు- అన్నాదులకాధిక్యరూపమైన విశేషభావమువలనను- తద్వాదః - అన్నాదివ్యవహారము-తద్వాదః - రెండుమార్లుచెప్పడము అధ్యాయ పరిసమాప్తికొఱకు.

వైశేష్యం - విశేష భావము.

త్రివృత్కృతమైనను అన్నాదు లొకొక్కటి అధికముగా వుండుటవలనఅన్నాదివ్యవహారముకలిగినది రెండుమారులుజెప్పడము అధ్యాయ పరిసమాప్తికొఱకనిద్యోతనమౌచున్నది.

అ.—సం॥ ప్రపంచవ్యష్టిసృష్టిహిరణ్యగర్భకర్తృకము కావచ్చుననిశంకించి అదియుతచ్ఛరీరకపరమాత్మకర్తృకమనినిర్ణయింపబడినది.

ద్వితీయాధ్యాయము - చతుర్థపాదము ముగిసెను.



శ్రీ గురుభ్యోనమః.

## తృతీయాధ్యాయము - ప్రథమపాదము.

౬౯. తదంతర ప్రతిపత్త్యధికరణము.

౨౮౮. తదన్తరప్రతిపత్తౌరంహతి సంపరిష్వక్తఃప్రశ్ననిరూపణాభ్యాం.

అ.— తదన్తర - దేహాంతరము యొక్క-ప్రతిపత్తౌ- ప్రాప్తికాలమందు-సంపరిష్వక్తః-ఇంద్రియములతో గూడినవాడై - రంహతి- పోవుచున్నాడు-ప్రశ్ననిరూపణాభ్యాం- ప్రశ్నప్రతివచనములచేత దెలియబడును.

జీవుడు దేహాంతరమును పొందే కాలమందు దేహమునకుగారణమైన భూతసూక్ష్మములతో గూడినవాడై పోవునా- లేదాయనిసంశయము. కూడక యేపోవుననిపూర్వపక్షము. దేహారంభమునకచ్చటచ్చట భూతసూక్ష్మములుసులభత్వములగుటవలన.

సిద్ధాంతము- పంచాగ్నివిద్యయం

ము "వేత్థయథాపఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తీ" ఇతి తు పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసో భవన్తి" యని ప్రశ్నప్రతివచనము నందు జెప్పబడుచున్నది. దేహారంభకమైన వుదకము త్రివృత్కరణముచేత భూతాంతర సంసృష్టములై స్వర్లోకపర్జన్యభూమి పురుషరూప అగ్నులయందు జీవునితో ప్రవేశించిన వై పంచమిద్యైన ఆహుతియందు యోషిదగ్ని ప్రవేశ కాలమందు పురుషశబ్దముచే జెప్పుటకు అర్హము లౌచున్నవని ప్రసిద్ధము. పురుషాకారత్వమును బొందుచున్నదని తాత్పర్యము గనుక భూత సూక్ష్మములచే గూడిన వాడ య్యేపోవుచున్నాడు.

సూత్రార్థము - (తదన్తర ప్రతిపత్తౌ) సంజ్ఞామూర్తిక్లృప్తిః యను స్థలమందు మూర్తిశబ్దముచే దేహము ప్రసక్తము, తచ్ఛబ్దముచేత దేహము పరామర్శ చేయుబడుచున్నది- దేహాంతరప్రాప్తి కాలమందు. (రంహతిపరిష్వక్తః) జీవుడు భూతసూక్ష్ములతో గూడినవాడై పోవును ఏమిటి వల్లనంటే : (ప్రశ్ననిరూపణాభ్యాం) పఞ్చాగ్నివిద్యాంతర్గత ప్రశ్న ప్రతివచనములచే అటుల దెలియ బడుచున్నదనియర్థము.

ఏ ప్రకారము విశేష రహితమైన అప్ఛబ్దముచే సమస్తము జెప్పడమని అశంక చేసుకొని చెప్పుచున్నారు.

౩౮౯. త్ర్యాత్మకత్వాత్తుభూయస్త్వాత్.

అ.—త్ర్యాత్మకత్వాత్తు- త్రివృత్కరణస్వరూపమందైతే - భూయస్త్వాత్ -అధికోపదేశమువలన.

తుశబ్దము శంకా నివృత్త్యర్థము- వుదకములకు త్రివృత్కరణము చేత మూటితో గూడియుండుటవలన ఆపః యని భూతాంతర సంసృష్టములైన వుదకము జెప్పబడుచున్నది. ఉదక భాగము భూయస్త్వాత్ - అతిశయించి వుండుటవలన అప్ఛబ్దముచే బేర్కొనంబడును.

౩౯౦. ప్రాణగతేశ్చ.

అ.— ప్రాణగతేశ్చ- ప్రాణములగతివలన.

ఇంకను తోగూడ భూత సూక్ష్ములచేత గూడినవాడయ్యేపోవును- "తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామన్తం సర్వే ప్రాణా అనూత్క్రామన్త" యని ప్రాణములకు, ఇంద్రియములకు జీవునితో సహగమనము వినబడుటచే ఇంద్రియములకు దేహాశ్రయత్వమందు వలనఆ దేహమున్న భూతసూక్ష్మరూపముచే పోచున్నదని తెలియబడుచున్నది - స్మృతియు "మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థానికర్షతి" ఇత్యాదులచేత విశదమౌను.

౨౯౧. అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్.

అ.— అగ్న్యాది-అగ్న్యాదుల కు-గతి- గమనముయొక్క - శ్రుతేః- శ్రుతివలన - ఇతిచేన్న - ఇటులన గూడదు. భాక్తత్వాత్ - వాటియంద భిమానముగల దేవతావాదికత్వము వలన.

"యత్రాస్యపురుషస్యమృతస్యాగ్నిం వాగప్యేతి వాతంప్రాణశ్చక్షు రాదిత్యం" యని మరణ వేళయందు వాగాదులకు అగ్న్యాదులయందుల యమువినడుటవలన జీవునితోటి సహ గమనముచెప్పే శ్రుతిమరి యొక ప్రకారముబోధించుచున్నదని జెప్పకూడదు (భాక్తత్వాత్) అచ్చటవాగాదిశబ్దమునకు వాగాద్యభిమాని దేవతావిషయమువల్ల - అచ్చట వాగాదులకు "ఓషధీర్లోమాని వనస్పతీన్కేశా" యనివానితోగూడ సహపాఠముండుటవలన.

౨౯౨. ప్రథమేఽశ్రవణాదితిచేన్నతాఏవహ్యుపపత్తేః.

అ.—ప్రథమే- మొదట - అశ్రవణాత్ -వినబడకపోవుటవలన - ఇతిచేన్న-అనగూడదు- ఉపపత్తేః-ప్రశ్నోత్తరములకుపపత్తివలన- తాఏవ-అప్పువేశ్రద్ధాశబ్దముచేత చెప్పబడును.

ప్రథమే- ద్యులోకాగ్నిహోమమందుపుదకమునకు శ్రవణములేకపోవుటవలనఆవుదకములు భూతాంతర సంసృష్టములైపోవుచున్నవని చెప్పడమునకుశక్యముకాదు-అచ్చటనో "తస్మిన్నేతస్మిన్నగ్నౌదేవాశ్శ్రద్ధాం జుహ్వతి"యనిశ్రద్ధయేహోమము జేయుకొఅకర్మముగా వినబడుచున్నదని చెప్పగూడదు. ఆవుదకములేశ్రద్ధాశబ్దముచేతచెప్పబడుచున్నది. ఉత్తరమునకు ప్రశ్నానుగుణము సంభవించుటవలన - "వేత్థయథాపఞ్చమ్యామాహుతావాపః పురుషవచసోభవన్తి" యనివుదకములతోగూడిన పురుషవిషయమునుగూర్చి అడిగేప్రశ్నకు ఆవిషయమైన ప్రత్యుత్తరముచెప్పతగినది. గానశ్రద్ధాశబ్దముచేఆవుదకముతోగూడిన పురుషుని చెప్పబడుచున్నది - "శ్రద్ధావాఆప" యని శ్రుతియుగలదు.

౨౯౩. అశ్రుతత్వాదితిచేన్నేష్టాదికారిణాంప్రతీతేః.

అ.—అశ్రుతత్వాత్ - వినబడకపోవుటవలన- ఇతిచేన్న-యిటులనగూడదు-ఇష్టాదికారిణాం - జీవులకు-ప్రతీతేః-ప్రసిద్ధివలన.

"ఆపఃపురుషవచసోభవన్తి" "శ్రద్ధాంజుహ్వతి" యనిఅంతరిక్షాదిలోకములందుదకములే పోవుచున్నవనివినబడుచున్నది-వానితోపరిష్వక్తుడై జీవుడుపోవుడమనేదిలేదు. ఆకారణమువలనప్రశ్నోత్తరములందుజీవునికి విని

కి లేకపోవుటవలన ఉదకములతో పరి ష్వక్తుడై జీవుడు పోవుచున్నాడని చెప్పడము యుక్తము గాదని చెప్పినట్టైతె అటుల జెప్పకూడదు - (ఇష్టాదికారిణాంప్రతీతేః) ముందర- "అథయఇమె గ్రామఇష్టాపూర్తె దత్తమిత్యుపాసతె తెధూమమభిసంభవన్తి" ఇత్యాదులందు జీవులకు స్వర్గలోకాదిగమనమునందు రావృత్తిప్రకారవచనమందు ద్యులోకాగ్ని సంబంధమైన చెంద్రుని బొందిన అప్ఛబ్దవాచ్యమునకు ప్రతీతియుండుటవలనయిచ్చట అప్ఛబ్దముచేతవానితో గూడిన జీవుడే చెప్పబడుచున్నాడు.

"ఆకాశాచ్చన్ద్రమసమేషసోమోరాజాదేవానాం మన్నంతం దేవాభక్షయంతి" యని ధూమాదిమార్గముచేతపోయినవానికి దేవతలచే భక్షణమువినబడుటవలన - జీవునికిభక్షణానర్హ్నముచే జీవుడచ్చట చెప్పబడినవాడుకాదనే శంక కుత్తరము చెప్పుచున్నారు.

౨౯౮. భాక్తంవా నాత్మవిత్త్వాత్తథాహిదర్శయతి.

అ.—అనాత్మవిత్త్వాత్ - బ్రహ్మవేత్తృత్వము లేక పోవడము వలన- భాక్తంవా-భక్ష్యత్వ వచనము వలన దేవభృత్యభావముగా- తథా- అప్రకారము-దర్శయతి-శ్రుతిచెప్పును.

వాశబ్దము శంకా నివృత్త్యర్థము- "తందేవాభక్షయంతి" యనిభక్ష్యత్వవచనము పొందడమని అర్థము కేవల ఇష్టాధికారులైన జీవులకు బ్రహ్మవేతృత్వము లేకపోవుటచేత దేవతలకు యుపకారమానెడు అభిప్రాయముగలుగును. ఆత్మవేత్తలుకానివారు కేవల ఇంద్రాదిదేవతలను పూజించి దేవతలనుపొంది వారల కుపకరణమువుచున్నారు. ఈయర్థమునే శ్రుతిచెప్పుచున్నది- "యథాపశురేవం సదేవానాం" యని భూతసూక్ష్మములచే గూడినవాడై జీవుడుబోవుచున్నాడు.

అ.—సం॥ జీవుడు సుకృతకర్మఫలాను భవార్థము దేహాద్దేహాన్తరప్రవేశము జేయుతరి అస్థలమందును దేహారంభక భూతసూక్ష్మములు లభించుటచే పూర్వదేహస్థ భూతసూక్ష్మసంపరిష్వక్తుడై పోవలసినది లేదని శంకించి- పంచాగ్నివిద్యోక్తప్రక్రియవలన పూర్వదేహస్థభూతసూక్ష్మపరిష్వక్తుడై దేహాద్దేహాన్తర ప్రవేశముచేయుచున్నాడని నిర్ణయింపబడినది. ఈఅధికరణమందు కాదాచిత్కముగనైనను భూతసూక్ష్మపరిష్వంగము లేకనే నిర్దుఃఖుడై యుండుటకు అవకాశము లేదని వైరాగ్యజననార్థము యావన్మోక్షము ప్రకృతిసంబంధమవర్జనీయమని నిష్కృష్టమైనది. కించ- భాక్తంవా నాత్మవిత్త్వాత్ - యనుసూత్రములో దేవభృత్య భావమును

అవలంబించి తత్ప్రియుక్తక్లేశ కరం భితమైయుండు స్వర్గ భోగాను భవముయొక్క క్షయిష్ణుత్వమును సాతిశయమును ఆవిష్కృతము.

౭౦. కృతాత్యయాధికరణము.

౨౯౫. కృతాత్యయేఽను శయవాన్దృష్ట స్మృతిభ్యాం యథేతమ నేవంచ.

అ.—కృత-పుణ్యముయొక్క-అత్యయె-అంత్యమందు-అనుశయవాన్ కర్మశేషముగలవాడై వెనుకకు దిరుగును-దృష్టస్మృతిభ్యాం-శ్రుతిస్మృతులుండుటవలన-యథేతమ నేవంచ-పోయినమార్గము జేతను, మరియొక దోవగుండావచ్చును.

ధూమాది మార్గగతుడై వెనకకు తిరిగినజీవుడు కర్మశేషముగలవాడై నివర్తించునా- కాదాయని సంశయము. కాదని పూర్వపక్షము. "యావత్సమ్పాత ముషిత్వా" "ప్రాప్యాంతంకర్మణ" ఇత్యాది శ్రుతులచేత సమస్తమైన కర్మయొక్క అనుభవముగా ప్రతీతి యుండుట వలన కర్మశేషముగలవాడై వెనకకుదిరుగడు.

సిద్ధాంతమైతే - "తద్యఇహరమణీయచరణా అభ్యాశోహయత్తేరమణీయాంయోనిమాపద్యేరన్ బ్రాహ్మణయోనిం క్షత్రియ యోనిం వైశ్యయోనింవా అథయ ఇహకపూయచరణా అభ్యాశోహయత్తేకపూయాం యోనిమా పద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా" యని రమణీయ్యకర్మగలవారు బ్రాహ్మణయోనియు - కపూయచరణాః- కుత్సితకర్మగలవారు సూకరాదియోనియుపొందుతారని శ్రుతియుండుటవలన "ప్రాప్యాంతంకర్మణ" ఇత్యాది శ్రుతిఫలదానమందు ప్రవర్తించిన కర్మవిషయమని కర్మావశేషమయ్యే వెనకకుదిరుగును.

సూత్రార్థము-(కృతాత్యయె)కృతస్య- చేయబడిన పూర్వకర్మనాశమందు-అనుశయః-అనుభవించి మిగిలినకర్మ-అదిగలవాడై వెనకకుదిరుగును. యేమిటి వల్లనంటే. దృష్టస్మృతిభ్యాం-శ్రుతిస్మృతులచే దెలియబడుచున్నది. "తద్య ఇహ రమణీయచరణా" ఇత్యాదిశ్రుతులు "తతఃపరివృత్తౌ కర్మఫలశేషేణ జాతిం రూపం" ఇత్యాదిస్మృతులు (యథేతమ నేవంచ) ఆరోహణ ప్రకారముచేను రియొకరీతిచేతను వెనకకుదిరుగుచున్నాడు "చన్ద్రమసస్థ్సానాదాకాశం" యని ఆరోహ క్రమముచేత నవరోహము చేయును, వాయు ధుమాభ్రాదులప్రకారాంతముచే వెనకకు దిరుగుచుందురు.

౨౯౬. చరణాదితిచేన్నతదుపలక్షణార్థేతి కార్ష్ణాజినిః.

అ.—చరణాత్ - చరణశబ్దముప

లన- పుణ్యాపాపరూపకర్మలు - ఇతిచేన్న- అనిఅనగూడదు- తదుపలక్షణార్థేతి-చరణశ్రుతి కర్మకుపలక్షణమని- కాష్ణాజినిః- కాష్ణాజన్యాచార్యులు దెలియుదురు.

“రమణీయ్యాచరణా”యని స్మృతియందు జెప్పబడిన రమణీయాచారమునకు బ్రాహ్మణ్యాదిప్రాప్తిసాధనత్వ శ్రవణమువలన కర్మసహితుడై వెనకకు దిరుగుననిచెప్పగూడదని యన్నట్టయితే అటులచెప్పకూడదు- చరణశ్రుతి-కర్మోపలక్షణార్థమని కాష్ణాజినాచార్యులు దెలియుదురు- పుణ్యకర్మకేసుఖప్రాప్తియందు కారణత్వముండుటవలన.

సూ ౧౦, ఆనర్థక్య మితిచేన్న తదపేక్షత్వాత్.

అ.—తదపేక్షత్వాత్ -ఆచారాపేక్షవలన- ఆనర్థక్యమితిచేన్న- వ్యర్థత్వమని చెప్పగూడదు.

స్మృతివిహితమైన యాచారమునకు అకించిత్కరత్వముగా వ్యర్థత్వము ప్రసక్తమౌనని అంటే అటులజెప్పకూడదు- తదపేక్షత్వాత్ - ఆచారాపేక్షయుండును సుఖసాధన భూతమైన పుణ్యకర్మకు- “స్నాత్వాహినో శుచిర్నిత్య మనర్హస్సర్వ కర్మసు” యని సర్వమునను పుణ్యకర్మాచారాపేక్షయేయని కాష్ణాజినులమతము.

సూ ౧౧, సుకృతదుష్కృతఏవేతి తుబాదరిః.

అ.—సుకృతదుష్కృతఏవేతితు, పుణ్యాపాపరూపకర్మములు జెప్పబడునని- బాదరిః- బాదరాచార్యులు దెలియుదురు.

తుశబ్దము పూర్వమతమును వ్యావృత్తిని చేయుచున్నది- “రమణీయ్యాచరణాః” “కపూయచరణా” యని చరణశబ్దముచే సుకృత దుష్కృతకర్మలే ప్రతిపాదించుచున్నవి- పుణ్యం కర్మాచరతీయని చరతిధాతువుకు కర్మయందే ప్రసిద్ధియుండుటవలనలక్షణయోగ్యము కాదని బాదరి యాచార్యులు దెలియుదురు. ఇదేసూత్రకారులకుయిష్టము - తుశబ్దముచేత పూర్వమతమునకంటే వ్యావృత్తియుండుటవలన- సుకృత దుష్కృతములే యని వ్యావర్తనము వలన. “ఆనర్థక్యం” యని చెప్పకూడదు-ఆచారాపేక్షత్వముండుటవలన యని స్వీకరింపబడినది.

అ.—సం॥ స్వర్గానుభవానంతరముజీవుడైనవాడు కృత్స్నకర్మ ఫలమునుభుక్తమైనందువలన కర్మసంబంధరహితుడై దిగుచున్నాడని శంకించి రమణీయచరణులు రమణీయయోనులనుపొందుదురు. కపూయచరణులు కుత్సితయోనులనుపొందుదురు. యని శ్రుతి చెప్పుటచే కర్మసంబంధముగలవాడయ్యేదిగుచున్నాడని నిర్ణయించ

బడినది. దీనిచే సూక్ష్మ దేహమునకు కారణతయా సకలసంసార నిదానక ర్మసంబంధము ముక్తిపర్యంతముఅను వృత్తమైయున్నదనిసంసార దోషము చెప్పడమైనది.

౭౧. అనిష్టాది కార్యధికరణము.

౨౯౯. అనిష్టాదికారిణా మపిచ శ్రుతం.

అ.—అనిష్టాది కారిణామపి-పాప కర్మలకును-శ్రుతం-చంద్రగమనమువి నబడుచున్నది.

అవిహితకర్మగలవారు నిషిద్ధసే వయందుఆసక్తులు- పాపకర్మముగల వారుధూమాదిమార్గముచేత చెంద్రుని బొంది వెనకకుదిరుగుదురా- లేదాయ నిసంశయము. పొంది వెనుకకుతిరుగు దురనిపూర్వపక్షము - ‹‹యేవై కేచా స్మాల్లోకాత్ప్రయన్తిచన్ద్రమసమేవ తేసర్వేగచ్ఛంతి’’యనిసమస్తులకువి శేషములేకనే చంద్రప్రాప్తి చెప్పుట వలన.

సిద్ధాంతము - ‹‹అథయఇమేగ్రా మఇష్టాపూర్తేదత్త మిత్యుపాసతే తే ధూమమభిసంభవన్తి’’యనిధూమా దిమార్గముచేత చంద్రగమనమునకుపు ణ్యకర్మఫలత్వముచెప్పుటవలన పుణ్య రహితులుపాపకర్మముగలవారుపొం దేదిలేదు- ‹‹యేవై కేచ’’యనెడివచ నముసమస్తపుణ్యకర్మగలవారికి చం ద్రగమనముచెప్పుచున్నది.

సూత్రార్థము- (అనిష్టాదికారిణా మపిచ శ్రుతం)ఇష్టాపూర్తాది కర్మల నుచేయనివారికిన్ని పాపిష్ఠులకు చం ద్రగమనముకలదు - ‹‹యేవై కేచాస్మా ల్లోకాత్ప్రయన్తి’’ యనిఅవిశేషము చేతశ్రుతియుండుటవలన:

ఇట్లుచెప్పినపక్షమందు పుణ్యపా పములుచేసినవారికవిశేషము లేనిగతి కాదనగా, అప్రకారముకాదని చె ప్పుచున్నారు.

౩౦౦. సంయమనేత్వనుభూయే తరేషామారోహావరోహౌతద్గతిదర్శ నాత్.

అ.—ఇతరేషాం-పాపిష్ఠులకు-సం యమనే, యమశాసనమందు-అను భూయ-యాతననుఅనుభవించి-ఆరో హావరోహౌ-ఆరోహావరోహములు- తద్గతిదర్శనాత్ - యమప్రాప్తివినబ డుటవలన.

తుశబ్దముశంకనువ్యావర్తిచేయు చున్నది. ఇతరేషాం-అనిష్టాదికారుల కు చంద్రుని యొక్క- ఆరోహ వరో హములు, సంయమనే, యమశాసన మందు-యాతనాది-దుఃఖమును, అను భూయైవ,అనుభవించే, యేమిటివల్ల నంటే-తద్గతిదర్శనాత్:- పాపిష్ఠులకు యమసదనప్రాప్తి వినబడుటవలన - ‹‹వైవస్వతంసఙ్గమనంజనానాం’’ ఇ త్యాదులయందు సిద్ధము.

౩౦౧. స్మరన్తిచ.

అ.—స్మృతులచేతను దెలియబడును.

ఇదేఅర్థము నె-"సర్వేపై తేవశం యాన్తియమస్యభగవసిఽల" ఇత్యాదులలో పరాశరాదులుస్మరించుదురు

౩౦౨. అపిసప్త.

అ.—అపిసప్త-సప్తనరకములు.

సప్తాపి-పాపకర్మగలవారికి పొందుటకు యోగ్యముగా సప్తరౌరవనరకాదులనుస్మరించుచున్నారు.

ఓయీ - సప్తనరకాదులందుపొయ్యెడువార్లకు యేప్రకారముయమపట్నము ప్రాప్తియనగా చెప్పుచున్నారు.

౩౦౩. తత్రాపి తద్వ్యాపారాదవిరోధః.

అ.—తత్రాపి-ఆనరకములందునను-తద్వ్యాపారాత్-యమవ్యాపారమువలన-అవిరోధః-విరోధములేదు.

ఆయేడైనరౌరవాదనరకలోకములందును-తద్వ్యాపారాత్-యమనియాజ్ఞచేత పోవుటవలన విరోధములేదు. గాన-అనిష్టకర్మచేసినవారికినియమలోకమునుబొంది యాతననుఅనుభవించిఅనంతరము చంద్రారోహావరోహములుయాచున్నవి. ఇట్లనిపూర్వపక్షము వచ్చినయడల చెప్పుచున్నారు.

౩౦౪. విద్యాకర్మణో రితితుప్రకృతత్వాత్.

అ.—విద్యాకర్మణోః- విద్యాకర్మలకుఫలమనిచెప్పటవలన - ఇతితు-యేప్రకారమనగా - ప్రకృతత్వాత్ - యీప్రకారము చెప్పటవలన.

తు శబ్దముపక్షమును వ్యావృత్తిని చేయుచున్నది- పాపకర్మగలవారికిఅర్చిరాదిమార్గముచేత బ్రహ్మలోకప్రాప్తియు,ధూమాదిమార్గముచేతచంద్రప్రాప్తియు,సంభవించదు-అవిద్యాకర్మలకుఫలమౌటవలన - ఏప్రకారము దానిఫలముదెలియబడుచున్నదంటే-(ఇతిప్రకృతత్వాత్) ఈప్రకారముప్రకృత ముండుటవలన. విద్యాకర్మలకు ప్రకృతమందువానికిఫలముగా రెండుగతులనుచెప్పుచున్నది. "తద్యఇత్థంవిదుర్యేచే మేఽరణ్యే శ్రద్ధాతపఇత్యుపాసతే తేఽర్చిమభిసంభవన్తి" అని. "అధయఇమేగ్రామ ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తేధూమ మభిసంభవన్తి" యనియుపాపిష్ఠులకు విద్యారహితత్వముచేతబ్రహ్మలోక ప్రాప్తి లేనటువలెపుణ్యకర్మలేని వారికినిచంద్రగమనమున్నుసంభవించదనిఅర్థము

"పఞ్చమ్యామాహుతావాపః పురుషవచసోభవన్తి" అని పంచమాహుతిచే దేహారంభ శ్రవణమువలన వారికి చంద్రగమన పూర్వకముగా పాపిష్ఠులకున్ను దేహారంభముకొఱకుచంద్రప్రాప్తి అవశ్యముకాతగినది యనగా చెప్పుచున్నారు.

౩౦౫. నతృతీయేతథోపలబ్ధేః.

అ.—తృతీయే- తృతీయస్థానమైనస్వర్లోకమందు- న-పంచమాహుత్యపేక్ష లేదు-తథోపలబ్ధేః-అప్రకారము ప్రత్యక్షముండుటవలన.

కేవలముపాపకర్మగలవారికి-తృతీయస్థానమందు దేహారంభము కొఱకు పంచమాహుతి యపేక్షలేదు-(తథోపలబ్ధేః) వేత్థయథా కేనాసౌ లోకో నసమ్పూర్యతా ౩ ఇతి" ద్యులోకము పొందనివా డెవడనెడి ప్రశ్నకు యుత్తరమైన - "అథైతయోః పథోర్నకతరేణచ తానీమాని క్షుద్రాణ్య సకృదావర్తీని భూతాని భవన్తి జాయస్వ మ్రియస్వేత్యేత త్తృతీయంస్థానం తేనాసౌలోకోనసమ్పూర్యత" యనితృతీయస్థానమైన స్వర్లోకఅప్రాప్తిశ్రవణమువలనవాని దేహారంభ మందు పంచమాహుతి యొక్క-అపేక్ష లేదు.

౩౦౬. స్మర్యతేపిచలోకే.

అ.—లోకే-శిష్టలోకమందు-స్మర్యతేపిచ-స్మరింపచేయబడుచున్నది.

పుణ్యకర్మగల ద్రౌపది మొదలైన కొందరిదేహారంభమందు పంచమాహుత్యపేక్ష లేదని పెద్దలవలన చెప్పబడుచున్నది.

౩౦౭. దర్శనాచ్చ.

అ.—దర్శనాచ్చ - శ్రుతియందు నుకనబడుచున్నది.

కొందరికి దేహారంభమందు పంచమాహుతిఅపేక్ష - శ్రుతియందు చూడబడుచున్నది - "తేషాంఖల్వేషాం భూతానాంత్రీణ్యేవబీజానిభవన్త్యాణ్డజంజీవజముద్భిజ్జం" యని స్వేదజోద్భిజ్జాదులయొక్క దేహారంభమందు పంచమాహుతిఅపేక్ష లేదు.

అణ్డజంజీవజ ముద్భిజ్జమనే స్థలమందు స్వేదజమునకు గ్రహణముచూడబడలేదనగా చెప్పుచున్నారు.

౩౦౮. తృతీయశబ్దావరోధస్సంశోకజస్య.

అ.—తృతీయశబ్దాత్ - ఉద్భిజ్జశబ్దమువలన-సంశోకజస్య-స్వేదజమునకు-అవరోధః-సంగ్రహము.

"అణ్డజంజీవజముద్భిజ్జం"అనెస్థలమందుమూడవఉద్భిజ్జశబ్దముచేత,సంశోకజస్య-స్వేదజమునకు-అవరోధః-సంగ్రహమనిఅర్థము. గాన కేవలపాపకర్మగలవారికి చంద్రారోహావరోహములుసంభవింపదు.

అ,—సం॥ అనిష్టాది కారకులైన పాపకర్మరతులకున్ను చంద్రప్రాప్తి యున్నదని శంకించి ఇష్టాపూర్తాదిసత్కర్మరహితులకు పితృయాణమార్గ ద్వారా గమనములేనందున చంద్రప్రాప్తి లేదనినిర్ణయించబడినది. ఇందు నను- "గ్రామంగచ్ఛన్వృక్షమూలాన్యుపసర్పతి"-యనెడున్యాయముచేతనైననుస్వర్గప్రాప్తిలేదు, యమసద

నమందుననురౌరవాది నరకములందు ననుమికిఁ లియాతనానుభవము - కీటాదిజన్మ ప్రాప్తిగలదని సంసారదోషము వ్యక్తముగా కీర్తన చేయబడినది.

౭౨. తత్స్వాభావ్యాపత్త్యధికరణము.

౩౦౯. తత్స్వాభావ్యాపత్తిరుపపత్తేః.

అ.—తత్స్వాభావ్య-ఆకాశాదిస్వభావమునకు- ఆపత్తిః- ప్రాప్తి- ఉపపత్తేః-ఉపపత్తివలన.

ధూమాదిమార్గముచేత చంద్రుని పొందిన వారికి అవరోహణ ప్రకారము చెప్పబడుచున్నది "యథేతమాకాశ మాకాశాద్వాయుం వాయుర్భూత్వా ధూమోభవతి ధూమో భూత్వాఽభ్రంభవతి అభ్రం భూత్వా మేఘోభవతి మేఘోభూత్వా ప్రవర్షతి" యని ఇచ్చట ఆకాశాదులభావము దేవమనుష్యాది భావమువలె ఆకాశాదిశరీరత్వమా లేక దాని సాదృశ్య ప్రాప్తియా యని సంశయము. ఆకాశాది శరీరత్వమని పూర్వపక్షము- శ్రద్ధకు సోమరాజ భావమువలెనే అచ్చటతచ్ఛరీరత్వమే చెప్పబడుచున్నది.

సిద్ధాంతము. ఆకాశాది ప్రాప్తియందు సుఖ దుఃఖాదుల యనుభవము లేకపోవుటవలన వానియొక్క సామ్య ప్రాప్తియే - సుఖదుఃఖానుభవముకొఱకుపోమాదిశరీరత్వము.

సూత్రార్థము-తత్స్వాభావ్యాపత్తిః-ఆకాశాదివస్తువులసాదృశ్యప్రాప్తి-ఉపపత్తేః- సుఖదుఃఖాదులఅనుభవము లేకపోవడమునకు వుపపత్తియగుటవలన.

అ.—సం॥ శ్రుతిసిద్ధమైన యాకాశాదిభావముజీవునికి దేవమనుష్యాదిభావమువలెనే తచ్ఛరీరత్వరూపమని శంకించి- ఆకాశాదిప్రాప్తియందుసుఖదుఃఖానుభవము లేనందున తత్స్వాభావ్యాపత్తియేగాక తచ్ఛరీరత్వము లేదనినిర్ణయించబడినది. ఇందుననుస్వర్గావరోహణము జేయువారికి ఆకాశాదిభావశ్రవణముచే, తదభిమానిదేవతలవలెఆకాశాది శరీరప్రయుక్తమైనకొన్నిదివ్యభోగములు వుంటున్నదనెడు శంకానివృత్త్యర్థముగా ఆకాశాదిసంశ్లేషమాత్రమేయున్నదని చెప్పుటచేతదోషకీర్తనముస్ఫుటము.

౭౩. నాతిచిరాధికరణము.

౩౧౦. నాతిచిరేణవిశేషాత్.

అ.—విశేషాత్-విశేషవచనము వలన-అతిచిరేణ- బహుకాలము-న-జీవునికినిష్క్రమణము లేదు.

ఆకాశవాయుధూమ అభ్ర మేఘ వర్ష ప్రాప్తియందు అచ్చటచ్చట బహుదినములుండేది లేదా-లేక-నియమము లేదాయని సంశయము. అనియమమని పూర్వపక్షము - నాతిచి

రేణయని విశేషవచనము లేక పోవుటవలన.

సిద్ధాంతము. ఉత్తరత్రవ్రీహ్యాది భావమందు - "అతోవైఖలు దుర్నిష్ప్రపతరం" యని అచిరేణగమనవచన ముండుటనుబట్టి ప్రాచీనులు అచిరగమనము సూచన చేయుచున్నారు - ఆకాశాదియావద్వ్రీహ్యాదుల భావప్రాప్తివరకు అచిరంబుగనుండును. సూత్రము వ్యాఖ్యానము చేయబడినది.

అ.—సం ॥ ఆకాశవాయు ధూమాభ్రమేఘవర్షప్రాప్తిగలిగి నప్పుడు ఆయాయి స్థలములలో అతిశీఘ్రముగా జీవునికి గమనముకద్దనే నియమము లేదు- తద్ధేతువు లేనందునయని శంకించి- ఉత్తరత్రవ్రీహ్యాది ప్రాప్తిలో - "అతోవైఖలుదుర్నిష్ప్రపతరం" యని విశేషించి కృచ్ఛ్రనిష్క్రమణము చెప్పుటవలన ఆకాశాదిప్రాప్తిలో అచిర నిష్క్రమణమేయున్నదని నిర్ణయించ బడినది. దీనియందునను ఆకాశాద్యవస్థానవిళంబ నియమునిరసనవ్యాజేన వ్రీహ్యాదులందుసుఖభోగము లేక అచిరావస్థాన రూప దోషము దృఢమైనది.

౭౮. అన్యాధిష్ఠితాధికరణము.

౩౧౧. అన్యాధిష్ఠితే పూర్వవదభిలాపాత్.

అ.—అన్యాధిష్ఠితే- ఇతరజీవుని చేతవుండబడినదానియందు సంబంధము-పూర్వవత్-ఆకాశాదిభావమువలెనే-అభిలాపాత్-చెప్పుటవలన.

దిగుచూనుండెడు జీవులు వ్రీహ్యాదిభావము చేతపుట్టుచున్నారని వినబడుచున్నది. "మేఘో భూత్వాప్రవర్షతిత ఇహవ్రీహియవాఓషధివనస్పతయ స్తిలమాషాఇతిజాయన్తే" యని-ఆజీవులు వ్రీహ్యాదిశరీరకులై పుట్టుచుందురా-లేక అన్యులైనజీవులచేత వ్రీహ్యాదిశరీరములుఅధిష్ఠించివుండబడిన వ్రీహ్యాదులను ఆలింగనముచేసుకొందురాయని సంశయము. "జాయన్తే"యనువచనమువలన వ్రీహ్యాదిశరీరమందు భోక్తలై వున్నారో అనిపూర్వపక్షము.

సిద్ధాంతము. వ్రీహ్యాది జన్మమందు హేతువైన కర్మవిశేషమునను వినికిలేక పోవడము వలన వ్రీహ్యాదుల సంశ్లేశమాత్రమేవున్నది. "జాయంతే"యనీ జన్మవచన మౌపచారికము బ్రాహ్మణాదిశరీరభావమందు "రమణీయచరణాః" "కపూయచరణా" యని జన్మహేతుభూతములైనపుణ్యపాపకర్మములువినబడుచున్నది.

సూత్రార్థము- అన్యాధిష్ఠితే- అన్యులైన క్షేత్రజ్ఞునిచేత అధిష్ఠించబడిన వ్రీహ్యాదులయందు సంశ్లేషము- ఏమిటవలననిన- పూర్వమందు చెప్పబడిన ఆకాశాది భావములవలె- వ్రీ

హ్యాదిభావములు చెప్పబడియున్నవి. జన్మహేతువులైన కర్మలను చెప్పకపోవడమువలనయని అర్థము.

౩౧౨. అశుద్ధమితిచేన్నశబ్దాత్.

అ.—అశుద్ధంపూర్వమందు జెప్పబడిన కర్మకారణము - ఇతిచేన్న-అనియనగూడదు-శబ్దాత్ - అహింసత్వాదిశబ్దమువలన.

ఎట్లయినను వ్రీహ్యాదిభావముచేత పుట్టుచున్నాడనే స్థలమందుజన్మమునకు హేతువుయైన కర్మవినబడలేదో - అట్లయినను పూర్వముచెప్పబడిన యిష్టాములగు అగ్నిషోమియాది కర్మాదులు హింసాగర్భమౌటచేత అశుద్ధములు - హింసాత్వము చేత అపరిశుద్ధమైన వ్రీహ్యాదిజన్మమందును హేతు గర్భముకలదని చెప్పినట్లయితే, అట్లుచెప్ప కూడదు అహింసశబ్దముండుటవలన. పశువుల యొక్క హింసకు స్వర్గప్రాప్తిసాధనభావవాది శబ్దము వినబడుచున్నది - «హిరణ్యశరీర ఊర్ధ్వస్స్వర్గంలోకమేతి" నవాఉఏతణ్ మ్రియసేనరిష్యసి" ఇత్యాదులు.

౩౧౩. రేతస్సిగ్యోగోఽథ.

అ.—అథ-వ్రీహ్యాదిస్వరూపప్రాప్యనంతరమందు-రేతస్సిగ్యోగః-పురుషసంశ్లేషమాత్రము వినబడుచున్నది దీనికంటే వ్రీహ్యాదుల యొక్క సంశ్లేషమాత్రమే- వ్రీహ్యాదిభావముకంటే అనంతరమందు రేతో రూపయోగము వినబడుచున్నది- «యోయోహ్యన్నమత్తి యో[illegible]యో రేతస్సిఞ్చతితద్భూయఏవభవతి" యని ఇచ్చట పురుషసంశ్లేషమాత్రమేవినబడుచున్నది-యీప్రకారము వ్రీహ్యాదిభావమందును దెలియవలయును.

౩౧౪. యోనేశ్శరీరం.

అ.—యోనేః- యోనిప్రాప్తివలన-శరీరం- శరీరసంబంధమువినబడుచున్నది.

యోని ప్రాప్తికంటే అనంతరమందు దిగుచూనుండెడు జీవునికిశరీసంబంధముగలుగును అచ్చటనేసుఖదుఃఖముల యొక్క అనుభవముండును - గనుక పూర్వమందుఆకాశాదులలో సంశ్లేష మాత్రమేయని అభిప్రాయము.

అ.—సం॥ స్వర్గావరోహము చేయుజీవులకువ్రీహ్యాదిజన్మహేతుభూతకర్మ విశేషము అశ్రుతమైనందున అన్యజీవాధిష్ఠిత వ్రీహ్యాదులలో సంశ్లేష మాత్రమేయున్నదని నిర్ణయించిరి. ఇందుచేత వ్రీహ్యాది భావేనజననమునప్పుడు తల్లవన పర్యంత మాత్రమే దుఃఖము క్లిష్టమై అట్లుగాక సంశ్లేష మాత్రమని నిర్ణయించిన దీనిచే శోషణకు సూలావస్థాపనా వహననఫలీకరణ పాక భక్షణాది దశలయందును అనువృత్తిసిద్ధించుటచేత భక్షు

ణవిషయము గాకయుండెడు శ్రీహ్యాదులలోను పరిణామ పరంపరయా సంశ్లేషము సిద్ధించుటవలన దోషకీర్తనము అస్ఫుటము.

తృతీయాధ్యాయము - ప్రథమపాదము ముగిసెను.

శ్రీగురుభ్యోనమః.

తృతీయాధ్యాయము - ద్వితీయపాదము.

౭౫. సన్ధ్యాధికరణము.

౩౧౫. సన్ధ్యేసృష్టిరాహహి.

అ.—సన్ధ్యే- స్వప్నస్థానము- సృష్టి-విచిత్రనిర్మాణముజీవునిచేత చేయబడినదికాదని- ఆహహి-యీఅర్థమును శ్రుతిచెప్పునుగదా.

స్వప్నమును అధికరించిన శ్రుతియున్నది - "నతత్రరథానరథయోగాన పన్థానో భవన్త్యథ రథాన్రథయోగాన్పథ స్సృజత" యని యారంభించి "అథవేశాన్పుష్కరిణ్యస్స్రవన్త్యస్సృజతేసహికర్తా" యని. స్వప్నమందనుభవింపబడిన పదార్థములకు నిర్మాతజీవుడా, పరమాత్మా యని సంశయము. స్వప్నముజూచెడి జీవునికి సన్నిధానమువలన "సహికర్తా" యని అతడే కర్తగా పరామర్శచేయ బడుచున్నది. జీవునికిని సత్యసంకల్పత్వము ప్రజాపతివాక్యముచేత చెప్పబడినదిగాన అతడే సృష్టించునుఅనిపూర్వపక్షము.

సిద్ధాంతము. జీవునికి సత్యసంకల్పత్వము సిద్ధమైనను సంసార దశయందు పరమపురుషునియొక్క సంకల్పముచేత తిరోహితమైజీవునికిసంకల్ప మాత్రముచేత నిర్మాతృత్వము యుపపన్నము కానేరదు. ఈకారణమువలననే పరబ్రహ్మసకలేతర పురుషులయొక్క అనుభవములకువిషయముగాఆయాయిపురుషులచేతనే యనుభవించుటకు యోగ్యమైన ఆయాకాలముననుసరించి స్వాప్నార్థములను నిర్మాణముచేసును.

సూత్రార్థము- సన్ధ్యే-స్వప్నస్థానము శ్రూయమాణమైన రథాదులయొక్క సృష్టి స్వప్నదృష్టిగల జీవునిచేతనే చేయబడినది. ఏమిటివలననని- ఆ

హి- అతడేకర్తయని నాజీవునికే పరామర్శవుండునని అర్థము.

౩౧౬. నిర్మాతారంచైకే పుత్రాదయశ్చ.

అ.—ఏకే-కొన్నిశాఖలు- నిర్మాతారం - యీజీవుణ్ని స్వప్నపదార్థములయందు కర్తగాను చెప్పును - పుత్రాదయశ్చ - కామశబ్దము చేత పుత్రాదులను వరించునని చెప్పబడినది-

ఇదే జీవుని స్వప్నార్థములకు కారణంబుగ కొన్నిశాఖలు చెప్పుచున్నవి- “యఏషసుప్తేషుజాగర్తి కామం కామంపురుషో నిర్మిమాణ” యని- ఇచ్చట కామశబ్దముచేత నిర్దిష్టములైన వస్తువులు కోరుటకుయోగ్యమగుటచేత పుత్రాదులగును. చశబ్దము అవధారణార్థము. ఇచ్చట “సర్వాన్ కామాన్” యని కామశబ్దము చేత ప్రసక్తులైన “శతాయుషఃపుత్ర పౌత్రాన్వృణీష్వ” యనగా దీర్ఘాయుస్సుగల పుత్రపౌత్రాదులనువరించునని వివేచనచేయుచున్నది.

౩౧౭. మాయామాత్రంతు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్.

అ.—మాయామాత్రం-ఈశ్వర మాయమాత్రమే - కార్త్స్న్యేన-సమస్తమునకు- అనభివ్యక్తస్వరూపత్వాత్ - అభివ్యక్తముగాని స్వరూపముగలదౌటవలన జీవుడు స్వప్నసృష్టిని చేయడు.

తుశబ్దమువలన పక్షముదిరుగుచున్నది. స్వప్నమందుండేపదార్థములు జీవుని చేతనే సృష్టిచేయబడినది కాదు-మరేమంటే ఈశ్వరుని యొక్క మాయామాత్రమే - సకలేతర పురుషుల అనుభవమునకుగోచరమై జీవునొకనిజేతనే అనుభవించుటకర్హమైన తత్కాలమందేసరిపుచ్చబడ్డఆశ్చర్య రూపమైన అర్థ సమూహములను ఈశ్వరుడే నిర్మాణముజేయునని యర్థము. జీవునికి సత్య సంకల్పత్వాదులు సమస్తసంసార దశయందభివ్యక్తముగాని స్వరూపమైయుండుటవలన, అతనికిసంకల్పమాత్రముచేతనే నిర్మాతృత్వ ముపపన్నము కానేరదు “కామంకామంపురుషోనిర్మిమాణ” యని పరమపురుషునే నిర్మాణకర్తగాచెప్పినది. “యఏషసుప్తేషు జాగర్తి” తస్మిల్లోకాశ్శ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన” యని యుపక్రమోపసంహారములయందు పరమపురుషునికసాధారణమైన ధర్మములను చెప్పుటవలన. “సహికర్తా” యని దానితోనైకకంఠ్యమువలన పరమపురుషునే చెప్పుచున్నది.

తా.—జీవునివలన స్వప్నమందనుభవించదగిన ఆశ్చర్యరూపమైన అర్థ సముదాయములను సర్వేశ్వరుడు సృజనచేయుచున్నాడు. జీవుడు సృష్టిచేయచాలడు.

జీవునికి సత్యసంకల్పత్వాది గుణములు స్వాభావికమైనయడల యేప్రకారము అభివ్యక్తము కాలేదనగా చెప్పుచున్నారు.

౩౧౮. పరాభిధ్యానాత్తు తిరోహితంతతోహ్యస్యబన్ధవిపర్యయౌ.

అ.—పర- పరబ్రహ్మ - అభిధ్యానాత్ -సంకల్పమువలన-తిరోహితం- ఆచ్ఛాదితమైన- తతః- సంకల్పమువల్లనే- అస్య-యీజీవునికి - బన్ధవిపర్యయౌ-బన్ధమోక్షములు వినబడును.

తుశబ్దము శంకానివర్తకము- పరమపురుషుని అభిధ్యానము వలన ఈ జీవునికి స్వాభావికమైన రూపము అనాదికర్మ ప్రవాహమువలన కృతాపరాధుడౌటచేత తిరోహిత మయినది (తతోహ్యస్యబన్ధవిపర్యయౌ) తతః ఆపరమపురుషసంకల్పమువలనయీ జీవునికి-బన్ధవిపర్యయౌ-సంసార మోక్షములువినబడుచున్నది. "క్షోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాద్యదేష ఆకాశ ఆనన్దోనస్యాత్ ఏషహ్యేవానన్దయాతి" "పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యత" ఇత్యాదులలోనీయర్థముస్ఫుటము.

తా.— పరబ్రహ్మసంకల్పమువలన యీజీవునికి స్వాభావికమైన రూపము అనాదికర్మప్రవాహముచేత తిరోహితమైనది. అందువలనపరమపురుష సంకల్పము వలన యీ జీవునికి బంధ మోక్షములు వినబడుచున్నది.

తిరోధాన ప్రకారమును జెప్పుచున్నారు.

౩౧౯. దేహయోగాద్వాసోపి.

అ.— సోపి - ఆయాచ్ఛాదనమున్ను-దేహయోగాద్వా-దేహసంబంధంబువలననైనది.

సోపి-అతిరోభావము- దేహసంబంధమువలననే యౌచున్నది. వాశబ్దమువికల్పార్థము-వ్యవస్థచేయబడినదివికల్పము. సృష్టివేళయందు దేవమనుష్యాదులయొక్క దేహాకారముగా పరిణతమైన అచిత్తు యోగమువలనను, ప్రళయకాలమందు నామరూపవిభాగమునకనర్హమైన సూక్ష్మదశనుపొందినఅచిత్సంబంధముచేతనౌను.

౩౨౦. సూచకశ్చహిశ్రుతే రాచక్షతేచతద్విదః.

అ —శ్రుతేః-స్వప్నశ్రుతులను- సూచకశ్చహి- శుభాశుభ సూచకములని-తద్విదః-అభిజ్ఞులు-ఆచక్షతే- చెప్పుదురు.

ముందున్నస్వప్నమందురథాదులుజీవసంకల్పముచే చేయబడినవి కావుఎందువల్లనంటేస్వప్నముశుభాశుభములకు సూచకమని శ్రుతులవలన దెలియబడుచున్నది॥ "యదాకర్మసుకామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి। సమృద్ధింతత్రజానీయాత్తస్మింత్స్వప్ననిదర్శనే" "అథ స్వప్నేపు

ద్ధమంకృష్ణంకృష్ణద_న్తం'' ఇత్యాదు
లలో-స్వప్నాధ్యాయ వేత్తలు జెప్పు
చున్నారు. జీవసంకల్పముచేత చేయ
బడిన యడల సూచకత్వము సంభ
వింపదు-తనసంకల్పముచే చేయబడిన
యడల శుభములకు సూచకమునైన
అర్థమును నిర్మాణముచేసి జీవునకు జూ
చును. గనుక స్వప్నమందు ప్రత్యక్ష
ములయ్యేడు యర్థములకు పరమపురు
షుడేనిర్మాత.

అ.—సం॥ స్వాప్నసృష్టిప్రకరణ
మందు జీవుడుసన్నిహితుడౌటచేత
త్సృష్టి జీవకర్తృకమనిశంకించి-సం
సారదశలో స్రష్ట్రుత్వోప యుక్త స
త్య సంకల్పత్వాదులు కర్మతిరోహి
తస్వరూపుడైన జీవునికి కూడనందున
స్వాప్నసృష్టి జీవకర్తృకము గాదు-
పరమాత్మ కర్తృకమని నిర్ణయించ
బడినది.

౨౬. తదభావాధికరణము.

౩.౨౧.తదభావో నాడీషుతచ్ఛ్రు
తేరాత్మనిచ.

అ.— తదభావః - స్వప్నాభావ
ము సుషుప్తియని యర్థము-నాడీషు-
నాళులందు-ఆత్మనిచ-ఆత్మయందును
తచ్ఛ్రుతేః- సుషుప్తిస్థానత్వముగా
శ్రుతెలుజెప్పును.

నాళులు పురీతద్బ్రహ్మయును-
సుషుప్తిస్థానత్వము చెవినబడుచున్నవి
వీనికి వికల్పమా- లేక - సముచ్చయ
మాయనిసంశయము. వికల్పమునిపూ
ర్వపక్షము. "ఆసుతదానాడీషు సు
ప్తోభవతి'' "తాభిఃప్రత్యవ సృప్యపు
రీతతిశేతే'' "సతాసోమ్యతదా సం
పన్నోభవతి'' యని మూటికినినిరపే
క్షత్వముతోచుటవలన.

సిద్ధాంతము. ప్రాసాద ముఖట్వా
ము పర్యంకాదులవలె కార్యభేదము
చే సముచ్చయము సంభవించుచుండ
గహాక్షి బాధ గర్భవికల్పము యు
క్తముగాదు సముచ్చయమే యోగ్య
ము. ఏకారణమువలన పర్యంకమువ
లె బ్రహ్మము సుషుప్తికిస్థానమవునో
అందు వలన పర్యంక స్థానీయము బ్ర
హ్మము,

సూత్రార్థము-తదభావః- స్వప్నా
భావః, సుషుప్తియని తాత్పర్యము
సుషుప్తినాళులలో, ఆత్మయందును
చకారముచేత పురీతతియందును. త
చ్ఛ్రుతేః- మూటికి సుషుప్తిస్థానత్వ
ముయొక్క శ్రవణముండుటవలన, చె
ప్పబడిన న్యాయముగా సముచ్చయ
ముయోగ్యమని అభిప్రాయము.

౩.౨.౨. అతఃప్రబోధోఽస్మాత్.

అ.—అతః-అందువలన-అస్మాత్
ఈబ్రహ్మమువలన- ప్రబోధః- ప్రబో
ధఃశ్రుతి ఉపపన్నమౌను.

అతః-ఆకారణమువలన-అస్మాత్ -
ఈబ్రహ్మవలన - ప్రబోధశ్రుతిః - ప్ర
బోధకశ్రుతి- వ్యపదిశ్యతే- వుపపన్న

మావుచున్నది- "సతఆగమ్యనవిదుస్స తఆగచ్ఛామహే" యని.

అ.—సం॥ నాళులేమి, పురీతత్ప్రదేశమేమి, బ్రహ్మమేమి, యీమూడున్ను నైరపేక్ష్యేణ సుషుప్తి స్థానత్వముగా శ్రుతమగుటవలన తత్స్థానత్వము వికల్పముగావచ్చునని శంకించి ప్రాసాద ఖట్వాపర్యంకములవలె కార్యభేదేన సముచ్చయమే కూడినట్లు ఉండగా పాక్షికబాధగర్భ వికల్పము అయుక్తమగుటచే సముచ్చయమే యుక్తమనినిర్ణయించబడినది.

౭౭. కర్మానుస్మృతిశబ్ద విధ్యధికరణము.

౩.౨.౩. సఏవతుకర్మానుస్మృతిశబ్దవిధిభ్యః.

అ.—కర్మ-జన్మాంతరకర్మచేతను అనుస్మృతి-ప్రత్యభిజ్ఞచేతను- శబ్ద-శబ్దములచేతను- విధిభ్యః- ఉపాసనచేత-సఏవ-అదేజీవుడే యని అర్థము.

సుషుప్తుడైనవాడే ప్రబోధ కాలమందు పైకిలేచునా- లేక- అతడా- అన్యుడాయనినియమము లేదని సంశయము. సుషుప్తుడైనవానికిసర్వోపాధి వినిర్ముక్తమైన బ్రహ్మయందు సంపత్తిగలిగియుండుటచే ముక్తునికంటే వైలక్షణ్యము లేదుగనుక పూర్వశరీరముయొక్క సంబంధము లేకపోవుటవలన అతడేనని నియమము సంభవింపదని పూర్వపక్షము.

సుప్తుడైనవానికి బ్రహ్మజ్ఞానము లేకపోవుటచేత పూర్వార్జితము చేయబడిన కర్మను అతని చేతనే అనుభవింప బడుటవలన వాడే నేననెడి ప్రత్యభిజ్ఞవలన - "తఇహవ్యాఘ్రోవా సింహోవా" యని ఆరంభించి "యద్యద్భవన్తి తదాభవన్తి" యనుశబ్దములవలన - మోక్షమునకు సాధనమైనవిద్యకు వ్యర్థత్వము సంభవించుటవలన అతడేలేచునాడని సిద్ధాన్తము. జీవుడు శరీరేంద్రియములచేత వినిర్ముక్తుడు కాడును దేహంటే కరణకళేబరములయొక్క ప్రవర్తనవల్లనైన ఆయాసమును ఊరటను పొందుటకొఱకు బ్రహ్మమందులయమును పొందకయే తిరిగి ఊరడించుకొనినవాడై పైకి లేచునని జెప్పవలెను. సూత్రము వ్యాఖ్యానము చేయబడినది.

అ.—సం॥ సుప్తుడే ప్రబోధకాలమందు యుత్థితుడౌతాడని అనగూడదు సుప్తునకు సర్వోపాధి వినిర్మోకపూర్వక బ్రహ్మసంపత్తివచ్చుటచేనని శంకించి సుషుప్తికి ముందే ఆరబ్ధమైనకర్మముత్థితునివలన సమాపనము చేయబడుటచేసోహమనిసుప్తుడే యుత్థితుడని ప్రత్యభిజ్ఞ వచ్చుట చేతను- ఇత్యాదియుక్తులచే సుప్తునికేవుత్థితత్వము సమర్థించబడినది.

౭౮. ముగ్ధాధికరణము.

౩౨౮. ముగ్ధేఽర్ధసమ్పత్తిః పరిశేషాత్.

అ.—ముగ్ధే-మూర్ఛయందు ఏఅవస్థోఅది-పరిశేషాత్ - మరణజాగరావస్థలు రెండుగానందున - అర్ధసంపత్తిః-మరణముకొఱకు అర్ధసమ్పత్తని భావము.

మూర్ఛ-మరణమునకంటే భిన్నమా- మరణమేనాయని సంశయము. సమస్తేంద్రియములు ప్రాణముల యొక్క వ్యాపారసమాప్తివలన మరణమేనని పూర్వపక్షము - ఆకారమునకు వైరూప్యము లేకపోవుటవలన సూక్ష్మప్రాణముంటున్నదని యంగీకరించుటచే మరణమందర్ధసంపత్తని సిద్ధాన్తము.

సూత్రార్ధము - ముగ్ధే - మూర్ఛనొందినప్పుడు పురుషునియందు యేఅవస్థోఅది మరణముకొఱకుఅర్ధసంపత్తి- ఏమిటివల్లనంటే (పరిశేషాత్) ప్రాణాదులయొక్క-సర్వవ్యాపారములుశాన్తములగుటవలన జాగరావస్థగాదు. గతమైన ప్రాణముగల అవస్థయుగాదు-అకారవైలక్షణ్యముచేత సూక్ష్మప్రాణములకు స్థితి నంగీకరించుట వలన-మూర్ఛనుపొందినవానికి తిరిగిబ్రతకడమువలన మరణముకాదు పరిశేషమువలన మరణముకొఱకు అర్ధసంపత్తియని దెలియబడుచున్నది.

అ.—సం॥ మూర్ఛ-సర్వేంద్రియప్రాణవ్యాపారోపరతి దశగానుండుటచేత మరణమనిశంకించి ఆకారవైరూప్యముచే సూక్ష్మప్రాణావస్థిత్వముచే అవగతమైనందువలన మరణార్ధసంపత్తిమూర్ఛయని నిర్ణయించబడినది.

౭౯ ఉభయలింగాధికరణము.

౩౨౫. నస్థానతోపిపరస్యోభయలిఙ్గంసర్వత్రహి.

అ.—పరస్య-బ్రహ్మమునకు- నస్థానతోపి-ఆయాయిస్థానము లందుండుటవలన దోషము సంభవించదు. సమస్తస్థలములందును- ఉభయలింగం హి - దోషరహితత్వకల్యాణగుణవత్స్వరూపమైన రెండులింగము నుండుటవలన.

జీవునికి వలెనంతర్యామియైనపరబ్రహ్మమునకు జాగరాది ప్రయుక్తమైనదోషములుసంభవించునా- లేదా - యనిసంశయము- "యఃపృథివ్యాంతిష్ఠన్" "యశ్చక్షుసితిష్ఠన్" "యోరేతసితిష్ఠన్" ఇత్యాదులలో జీవునివలెనే సర్వావస్థలందును స్థితిచెప్పుటవలన, తనయిచ్ఛనుబట్టి పూయశోణితాదులందు మజ్జనముఅపురుషార్ధమైనను సమస్తదోషములు సంభవించునని పూర్వపక్షము.

సిద్ధాంతము - "అపహతపాప్మావిజరః" "నిరవద్యంనిరఞ్జనం" "సత్యకామస్సత్యసంకల్పః" "యస్సర్వ

జ్ఞస్సర్వవిత్ '' "యోమామజమనా దించవేత్తి లోకమహేశ్వరం'' "పరేషాం పరాణాం సకలానయత్ర క్లేశాద యస్సంతిపరావరేశ'' ఇత్యాదిశ్రుతిస్మృతులలో నిరస్తనిఖిలదోష గంధముగలసర్వజ్ఞ సత్యసంకల్పత్వాదియుభయ లక్షణస్వరూప మవగతమౌటచే పరబ్రహ్మమునకు సర్వాంతర్యామిత్వముచేత అవస్థితమైననుదోషగంధముసంభవించదు - సు రేనం ఛేసర్వనియమనరూపలీలారసమును వహించడమే.

సూత్రార్థము - (నస్థానతోపిపరస్య) పృథివ్యాదులందు అంతర్యామిగా నుండినను పరబ్రహ్మకు నాయాయిస్థానాదు లంసంబంటచే జీవునికి యేదోషాములుచెప్పబడినవో అవిసంభవింపవు. యేమిటివలననిన. (ఉభయలింగంసర్వత్రహి)హి- హేతువు- యే కారణమువలనస్సర్వత్రశ్రుతిస్మృతులందును-నిరస్తనిఖిలదోషత్వసమస్తకల్యాణగుణాత్మకత్వ రూపోభయలింగమో ఆహేతువునుబట్టి ఉభయలక్షణముగల పరబ్రహ్మమని తెలియబడినది.

౩.౨౧. భేదాదితిచేన్న ప్రత్యేకమతద్వచనాత్.

భేదాత్ -స్థితిభేదమువలన - ఇతిచేన్న - జీవునివలెపరమాత్మకుదోషమునూడమ- ప్రత్యేకం-ప్రతిపర్యాయము - అతద్వచనాత్ - దోషాభావము చెప్పుటవలన.

యేప్రకారము జీవుడు స్వతఃఅపహతపాప్మత్వాది గుణములు గలవాడైనను దేవాదిశరీరసంబంధస్థితివలన జెప్పబడిన దోషసంబంధిత్వ ముగలదో-ఆప్రకారముపరబ్రహ్మమునకున్ను "యస్యపృథివీశరీరం'' యనిశరీరసంబంధిత్వముచే నట్టి దోషములున్నవని జెప్పగూడదు. ప్రత్యేకం - ప్రతిపర్యాయమంమనుఅతద్వచనాత్ - దోషాసంబంధిత్వముచెప్పుటవలన॥యస్యపృథివీశరీరం'' ఇత్యాదులలో- "సతఆత్మా న్తర్యామ్యమృత '' యని అన్తర్యామికినిదోషత్వము చెప్పబడుచున్నది. జీవునికిపరమాత్మ సంకల్పమువలన స్వరూపమాచ్ఛాదితమని చెప్పబడుచున్నది. గానశరీరసంబంధముండినను పరబ్రహ్మమునకా దోషములుసంభవించవు.

౩.౨౨. అపిచైవమేకే.

అ.—ఏకే-కొన్నిశాఖలు- ఏవమపిచ-ఇదేప్రకారముచెప్పును.

మరియు నీజీవపరమాత్మలకుయేకశరీరగమందే శరీరులుగా నుండడముచేతదోషసంబంధిత్వము దోషరహితత్వముయేదిచెప్పబడినదోయదెఅర్థమునుకొన్నిశాఖలు స్వశబ్దముచేతచెప్పుచున్నవి-"ద్వాసుపర్ణాసయుజాసఖాయా సమానం వృక్షంపరిషస్వజా

తే। తయోరన్యంపిప్పలంస్వాద్వత్త్య
నశ్నన్యన్యోఽభిచాకశీతి" యని.

మనుష్యాది శరీరములందు శరీరి
యగుటజీవునికి నామరూపములుపొం
దడముచేత కర్మవశ్యత్వమందు హే
తువగును - అదిపరబ్రహ్మకుకర్మవశ్య
త్వముచేతయేప్రకారము కర్మఫలము
అననుభవంబనగా చెప్పచున్నారు.

౩౨౪. అరూపవ దేవహితత్ప్ర
ధానత్వాత్.

అ.—తత్ - పరబ్రహ్మ-ప్రధానత్వా
త్ - నియామకత్వమువలన- అరూ
పవదేవహి - రూపరహితమేయగును.

మనుష్యాదులయొక్క శరీరమం
దుశరీరిగా నుండినను ఆపరబ్రహ్మరూ
పరహితమైనదే- యేమిటివల్లనంటే-
ప్రధానత్వాత్ - నిర్వాహకత్వమువ
లన-జీవునికి నామరూపప్రాప్తిపూర్వ
కముగా కర్మఫలానుభవమునునిర్వ
హింప జేసెడికొఱకు పరబ్రహ్మ ఆ
యా ఋ శరీరములందు శరీరిగానుం
డును. యీయర్థము నే "యస్యపృథివీ
శరీరం" "యస్యాత్మాశరీరం" "య
ఆత్మానమన్తరోయమయతి" "అ
న్తఃప్రవిష్టశ్శాస్తాజనానాం సర్వా
త్మా" యని. గానవుభయలింగముప
రబ్రహ్మమగును.

తా.—దేహాన్తఃప్రవిష్టుడై అన్యుల
కదృష్టుడైపరమాత్మశాసనము చేయు
చుండును.

"సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ" య
నిప్రకాశ మొక్కటే బ్రహ్మస్వరూపమ
నిచెప్పబడుచున్నది. యెట్లుభయలిం
గమనగా చెప్పచున్నారు.

౩౨౫. ప్రకాశవచ్చావైయర్థ్యాత్.

అ — ప్రకాశవత్ - ప్రకాశ
మునకుబ్రహ్మస్వరూపమువలె - అవై
యర్థ్యాత్ -వైయర్థము లేకపోవుటవ
లనకల్యాణ గుణవత్వము స్వీకరింపబ
డును.

ఏప్రకారము-"సత్యంజ్ఞానం" అ
నేవాక్యమునకు వ్యర్థత్వములేక పో
య్యేడికొఱకుప్రకాశమే బ్రహ్మస్వరూ
పమని తెలియబడుచున్నదో ఆ ప్రకార
ము-"యస్సర్వజ్ఞస్సర్వవిత్" "పరాస్య
శక్తిర్వివిధైవశ్రూయతే" ఇత్యాది
వాక్యములకు వైయర్థము లేకపోవుట
వలన కల్యాణగుణాకరత్వమున్ను బ్ర
హ్మమునకు స్వరూపమని తెలియబడు
చున్నది - గాన వుభయలిఙ్గము పర
హ్మము.

తా.— శ్రుతులందు వైయర్థము
లేనందు చేత బ్రహ్మమునకు కల్యాణ
గుణాకరత్వముగ్రహింపబడుచున్నది

౩౨౬. ఆహచతన్మాత్రం.

అ.—తన్మాత్రం- ప్రకాశస్వరూ
పమాత్రము నే-ఆహచ- సత్యము నెడి
శ్రుతిచెప్పినది.

"సత్యంజ్ఞానం" అనువాక్యము,
బ్రహ్మము జ్ఞానస్వరూపమని యింత

మాత్రము చెప్పినది. మరల కల్యాణ గుణాకరత్వ బ్రహ్మస్వరూపమును నిషేధించదు.

౩౩౧. దర్శయతిచాథో అపిస్మర్యతే.

అ.—దర్శయతిచ- శ్రుతులును చెప్పును-అథాఅపి- అనంతరమందును- స్మర్యతే-స్మృతులున్ను చెప్పును,

వేదాంతవాక్యసమూహము-నిరస్తనిఖిలదోషత్వము కల్యాణ గుణాకరత్వమును చూపించుచున్నవి - "నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యంనిరంజనం" "తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తందేవతానాం పరమంచ దైవతమ్" ఇత్యాదులు. "యోమామజమనాదించవేత్తిలోక మహేశ్వరం" అహంకృత్స్నస్యజగతః ప్రభవః ప్రళయస్తథా। మత్తః పరతరంనాన్యత్-ఇత్యాదులు.

౩౩౨. అతఏవచోపమాసూర్యకాదివత్.

అ.—అతఏవచ- ఆకారణమువల్లన-సూర్యకాదివత్ - జలసూర్యాదులవలెనే-ఉపమా- సాదృశ్యము అనగా సూర్యప్రతిబింబసామ్యమని దెలియవలయును.

ఏ కారణమువలన పరబ్రహ్మమునకు నిరస్తసమస్త దోషములచేత, కల్యాణ గుణాశ్రయత్వము చేత ఉభయలింగత్వమువలన పృథివ్యాదిస్థానములందుండినను వానివలనప్రయుక్తమైన దోషసంబంధములేదో- ఆ కారణమువలన శాస్త్రములందు జలసూర్యకాదుల యొక్క సాదృశ్యము చెప్పబడియున్నది. "ఆకాశమేకం హి యథాఘటాదిషుపృథగ్భవేత్।తథాత్మైకోప్యనేకస్థో జలాధారేష్వివాంశుమాన్" ఇత్యాదులలో.

తా.— పరబ్రహ్మమునకు నిరస్తనిఖిలదోషభావము చేతను కల్యాణ గుణాకరత్వము చేతను పృథివ్యాదిస్థానమందుండినను తత్ప్రయుక్తదోషము ఆకాశ సూర్యాదులకువలె సంభవించదు.

౩౩౩. అమ్బువదగ్రహణాత్తునతథాత్వం.

అ.—అమ్బువత్ - ఉదకమందు సూర్యునివలెనే- అగ్రహణాత్ - గ్రహణము లేక పోవుటవలన - నతథాత్వం-సాదృశ్యము [illegible].

తుశబ్దము చోద్యమును సూచన చేస్తున్నది. ఉదకమందున్నట్టువలె గ్రహణము లేకపోవుటవలన- యేప్రకారము వుదకమందు సూర్యుడు లేకపోయినను భ్రాంతిచేత నచ్చట వుండే వానివలె గ్రహింపబడునో ఆప్రకారము పృథివ్యాదులందు పరమాత్మగ్రహింపబడదు "యఃపృథివ్యాంతిష్ఠన్ పృథివ్యాఅన్తరః" యని పరమార్థత్వముగా స్థితిని గ్రహింపబడును. గనుక

యారీతి కాదు-సూర్యునివలె తత్ప్రి యుక్తదోషగంధముయొక్క- అభావము పరమాత్మకు లేదు యథార్థముగావుండుట వలన.

పరిహరించుచున్నారు.

౩౩౪. వృద్ధిహ్రాసభాక్త్వ మంతర్భావాదుభయ సామఞ్జస్యాదేవం దర్శనాచ్చ.

అ.—అంతర్భావాత్ - పరమాత్మకు పృథివ్యాదులందు అంతర్భావమువలన- వృద్ధిహ్రాసభాక్త్వం- వృద్ధిక్షయప్రాప్తిని నివారణచేయబడును ఇదియేమిటివలన దెలియబడుననగా ఉభయ సామఞ్జస్యాత్ - రెండుదృష్టాంతములకు సమంజసత్వమువలన- ఏవం- యీప్రకారము- దర్శనాచ్చ- సాదృశ్యము చెప్పుటవలన.

పృథివి మొదలైన విషమ స్థానములందుండినను- పరమాత్మకు- తదంతర్భావాత్ - అక్కడ అంతర్భావము వలన దానివలనసంభవించిన వృద్ధిక్షయములను పొందడము. "జలాధారేష్వివాంశుమాన్" యనే దృష్టాంతముజేత నివర్తిచేయబడును - ఇదియే ప్రకారము దెలియబడునంటే (ఉభయ సామఞ్జస్యాదేవం) ఉభయ దృష్టాంతముల యుపాదాన సమంజసత్వము వలన నీప్రకారము దెలియబడుచున్నది "ఆకాశమేకంహియథా ఘటాదిషుపృథగ్భవేత్ అని" ఘటకరకాదులలో విషమంబుగనుండుఆకాశమును- "జలాధారేష్వివాంశుమాన్" యని యథార్థముగా లేనిసూర్యునియీయుభయమునుదృష్టాంతముగా తీసుకొని "తథాత్మైకోప్యనేకస్థః" యని నిగమనముచేయుటవలనఆయాయిస్థానప్రయుక్త వృద్ధిహ్రాసప్రాప్తినివర్తనమాత్రమే వివక్షచేయబడినదని దెలియబడుచున్నది. మరియొక స్థలమందుదృష్టాంతదార్ష్టాంతములకుసర్వసామ్యమభావమైనను సింహఇవ మాణవకయిత్యాదులలో దృష్టాంతోపాదానముయొక్క- దర్శనమువలన దెలియబడుచున్నది.

"అథాత ఆదేశో నేతి నేతి" ఇత్యాదులచే పూర్వమందుప్రకృతమైన మూర్తామూర్తరూపమైన ప్రపంచమునకు బ్రహ్మస్వరూపత్వము యొక్క- నిషేధమువలన నిష్ప్రపంచమైన సన్మాత్రమే బ్రహ్మము. చెప్పబడిన ఉభయలింగములుగలదిగాదనిశంకించిసమాధానము చెప్పుచున్నారు.

౩౩౫. ప్రకృతైతావత్త్వంహి ప్రతిషేధతితతో బ్రవీతిచ భూయః.

అ.—ప్రకృత-పూర్వమందుస్మృతమైన-ఏతావత్త్వం-ఇంతమాత్రము బ్రహ్మమునకు నిషేధమగును - తతః- పూర్వమందు చెప్పబడినదానికన్నను భూయః- అధికముగా- బ్రవీతిచ-చెప్పుచున్నది.

హిశబ్దము - హేతు వాచకము. "ద్వేవావబ్రహ్మణోరూపేమూర్తంచామూర్తమేవచ" ఇత్యాదులయందు స్థూల సూక్ష్మప్రపంచమునకు బ్రహ్మ రూపత్వముచేత ప్రమాణాంతరమందు చెప్పబడనిదాని కచ్చటనేరూపముగావుపదేశముండుటవలన నిషేధముసంభవించదు ప్రకృత మందింత మాత్రమే బ్రహ్మమునకు నిషేధము గలుగుచున్నది- పూర్వమందు ప్రకృతమైనంతమాత్రము కలిగినది బ్రహ్మ కాదని, "అథాత ఆదేశో నేతి నేతి" యనుస్థలమందు ప్రతిపాదించ బడినదనియర్థము.(తతోబ్రవీతిచభూయః) తతః-పూర్వోక్తమైనయాధిక్యమును వాక్య శేషము చెప్పుచున్నది "నహ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి అథనామధేయం సత్యస్య సత్యమితి ప్రాణావై సత్యం తేషామేష సత్యమితి" యనినేతినిర్దిష్టము వలన, బ్రహ్మమునకన్యములేదని అర్థము. పరబ్రహ్మకంటే స్వరూపమువలన గుణముల వలన ఉత్కృష్టము లేదని యర్థము. సత్యస్యసత్య మని బ్రహ్మయొక్క నామధేయము. దాని నిశ్చయ కథనము- ప్రాణావై సత్యం తేషామేష సత్యమని- ప్రాణసాహచర్యము వలన జీవాత్మలు-ప్రాణములు- అవి అంతరిక్షాదులవలెనే వుత్పత్తికనర్హములౌటచేత సత్యము. వానికంటే ఇతడు సత్యము. వారలు కర్మానుగుణమైన-దేహసంబంధముచేత జన్మముగలవారు అవి యితనికిలేదు గనుక వారలలోనితడుసత్యము- జ్ఞానసంకోచరూపమైన వికారములున్ను సంభవించవు. ఈ కారణమువలన ప్రమాణాంతరము చేతను దెలియబడని స్వరూపముగలబ్రహ్మమునకు మూర్తామూర్తప్రపంచక్రమముచేత వుపదేశముండుటవలన- మరియొకప్రకారవిశేష వుపదేశమువలనను "అథాతఆదేశోనేతినేతి" అనిపూర్వముప్రకృతమైనఇయత్తాబ్రహ్మమునకు నిషేధముచేయబడుచున్నదని అర్థము.

వోయిూస్వభావముగా ప్రత్యక్షమువల్లనిర్విశేష సన్మాత్రమేగ్రహింపబడుచున్నది- దానికంటే అతిరిక్తమైనభ్రాంతిచేతతోచెడివిశేషమును ఆరోపముచేసి "నేతినేతి" యని నిషేధము చేయబడుచున్నదని అంటే చెప్పుచున్నారు.

౩౩౬. తదవ్యక్తమాహహి.

అ.—తత్-బ్రహ్మము-అవ్యక్తం-అస్ఫుటమని-ఆహహి-శ్రుతిచెప్పెను.

ఆబ్రహ్మము యేప్రమాణము చేతను వ్యక్తముకాదు- అటువలెశ్రుతిచెప్పుచున్నది- "నసంధృశే తిష్ఠతి రూపమస్య" ఇత్యాదులందు.

౩౩౭. అపిసంరాధనేప్రత్యక్షానుమానాభ్యాం.

అ.—ప్రత్యక్షానుమానాభ్యాం-శ్రుతిస్మృతులచేతను- సంరాధనేపి-ధ్యానమందు పరమాత్మ దెలియబడు నని నిశ్చయింపబడును.

మరియు సంరాధనమందే పొంద బడుచున్నది. సంరాధనం-చక్క-గా ప్రీతితోగూడినభజనము-ఉపాసనమ ని తాత్పర్యము. ఉపాసనరూపభగవ త్ప్రీతిజనకమైన నిమిత్తమువినా మ రిదేనిచేతను పొందబడెడు వాడుకా డని శ్రుతిస్మృతులచేత దెలియ బడు చున్నది. "నాయమాత్మా ప్రవచనేన లభ్యోనమేధయా నబహునా శ్రుతేన యమేవైష వృణుతే తేనలభ్యః" నా హం వేదైర్నతపసా నదానేన నచేజ్య యా-భక్త్యాత్వనన్యయాశక్య" య ని. గనుక యే ప్రమాణముచేతను అవ్య క్తరూపము గలవాడౌటవలన బ్రహ్మ కు "ద్వేవావ బ్రహ్మణోరూపే" యి త్యాదులందు బ్రహ్మమునకు ప్రకార తయా జగదైశ్వర్యము యుపదేశము చేయబడినది. "నేతి నేతి" యని ని షేధింపబడడము లేదు. మరేమంటే ప్రకృత ఇయత్తామాత్రమే నిషేధిం పబడుచున్నది.

౩౩౦. ప్రకాశాదివచ్చా వైశే ష్యంప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్.

అ.—కర్మణి-ధ్యానకర్మయందు అభ్యాసాత్-అభ్యాసమువలన-ప్రకా శశ్చ-దర్శనముగలిగి- ప్రకాశాదివత్ జ్ఞానానందాదులవలె- అవైశేష్యం-విశేషాభావముతోచుచున్నది.

ఈ కారణమువలన జ్ఞానానందా దులవలె జగదైశ్వర్యమున్ను బ్రహ్మ యొక్క-రూపము- యేవామదేవాదు లకు ధ్యాన రూప కర్మయందభ్యాస మువలన ప్రకాశము గలిగెనో దర్శ నము బుట్టెనో వారలదర్శనమందు ప్ర కాశాదివత్ - జ్ఞానాదులకున్నటువ లెనే జగదైశ్వర్యమునకు అవిశేష్య ముతోచుచున్నది-"తద్ధైతత్పశ్యన్నృ షిర్వామదేవః ప్రతిపేదేఅహంమను రభవంసూర్యశ్చాహం కక్షీవాన్" ఇత్యాదులందు.

౩౩౧. అతోనన్తేనతథాహిలిఙ్గం.

అ.—అతః-ఆ కారణమువలన-అ నంతేన-కల్యాణగుణసమూహముచే త యోగముసిద్ధించెను-తథా-అట్లయి నను-లింగంహి- ఉభయలింగము గల దె బ్రహ్మ,

అతః- అనంతేన,కల్యాణగుణస మూహములచేత యోగము బ్రహ్మ మునకు సిద్ధించెను. ఆప్రకారమైనను యుభయలింగమే పరబ్రహ్మ.

అ.—సం॥ జీవునికివలెనె పర మాత్మునికి జాగరాదిసర్వావస్థలలో అవస్థానము క్తమైనందుచేత తత్ప్ర యుక్తదోషములు సంభవించుననిశం కించి సర్వావస్థావస్థితమైన బ్రహ్మ మునకు అఖిలహేయప్రత్యనీకత్వక

ల్యాద్యైకతానత్వములనే ఉభయలింగము శ్రుతిశతసమధిగతమూటచే,తత్ప్రయుక్తదోషములు సంభవించదనినిర్ణయించబడినది

౮౦. అహికుండలాధికరణము.

౩౮౦. ఉభయ వ్యపదేశాత్త్వహికుణ్డలవత్.

అ.—అహి-సర్పమునకు-కుణ్డలవత్-కుణ్డలభావమువలె బ్రహ్మస్వరూపమునకుఅచిద్రూపముచేతస్థితి- అచిత్తునకు బ్రహ్మరూపముచేత స్థితి - ఉభయ వ్యపదేశాత్ - ఏకత్వ నానాత్వవ్యపదేశమువలననగును.

“ద్వేవావబ్రహ్మణోరూపే” ఇత్యాదులలోజెప్పబడినఅచిద్వస్తువునకు బ్రహ్మరూపత్వము బ్రహ్మస్వరూపమునకు అచిద్రూపముచే పరిణామము వలనయౌచున్నదా - లేకపరబ్రహ్మయందు-అచిద్వస్తువయందును - ఏకజాతియోగమువలననా- లేకజీవునివలెబ్రహ్మశరీరత్వముచేత బ్రహ్మవిశేషణత్వముచేత నాయనిసంశయము- భిన్నాభిన్నత్వ రూపోభయవ్యపదేశములకుయుపపత్తికొఱకు బ్రహ్మ అచిద్రూపముచేత పరిణమించుచున్నదని మొదటిపక్షము. అప్రకారమైనను-బ్రహ్మమునకు నిర్దోషత్వాదులు బాధపెట్టుచున్నదనిఏకజాతియోగముచేతనని రెండవపక్షము. ఇట్లైనను - “ఆత్మైవేదంసర్వం” “బ్రహ్మైవేదంసర్వం” యని బ్రహ్మస్వరూపమునకే సర్వశబ్దవాచ్యత్వముయొక్క వ్యపదేశమునకుబాధకలగని - లోకమందొక్కగోవుఖండమనియుముండమనియుపూర్ణశృంగమనియు సర్వగోవ్యక్తులకు వాచకమైన శబ్దముచేత జెప్పబడుచున్నది. గానజీవునికిన్నటువలె బ్రహ్మశరీరత్వముచేతను బ్రహ్మవిశేషణత్వముచేతనుఅచిద్వస్తువునకు బ్రహ్మాంశత్వమనిసిద్ధాంతము.

సూత్రార్థము - తుశబ్దమువధారణార్థకము. సర్పమునకుకుండలభావమువలె నేబ్రహ్మస్వరూపమునకచిద్రూపముచేతస్థితి. యేమిటివల్లనంటే-ఉభయవ్యపదేశాత్ - నానాత్వఏకత్వములను జెప్పటవలన.

౩౮౧. ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్.

అ.—తేజస్త్వాత్ - తేజస్త్వముచేత- ప్రకాశాశ్రయవద్వా - ప్రకాశాశ్రయమువలె యేకజాతి యోగముండును.

వా శబ్దము అనంతరమందు చెప్పబడినదానికివ్యావృత్తమనియర్థము-యేప్రకారము ప్రకాశమునకుతదాశ్రయవస్తువునకు తేజస్త్వముచేత ఏకజాతి యోగమువలన అభిన్నత్వము భిన్నత్వము రెండుయుండునో - అప్రకారముఅచిద్వస్తులకునుండును.

౩౮౨. పూర్వవద్వా.

అ.—పూర్వవద్వా - పూర్వము బ్రహ్మకు నిర్దోషత్వము చెప్పబడినప్రకారంబుగనైనను.

వా శబ్దము పక్షద్వయవ్యావృత్తిఫలకమనియర్థము - పూర్వవత్ -యె ప్రకారము ‹‹అంశో నానావ్యపదేశాత్›› ప్రకాశాదులకొఅకు-బ్రహ్మకునిర్దోషత్వముసిద్ధించెడికొఅకు-ప్రకాశ-జాతి-గుణము- శరీరమువలె భిన్నముగానుండడమున కనర్హమైన విశేషణత్వముచేత జీవునికి బ్రహ్మాంశత్వము చెప్పబడినదో-అదెప్రకారము - అచిద్వస్తువుకును-అచిద్వాచక శబ్దముచేతఅచిద్విశిష్టమైనవస్తువే బ్రహ్మమనిచెప్పబడుచున్నది-‹‹ఆత్మైవేదంసర్వం›› యనిఅభేదవ్యపదేశమునకుపపత్తి - విశేషణవిశేష్యములకుస్వరూపముస్వభావముయొక్క భేదజ్ఞాపనముకొఅకు విశేషణ విశేష్యముల భేదము చేవ్యపదేశము ఉపపన్నమౌను.- ‹‹క్షరం త్వవిద్యాహ్యమృతంతువిద్యా విద్యావిద్యేఈశతేయస్తుసోన్యః›› యని- బ్రహ్మమునకునిర్దోషత్వము చెప్పబడెను.

౩౮౩. ప్రతిషేధాచ్చ.

అ.—ప్రతిషేధాచ్చ - బ్రహ్మమునకచిద్ధర్మనిషేధమువలన.

‹‹సవాఏష మహానజఆత్మాఽజరోఽమరః›› ‹‹నాస్యజరయైతజ్జీర్యతి›› ‹‹విజరోవిమృత్యుః›› ఇత్యాదులందు బ్రహ్మమునకు అచిద్ధర్మములయొక్క నిషేధమువలనను - విశేషణవిశేష్యభావములచేతను అంశాంశీ భావమని తాత్పర్యము.

అ.—సం ॥ అచిద్వస్తురూపేణ పరిణతము బ్రహ్మమే తాగావలెను- లేక బ్రహ్మమునకును అచిద్వస్తువునకును ఏకజాతియోగముచేత ఐకజాతికవస్తువు తాగావలెను- భిన్నాభిన్నత్వోభయవ్యపదేశము గూడా కావలసినదనిశంకించి-‹‹అంశో నానావ్యపదేశాత్›› అనే అధికరణ న్యాయేన జీవునికివలె శరీరాత్మభావముకలిగినదైఅందువలన భిన్నత్వాభిన్నత్వవ్యపదేశము కూడుటచేత అచిద్వస్తువు బ్రహ్మశరీరమని నిర్ణయించబడినది-

౮౧. పరాధికరణము.

౩౮౪. పరమతస్సేతూన్మానసమ్బన్ధభేదవ్యపదేశేభ్యః.

అ.—అతః- ఈబ్రహ్మకంటే - పరం-వ్యాప్యమైనవస్తువువున్నదనియు- సేతు-సేతువని- ఉన్మాన- అపరిమితమనియు - సమ్బన్ధ-సంబంధముగలదని భేద- భేదముగలదని- వ్యపదేశేభ్యః- చెప్పుటవల్లననియొకడు దెలియును.

‹‹యతో వాఇమాని›› ఇత్యాదులలో జగజ్జన్మాదికారణత్వము చెప్పబడినపరబ్రహ్మకంటెభిన్నమైన మరియొకతత్వమున్నదా, లేదాయనిసంశయము. యింతకంటెపరము వున్నదని పూర్వపక్షము. ‹‹అథయ ఆత్మా

స సేతు" యని దీనికి సేతుత్వవ్యపదేశమువలన- "ఏతంసేతుంతీర్త్వా" యని దీనికి దాటుటకు యోగ్యమైనప్రకారము చెప్పుటవలన దీనికంటే భిన్నమున్నదని దెలియబడు చున్నది- "చతుష్పాద్బ్రహ్మ షోడశకలం" యని పరిమిత వ్యపదేశము వలన, అపరిమితమయినది మరియొకటియున్నదని తోచుచున్నది. "అమృతస్యైష సేతు" యని ప్రాపకత్వము చెప్పుట వలన దీనిచేత ప్రాప్యమైనది మరియొకటియున్నదని ప్రాప్యప్రాపక రూపమయినసంబంధమువలన దోచుచున్నది. ఆప్రకారము "తేనెదం పూర్ణం పురుషేణసర్వం తతో యదుత్తరతరం" అని పురుష శబ్దము చేత చెప్పబడిన బ్రహ్మకంటే ఉత్తరత్వముచేత భేదము చెప్పుట వలన మరి యొకటి యున్నది.

సిద్ధాంతము. "నహ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తీతి" నేతియని నిర్దిష్టమైన మూర్తామూర్తరూపమైనబ్రహ్మకంటే మరియొకపరము లేదని పరతత్వముయొక్క నిషేధము వలన కారణమైన బ్రహ్మకంటే భిన్నమయినపరవస్తువు లేదు- సేతువ్యపదేశమందునను- "ఏషాంలోకానామసమ్భేదాయ,, యనగా - ఈలోకములకు అసంకరత్వము చేత జేయ బడినది. "ఏతంసేతుంతీర్త్వా,, యని - తరతి ధాతువుకు వేదమును దాటును యనేప్రకారము ప్రాప్తి వాచకము,, "చతుష్పాద్బ్రహ్మ షోడశకలం" అని యున్మానవ్యపదేశమున్ను- "వాక్పాదశ్చక్షుఃపాదః" యను ప్రకారము పాసనముకొఱకు - అపరిమితమైనను తత్తద్దేశ సంబంధిత్వముచే పున్మితత్వాను సంధానము సంభవిస్తున్నది. "అమృతస్యైవ సేతుః" యని తనకే యమృతత్వ స్వరూపమునకు తానే ప్రాపకమని చెప్పబడుచున్నది. "యమేవైషవృణుతే తేనలభ్య" యిత్యాదిశ్రుతులందు - "తతో యదుత్తరతరం" అనియు- "తేనేదంపూర్ణం" అనినిర్దిష్టుడైన పురుషునికంటే అన్యమైనపరతత్వమును చెప్ప లేదు- మరేమనిన- "తమేవంవిద్వానమృతఇహభవతి నాన్యఃపంథావిద్యతేయనాయ,, యని పూర్వమందు ప్రతిజ్ఞ చేయబడినదిపురుషజ్ఞానమునకు అమృతహేతుత్వము- అన్యమునకుఅమార్గత్వము - నీరెంటిని సహేతుకముగా యుపసంహారము చేయుచున్నది- "యస్మాత్పరంనాపరమస్తికిఞ్చిత్,, యని యారంభించి "తేనేదంపూర్ణంపురుషేణ సర్వం,, యని పురుషునికి సమస్తమునకంటే పరత్వము - అన్యమునకుపరత్వాభావము ప్రతిపాదించి- తతః-ఆహేతువునుబట్టి ఉత్తరతరం శ్రేష్ఠమైన పురుషతత్వమున్ను- అదే అరూపము అనా

మయము. "యఏతద్విదుః-అమృతా స్తేభవన్తిఅథేతరేదుః ఖమేవాపియ న్తి" యని పూర్వము ప్రతిజ్ఞ చేయబ డినదేయుపసంహారము చేయబడినది.

సూత్రార్థము - (పరమతః) "జ న్మాద్యస్యయత" యని యారంభిం చి "అతోఽనంతేన తథాహి లిఙ్గం" యను వరకు ప్రతిపాదనచేయ బడిన సమస్తజగత్తుకు కారణము సర్వాం తర్యామి- నిరస్తనిఖిలదోష గంధము గల అనవధికాతిశయము అనంతక ల్యాణ గుణములకు ముఖ్యాధారుడై న పర బ్రహ్మకంటే పరమైన వస్తువు న్నదని యొకడు దెలియును- యేమిటి వలననిన (సేతూన్మానసంబన్ధభేదవ్య పదేశేభ్యః) యని వీనియర్థము పూ ర్వమే వ్యాఖ్యానము చేయబడినది.

౩౮౫. సామాన్యాత్తు.

అ.—సామాన్యాత్తు - సేతుసా దృశ్యమువలన పరబ్రహ్మమునకంటే పరము లేదు.

తుశబ్దము - పక్షమును వ్యావృత్తి చేస్తున్నది- సేతుత్వ వ్యపదేశ మైతే ఆబ్రహ్మకంటేపరుని తోపింప చేసేది లేదు. సేతుసామాన్యాత్-సాదృశ్య రూపమువలన-అనగా జగద్ధారణరూ పమైన సాదృశ్యమువలన బ్రహ్మమున కు-ఆప్రకారము వ్యపదేశమని శ్రుతి యే సేతుశబ్దమును చెప్పుచున్నది. "అ థయఆత్మాససేతుర్విధృతి రేషాంలో కానామసమ్భేదాయ" యని- యేయే స్వభావముగల లోకములు సృజింపబ డినవో ఆయాయిస్వభావముగల అ సాంకర్యముకొఱకు సమస్తలోకము లనుభరించున్న గనుక సేతువవలె సే తువని చెప్పబడునని అర్థము.

౩౮౬. బుద్ధ్యర్థః పాదవత్.

అ.—పాదవత్ - వాక్పాదశ్చ క్షుఃపాదమువలె-బుద్ధ్యర్థః-ఉపాస నకొఱకైనది

"చతుష్పాద్బ్రహ్మ" "పాదోఽస్య విశ్వాభూతాని" యనే వున్మానవ్య పదేశము అటు అను సంధానము కొఱకు - "వాక్పాదశ్చక్షుఃపాద" యను ప్రకారమని దెలియవలయును. అపరిమిత స్వరూపముగల బ్రహ్మము నకు అనుసంధానముకొఱకైనను యే ప్రకారము పరిమితత్వమనగా చెప్పు చున్నారు.

౩౮౭. స్థానవిశేషాత్ప్రకాశా దివత్

అ.—ప్రకాశాదివత్-ప్రకాశము మొదలైనవానివలె- స్థానవిశేషాత్ - ఆయాయిస్థానములయొక్క విశేష ము వలన.

పొందబడిన వాగాదిస్థాన విశేష ముయొక్క- సంబంధమువలననాయా యి స్థానసంబధిత్వముచే అవచ్ఛిన్న మైనయనుసంధానముకూడుచున్నది- ఏప్రకారము విస్తారమైనప్రకాశమున

కు యాకాశమునకు గవాక్షీ ఘటామలందువలె.

౩౭౮. ఉపపత్తేశ్చ.

అ.—ఉపపత్తేశ్చ-ఉపపత్తిసంభవించుటవలన.

"అమృతస్యైష సేతుః" యని అమృతమైనతనకు తానె ప్రాపకుడని సేతుత్వవ్యపదేశమునకు యుపపత్తికలుగుట వలన మరొక పరమున్నదనే కల్పనగూడదు. "నాయమాత్మా ప్రవచనేనలభ్యో నమేధయాన బహునా శ్రుతేన। యమేవైష వృణుతే తేనలభ్యస్తస్యైషఆత్మావివృణుతేతనూంస్వామ్" యని యిదెయర్థము ధృవమౌచున్నది.

౩౭౯. తథాన్యప్రతిషేధాత్.

అ.—తథా-ఆప్రకారము-అన్య పరమపురుషునికంటెఅన్యునికి- ప్రతిషేధాత్-నిషేధమువలన.

"తేనేదం పూర్ణం పురుషేణ సర్వంతతోయదుత్తరతరం" యనిపరమపురుషుని కంటె అన్యునికి పరత్వముచెప్పలేదు- "నతస్యేశేకశ్చన" "నహ్యేతస్మాత్" యని దీనికంటే పరము లేదు "యస్మాత్పరం నాపరమస్తి కించిద్యస్మాన్నాణీయోన జ్యాయోస్తికశ్చిత్-యస్మాదపరం పరంనాస్తి" యని యర్థము - ఈమొదలైనవానిలో పురుషునికంటే అన్యమునకు ప్రతిషేధము చేయుటనుబట్టి "తతోయదుత్తరతరం" యని ఏకారణము వలన పురుషతత్వము శ్రేష్ఠమో-ఆహేతువువలన ఉత్తరతరమైనపురుషతత్వము-అదేఅరూపము అనామయమని వ్యాఖ్యానముచేయబడినది. "యఏతద్విదు రమృతాస్తేభవన్తి" యని "తమేవం విదిత్వాతి మృత్యుమేతి నాన్యఃపన్థాఅయనాయవిద్యత" యని ప్రతిజ్ఞ జేయబడినదే యుపసంహారము చేయబడినది - "నతస్యేశేకశ్చనతస్యనామమహద్యశః" యని పురుషతత్వమును జెప్పుచున్నది. అనంతరము- "అద్భ్యస్సంభూతోహిరణ్యగర్భ ఇత్యష్టావ" యని పురుషతత్వవాచకములైన వాక్యములతో ఏకవాక్యత్వాంగీకారమువలన- "అప్సస్యపారే" యమన్తస్సముద్రేకవయోఽవయన్తి" అని యుపక్రమమువలన.

౩౮౦. అనేనసర్వగతత్వమాయామశబ్దాదిభ్యః.

అ.—అనేన- బ్రహ్మచేతను-సర్వ సమస్తమునకున్ను - గతత్వం- వ్యాప్తత్వము- ఆయామశబ్దాదిభ్యః- సర్వవ్యాప్తవాచి శబ్దాదులవల్ల తెలియబడును.

"తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" "అన్తర్బహిశ్చతత్సర్వంవ్యాప్యనారాయణస్థితః" నిత్యంవిభుం సర్వగతంసుసూక్ష్మంతదవ్యయం య

ద్భూత యోనిం పరిపశ్యన్తి ధీరాః" యనెడిఅనేక ఆయామశబ్దములచేత సర్వవ్యాప్తివాచకములైన వాటిచేత దెలియబడెడిదై ఇతనికంటె పరమును వారించుచున్నదని అర్థము ఆదిశబ్దమువలన "ఆత్మైవేదంసర్వం" ఇత్యాదులు గ్రహింపబడుచున్నది. అతః-ఈకారణమునుంచి - "యతో వాఇమాని" యను వాక్యములచేదెలియబడిన జగత్తును నిమిత్తోపాదాన కారణభూతమయిన బ్రహ్మమునకంటెపరము లేదు.

అ.—సం॥ జగజ్జన్మాది కారణతయా దృష్టపర బ్రహ్మవస్తువుకంటెపర వస్తువును సేతూన్మానసంబంధభేదవ్యపదేశములు చేయుచున్నదని శంకించి-కారణవస్తువుకంటె వస్త్వంతరమునకుపరత్వము "యస్మాత్పరంనాపరమస్తికించిత్" ఇత్యాది శ్రుతి నిషిద్ధమవుట వలన సేతుత్వవ్యపదేశము సర్వలోకాసాంకర్యహేతుత్వ ప్రయుక్తమైనందునను. అపరిచ్ఛిన్న వస్తువుకు యున్మానవ్యపదేశము యుపాసనార్థమైనందుచేతను సంబంధ వ్యపదేశము తనకే ప్రాప్యత్వ ప్రాపకత్వ ప్రయుక్తమవుటవలన- "తతో యదుత్తరతరం" అను శ్రుతికి భేద వ్యపదేశము అర్థముగా నందున జగత్కారణవస్తువుకంటె పరవస్తువులేదని నిర్ణయించబడినది.

౮. ఫలాధికరణము.

౩౫౧. ఫలమతఉపపత్తేః.

అ.—అతః- బ్రహ్మవలన- ఫలం- మోక్షాదిరూపఫలము- ఉపపత్తేః-ఉపపత్తివలననియనిభావము.

వేదమందుజెప్పబడిన యాగము దానము హోమము మొదలైన యుపాసనలును - "యజేత" "ఉపాసీత" యని కామికిని ముముక్షువుకు కర్తవ్యత్వముచే వినబడుచుండెడు కర్మ అపూర్వ ద్వారముగా భోగాపవర్గరూపఫలమునిచ్చునా- లేక- వానివానియొక్క ఆరాధనచేత సంతుష్టుడైన పరమపురుషుడేఫలమునిచ్చునాయని సంశయము. కర్మమే నిచ్చుననిపూర్వపక్షము - లోకమందుపొందుటకుయోగ్యమైన కృషి మొదలైన కర్మములకు సాక్షాత్తుగానైను- పపరంపరల చేతనైనను ఫలప్రదత్వము వినబడుటవలన వేదమందును- "యజేతస్వర్గకామః" ఆత్మానమేవ లోకముపాసీత" యని కామికిముముక్షువునకు కర్తవ్యత్వముచేత వినబడెడు కర్మ అయాయి ఫలమందు సాధనమని దెలియబడినది. క్షణికమైనను అపూర్వమనెడి ద్వారముచేత భోగాపవర్గరూపమైన సమస్తఫలము నిచ్చును.

సిద్ధాంతము-కర్తవ్యత్వము చేత దెలియబడిన యాగాదులందు ఉపా

సనాతనస్మృతి "యజదేవపూజాయాం, అని దెలియబడిన ధాత్వర్థ స్వభావముగలిగిన దౌటవలన "వాయుమేవస్వేన భాగధేయేనోపధావతి సఏవైనంభూతింగమయతి" యనివాక్యశేషమును - "ఇష్టాపూర్తంబహుధాజాతంజాయమానంవిశ్వంబిభర్తిభువనస్యనాభిః" "తదేవాగ్నిస్తద్వాయుస్తత్సూర్యస్తదుచంద్రమాః,, సతయాశ్రద్ధయాయుక్తస్తస్యారాధనమీహతే।లభతేచతతఃకామాన్మయైవవిహితాన్హితాన్,, "అహంహిసర్వయజ్ఞానాంభోక్తాచప్రభురేవచ,, స్వకర్మణాతమభ్యర్చ్యసిద్ధిం విన్దతిమానవః "మత్ప్రసాదాత్పరాంశాంతింస్థానంప్రాప్స్యసిశాశ్వతం,, ఇత్యాదిశ్రుతిస్మృతులవలన పరమ పురుషుడే కర్మలచేత ఉపాసనచేత పూజచేయబడినవాడై భోగాపవర్గ రూపమైనఫలమునిచ్చును లోకమందుకృష్యాదికర్మలచేతసస్యాదులనుపుట్టించిదానిచేత భృత్యమూలముగ నైననుసాక్షాత్తుగా నైనను రాజునుసంతోషింపచేసి వానివలనవే ఇష్టార్థమునుపొందుచున్నారు. ఆప్రకారముగాపరమపురుషుడేఫలమునిచ్చును.

సూత్రార్థము. అతః- పరబ్రహ్మము కర్మలచేత యుపాసనచేత యారాధితుడై అందు వలన భోగాపవర్గ రూపమైన ఫలమునిచ్చును - యేమిటివల్లనంటే-ఉపపత్తేః- కర్మతుణధ్వంసియగుటవలన కాలాంతరములోగలిగెడి ఫలము కొఱకు యుత్పాదకము కానేరదు. గనుక సర్వజ్ఞుడై సర్వశక్తిగల పరమ కరుణా శాలియైన మహాదారత్వముగల అద్యంతరహితుడైన సర్వ నియామకుడైన పరబ్రహ్మ తనయారాధనరూపమైనకర్మచేత పూజచేయ బడినవాడై ఫలమిచ్చునని ముఖ్యమయిన యుపపత్తిగలుగును.

౩౮౨- శ్రుతత్వాచ్చ.

అ.—శ్రుతత్వాచ్చ - శ్రుతియందు జెప్పబడుటవలనను.

"సవాఏషమహానజ ఆత్మా న్నాదోవసుదానః,, "ఏషహ్యేవానందయాతి" యని భోగాపవర్గ రూపమైనఫలమును పరబ్రహ్మయిచ్చునని దెలియబడుచున్నది.

౩౮౩. ధర్మంజైమినిరతఏవ.

అ.—అతఏవ- వుపపత్తివలననే- ధర్మం-యాగాదిధర్మఫలము నిచ్చునని-జైమినిః-జైమినులుదెలియుదురు-

యాగాదికము యుపాసనా స్వరూపమైన ధర్మమే ఫలము నిచ్చునని జైమిన్యాచార్యులుదెలియుదురు-అతఏవ-అనగా యుపపత్తికి శ్రవణ ముండుటవలన యని అర్థము.లోకమందు కృషి మొదలైన కర్మలకు సాక్షాత్తుగాగాని పరంపరచేతగాని - ఫలదా

తృత్వదర్శనముండుట వలన వేదమం దునను యిదే ప్రకారము యుక్తమని ఉపపత్తిజేయుచున్నది. అపూర్వరూపమైనమార్గము చేతనే సాధనత్వము యుపపన్నమవును - "యజేత స్వర్గకామః,, బ్రహ్మ విదాప్నోతి పరం" యని కామికి కర్తవ్యత్వము చేతకర్మ విధానము తప్ప మరియొక ప్రకారోపపత్తిలేకపోవుటచేత కర్మయేఅపూర్వద్వారముగా ఫలసాధనమని దెలియబడుచున్నది.

3౫౪. పూర్వంతు బాదరాయణో హేతువ్యపదేశాత్.

అ. -పూర్వం-పూర్వము జెప్పబడిన-హేతువ్యపదేశాత్ -బ్రహ్మమునకు జగత్కారణత్వము జెప్పడమువలన- బాదరాయణః-పరమపురుషుడే ఫలప్రదుడని బాదరాయణులు దెలియుదురు

తుశబ్దము పక్షమునకు వ్యావృత్తి జనకము-పూర్వమందు జెప్పబడిన పరమపురుషునికే ఫలప్రదత్వమును శ్రేష్ఠులైన బాదరాయణులుదెలియుదురు- యేమిటివల్లనంటె-హేతు వ్యపదేశాత్ - "వాయు మేవస్వేన భాగధేయేనోపధావతి సఏవైనం భూతిం గమయతి" యని వాయ్వాదిస్వరూపము చేతనుండెడు పరమపురుషునికే ఫలప్రదత్వము యొక్క వ్యపదేశము "యోవా యాంతిష్ఠన్,, యని అతడే వాయువందుండెడు వాడని దెలియబడుచున్నది - "తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదుచంద్రమా,, యనియు. దీని పరిత్యాగమందపూర్వమునకు ఫలసాధనత్వకల్పనముచేసినయడల శ్రుతమునకు హానియు అశ్రుతమునకు కల్పనయునగును విధిచే అపేక్షితమైన ఫల సాధనత్వము యొక్కక్రమము వాక్యశేషము చేత దెలియబడినదైనను ఫలసాధనత్వ ప్రకారకల్పనము జేయడము యుక్తముకాదు. యెటులరాత్రియజ్ఞాదులందు అధికారకల్పనమో అటువలెనని యర్థము.

అ.—సం ॥ యాగదానహోమోపాసనాది వైదికకర్మములు క్షణధ్వంసులైనను తజ్జన్యాపూర్వద్వారాభోగాపవర్గ రూప సర్వఫలసాధనములని శంకించి - కర్తవ్యతయా అవగత్యా గోపాసనాదులకున్ను ఫలప్రదుడు పరమపురుషుడే యని శ్రుతిస్మృతి సిద్ధమైనందు చేత పరమపురుడే ఫలప్రదుడని నిర్ణయించబడినది.

తృతీయాధ్యాయము - తృతీయపాదము ముగిసెను.



శ్రీగురుభ్యోనమః.

## తృతీయాధ్యాయము - తృతీయపాదము.

౧౩. సర్వవేదాంత ప్రత్యయాధికరణము.

౩౫౫. సర్వ వేదాంత ప్రత్యయంచోదనాద్యవిశేషాత్.

అ.—సర్వవేదాంత- సమస్తవేదాంతశ్రుతులయందు- ప్రత్యయం-ప్రతిపాదితమైనది - చోదనాద్యవిశేషాత్ - చోదనము మొదలైనవానికివిశేషము లేకపోవుటవలన వొక్కటనే దెలియవలయును.

సమస్తవేదాంతములందునువినబడెడిదహరవిద్యయొక్కటా - లేకవిద్యాంతరమాయనిసంశయము - అవిశేషపునశ్శ్రవణమునకు ప్రకరణాంతరమునకున్ను విద్యాభేదమందు హేతుత్వమువలన విద్యాంతరమని పూర్వపక్షము. చోదనముఫలసంయోగరూపమైన ఆఖ్యగలవాటికి విశేషము లేకపోవుటవలన - దెలిశెడు వాని భేదము చేతతిరిగిశ్రవణమునకుయుపపత్తిగలుగుటవలన, అంతమాత్రము చేత నేప్రకరణాంతరత్వము లేనిదానివలన విద్యలకుఏకత్వమని.

సిద్ధాంతము - విద్యలయందుగుణములయొక్క ఉపక్రమోప సంహారములచింతనకొఱకు మరియొక శాఖయొక్క అధికరణమందు జెప్పబడిన న్యాయముచేత సిద్ధమైనఫలము స్థిరము జేయబడినది.

సూత్రార్థము - సమస్తవేదాంతములచేతప్రత్యయమైనది వొక్కటైనదహరాద్యుపాసనమే- యేమిటివలనంటే - చోదనాదులవలెవిశేషము లేకపోవుటవలన.

౩౫౬. భేదాన్నేతిచేదేకస్యామపి.

అ.—భేదాత్ - భేదము దెలియుటవలన- నేతిచేత్ - విద్యలకైక్యము లేదనిచెప్పగూడదు-ఏకస్యామపి-ఒక్కటైనవిద్యయున్నందున.

అవిశేష పునశ్శ్రుతిచే విద్యాభేదము దెలియుటవలన విద్యలకైక్యము లేదనిజెప్పగూడదు. ఒకవిద్యయందును మఱియొక శాఖయందు ప్రతిపత్త్రు (దెలిశెటివాని) భేదమువలనతిరిగి మధ్యే ప్రయోజనము గలిగినదే గానివిద్యాభేదము లేదు.

తా.—శ్రుత్యాది విద్యలకు భేదముండుటవలన విద్యలకు భేదము గలదు లేదని శంకించి వొక్క విద్యయందే శాఖాన్తరములో అధ్యేతృభేదము వలన భేదమే కాని విద్యాభేదము లేదు.

“తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తుచీర్ణం” యని ఆథర్వణికులకు శిరోవ్రతము యొక్క విద్యోపదేశమందు అంగత్వని యను దర్శనము విద్యాభేదమును చూపుచున్నది. విద్యలకు ఐక్యముండే ఆథర్వణికులకేయని నియమము యుపపన్నముకానేరదు- అనియాశంక చేసి సమాధానము జెప్పుచున్నారు.

౩౫౭. స్వాధ్యాయస్య తథాత్వేహిసమాచారేఽధికారాచ్చ సవవచ్చతన్నియమః.

అ.—స్వాధ్యాయస్య- స్వాధ్యాయమునకు- తథాత్వేహి - దానివలన బుట్టిన సంస్కారప్రాప్తియుండినయడల దానినియమము- సమాచారే- గ్రంథవిశేషమందు - అధికారాచ్చ- అధికారమువలనను- సవవత్ - సవహోమము మొదలైనవానికివలెనే - తన్నియమః - అచ్చటనే నియమము సంభవించును.

శిరోవ్రతము విద్యకంగముగాదు- మరేమనిన స్వాధ్యాయస్యతథాత్వేహి- స్వాధ్యాయమునకు దానివలనపుట్టిన సంస్కారప్రాప్తి యుండినపక్షముదానినియమము- “నైతదచీర్ణవ్రతోధీయీత” యని అధ్యయన సంబంధమువలన, గ్రంథవిశేషమందు - “ఇదమపి వేదవ్రతేన వ్యాఖ్యాతం” యని వేదవ్రతత్వము దెలియుటవలన “బ్రహ్మవిద్యాం” అనగా వేదవిద్యయనియర్థము- సవవచ్చతన్నియమః- యేప్రకారము సవహోమములు సప్తసూర్యులు మొదలుగా గలిగినవిశతౌదన పర్యంతములైన ఆథర్వణికపకాగ్నిసంబంధులచ్చటనే యాచున్నవో - ఆప్రకారమే యిదియు అథర్వణ వేద సంబంధిత్వము చేత అచ్చటనే యాచున్నవి.

౩౫౮. దర్శయతిచ.

అ.—దర్శయతిచ- శ్రుతియందు ఈసంగతి దెలియబడుచున్నది.

ఉపాసనకు సమస్త వేదాంతప్రత్యయత్వమును శ్రుతిచూపించుచున్నది- ఛాందోగ్యములో దహరవిద్యయందు- “తస్మిన్యదన్తః” యని చెప్పబడిన అపహతపాప్మత్వాది గుణాష్టకములను తైత్తిరీయకమందుముఖ్యముగా- “తస్మిన్యదన్తస్తదుపాసితవ్యం” యని చెప్పబడినది గనుక ఉభయస్థలమందును విద్యలకైక్యము సంభవించుచున్నది.

౩౫౯. ఉపసంహారోఽర్థాభేదాద్విధిశేషవత్సమానేచ.

